ఓమ్

శ్రీ విద్యాశంకర గ్రంథరత్నావళ్యాం ద్వితీయం రత్నమ్.

# కల్యాణసుధ

అను

శాంకర బ్రహ్మసూత్రభాష్య వ్యాఖ్య

ఇత్యాది

శృంగేరీ శ్రీవిరూపాక్ష

శ్రీవిద్యాశంకర పదమాఽఽవేశ్యప్రకాశిత

జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీ మహాంతాచార్య

స్వాములవారిచే 1935 print

రచియింపఁబడినది.

శృంగేరీ శ్రీ విరూపాక్ష శ్రీపీఠ కార్యదర్శి

శ్రీ అక్కనప్రగడ సూర్యనారాయణరావుచే

ప్రకటింపఁబడినది.

మూల్యము:— రూప్య పంచకము.

# సర్వసాన్విష్య సంకలితము.



శాంకరశకము ర్యబ్ధి వేదాక్షిమిత (౨౪౪౭) వగు
బహుధాన్యనామ సంవత్సర మార్గశిర్ష పూర్ణిమా
సౌమ్యవాసరమున
ప్రకాశితము.



౭—౧౨—౧౯౩౮



గ్రాక్షరశాలయందు
రాయణచే ముద్రాపితము

॥ శ్రీః ॥

# ప్రరోచనా

దృశ్యతే హి తావ దాసృష్టేః "ఇష్టం మే భూయా దనిష్టం మాభూ ది" త్యాకారకేష్టప్రాప్త్యనిష్టప్రహాణతత్సాధనానుకూలా సార్వజనీనా నైసర్గికీ ప్రవృత్తిః । సా చాధికారియత్నానురూపం ఫల మాతనోతి । తథా "ప్యభయం ప్రతిష్ఠాం విందతే" ఇత్యనన్యైకాంతికాశేషదుఃఖోన్మూలననిమిత్తసుఖావాప్తి రిష్యతే విచారవిమలైః పండితైః । సైవ మోక్షః । మోక్షస్తు జ్ఞానేనైవావాప్యతే, "జ్ఞానాదేవతు కైవల్యం" "నాన్యః పంథా విద్యతే అయనాయే"తి మోక్షప్రాప్తి హేతుత్వేనాన్వయవ్యతిరేకాభ్యాం చ జ్ఞానపథస్యైవ విధీయమానత్వాత్ । అథ కింస్వరూపో మోక్షః ? దేహనివహేతర ఆత్మా ఉతానితరో వా ? ఆత్మనాఽ భిన్నం బ్రహ్మోత భిన్నం వేత్యాదివిషమస్థలేషు విప్రవదన్తే బహవో దర్శన ప్రదర్శకాః । తత్ర ప్రత్యక్షైకప్రమాణా వేదబాహ్యాశ్చార్వాకాః । ప్రత్యక్ష మధిక్షిపంత శ్చార్వాకాణాం, విచక్షణాః ప్రమాణచణా అన్యే సాంఖ్యనైయాయిక వైశేషికప్రాభాకారభాట్టాదయో వేదప్రామాణ్యవాదిన స్తత్తద్రాద్ధాన్తసమర్థన సాధనత్వేనాలభన్తే చ ప్రత్యక్షానుమానోపమానశాబ్దార్థాప త్త్యనుపలబ్ధ్యై త్యగణ్యం ప్రమాణగణమ్ । తథాపి విచికిత్సావంతో బహవ స్సందిహాన్తి స్మ నచికేతఃప్రభృతయః "అస్తీత్యేకే నాయమస్తీతి చైకే" "తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామీ"తి ఆహవభూమావుభయసేనానివహమధ్యమాస్థాపిత శ్శస్త్రో ద్యతకరోఽప్యర్జునః క్షుద్రం హృదయదౌర్బల్య మాస్థాయ, "న యోత్స్యే" ఇత్యుపసంహృతాస్త్రః శ్రీకృష్ణం ప్రార్థయామాస "యచ్ఛ్రేయః స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమి"తి ।

ఏవం స్థితే జిజ్ఞాసుజనసందేహాపనోదనానుజిఘృక్షయా ప్రవృత్తినివృత్తి రూపమార్గద్వయాత్మకం ముముక్షులోకోపకారక మాదిదేశ భగవాన్నారాయణః । తేనచాశేషవేదసారభూతనిశ్చితార్థత్వేన ప్రదర్శితా ఉపనిష దాత్మతత్త్వవివి దిషూణాం "గర్భజన్మజరాదినిశాతనావసాదన" మాకలయ్యచ బ్రహ్మణా ఉపని

గమయిత్వా దన్వర్థనామేతి। సుమనస్సుమనసా మైవ శిరసి ధార్యతే। తదర్థనిబంధనవిఘాతః ప్రమాణతయా శ్రుతిమంగీకుర్వంతోఽపి సాంఖ్యాదయః కేచి త్సహజవిదగ్ధతావిలసితవాక్యయుక్త్యాభాసావష్టంభన మాస్థాయానేకధాఽల్పమతీనాం వ్యామోహజనకా విప్రతిపత్తీ రకల్పయన్। తన్నిరసనపూర్వక ముపనిషదాం నిశ్చితార్థప్రరోచనధియా దుస్తర్కవిషమూర్ఛితతదర్థానా ముజ్జీవయిషుణా భగవతా బాదరాయణేన వ్యరచ్యధ్యాయచతుష్టయాత్మకం పంచపంచాశదుత్తరపంచశత సంఖ్యాపరిమితం బ్రహ్మసూత్రకదంబమ్। తచ్చాధ్యాత్మికశాస్త్రముకుటాలంకార భూతోఽనన్యప్రమాణరాజ ఇతి సర్వజనామోదతామేతి। తస్య సోపపత్తికం ప్రతిపత్త్యర్థప్రకటనపటు శారీరకమీమాంసాభాష్య మారచయంచ్ఛ్రీమద్విద్యా శంకరభగవత్పాదాః। తచ్చ విద్వన్మండలీషు ప్రౌఢతాయాః పరాం కోటి మధితిష్ఠతీత్యత్ర తన్నిగూఢగభీరతరార్థావిష్కరణే కృతాభినివేశినః పద్మపాదవాచస్పతిమిశ్రాదయో వ్యాఖ్యాతారోఽన్యే పాశ్చాత్యపండితాశ్చ ప్రమాణమ్। వేదాంతవాక్యప్రతిపాదితార్థం ప్రవృత్తినివృత్త్యాత్మకం శాస్త్రం సాంఖ్యయోగస్వరూపేణ న్యరూపి భగవతా శ్రీకృష్ణేనార్జునాయ। శ్రీవిద్యాశంకరభగవత్పాదైః కృతముపనిషద్బ్రహ్మసూత్రగీతాభాష్యత్రయ మద్వైతామృతఝురీసారపిపాసూనాం ప్రకర్షేణ స్థానమితి కృత్వా "ప్రస్థానత్రయ" మితి విద్వల్లోకే మహీయతే। తథాప్యేతస్మిన్ కిరాళకాలే విస్మృతికల్పతాం గమితాయాం గీర్వాణవాణ్యాం భారతీయనాగరకతా సౌధమివ తత్ప్రతిష్ఠాస్థానభూతం సర్వ మాధ్యాత్మికశాస్త్ర ముత్సన్నమివాభాతి। పఠనపాఠనవైరళ్యేన శోభన్తే సర్వేఽధ్యేత్రధ్యాపకాః। తథాపి సుకృతకృతోపచయా వయం గర్తపురీనివాసినః, యదస్మా ననుదిన మనుగృహ్ణన్తి వర్షపంచక మారభ్య ప్రస్థానత్రయప్రవచనేన ప్రాతఃస్మరణీయస్వనామధేయాః శృంగేరీశ్రీవిరూపాక్ష శ్రీవిద్యాశంకరపదపద్మాఽఽవేశప్రకాశిత జగద్గురు శ్రీకల్యాణానంద భారతీమాంతాచార్యస్వామిపాదాః, యైరాధ్యాత్మికప్రాసాద మారురుక్షుశ్చ శిష్యలోకః శ్రవణాత్మకప్రథమసోపాన మారోప్యమాణః ప్రతిదిన మాద్రియతే। సువిదితైవ సర్వ సుమనోభిః శ్రీచరణానాం సర్వతంత్రస్వతంత్రతా, సకలనిగమార్థనిష్ణాతతా చ ముముక్షుజనానుగ్రహచికీర్షయా తైర్వ్యరచ్యాంధ్రవాణ్యాం భామతీత్యాది వ్యాఖ్యానవిశేషవిషయోపబృంహితాః సకలకల్యాణావహాః కల్యాణసుధాఖ్యాః సువి

ఖ్యాతోఽప్రత్యాఖ్యేయో వ్యాఖ్యానరాజః । స చ బ్రహ్మసూత్రశారీరకమీమాంసాభాష్యగంభీరార్థప్రదీపనసమర్థ ఇతి సముల్లసతితరా మస్మదీయం చేతః । తదివ లలితపదవిలసితం, విషయవిమర్శవిశోభితం తత్త్వస్వరూపనిరూపణరమణీయం పరిమితమతీనా మప్యనాయాసగమ్య మస్యద్వ్యాఖ్యాన మాంధ్రభాషాయాం నోపలభ్యత ఇతి వదతోఽస్మా న్నోపస్పృశ త్యతిశయోక్తిలేశోపి । భావుకా నజస్ర మాస్వాదయ త్వాలయ మేవ నిజసుధామాధురీ మద్వైతామృతరసనిష్యన్దినీభిః సూక్తిభిః । అనుగృహీతశ్చ శిష్యలోకో య త్తన్ముద్రణేఽనుజ్ఞాపిత స్తై రాచార్యానన్యప్రియతమ మద్వైతరహస్యామూల్యరత్ననిచయనిబద్ధపేటికాత్మక మిదం ధనం శ్రీచరణచరణయోః సమర్పయ న్నవిందచ్చ ధన్యతామ్॥

ఓం తత్సత్

"బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్ ।

బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా"

గర్తపురీ,
బహుధాన్యనామ సంవత్సర
మార్గశీర్ష పూర్ణిమా
సౌమ్యవాసరః

ఇత్యత్యంతప్రియాన్తేవాసీ
శ్రీవిద్యాశంకరపాదపద్మయాజీ
రాయప్రోలు లింగనసోమయాజీ.

# విషయసూచిక.

ఇతి శ్రీః



శ్రీ విద్యాశంకర పదమాఽఽవేశ ప్రకాశిత

జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీ మహంతాచార్య స్వాములవారు

।

శ్రీః

శ్రీవిద్యాశంకర భగవత్పాదకృతా

# శారీరకమీమాంసా

కల్యాణసుధాసమేతా

ఓం

ప్రథమోఽధ్యాయః — ప్రథమః పాదః

యుష్మదస్మత్ప్రత్యయగోచరయోర్విషయవిషయిణోస్తమఃప్రకాశవ-

## కల్యాణసుధ

శ్రీవిద్యాశంకరహృదయము.

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యమ్ ।
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి ॥

నారాయణం పద్మభువం వసిష్ఠం శక్తిం చ తత్పుత్రపరాశరం చ ।
వ్యాసం శుకం గౌడపదం మహాన్తం గోవిందయోగీంద్రమథాస్య శిష్యమ్ ॥

శ్రీశంకరాచార్యమథాస్య పద్మపాదం చ హస్తామలకం చ శిష్యమ్ ।
తం త్రోటకం వార్తికకారమన్యానస్మద్గురూన్ సంతతమానతోఽస్మి ॥

శ్రుతిస్మృతిపురాణానామాలయం కరుణాలయమ్ ।
నమామిభగవత్పాదశంకరం లోకశంకరమ్ ॥

ద్విరుద్ధస్వభావయోరితరేతరభావానుపపత్తౌ సిద్ధాయాం తద్ధర్మాణా-

శంకరం శంకరాచార్యం కేశవం బాదరాయణమ్ ।
సూత్రభాష్యకృతౌ వందే భగవంతౌ పునః పునః ॥

నారాయణపద్మభవవసిష్ఠశక్తిం చ తత్పుత్రపరాశరం చ — 
నారాయణసమారంభాం విద్యాశంకరమధ్యమామ్ ।
శ్రీబోధానందపర్యంతాం వందే గురుపరంపరామ్ ॥

శ్రీకృష్ణద్వైపాయనమహర్షి 'జైమినీయదర్శన'మనెడి ధర్మమీమాంసవలనను సాంఖ్యాదివైదికదర్శనములవలనను పాశుపతపాంచరాత్రాదితంత్రములవలనను బౌద్ధాదివేదబాహ్యతంత్రములవలనను వేదాంతముల కపార్థము సేయబడి వేదాంతార్థము విప్రతిపత్తికిఁ బాల్పడుటంజేసి ప్రాకృతలోకమునకుఁ గల్గి యనర్థమును దొలఁగించి జిజ్ఞాసువులను వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థులుగఁ జేయు తలంపునఁ గరుణతో "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యను సూత్రము మొదలుగ గలిగినట్టియు "అనావృత్తిశ్శబ్దాదనావృత్తిశ్శబ్దాత్"ను సూత్రము చివఱగాఁ గ యయిదువందలయేఁబదియైదు సూత్రములతోఁ గూడిన వేదాంతమీమాంసా శాస్త్రమును రచియించెను.

కాలక్రమమున నీయుత్తమదర్శనమునకుఁ గూడఁ బురుషమతివైచిత్ర్యముచేఁ బెక్కులు కువ్యాఖ్యానములు బయలువెడలి సంప్రదాయసిద్ధమగు నర్థము మఱుఁగువడి యనర్థము వాటిల్లఁగా నట్టి యనర్థముఁ దొలఁగించి వేదాంతమఖండతేజమున నాచంద్రతారకము నప్రతిహతముగ నిలిచియుండునట్లు శ్రీవిద శంకరభగవత్పాదులు "శారీరకమీమాంస" యను భాష్యరాజమును రచించి ఈ భాష్యరాజమన్ననో ప్రసన్నగంభీరమగుటంజేసి సర్వసామాన్యముగ నెల్లర తెలిసికొనుట కవకాశములేదను తలంపుతోఁ బలువురు పలువిధములగు వ్యాఖ్యానములఁ బ్రవర్తింపఁజేసిరి. ఇట్టి వ్యాఖ్యానములలోకింత పరస్పరవైషమ్యములతో గూడి యుండుటఁజేసి శ్రీవిద్యాశంకరభగవత్పాదహృదయము సంశయాస్పదమగుచున్నది. దానంజేసి జిజ్ఞాసువులకు భాష్యార్థము సుస్పష్టముగాఁ దెలియకుం యది. కావున నట్టి విప్రతిపత్తిని దొలఁగింప 'నీశారీరకమీమాంసాకల్యాణసు యనెడి యాంధ్రవ్యాఖ్యానము ప్రారంభింపఁబడుచున్నది.

శ్రీ విద్యాశంకర భగవత్పాదులు తాము వ్యాఖ్యానముచేయ నిశ్చయించిన గ్రంథరాజము శ్రుత్యర్థమును బ్రదర్శించుచు శ్రుతిమూలకమగు స్మృతి యటంజేసి ప్రమాణపదవి నధిష్ఠించియున్నదని ఘంటాపథముగఁ బ్రదర్శింప సు

మపి సుతరామితరేతరభావానుపపత్తిరిత్యతోఽస్మత్ప్రత్యయ-

తంత్రమున కుపోద్ఘాతముగ "యుష్మదస్మత్ప్రత్యయగోచరయోః" యనునది మొదలుగాఁ గల్గి "సర్వే వేదాంతా ఆరభ్యన్తే" యను వాక్య మంతముగాఁ గల భాష్యమును ప్రదర్శించియున్నారు.

ఇందు "అస్యానర్థహేతోః ప్రహాణాయాత్మైకత్వవిద్యాప్రతిపత్తయే సర్వే వేదాంతా ఆరభ్యన్తే" యను భాష్యమువలన సకల వేదాంతములును నాత్మైకత్వవిద్యావిషయములుగను ననర్థహేతు ప్రహాణము ప్రయోజనముగను గల్గియున్నవని వ్యక్తీకరించి యట్టితాత్పర్యమునే వేదాంతములు బోధించుచున్నవను విషయమును 'శారీరకమీమాంస'యను తమగ్రంథమున ననఁగా శ్రీకృష్ణద్వైపాయనప్రణీతమగు వేదాంతమీమాంసా శాస్త్ర వ్యాఖ్యానమునఁ బ్రదర్శించుచున్నామని "యథా చాయమర్థః సర్వేషాం వేదాంతానాం తథా వయమస్యాం శారీరకమీమాంసాయాం ప్రదర్శయిష్యామః" యని ప్రతిజ్ఞచేసియున్నారు. దీనిఁబట్టి వేదాంతమీమాంసాశాస్త్రము వేదాంతములచే నుపదేశింపఁబడుచుండెడి బ్రహ్మాత్మైకత్వ విద్యను బోధించుచున్నదనియు నిట్లు శ్రుతిసమ్మతమగుటఁజేసి యీ వేదాంతమీమాంసాశాస్త్రము ప్రమాణరాజముగ నలరారుచున్నదనియు సూచింపఁబడుచున్నది.

ఇఁక వేదాంతములయందు వినవచ్చెడి బ్రహ్మాత్మైకత్వము యుక్తిసహమై న్యాయోపేతమగుచున్నదని "యుష్మదస్మత్ప్రత్యయగోచరయోః" యను పదము మొదలుగాఁగల్గి "సర్వలోకప్రత్యక్షః" యను పద మంతముగాఁ గల భాష్యముచేఁ బ్రదర్శించుచున్నారు. ఈ భాష్యమున కధ్యాసభాష్య మని శిష్టవ్యవహారము గలదు. ఏలయన, నీ గ్రంథముచేఁ బ్రతిజ్ఞ సేయఁబడిన బ్రహ్మాత్మైకత్వము తద్భిన్నమగు సకల ప్రపంచమును బ్రహ్మాత్మయందు శుక్తిరజతమట్లజ్ఞానముచే నధ్యస్తము చేయఁబడుటవలన భ్రమమాత్ర మగుటంజేసి సత్య మెంతమాత్రము గాదు. అందుచే బ్రహ్మాత్మకు ద్వితీయత్వము గలుగనేరదను విషయము న్యాయోపేత మగుచున్నది. అట్లధ్యస్తముగానిచో బ్రహ్మాత్మ కేకత్వ మెంతమాత్రము ఘటింపనేరదు. కావున బ్రహ్మాత్మైకత్వవాది తద్భిన్నమగు సకలమును బ్రహ్మాత్మయందధ్యస్తమని ప్రథమమున నిరూపింపవలయును. దానంజేసి మీమాంసకాగ్రేసరులగు శ్రీవిద్యాశంకర భగవత్పాదులు తమ పవిత్రగ్రంథమునందలి విషయప్రయోజనములను సయుక్తికముగ నిరూపించుటకు హేతుభూతమగు నధ్యాసను లక్షణ సంభావనా సద్భావము లనెడి ప్రమాణములచే నిరూపింపఁదలంచి తొలుత "యుష్మదస్మత్ప్రత్యయగోచరయోః" యనునది మొదలు "మిథ్యేతి భవితుం యుక్త

మ్మ"ను వాక్యమంతమ్ముగాఁగల భాష్యముచే నధ్యాసమునాక్షేపించి "తథాపి"యను శబ్దము మొదలు "లోకవ్యవహార" యను పద మంతిముగాఁగల భాష్యముచే నధ్యాసమును నిరూపించుచున్నారు.

అందు "అహ కోఽయమ్మ"ను వాక్యము మొదలు "ఏకశ్చంద్రస్సద్విత్రీయవదితి" యను వాక్యమువఱకుఁగల భాష్యము లక్షణపరము. "కథం పున" యను వాక్యము మొదలు "న న సంబధ్యతే" అను వాక్యమువఱకుఁగల భాష్యము సంభావనాపరము. "తమేతమవిద్యాఖ్యమ్మ"నునది మొదలు "సర్వలోకప్రత్యక్ష" యను వాక్యమువఱకుఁగల భాష్యము సద్భావపరము.

ఇట్లే యుపోద్ఘాతభాష్య మాక్షేపము, సమాధానము, లక్షణము, సంభావన, సద్భావము, విషయప్రయోజన నిరూపణము, ప్రతిజ్ఞ యను నేడువిషయములతో నొప్పుచున్నది. ఈ యేడువిషయములును క్రమముగా నిరూపింపఁబడుచున్నవి.

ఆక్షేపము—"అస్మత్ప్రత్యయగోచరే విషయిణి చిదాత్మకే యుష్మత్ప్రత్యయగోచరస్య విషయస్య తద్ధర్మాణాం చాధ్యాసః, తద్విపర్యయేణ విషయిణస్తద్ధర్మాణాం చ విషయేఽధ్యాసోమిథ్యేతి భవితుం యుక్తమ్మ"ని. ఈవాక్యమునందు "విషయిణి చిదాత్మకే విషయస్య తద్ధర్మాణాం చాధ్యాసః, తద్విపర్యయేణవిషయిణస్తద్ధర్మాణాం చ విషయేఽధ్యాసో మిథ్యేతి భవితుం యుక్తమ్మ"ను వాక్యముచే నిష్టార్థసిద్ధి గలుగుచున్నది దీనియర్థమేమన—"విషయియందు విషయముయొక్కయుఁ దద్ధర్మములయొక్కయు నధ్యాసయునద్దానికి విపర్యయముగా విషయమునందు విషయియొక్కయుఁ దద్ధర్మములయొక్కయు నధ్యాసయును మిథ్యయని చెప్పుట యుక్తమైయున్నది "యని. ఇచట విషయి విషయపదములచే నభిప్రేతార్థములాత్మానాత్మలని "ఏవమవిరుద్ధః ప్రత్యగాత్మన్యప్యనాత్మాధ్యాస" యను సంభావనాగ్రంథమందును "తమేతమవిద్యాఖ్య మాత్మానాత్మనోరితరేతరాధ్యాసం పురస్కృత్య" యను సద్భావగ్రంథమందును విశేషనిరూపణము చేయఁబడుటచే స్పష్టముగఁ దెలియఁబడుచున్నది. దానంజేసి 'విషయి' యన నాత్మను, విషయమన ననాత్మను గ్రహింపవలయును. ఆత్మయనఁగా నశేషస్వప్రచారసాక్షియు సర్వసాక్షియునగు ప్రత్యగాత్మయని"అశేషస్వప్రచారసాక్షిణి ప్రత్యగాత్మన్యధ్యస్యతం చ ప్రత్యగాత్మానం సర్వసాక్షిణం తద్విపర్యయేణాన్తఃకరణాదిష్వధ్యస్యతి" యను వాక్యమువలనఁ దెలియుచున్నది. ఇఁక ననాత్మయన నాత్మయం దధ్యస్తములుగా వర్ణింపఁబడిన

బాహ్యప్రపంచము, కరచరణాద్యవయవవిశిష్టమగు స్థూలదేహము, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు, నంతఃకరణము, నహంప్రత్యయియు నగు సమూహ మని సద్భావగ్రంథమున "బాహ్యధర్మానాత్మన్యధ్యస్యతి" యనునది మొదలు "ఏవ-మహంప్రత్యయినమ్" ను వాక్య మంతమందుగల భాష్యముచే సువ్యక్త మగుచున్నది. ఇట్లాత్మ నశేషస్వప్రచారసాక్షి యనియు సర్వసాక్షి యనియును దేహేంద్రియ, మనో బుద్ధు లనువానిచే గ్రహింపఁబడు బాహ్యప్రపంచము ననాత్మయనియు వివరించుట భాష్యకారకల్పితమా? లేక ప్రమాణానుప్రాణితమా? యన నీ విషయమున నిత్యమును స్వతఃప్రమాణమును నపౌరుషేయమును నగు శ్రుతిరాజము పరమప్రమాణముగా నలరారుచున్నది. అట్టిశ్రుతి యెద్దియన..

"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ తు।
బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ॥

ఇంద్రియాణి హయానాహుర్విషయాంస్తేషు గోచరాన్।
ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః॥ (క. 1-3-3,4)

అనునది. ఈశ్రుతియందు రథిరూపక కల్పనచేఁ బ్రదర్శింపఁబడిన యాత్మ యాత్మగను, నట్టియాత్మకంటె భిన్నముగా రథాదిరూపక కల్పనచేఁ జెప్పఁబడిన శరీరము బుద్ధి మనస్సు ఇంద్రియములు విషయములు భోక్త యను సమూహ మనాత్మగను గ్రహింపఁబడినట్లెఱుంగునది. ఇచట భోక్త నహంప్రత్యయినిగా భాష్యకారులు గ్రహించియున్నారు. కావున విషయి శబ్దముచే నీశ్రుతిసిద్ధమగు నాత్మయును విషయ శబ్దముచే నీశ్రుతియందే తెలియవచ్చెడి యనాత్మ యగు దేహాది సంఘాతమును గ్రహింపఁబడుచున్నవి.

ఇఁక నిచట "విషయిణి చిదాత్మకే" యని విషయికిఁ జిదాత్మకత్వవిశేషణ మొకటి గ్రహింపఁబడుచున్నది. అద్దానియభిప్రాయ మేమన, చిత్ = జ్ఞానము, ఆత్మా=స్వరూపము, యస్య=దేనికో, సః=అది చిదాత్మ, అనఁగా జ్ఞానస్వరూపమని యర్థము. అనఁగా సర్వమును గనిపెట్టు జ్ఞానము. ఇట్టి జ్ఞానమే సాక్షియగు నాత్మయనియు విషయి యనియు భాష్యకారులచే నిరూపింపఁబడుచున్నది.

అట్లు "విషయస్య" అనుచో విషయస్వరూపబోధక మగు విశేషణ మెద్దియు గ్రహింపఁబడుటలేదు. దానంజేసి విషయమగు ననాత్మ కెట్టి స్వరూపమును నిర్వచించుట కవకాశము లేదను గొప్పయాశయముతో భాష్యకారులు విషయస్వరూపబోధకవిశేషణమును స్మరకుగొనలేదని సుకరముగ గ్రహింపనగును.

గోచరే విషయిణి చిదాత్మకే యుష్మత్ప్రత్యయ గోచరస్య విషయస్య

కావున నెవ్వరేని విషయమగు ననాత్మకు 'జడాత్మా' యను విశేషణమును బ్రయోగించినను విషయమగుననాత్మను జడస్వరూపముగవివరించిన నయ్యది భాష్యకారాభిమతమగుటఁజేసి యనుపాదేయమే యని గ్రహింపనగును.

ఇచట "విషయస్య తద్ధర్మాణాంచ" యనియు "విషయిణస్తద్ధర్మాణాంచ" యనియు విషయికిని విషయమునకుఁగూడఁ బ్రత్యేకప్రత్యేకముగా ధర్మములున్నట్లు వ్యక్తీకరింపఁబడియున్నది. ఇచట భాష్యకారాభిమతములగు విషయధర్మము లెవ్వి యనియు విషయధర్మము లెవ్వి యనియు నొకింత యోజించి నిరూపింపవలయును. విషయధర్మములనఁగా విషయమగు ననాత్మధర్మము లని యభిప్రాయము. అనాత్మ యనఁగా రథాదిరూపక కల్పనచేఁ జెప్పఁబడిన దేహాదిసముదాయము. అవ్వాని ధర్మము లెవ్వియన- వికలత్వము సకలత్వము, స్థూలత్వము కృశత్వము, గౌరత్వము, మూకత్వము కాణత్వము, క్లీబత్వము బధిరత్వము, కామము సంకల్పము విచికిత్స యధ్యవసాయము మున్నగునవని "తద్యథా పుత్రభార్యాదిషు" అనునది మొదలు "అధ్యవసాయాదీన్"ను పదమంతముగాఁగల భాష్యముచేఁ జెప్పఁబడినది.

ఇఁక విషయిధర్మములన్ననో విషయియగు నాత్మధర్మము లని యభిప్రాయము. ఆత్మధర్మములన బ్రహ్మధర్మములే. ఇచట భాష్యకారాభిమతమగు నాత్మధర్మము లానందరూపత్వము, విజ్ఞానఘనత్వము, సర్వగతత్వము, సర్వాత్మత్వము, నిత్యత్వము మొదలుగాఁగలవని "శ్రుతిష్వానందరూపత్వం, విజ్ఞానఘనత్వం, సర్వగతత్వం, సర్వాత్మత్వమిత్యేవంజాతీయకా బ్రహ్మణోధర్మాః క్వచిత్కేచిచ్ఛ్రూయన్తే" యను భాష్యకారవచనమువలన స్పష్టముగఁ దెలియవచ్చుచున్నది. కావున "నానందరూపత్వము, విజ్ఞానఘనత్వము, సర్వగతత్వము, సర్వాత్మత్వము, నిత్యత్వము" మున్నగునవి విషయిధర్మములుగాఁ దెలియనగును.

ఇచట 'విషయిణి చిదాత్మకే' అని భాష్యకారప్రయోగమువలన విషయి కేవల చిత్స్వరూపముగా నిరూపింపఁబడియుండఁగ నట్టి చిత్స్వరూపమునకు ధర్మముల వర్ణించుట యసంగతము గావున "విషయిణస్తద్ధర్మాణా" మను భాష్యకారవచన మసంగతమా యన నట్లుగాదు. ఏలయనః- బ్రహ్మ చిదేకరసమయ్యునద్దాని స్వభావమును వర్ణింప బాహ్యదృష్టి ననుసరించి పైనిఁ జెప్పఁబడిన యానందాదివ్యపదేశము చిదేకరసమునకుఁ గల్గుచున్నది. కాన నిచట 'తద్ధర్మాణామ'ను ప్రయోగము బాహ్యదృష్టివ్యపదేశమాత్రమేగాని వస్తుధర్మనిరూపణ మొంతమాత్రము గాదు.

తద్ధర్మాణాం చాధ్యాసః, తద్విపర్యయేణ విషయిణస్తద్ధర్మాణాం చ

ఇఁక నధ్యాసయన నదికానిదానియందు దానిబుద్ధి యని "అతస్మింస్త-ద్బుద్ధి" యను భాష్యకారివచనమువలన సువ్యక్తమగుచున్నది. అనఁగా రజతము కాని శుక్తియందు రజతబుద్ధి యేది కలదో యయ్యదియే యధ్యాసమని యర్థము.

ఇఁక మిథ్యాశబ్దమునకు అపహ్నవము, అనిర్వచనీయ మను రెండర్థములు సుప్రసిద్ధములగుచున్నవి. అపహ్నవమనఁగా నిషేధరూపమగు నాస్త్యర్థము., అనిర్వచనీయమన నిదమిత్థమ్మని నిరూపించుట కవకాశము లేనిదని యర్థము. ప్రకృతమునను మిథ్యాశబ్దమున కపహ్నవరూపార్థమే గ్రహింపఁబడవలయును. అనఁగా లేదను నర్థమును గ్రహింపవలయును.

ఇట్లు పూర్వపక్షమందలి పదార్థవిశేషకథనముచేఁ దెలియవచ్చెడి పూర్వపక్షవాక్యార్థమేమనఁ, జిత్స్వరూపమును విషయియునగు నాత్మయందు విషయమగు ననాత్మకును దద్ధర్మములగు వికలత్వాదులకు నధ్యాసయు నద్దానికి విపర్యయముగా విషయమగు ననాత్మయందు విషయియగు నాత్మకును దద్ధర్మములగు నానందాద్యులకు నధ్యాసయు లేదని చెప్పుట యుక్తమై యున్నదని.

ఇట్టివాక్యముచేఁ బూర్వపక్షాశయము సువ్యక్తమగుచుండ నిచట "విషయిణి" యనుచో "అస్మత్ప్రత్యయగోచరే" యనియు "విషయస్య" యనుచో "యుష్మత్ప్రత్యయగోచరస్య" యనియు విశేష శబ్దములు సెప్పఁబడియున్నవి. ఇట్టివిశేషశబ్దములవలనఁ దెలియవచ్చునదేమన — విషయియగు నాత్మ యస్మత్ప్రత్యయ గోచర మనియు విషయమగు ననాత్మ యుష్మత్ప్రత్యయగోచర మనియు విశేషముగాఁ బేర్కొనఁబడిన దని. ఇచట నాత్మానాత్మ శబ్దములచే నర్థము సువ్యక్త మగుచుండుటచే నుత్తరగ్రంథమున నాత్మానాత్మ శబ్దములనే గ్రహించుచుండఁగా నిచట నాత్మానాత్మ శబ్దముల విడిచి తత్స్థానమున నస్మత్ప్రత్యయగోచరము యుష్మత్ప్రత్యయగోచర మను నపూర్వ గౌరవ శబ్ద ప్రయోగమువలనఁ గల్గు ప్రయోజన మెయ్యది? ప్రయోజనము లేనిచో నపూర్వ గౌరవశబ్దప్రయోగ మనర్థహేతువుగదా? యన్న స్వాభిమతమగు విషయిని నాత్మయని గ్రహించినచో నాత్మశబ్దము తంత్రాంతరములయందుఁ బలువిధములుగ నర్థము గాంచిపఁబడి విప్రతిపత్తికిఁ బాల్పడినది. కావున నా శబ్దము శ్రుతిసిద్ధ మగు నర్థము నీయఁజాలదు. అట్టి యర్థమును స్ఫురింపఁజేయుటకు సర్వతంత్రముల వారిచే విషయిగాఁ దలంపఁబడు నాత్మయొక్క స్వరూపము వారిచేఁ దలంపఁబడు నహంప్రత్యయిగాక యట్టియహంప్రత్యయికి సాక్షియగు శ్రుతిసిద్ధ విశేష స్వరూప

విషయేఽధ్యాసో మిథ్యేతి భవితుం యుక్తమ్ ।

మని తెల్పుటకు నహంశబ్దమునకుఁ బ్రాతిపదికమగునట్టియు వ్యవహారాతీతమగు నట్టియు నస్మ.త్తనుదానితోఁ గూడిన యస్మత్ప్రత్యయగోచర మను లాక్షణిక పదముచే నిరూపించియున్నారు. భాష్యకారులచే లాక్షణికముగ సిద్ధియో యొకతీరునఁ బ్రయోగింపఁబడినట్టియు వ్యవహారమునందు లేనట్టి యీపదమువలనఁ దెలియవచ్చెడి యాచార్యాశయ మేమన—లోకమునందలి లాక్షణిక పదప్రయోగముల వలనఁ బ్రయోక్తలెట్టిప్రయోజనము నభిలషించి లాక్షణిక పదప్రయోగమును జేయుచున్నారో యట్టి ప్రయోజనమును బడయుటయే యని. లాక్షణిక పద ప్రయోక్తలయాశయమన్ననో యట్టిపదములచేఁ దెలిసికొనఁదగినయర్థమును దమ సంప్రదాయమువలననే తెలిసికొనవలయునుగాని యద్దానికంటె వేఱొంకమార్గము ప్రయోజనకరము కాకపోవుటయేగాక యనర్థహేతువుగూడ నగుననిగదా! ఆతీరు ననే భాష్యకారులు స్వాభిమత విషయి విషయ తత్త్వము నవిచ్ఛిన్నపరంపరాక్రమమున వచ్చుచుండెడి స్వీయసంప్రదాయమువలననే దెలిసికొనవలయును ; లేనిచో ననర్థము వాటిల్లునను గొప్ప యాశయముతో నీ లాక్షణికములగు నపూర్వగౌరవ పదములచేఁ దమ గ్రంథము నుపక్రమించియున్నారు. దానంజేసి యీ గ్రంథము భాష్యకార సంప్రదాయ ముఖమునవే శ్రవణము చేయఁబడవలయునుగాని వేఱొక విధమునఁగాని వేఱొకరివలనఁగాని యెంతమాత్ర మభ్యసింపఁగూడదని తాత్పర్యము. ఇయ్యదియె యీ యపూర్వ పదప్రయోగమునకుఁ బరమ ప్రయోజనమై యున్నది. ఇట్టి యస్మత్ప్రత్యయగోచర యుష్మత్ప్రత్యయగోచర పదప్రయోగమువలన నాత్మానాత్మ శబ్దముల కాచార్య సంప్రదాయైక వేద్యమగు నర్థము నాచార్యసంప్రదాయముఖమున నుపదేశముఁ బడసి గ్రహింపవలయునుగాని తంత్రాంతరములందుఁ జెప్పఁబడిన యర్థములనుగాని సంప్రదాయాంతరములచేఁ జెప్పఁబడు నర్థమునుగాని యెంతమాత్రమును గ్రహింపఁగూడదు.

ఇఁక నస్మత్ప్రత్యయగోచరమనఁగా శ్రుతిసిద్ధమును భాష్యకారసంప్రదాయైకవేద్యమునగు విషయి. అనఁగా సర్వసాక్షియగునాత్మ. యుష్మత్ప్రత్యయ గోచరమన నట్టివిషయికి విషయమగు ననాత్మ.

ఇట్టి యర్థవిశేషముచేఁ బూర్వపక్ష భాష్యమునకుఁ దెలియవచ్చెడి విశిష్టార్థము:—విషయియును జిత్స్వరూపమునగు నస్మత్ప్రత్యయగోచరమునందు విషయమగు యుష్మత్ప్రత్యయగోచరమునకు విషయధర్మములగు వికలత్వాదులకు నధ్యాసయు నద్దానికి విపర్యయముగ విషయమగు యుష్మత్ప్రత్యయగోచరమునందు

విషయమగు అస్మత్ప్రత్యయగోచరమునకు విషయధర్మములగు సానందాదులకు నధ్యాసయును లేదని చెప్పుట యుక్తమనునది.

ఇట్టి భావమునకు ఉపపాదకముగా భాష్యమునందు గల కారణము "యుష్మదస్మ-త్ప్రత్యయగోచరయోర్విషయవిషయిణోస్తమఃప్రకాశవద్విరుద్ధస్వభావయోరితరేతర-భావానుపపత్తౌ సిద్ధాయాం తద్ధర్మాణామపి సుతరామితరేతరభావానుపపత్తిః" యని నిర్వచింపఁబడియున్నది. ఇందు "యుష్మదస్మత్ప్రత్యయగోచరయోరితరేతర-, భావానుపపత్తౌ సిద్ధాయాం తద్ధర్మాణామపి సుతరామితరేతరభావానుపపత్తి"యను భాష్యము హేతుప్రతిపాదకము. ఇందు "యుష్మదస్మత్ప్రత్యయగోచరయో" యను పదము పైఁ జెప్పఁబడిన "యుష్మత్ప్రత్యయగోచరః" "అస్మత్ప్రత్యయ-గోచరః" అను లాక్షణిక పదములతోఁ గూర్పఁబడిన సమస్తపదమని తెలియఁ, బడుచున్నది. ఈసమస్తపదార్థవ్యక్తీకరణమునకై ఆ హేతువాక్యమును ప్రదర్శించి. నచో హేతువాక్యము"యుష్మత్ప్రత్యయగోచరస్య, అస్మత్ప్రత్యయగోచరస్య చేత-రేతరభావానుపపత్తౌ సిద్ధాయాం తద్ధర్మాణామపి సుతరామితరేతరభావానుపపత్తి" యను స్వరూపము నొందుచున్నది. ఇచట "యుష్మత్ప్రత్యయగోచరస్య, అస్మ-త్ప్రత్యయగోచరస్య" అను పదములు సమస్యమానములగుచో "యుష్మత్ప్రత్యయ-గోచరాస్మత్ప్రత్యయగోచరయో" యని యుండవలసియుండఁగా భాష్య కారులు "యుష్మదస్మత్ప్రత్యయగోచరయో" యని ప్రయోగించిరి. ఇట్టి భాష్య కారప్రయోగము వ్యాకరణస్మృతిచే నెట్లు సాధువుగా నొప్పును? భిన్నములగు పదములందుఁ దెలియవచ్చెడి సామాన్య విశేషపదములలో విశేషపదములకు మాత్రము ద్వంద్వకల్పనమును గావించి తదంతమున సామాన్యపదము నొక దానిని జేర్చుట, యనఁగా దేవదత్తయజ్ఞదత్తశబ్దములందుఁ దెలియవచ్చెడి విశేష పదములగు దేవ యజ్ఞపదములకు "దేవయజ్ఞ"అను సమాసముచేసి తదంతమున, సామాన్యపదమగు దత్తపదమునుగూర్చి"దేవయజ్ఞదత్తౌ" యనునట్లు సమాసకల్పన చేయుట వ్యాకరణసమ్మతమగునా? అట్లుకానిచో యుష్మత్ప్రత్యయగోచరాస్మ త్ప్రత్యయగోచరశబ్దములకు 'యుష్మదస్మత్ప్రత్యయగోచరౌ' అను సమాసకల్పన మసమంజసమేయయ్యెడిని. ఇట్టికల్పనమే యసమంజసమగుచో గ్రంథాదియందు దప శబ్దప్రయోగము •దోషావహ మెట్లు కానేరదను నర్థానికి నొకింత చెప్పవలసి యున్నది. పదవాక్య ప్రమాణ పారావారపారీణులగు భాష్యకారు లపశబ్దప్రయో గముచేయుదు రనుటగాని చేసిరనుటగాని యెంతమాత్రము విబుధలోకము సహింపదుగదా! కావున నిట్టి ద్వంద్వకల్పన శిష్టసమ్మతిని బడసినదయ్యు నపూర్వ

మగుటఁజేసి యపూర్వమగు నర్థమును బోధించునదియై యుండవలయును. ఇది వఱకు యుష్మత్ప్రత్యయగోచరము, అస్మత్ప్రత్యయగోచర మను శబ్దము లపూర్వార్థబోధకము లనియు లాక్షణికము లనియు నిరూపింపఁబడియె. ఇట్టి యపూర్వార్థబోధకములగు లాక్షణికపదములచే నీయపూర్వద్వంద్వకల్పనమును గావించుటయందుఁగల తాత్పర్యము లాక్షణికపదకల్పనయందలి తాత్పర్యమే యనియు నంతకంటె భిన్న మెంతమాత్రముగాదనియు నిశ్చయముగఁ జెప్పనొప్పు. అనఁగా నీశబ్దార్థముగూడ సంప్రదాయైకవేద్యమే యని భాష్యకారాశయము. అట్లగుచో సంప్రదాయైకవేద్య మను మిషచే నపశబ్దప్రయోగము శిష్టసమ్మతమా? యన నియ్యది యపశబ్ద మెంతమాత్రమును గాక శిష్టసమ్మతమగుసుశబ్దముగా నలరారుచున్న దని చెప్పుట కెంతమాత్రమును సందియము లేదు. ఎట్లన, “సుబంతం చ తిజంతం చ పదసంజ్ఞం స్యాత్” ను శిష్టవాక్యమును సూత్రరూపమున వ్యక్తీకరింపఁదలఁచినపాణిన్యాచార్యుఁడు సుబంతతిజంతపదములలోని సుప్తిఙ్రూపములగు విశేషపదములను ముందుగాఁ గూర్చి తదంతమున ‘అంత’ శబ్దమును గూర్చి “సుప్తిఙంతం పదమ్”ను సూత్రము నెట్టినియమముచే స్మరించెనో యారీతిననే యుష్మత్ప్రత్యయగోచరాస్మత్ప్రత్యయగోచరశబ్దములకు, యుష్మదస్మత్ప్రత్యయగోచరాయని సమానకల్పనమును జేయుటచేఁ బాణిన్యాదిశిష్టులలోఁగూడ భాష్యకారులగ్రగణ్యులుగఁ బరఁగునంతటిగౌరవముతో నొప్పియున్నా రను విశేషము నీ “యుష్మదస్మత్ప్రత్యయగోచరయో” యను పదము వ్యక్తీకరించుచున్నది. ఇంతియే కాదు. సకలవేదార్థసారము నొక్క-యాక్షేపసమాధానములతోఁ గూడిన యధ్యాసభాష్యముచేతనే సకలలోకములకు నుపదేశించుచున్న భాష్యకారులు యుష్మత్ప్రత్యయగోచరాస్మత్ప్రత్యయగోచరములయొక్క- యన్యోన్యాధ్యాసమును “యుష్మదస్మత్ప్రత్యయగోచరయో” యను నపూర్వద్వంద్వకల్పనచే సూచించి యున్నారు. ఇందలిరహస్యవిశేషము భాష్యకారసంప్రదాయైకవేద్యము.

ఇది యిట్లుండ భాష్యవ్యాఖ్యాతలు గొందఱు విషయిని నస్మత్తనియు విషయమును యుష్మత్తనియు గ్రహించుచుఁ దదర్థపురస్సరంబుగ యుష్మదస్మత్ప్రత్యయగోచరయో యను పదమునకుఁ బలువిధములగు విగ్రహములను గల్పించి యున్నారు. అట్టివిగ్రహములు వారలకుఁగూడ రుచింపలేదని నిర్ణయింపఁగలిగినంత యాభాసముగ నావిగ్రహములఁ బ్రదర్శించియున్నారు. అట్టియాభాసమునకుఁ గారణము భాష్యకారానభిమతముగ నస్మత్తుచే విషయియగు నాత్మను, యుష్మత్తుచే విషయమగు ననాత్మను గ్రహించుటయే. భాష్యకారు లన్ననో విషయియగు

నాత్మను అస్మత్ప్రత్యయగోచర మనియు, విషయమగుననాత్మను యుష్మత్ప్రత్యయ గోచర మనియును గ్రహించియున్నారు గాని యెచ్చటను వ్యాఖ్యాతలు గ్రహించినట్లు యుష్మన్మాత్రముచేతను అస్మన్మాత్రముచేతను గ్రహించియుండ లేదు. కావున యుష్మదస్మత్తులను ప్రత్యేకవాచకములనుగా గ్రహించుట భాష్యకార హృదయవిరుద్ధమును హేయము నగుచున్నది.

ఇఁక నితరేతరభావ మన నితరేతరసంభేదము. అనఁగా నితరేతర సాంకర్య మని యభిప్రాయము. ఇతరేతరసాంకర్యమున కవకాశ ముండినచో నితరేతరాధ్యాసమున కవకాశము గలుగును. అట్టిసాంకర్యము లేనిచో నధ్యాసము సిద్ధింపదు. ప్రకృతమున నుద్దేశింపఁబడిన యుష్మత్ప్రత్యయగోచరాస్మత్ప్రత్యయ గోచరములయొక్క యితరేతర సాంకర్యమున కెంతమాత్రము నవకాశము లేదు. కావున నాయుష్మత్ప్రత్యయగోచరాస్మత్ప్రత్యయగోచరములయొక్క ధర్మముల సాంకర్యమునకుఁ గూడ నించుకేనియు నవకాశము లేదు గావున నధ్యాసము లేదని చెప్పుటకుఁ గారణ మని హేతువాక్యముయొక్క తాత్పర్యము. యుష్మదస్మ త్ప్రత్యయగోచరములకు నితరేతరసాంకర్యము లేదనుటకుఁ గారణము "విరుద్ధస్వభా-వయోః" యను పదముచే నిరూపింపఁబడుచున్నది. విరుద్ధస్వభావ మన నెద్దియో యద్దానిని నిరూపించుటకై "తమఃప్రకాశవత్త"ను దృష్టాంత మీయఁబడుచున్నది. ఇచటఁ దమఃప్రకాశదృష్టాంతముచే గ్రహింపఁబడవలయువిరుద్ధస్వభావము పరస్పరానాత్మతాలక్షణముగాని సహానవస్థానలక్షణ మెంతమాత్రముగాదు. సహానవస్థాన మనఁగా నొకచోఁ గూడియుండుటకు వీలులేని స్వభావము. అనఁగా నొకదానియొక్క స్వభావము మరియొకదానిస్వభావమునకు బాధక మగుచో నా రెండు వస్తువులు నొకేకాలమున నొకేస్థలమున నిలిచియుండనేరవు. తమఃప్రకాశము లన్ననో యన్యోన్య బాధకములు గాక రెండు నొకచో నిలిచియుండుటకుఁ దగు సావకాశమును గల్గియున్నవి. కాని తమస్సును జూచి ప్రకాశ మనిగాని ప్రకాశమును జూచి తమస్సని గాని యించుకేనియు శంకించుటకు వీలులేని యన్యోన్య విలక్షణస్వరూపముతో నొప్పుచున్నవి. ఇట్టియన్యోన్యవైలక్షణ్యముతో నొప్పు స్వరూపమునే పరస్పరానాత్మతాలక్షణ మని కోవిదులు చెప్పుచున్నారు.

ప్రకృతమునఁ దమఃప్రకాశదృష్టాంతముచే సూచింపఁబడువిరుద్ధస్వభావ మెద్దియన నయ్యది "విషయవిషయిణోః" యను పదముచే నిరూపింపఁబడుచున్నది. అది యెద్దియన—యుష్మత్ప్రత్యయగోచరము విషయ మనియు నస్మత్ప్రత్యయ గోచరము విషయి యనియుఁ జెప్పఁబడుచున్నది. విషయి యన్ననో విషయమును

దెలిసికొను సాక్షిరూపమగు చైతన్యము. విషయ మన్ననో విషయికంటె భిన్నమై విషయిచేఁ దెలిసికొనఁబడునట్టివి శేషము. తెలిసికొనువాఁడు దనచేఁ దెలిసికొనఁబడు వానివిశేషముల నెన్నఁడు దనస్వరూపముగాఁ దెలిసికొనుట కవకాశ ముండదు. కావున విషయివిషయములు లోకస్థలమున నొకకాలముననే నిలిచియున్నను విషయిని విషయముగాఁ గాని విషయమును విషయినిగాఁ గాని యెంచుకేనియుఁ దలంచుట కెంతమాత్రము సావకాశము లేదుగదా! దానంజేసి "విషయవిషయిణో" యను పదములచే యుష్మదస్మత్ప్రత్యయగోచరములు రెండు నెంచుకేనియు సాంకర్యముఁ జెందుటకు వీలులేనంతటి విరుద్ధస్వభావములతో నొప్పుచున్నవని పరమ తాత్పర్యము. కావున నస్మత్ప్రత్యయగోచరమునకును యుష్మత్ప్రత్యయగోచరమునకును దద్ధర్మములకును యుష్మత్ప్రత్యయగోచరమునం దస్మత్ప్రత్యయగోచరమునకుఁ దద్ధరములకు నధ్యాసము లేదని చెప్పుట యుక్తమే యని యాక్షేపభాష్యతాత్పర్యము. కావున శాస్త్రమునకు నభిమతములగు విషయప్రయోజనములు సిద్ధింపక పోవుటచే శాస్త్ర మనారంభణీయమే యని యాక్షేపభాష్యతాత్పర్యము.

"అధ్యాసస్థలములందు ధర్ములకు సాంకర్యము లేకుండ ధర్మములకు సాంకర్యము గలుగుట యప్రసిద్ధ మగుచుండ భాష్యకారులు "తద్ధర్మాణామపి సుతరామితరేతరభావానుపపత్తి" యని యధ్యాసనిషేధహేతువుగ ధర్మసాంకర్యనిషేధమును గూడ నెందులకుఁ గావించి రన, వ్యవహారమున నహంమాని ధర్ము లగు నింద్రియాదులతోఁ దాదాత్మ్యభావముఁ జెందకయే యింద్రియాదిధర్మము లగు కాణత్వాదులను దనయం దధ్యస్తములుగాఁ జేసికొనుట దెలియవచ్చుచున్నది. దానంజేసి ధర్మ్యధ్యాసము లేకుండఁగనే ధర్మాధ్యాసము గలుగవచ్చునను నాక్షేపమును వారింప "తద్ధర్మాణామ" ని గ్రహించియున్నారు.

గ్రంథకరణాదికార్యారంభమున నట్టికార్యముయొక్క నిర్విఘ్నపరిసమాప్తిని బ్రయోజనముగా నభిలషించి శిష్టులు మంగళాచరణమును గావించుట యాచారముగానున్నది. శిష్టాచారముగూడఁ బ్రమాణముగదా? అట్టిశిష్టాచారము నుల్లంఘించి తమభాష్యాదియందు భాష్యకారులు మంగళాచరణము నెందులకుఁ గావింపలే దన, శిష్టాచారప్రమాణవాదులలో నగ్రగణ్యు లగు భాష్యకారులు మంగళమును గావింప లేదనునది లేదు. "అక్షరాణామకారోఽస్మి ద్వంద్వస్సామాసికస్య చ" యను నీశ్వరగీతములయందు ద్వంద్వసమాస మీశ్వరస్వరూపముగా స్మరింపఁబడినది. భాష్యకారులన్ననో యీశ్వరస్వరూపముగాఁ దలంపఁబడు "యుష్మదస్మత్ప్రత్యయగోచరయో" యను ద్వంద్వసమాసముతోఁ దమగ్రంథమును

తథాప్యన్యోన్యస్మిన్నన్యోన్యాత్మకతా మన్యోన్యధర్మాంశ్చాధ్యస్యేతరేతరా-

ప్రారంభించుటచే వృద్ధ్యర్థశబ్దములను గ్రంథారంభమునఁ బ్రయోగించిన శిష్టులకు మంగళము సిద్ధించినతీరుననే భాష్యకారులకుఁగూడ మంగళము సిద్ధించుచున్నది. ఇంతియ గాదు; ఈద్వంద్వసమాసమునఁ అస్మత్ప్రత్యయగోచర మను లాక్షణిక పదముచేఁ దమ కభిమత మగు, సర్వోపప్లవరహిత ప్రజ్ఞానఘనప్రత్యగాత్మస్వరూప మగు బ్రహ్మమును స్మరించుటచే నిష్టదేవతాతత్త్వానుస్మరణరూపమంగళమును భాష్యకారులు సర్వవిధములఁ జేసియేయున్నారు. అట్టిమంగళమున కనురూప మగు ప్రయోజనమైన భాష్యపరిసమాప్తి గలుటయే గాక యట్టిభాష్య మాచంద్ర తారకముగ నఖండ మగు యశము నన్నిదేశములయందుఁ గనుచున్నదిగదా!

ఉత్తరగ్రంథము “తథాపి” యను పదములతోఁ బ్రారంభింపఁబడుట వలన నీపూర్వపక్షగ్రంథమున “యద్యపి” యను పదము నధ్యాహారము చేసి కొనవలయును. అనఁగా నధ్యాసము లేదని చెప్పుట యుక్తమగునప్పటికిని నని యర్థము. ఇచ్చట నధ్యాసము లేదని చెప్పుటకు నధ్యాసము నిజముగా లేదా లేక యధ్యాసము తెలియఁబడలేదా యను పక్షద్వయమును శంకించి యస్మత్ప్రత్యయ గోచరమునందు యుష్మత్ప్రత్యయగోచరమునకుఁ గాని యుష్మత్ప్రత్యయగోచర మం దస్మత్ప్రత్యయగోచరమునకుఁ గాని పూర్వోక్తకారణములచే నధ్యాస మెంత మాత్రమును గలుగనేర దను గొప్పయాశయమును “తథాపి” యను పదముచే సూచించి యధ్యాసము ప్రత్యక్షముగాఁ దెలియవచ్చుటఁజేసి లేదని చెప్పుట కవకాశ మెంతమాత్రమును లేదనునభిప్రాయమును సయుక్తికముగ “అన్యోన్య-స్మిన్నన్యోన్యాత్మకతామన్యోన్యధర్మాంశ్చాధ్యస్యేతరేతరావివేకేనాత్యంతవివిక్త-యోర్ధర్మధర్మిణోర్మిథ్యాజ్ఞాననిమిత్తః సత్యానృతే మిథునీకృత్యాహమిదం మమేదమితి నైసర్గికోఽయం లోకవ్యవహార” యను భాష్యముచే సూచించుచున్నారు. అయమ్=యుష్మదస్మత్ప్రత్యయగోచరములయొక్క యితరేతరాధ్యాసము, నైసర్గికః=స్వభావముచే నస్మత్ప్రత్యయగోచర మగు చైతన్య మాత్రమునే యాలంబనముగాఁ గల్గియుండునది. కావున నస్మత్ప్రత్యయగోచరము యొక్క సద్భావ మెటుల నిరాకరింపఁబడుట కవకాశము లేదో యాతీరుననే యీ యధ్యాసము గూడ నిరాకరింపఁబడుట కవకాశము లేదు. ప్రత్యక్షముగాఁ దెలియ వచ్చెడి యధ్యాసస్వరూపము “అహమిదం మమేదమితి లోకవ్యవహార” యను భాష్యముచేఁ బ్రదర్శింపఁబడుచున్నది. ఇచట “అహమిదమ్మ”ను భాష్యము తంత్రోచ్చరితము. అనఁగా నర్థవ్యవస్థ చేయునపుడు రెండుసారులు దీనిని బొందికపఱచి “అహమిదం, అహమిదం, మమేదమితి లోకవ్యవహార” యని భాష్యార్థమును

వివేకేనాత్యంత వివిక్తయోర్ధర్మధర్మిణోర్మిథ్యాజ్ఞాననిమిత్తః సత్యానృతే

నిరూపింపవలయును. అధ్యాసములలో 'నహ'మ్మను భావము మొదటి యధ్యాసము. ఇట్టిభావమునందుఁ జడచిత్తులు రెండును వెలియవచ్చుటచే నీయహంభావము గూడ నధ్యాసకార్యమే. కాని నిరంశ మగు చైతన్య మెంతమాత్రమును గాదు. ఇఁక 'నిదమ్మ'నునది భోక్త యగు నహంశబ్దవాచ్యునకు భోగసాధనముగాఁ దెలియవచ్చెడి దేహేంద్రియసంఘాతరూపము. ఈదేహేంద్రియసంఘాతముతో నహంమాని తాదాత్మ్యమును జెంది "అహమిదం=నేనే యీశరీర మను భావమును బొందుట మూఁడవయధ్యాసము. ఇఁక నిదంశబ్దముచే దేహేంద్రియసంఘాతముకంటె భిన్నమగువిషయములను గ్రహించి యట్టివిషయములకును ధనకును "మమేదం=ఇది నాసంబంధ మయినది" యను నభిమానమును జెందుట నాలుగవ యధ్యాసము. ఇట్టినాలుగువిధము లగు నధ్యాసములతోఁ గూడినది లోకవ్యవహారము. అనఁగా నేను మనుష్యుఁడనని వ్యవహరించుటయే యధ్యాసముయొక్క తాత్పర్యము. ఇట్టివ్యవహారము అభిజ్ఞ, అభివదనము, ఉపాదానము, అర్థక్రియ యని నాల్గువిధములుగ లోకమునఁ దెలియవచ్చుచున్నది. ఇట్టివ్యవహార మెట్లు పరఁగుచున్నదన, సత్య మగు నస్మత్ప్రత్యయగోచరమును నన్నృత మగు యుష్మత్ప్రత్యయగోచరమును నొకదానితో నొకదానిని గలుపుటచేఁ గల్గుచున్న దని "సత్యానృతే మిథునీకృత్య" యను భాష్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

యుష్మత్ప్రత్యయగోచరము స్వరూపముచేఁ గూడ నధ్యస్తస్వరూపమే. ఇందు సత్యానృతములయొక్క మిథునీకరణమునకుఁ గల కారణము "మిథ్యాజ్ఞాన-నిమిత్త" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. ఇచట మిథ్యాజ్ఞాన మనుచో "మిథ్యా చ తదజ్ఞానం చ మిథ్యాజ్ఞాన"మ్మని విగ్రహమును గ్రహింపవలయును. ఇచ్చో మిథ్యాశబ్ద మనిర్వచనీయార్థకము. దానంజేసి మిథ్యాజ్ఞాన మన ననిర్వచనీయ మగు నజ్ఞాన మని యభిప్రాయము. అజ్ఞాన మన భావరూప మగు నవిద్యాశక్తి గాని జ్ఞానాభావ మెంతమాత్రము గాదని దెలియవలయును. నిమిత్తశబ్ద మిచట నుపాదానకారణపరము. అనఁగా సత్యానృతమిథునీకరణమునకవిద్యాశక్తియే కారణము. కారణముచేఁ గల్గిన వ్యవహారమునకు నైసర్గికభావ మెట్లు గల్గునన జెప్పఁబడుచున్నది.—అస్మత్ప్రత్యయగోచర మగు చైతన్యమునే యాలంబనముగాఁ గలిగినట్టి యజ్ఞాన మనెడి యీ యవిద్యాశక్తి బాహ్యములు నాధ్యాత్మికములు నగు వస్తువులయందు ననుస్యూతమై యున్న దని యంగీకరించి తీరవలయును. అట్టి యవిద్యాశక్తియే లేకపోయినచో మిథ్యారూపము లగు వస్తువులయొక్క యవభాసమునకుఁ గారణము లేకపోవుచున్నది; కావున మిథ్యారూపము

మిథునీకృత్యాహమిదం మమేదమితి నైసర్గికోఽయం లోకవ్యవహారః॥

---

లగు వస్తువులు భాసించుటఁజేసి యస్మత్ప్రత్యయగోచరము నాశ్రయించిన యవిద్యాశక్తి యొకటి యున్నదని తెలియవచ్చుచున్నది. ఈయవిద్యాశక్తి యుష్మత్ప్రత్యయగోచరమగు దృశ్యవస్తువులయందు దృశ్యవస్తువులయొక్క ప్రకాశము నెంతమాత్రము ప్రతిబంధింపకపోయినను నావస్తువులను గనిపెట్టెడి యస్మత్ప్రత్యయగోచర మనెడి చైతన్యము నావరించుటచేతనే దృశ్యస్వరూపము చైతన్యముచే గ్రహింపఁబడకున్నది. కాని దృశ్యవస్తువుల నెంతమాత్రమీ యజ్ఞానశక్తి యావరించి వాని స్వరూపము తెలియఁబడకుండునట్టి ప్రతిబంధకమును గావించియుండలేదు. కావున శుక్త్యాదులయందు రజతాద్యధ్యాసములకుఁ గూడ నస్మత్ప్రత్యయగోచరము నావరించిన యజ్ఞానమే కారణమైయున్నది.

అస్మత్ప్రత్యయగోచర మన్ననో చిత్స్వరూపమే యగుటవలన స్వయంప్రకాశమానమేయైనను నట్టిస్వరూప మించుకేనియుఁ బ్రకాశింపకుండుటకు వేఱొక కారణము తెలియఁబడకుండుటచే నా యస్మత్ప్రత్యయగోచరమునందు నిసర్గసిద్ధమగు నజ్ఞానరూప మగు నవిద్యాశక్తియొక్క ప్రతిబంధమే కారణ మని సుస్పష్టమగుచున్నది. కావున నాయవిద్యాశక్తియే యస్మత్ప్రత్యయగోచరమందు బ్రహ్మస్వరూపావభాసమును బ్రతిబంధించుచు నతద్రూపమగు నహంకారాదికముయొక్క ప్రతిభాసమునకు హేతువు గూడ నగుచున్నది. ఇట్లవిద్యాశక్తియొక్క కార్యమావరణ మనియు విక్షేప మనియు రెండువిధములఁ బరఁగుచున్నది.

ఈ యవిద్యాశక్తి సుషుప్తునియందును సమాధిస్థునియందును మూర్ఛితునియందును నహంకారము మొదలుగాఁ గల్గిన విక్షేపముయొక్క సంస్కారమాత్రముగా నుండి సుషుప్త్యాదులనుండి యుత్థానమును జెందఁ దిరుగ నుద్భవించుచున్నది. కావున నీయహంకారమమకారాత్మకమును మనుష్యాద్యభిమానము నగు లోకవ్యవహారము నైసర్గిక మయ్యు మిథ్యాజ్ఞాననిమిత్తమే గాని యాగంతుకమెంతమాత్రముగాదు. కావున నైసర్గికనైమిత్తికభావముల కెంతమాత్రము నిట విరోధము లేదు.

ఇట్టి నైసర్గికభావమునే 'యనాది' యని భాష్యకారులు దలఁచుచున్నారుగాని పరస్పరాశ్రయదోషవారణమునకు నజ్ఞులచేఁ గల్పింపఁబడిన యనాది నెంతమాత్ర మనాదిగాఁ దలఁచియుండలే దని "శరీరసంబంధస్య ధర్మాధర్మయోస్తత్కృతస్య చేతరేతరాశ్రయత్వప్రసంగాదంధపరంపరైషాఽనాదిత్వకల్పనా" యను భాష్యకారో [illegible] స్పష్టమగుచున్నది.

ఇఁక "అన్యోన్యస్మిన్నన్యోన్యాత్మకతామన్యోన్యధర్మాంశ్చాధ్యస్యేతరేతరావివేకేనాత్యంతవివిక్తయోర్ధర్మధర్మిణోః" యను భాష్యముచే నధ్యాసలక్షణము చెప్పఁబడుచున్నది. "ధర్మధర్మిణోః" యనుచో ధర్మము లనఁగ నస్మత్ప్రత్యయ గోచరము లగు దేహేంద్రియాదులును యుష్మత్ప్రత్యయగోచరము లగు చైతన్యాదులును. ధర్ము లనఁగా నస్మత్ప్రత్యయగోచరమును యుష్మత్ప్రత్యయగోచరమును.

"అత్యంతవివిక్తయోః" యనుదానికి ధర్మములయొక్కయు ధర్ములయొక్కయు స్వభావము లొకదానితో నొకటి సాంకర్యముఁ జెందుటకించుకేనియు నవకాశము లేని విరుద్ధస్వభావములతో నున్నవని యభిప్రాయము.

'ఇతరేతరావివేకేన' ఒకదానినుండి వేఱొకదానిని వేఱుచేయుటకుఁ దగు వివేకము లేకపోవుటచే నొకటిగానే దలఁచి, 'అన్యోన్యస్మిన్' = ఒక్కొక్కదాని యందు, అన్యోన్యాత్మకతాం'=ఒక్కొక్కదానియొక్క స్వరూపమును,' అన్యోన్యధర్మాంశ్చ =ఒక్కొక్కదానిధర్మములను, అధ్యస్య = సమారోపణముచేసి, యని యర్థము.

ఇచట 'అన్యోన్యధర్మాంశ్చ' అని ప్రత్యేకముగా గ్రహించుటచే ధర్మ్యధ్యాస లేకుండఁగనే యెద్దియో యొక ధర్మాధ్యాసము గల్గు నని సూచింపఁబడుచున్నది. ఏధర్మియందే ధర్మి కధ్యాసమో, లేక ధర్మమాత్రమునకే యెచట నధ్యాసమో యయ్యది యంతయు భాష్యకారులచేతనే స్వయముగ "తద్యథా పుత్రభార్యాదిషు" యను వాక్య మాదిగాఁగల భాష్యముచే ముందు నిరూపింపఁబడుచున్నది.

"అధ్యస్య, మిథునీకృత్య" యనుచోఁ గ్త్వాప్రత్యయ మధ్యాసమునకును మిథునీకరణమునకును బూర్వకాలత్వమును గాని భేదమును గాని తలంచి యెంత మాత్రమును బ్రయోగింపఁబడలేదు. ఏలయన నిచట "అధ్యస్య, మిథునీకృత్య" అను పదములచే "భుక్త్వా వ్రజతి" యను ప్రయోగమందు వలెఁ గ్రియాంతరము గ్రహింపఁబడక యొకేక్రియ యభిప్రేతమగుటచే గ్త్వాప్రత్యయమునకు స్వార్థమునఁ దాత్పర్యము లేదు.

అట్లైనచో "అధ్యస్య, లోకవ్యవహారః" అను పదములచేఁ గ్రియాన్తరము దెలియవచ్చుచున్నదే యనిన నట్లు గాదు. ఏల యన నయ్యదియు స్వరూపమాత్రమునందే పర్యవసితము గాని వేఱొకటి గాదు. ఇంతియ గాదు; ఉపసంహారమునందు "ఏవమయమనాదిరనంతో నైసర్గికోఽధ్యాస" యనుదానిని మాత్రమే భాష్యకారులు గ్రహించియున్నారు. దానం జేసి "చైతన్యము పురుషునియొక్క స్వరూపము"నట్టియ్యది వ్యపదేశమాత్రమే యని గ్రహింపవలయును.

ఆహ - కోఽయమధ్యాసో నామేతి! ఉచ్యతే — స్మృతి

ఇట్లీ సిద్ధాన్తభాష్యమున " అన్యోన్యస్మిన్న "ను పదము మొదలు "ధర్మ-ధర్మిణో " యను పదమువఱకును గల భాష్యముచే నధ్యాసలక్షణమును "మిథ్యా-జ్ఞాననిమిత్తః సత్యానృతే మిథునీకృత్య నైసర్గిక " యను భాష్యముచే నధ్యాస కారణమును, " అహమిదం మమేదమితి లోకవ్యవహార " యను భాష్యముచే నధ్యాసస్వరూపమును సుస్పష్టముగ నిరూపింపఁబడుటచే యుష్మదస్మత్ప్రత్యయ గోచరములకు నధ్యాసము లేదని చెప్పుట కెంతమాత్ర మవకాశము లేదు. కావున శాస్త్రమునకు విషయప్రయోజనములు సిద్ధించుటఁ జేసి శాస్త్ర మారంభణీయమే యని సిద్ధాన్తతాత్పర్యము.

ఇట్లీ యధ్యాసభాష్యము శాస్త్రముయొక్క విషయప్రయోజనసిద్ధికిఁ గారణ మగుటఁ జేసి శాస్త్రముతో సంబంధించియే యున్నది. అంతియే గాదు. మొదటిసూత్రమునఁ బ్రతిజ్ఞచేయఁబడిన విషయ ప్రయోజనములను గూడ సిద్ధింపఁ జేయుచున్నందున మొదటిసూత్రముతోఁ గూడ సంబంధించియే యున్నదని చెప్పుట కెంతమాత్రము సందియము లేదు. మొదటిసూత్రమునందుఁ బ్రతిజ్ఞచేయఁ బడిన విషయ ప్రయోజనములఁ గూర్చి మొదటిసూత్రముయొక్క భాష్యవ్యాఖ్యా నావసరమున నిరూపింపఁబడును.

" ఆహ కోఽయమధ్యాసో నామ " యను వాక్యము మొదలుగాఁ గల భాష్యమధ్యాససిద్ధిపరము. ఇచట " కథం పునః ప్రత్యగాత్మని " యను వాక్యము నకుఁ బూర్వభాష్య మధ్యాసలక్షణపరము. అది మొదలుగాఁ గల భాష్యము సంభావనాపరము.

అట్లైనచో నింతకుఁ బూర్వము "తథాప్యన్యోన్యస్మిన్న"ను వాక్య మాదిగాఁ గల భాష్యముచే నధ్యాసలక్షణసద్భావములు నిరూపింపఁబడియుండ మఱల నధ్యాససిద్ధికొఱకు లక్షణసంభావనల నెందుకుఁ బ్రతిపాదింపవలయు ననఁ జెప్పఁబడుచున్నది. దేహేంద్రియాదులయందు "అహం మమ" యను నభిమానము గలిగిన వానికిఁ బ్రమాతృత్వమును నిరూపించినంతనే యట్టిప్రమాతకు నధ్యాస స్వరూప మెంతమాత్రము సిద్ధింపనేరదు. ఏలయన లోకమునందు శుక్తిరజతద్విచంద్రాదిస్థలములయందు వలెఁ బ్రమాతయం దధ్యాసానుభవ మిచటఁ దెలియరాకున్నది. ఏలయనఁ దెలియవచ్చెడిభానమునకు బాధగలిగినచో నట్టిభావము లధ్యస్తము లని చెప్పనొప్పును. ప్రకృతమునఁ బ్రమాతయం దన్ననో ప్రమాతృభావము నకు బాధ తెలియరాదు కావునఁ బ్రమాతృత్వ మధ్యస్త మని నిరూపించుటకు నధ్యాసలక్షణము చెప్పి యట్టిలక్షణముచే వ్యాప్తమగు సద్భావమును నిరూపింప వలయును.

రూపః పరత్ర పూర్వదృష్టావభాసః । తం కేచిదన్యత్రా—

అస్మినచో లక్షణముతోఁ గూడిన వస్తువుయొక్క సద్భావమాత్రమును బ్రదర్శించుటవలననే యద్దానియొక్క యసంభావనాశంక గలుగనేరదుగదా! అట్టి విషయమున సంభావనానిరూపణము నెందులకుఁ జేయవలయు ననఁ జెప్పఁబడు చున్నది. ప్రకృతపుటస్మత్ప్రత్యయగోచర మన్ననో యవిషయమును నసంగ మును నగుచు నధ్యాసమునకు హేతుభూత మగు నెట్టిగుణములతోడను గూడి యుండకపోవుటచేతను, పుష్కలచైతన్యభావముతో నొప్పియుండుటంజేసి యిత రములయందుఁ దెలియనచ్చెడి యధ్యాసములఁ గూడఁ దొలఁగించుటకుఁ దగిన విశేషములతోఁ గూడియుండుటచేతను నద్దానియం దధ్యాసమున కెంతమాత్ర మవ కాశము లేదను నాక్షేపము గలుగును. కావున నట్టియాక్షేపమును వారించుటకై సంభవమును దప్పక చెప్పితీరవలయును. ' అధ్యాసమునకు లక్షణసంభావనలు రెండును సంభవింపనేరవను నాశయముతో "ఆహ కోఽయమధ్యాసో నామ" యనునది చెప్పఁబడుచున్నది. ఇచట "కిం"శబ్దమునకుఁ దెలియవచ్చెడి ప్రశ్నా క్షేపార్థములు రెండును సంభవించుటచే నీవాక్యము తంత్రముచే నుచ్చరింపఁబడ వలయును. తంత్రోచ్చరిత మగు నీవాక్యమునకు 'నధ్యాస మన నేమి యని యడుగుచున్నాఁడ"ని యర్థము. అనఁగా "నధ్యాసమునకు లక్షణ మెయ్యది? అట్టి యధ్యాస మిచట సంభవించునా ?" అను రెండువిధము లగు నర్థ మిచటఁ గలుగు చున్నది. అందు మున్ముందుఁ బ్రశ్నమునకుఁ బ్రతివచన మగు లక్షణమును జెప్పి యాలక్షణముయొక్క సంభవము నాక్షేపించి సమాధానమును జెప్పుచున్నారు. ఇచట "ఆహ"వలుకుచున్నాఁడు లేక యడుగుచున్నాఁడని రెండవవాఁ డొకఁ డడుగుచున్నట్లు వ్రాయఁబడినది. ఇట్టిగ్రంథములను రచించుటలోఁ దమయభి ప్రాయములను శ్రోత లనాయాసముగ గ్రహించుటకుఁ గాను గ్రంథకర్త లొక ప్రతివాదియో శిష్యుఁడో యట నున్నట్లు భావనచేసి యట్టివానిచే నాక్షేపింపఁబడిన దనిగాని యడుగఁబడిన దనిగాని తలంచుచు వానికి సమాధానముఁ జెప్పుచున్నటుల గ్రంథములను రచించుట యాచారమై యున్నది. ఇట్టిరచనావిశేషమును వాద కథ యని కోవిదులు చెప్పుచున్నారు. పవిత్ర మగు నీభాష్యము వాదకథ యని సూచించుటకుఁ గాను భాష్యకారులు "ఆహ!" యను నీపదోక్తినిఁ బ్రయోగించి యున్నారు. ఇంతియ గాదు. ఇయ్యది మీమాంసాగ్రంథరాజ మగుటఁజేసి యిందు వాదిప్రతివాదిమధ్యస్థులయొక్క వాక్యముల ననుకరించు వాక్యక్రమమున నీ "శారీరకమీమాంస" రచియింపఁబడియున్నది.

" అధ్యాస మన నేమి? " యనుప్రశ్నమునకు సమాధానరూప మగు నధ్యాసలక్షణము " స్మృతిరూపః పరత్ర పూర్వదృష్టావభాస " యను ' వాక్య

ముచేఁ జెప్పఁబడుచున్నది. ఇచట "అధ్యాసః" యను పదము నధ్యాహారము చేయవలయును.

ఇందు 'పరత్ర' యని యుండుటచే 'పరస్య' అనునది యర్థసిద్ధ మగుచున్నది. స్మృతిరూపశబ్ద మవభాసశబ్దమునకు విశేషణము. స్మర్యత ఇతి = స్మరింపఁబడుచున్నది గాఁగ, "స్మృతి" యని చెప్పఁబడుచున్నది. ఇచట భావము స్పష్టముగాఁ గంటికి నెదురుగాఁ దెలియవచ్చుచున్నందునఁ స్మరింపఁబడిన రూపమువంటి రూపముగలది యనునర్థమును గ్రహింపవలయును. కాని స్మరింపఁ బడిన దని మాత్రము గ్రహింపఁగూడదు. ఈయవభాసము స్మృతిసదృశ మని చెప్పుటకుఁ గల హేతువు "పూర్వ దృష్టావభాస"పదము. స్మృతికిఁ బూర్వ ప్రమాణజనిత మగు ననుభవము కారణ మెట్లగుచున్నదో యాతీరుననే యీయవ భాసమునకుఁ గూడఁ బూర్వప్రమాణజనితానుభవము కారణము. కాన నియ్యది యు స్మృతిసదృశ మగుచున్నది. కావున నధ్యాస మన నొకదానియందు స్మృతి సదృశమును బూర్వదృష్టము నగు వేఱొకదానియొక్క యవభాస మని, యనఁగా నధ్యాసలక్షణ మని లక్షణవాక్యమున కర్థము.

ఒకదానియందు, ననఁగా శుక్తియందు వేఱొకదానియొక్క యన స్మృతి సదృశమును బూర్వదృష్టము నగు రజతముయొక్క యవభాస మని లక్షణమునకు లక్ష్యమునందు సమన్వయము. శుక్తియందు రజతముగాఁ జూడఁబడినది సత్యము గాకపోవుటచే స్మృతిసదృశ మనియు, నిదివఱకుఁ బ్రమాణముచే రజతమును గ్రహింపనివానికి శుక్తి రజతముగ గ్రహింపఁబడుటకు వీలులేకుండుటఁజేసి పూర్వ దృష్టసదృశ మనియుఁ జెప్పఁబడుచున్నది. దానంజేసి స్మృతిరూపము పూర్వదృష్ట మనువిశేషణము లవశ్యగ్రాహ్యము లగుచున్నవి. ఇట్టివిశేషణద్వయరహితముగ "పరత్ర పరావభాసః = ఒకదానియందు వేఱొకదానియొక్క యవభాసము" నియే యధ్యాసమునకు లక్షణ మని గ్రహించినను, లేక "పరత్ర పూర్వదృష్టావభాసః= ఒకదానియందుఁ బూర్వదృష్ట మగుదానియొక్క యవభాసము"ని స్మృతిరూప మను విశేషణమును ద్రోసి యధ్యాసలక్షణమును గ్రహించినను, ప్రత్యభిజ్ఞయం దీలక్షణ మతివ్యాప్త మగుటఁజేసి యధ్యాసమున కియ్యది యెంతమాత్రము లక్ష ణము గానేరదు. కావున నధ్యాసలక్షణమున స్మృతిరూపవిశేషణ మవశ్యము గ్రహింపవలయును.

ఇట్లు శుక్తియందు భాసించు రజతమునకు సత్య మగు స్థితి లేదు గావున నయ్యది సత్తు గానేరదు. పురోఽవస్థితముగఁ దెలియవచ్చుటఁజేసి శశ విషాణాదులవలె నసత్తును గాదు. పరస్పరవిరోధభావ ముండుటవలన సదసత్తును గాదు. కావున నీరజతావభాసము మనిర్వచనీయ మని చెప్పఁబడవలయును. శుక్తి

న్యధర్మాధ్యాస ఇతి వదన్తి। కేచిత్తు యత్ర యదధ్యాస స్తద్వివేకాగ్రహనిబన్ధనో భ్రమ

రజతస్థానమందువలెనే స్వప్నజ్ఞానమునందును శంఖముయొక్క పచ్చదనమునందును గుడముయొక్క తిక్తత్వమునందును ద్విచంద్ర దిఙ్మోహాలాతచక్ర గంధర్వనగర వంశోరగ మరీచికాజలాది విభ్రమములయందుఁ గూడ నీలక్షణమే సమన్వయ మగుచున్నది. ఇందువలనఁ దెలియవచ్చెడి దేమన, నెద్ది యేని యొకటి ప్రకాశించుచున్నంతనే యయ్యది సత్యముగా నున్నదని గ్రహింపుట కవకాశము లేదు. కావున దేహేంద్రియాదులు ప్రకాశించుచున్నంతనే వస్తుస్థితి నెంతమాత్రమును గలిగియుండలే దని నిరూపణచేయుట కవకాశము గలదు. కావున నయ్యవి యధ్యస్తములే యగుచున్నవి.

భాష్యకారు లధ్యాసలక్షణమును బ్రదర్శించి తాము స్వాభిమతలక్షణము యొక్క యతిశయమును వ్యక్తీకరించుటకుఁ గాను 'తం కేచిత్'ను వాక్యము మొదలుకొని మతాంతరలక్షణములను బ్రదర్శించుచున్నారు ఎట్లన—"తం కేచిదన్యత్రాన్యధర్మాధ్యాస ఇతి వదంతి" యని. ఆయధ్యాసమును గొందఱు, అన్యత్ర = శుక్తికాదులయందు, అన్యధర్మాధ్యాసః = అర్థాంతరముయొక్క యనఁగా, జ్ఞానాకార మగు రజతాదికముయొక్క కాని, బాహ్య మగు రజతము యొక్క కాని యారోప మని, వదంతి = పలుకుచున్నారు. ఈలక్షణ మన్యథాఖ్యాతివాదులచేతను, ఆత్మఖ్యాతివాదులచేతను, గూడఁ బ్రదర్శింపఁబడుచున్నది. లక్షణస్వరూప మొకేతీరున నున్నను నిందు నభిప్రాయభేదము గలదు. అట్టి యభిప్రాయభేదముచేతనే 'యన్యథాఖ్యాతి' యనియు 'నాత్మఖ్యాతి' యనియు నధ్యాసమునకు మతభేదముచే భిన్ననామములు పరఁగుచున్నవి. నైయాయికులును వైశేషికులును బాహ్యమందు, అనఁగా హట్టపట్టణాదికములయం దుండెడి రజత మీశుక్తియందు భాసించుచున్న దని తలంతురు. బౌద్ధులలో నేకదేశు లగు విజ్ఞానవాదులు బుద్ధియందలి జ్ఞానాకారిత మగు రజత మీశుక్తియందు భాసించుచున్న దని తలంతురు. హట్టపట్టణాదికమందలి రజతము గాని బుద్ధియందలి రజతము గాని భాసించినచో నచట రజతము వస్తుస్థితిని గలిగియుండవలయును. అట్లు గలిగియుండలేదు గావున శుక్తియందు భాసించిన రజతము భాష్యకారు లుపదేశించిన ట్లనిర్వచనీయమే గావలయును. రజతస్వరూపము వాస్తవ మయ్యు ననిర్వచనీయ మయ్యు నొకదానియందు మఱియొకటి భాసించుచున్న దను విషయ మాక్షేపరహితమే యగును. ఇట్లన్యథాఽఽత్మఖ్యాతివాదులలక్షణమును నుపన్యసించి యఖ్యాతివాదిమతమును "కేచిత్తు యత్ర యదధ్యాస స్తద్వివేకాగ్రహనిబంధనో భ్రమ"యని నిరూపించుచున్నారు. దీనియర్థ మేమన—యత్ర=ఏశుక్త్యాదులయందు, యస్య = ఏరజతాదులకు, అధ్యాసః = అధ్యాసము లోకసిద్ధమై యున్నదో,

ఇతి। అన్యే తు యత్ర యదధ్యాస స్తస్యైవ విపరీతధర్మత్వకల్పనామాచక్షతే

అయ్యాది, తద్వివేకాగ్రహనిబంధనః; తయోః= ఆశుక్తిరజతములయొక్క, వివేకస్య= భేదమును, అగ్రహాత్ = గ్రహింపకపోవుటవలన, తన్నిబంధనః= ఆయవివేకము మూలముగాఁ గలిగిన, ఏకత్వభ్రమః= రజతాదిభావములయొక్క భ్రమ, యధ్యాస మని యర్థము. అఖ్యాతివాదులు శుక్తిశకలమునందే శుక్తిరజతములు రెండును గల వనియు నందుండు రెండిటిని గ్రహింపఁజాలక రెండిటియందు నొక్క రజతమే దెలియఁబడుచున్న దనియుఁ దలంచుచున్నారు. ఇచట రెండు వస్తువు లుండఁగా రెండిటియందును రెండిటిని గ్రహించుటకు మాఱుగా రెండిటియందు నొకదానినే గ్రహించుట యంగీకరింపఁబడినది గావున నిచటఁ గూడ "పరత్ర పరావభాస" యను లక్షణము దెలియవచ్చుచున్నది. ఈవాదులచే శుక్తియందు రజత మున్నప్పటికిని దెలియఁబడలే దను నభిప్రాయము వ్యక్తీకరింపఁబడుచున్నది. కావున వీరివాదమున కఖ్యాతివాద మను పేరు గలిగినది. ఇయ్యది జైమినీయుల యభిప్రాయముగాఁ దెలియవచ్చెడిని.

అఖ్యాతివాదులు దలంచునట్లు శుక్తియందు రజతము గూడ నున్నచో నుత్తరకాలమునందు శుక్తిరజతములు రెండును గ్రహింపఁబడుచు రజతమునకు బాధ లేకుండఁ గావలయును. అట్లు గాక రజతమునకు బాధ దెలియవచ్చుటం జేసి యఖ్యాతివాదిమత మసమంజసమే యగును.

ఇట్లఖ్యాతివాదిమతమును బ్రదర్శించి బౌద్ధైకదేశు లగు విజ్ఞానవాదులలోఁ గొందఱును, శూన్యవాదులును బ్రదర్శించు లక్షణమును "అన్యే తు యత్ర యదధ్యాస స్తస్యైవ విపరీతధర్మత్వకల్పనామాచక్షతే" యని నిరూపించుచున్నారు. దీనియర్థ మేమన— యత్ర = ఏశుక్తికాదులయందు, యస్య = ఏరజతాదికము యొక్క, అధ్యాసః = అధ్యాసము, గలదో యద్దానిని, తస్యైవ = ఆశుక్త్యాదికము యొక్క, విపరీతధర్మకల్పనాం, విపరీతధర్మత్వస్య = తెలియఁబడని రజతాది రూపముయొక్క, కల్పనాం = ప్రకాశమును, అధ్యాస మని చెప్పుచున్నా రని. ప్రకృతపుశూన్యవాదు లన్ననో శుక్తిశకలమే విపరీతభావము నొంది, యనఁగా విపరీతముగాఁ బరిణమించియో, లేక శూన్యభావముతో నొప్పుచు రజతముగాఁ బరిణమించియో ప్రకాశించు నని తలంతురు. అనఁగా నీరజతకల్పనము సత్తాహీన మని యభిప్రాయము. అనఁగా నీరజతావభాసము నిరధిష్ఠానమై యాంతరమగు బుద్ధిస్థరజతము బాహ్యమందుఁ బ్రకాశించుటచేఁ గాని లేక శూన్యమందు రజత బుద్ధ్యారోపణముచేఁ గాని గల్గుచున్న దని తలంతురు. బుద్ధిస్థరజతము బాహ్య మందుఁ బ్రసరించినను లేదా శూన్యమందు రజతబుద్ధి గలిగినను



ఇతి। సర్వథాఽపి త్వన్యస్యాన్యధర్మావభాసతాం న వ్యభిచరతి।
తథా చ లోకేఽనుభవః— శుక్తికా హి రజతవదవభాసతే;
ఏకశ్చంద్రస్సద్వితీయవదితి।

భాస" యను నభిప్రాయమునకు విరోధ మెంతమాత్రమును గన్పట్టదు. కాని యుత్తరకాలమున రజతబుద్ధి తొలఁగి యధిష్ఠాన మగు శుక్తి గ్రహింపఁబడుచుం డుటఁజేసి యీరజతభ్రమ నిరధిష్ఠాన మని చెప్పుటకు వీలులేదు.

ఇట్లు భాష్యకారులు ముప్విధము లగు మతాంతరలక్షణములను బ్రదర్శించి వాదులయొక్క యభిప్రాయములును లక్షణములును నేతీరున నొప్పుచున్నను నా లక్షణములన్నిటియందును "నొకదానియందు వేఱొకదానిస్వభావము దెలియ వచ్చుట" యను సామాన్యము సమాన మగుటంజేసియుఁ దాము ప్రదర్శించిన లక్షణమందుఁగూడ "పరత్ర పరావభాస" యను వాక్యముచే నట్టిసామాన్యము ప్రదర్శింపఁబడుటంజేసియుఁ దమలక్షణముల కితరము లగు లక్షణములతో నెంత మాత్రమువిరోధము లేదని "సర్వథాపి త్వన్యస్యాన్యధర్మావభాసతాం న వ్యభిచరతి" యను వాక్యముచే సారాంశమును నిరూపించియున్నారు. దీనియర్థమేమన— నెన్నిభంగుల నాలోచించినను, ననఁగా వాదు లెన్ని రీతు లగు లక్షణములను బ్రదర్శించినను, నాయాయిమతములందును లక్షణములందు నేయేభేదము లున్నను వానియం దన్నింటియందును "అన్యస్య అన్యధర్మావభాస" యను సామాన్య మెంతమాత్రము వ్యభిచరింపక యప్రతిహతముగఁ దెలియవచ్చుచున్నదని ప్రకృతమునఁ బ్రదర్శింపఁబడిన లక్షణములచే శుక్తిరజతస్థలమునందలి రజతప్రకాశ మైదువిధములుగఁ దలంపఁబడియుండుటచే నేతద్విషయమును గూర్చి 1 అన్యథా ఖ్యాతి, 2 ఆత్మఖ్యాతి 3 అఖ్యాతి 4 అసత్ ఖ్యాతి 5 అనిర్వచనీయఖ్యాతి యను నైదుమతములు దెలియవచ్చుచున్నవి. ఇట్టియైదుమతములందు నెయ్యది యుక్తిసహ మనినిర్ణయించుటకులోకప్రతీతిమాత్రమే శరణముగావున నట్టిప్రతీతిని భాష్యకారులు "శుక్తికా హి రజతవదవభాసతే, ఏకశ్చంద్రస్సద్వితీయవదితి" యని ప్రదర్శించి యున్నారు. దీనియర్థ మేమన— నియ్యది నిశ్చయముగ శుక్తికయే, రజతమువలెఁ బ్రకాశించుచున్నది. చంద్రుఁ డొక్కఁడే. కాని రెండవచంద్రునితోఁ గూడి యున్నట్లు ప్రకాశించుచున్నాఁ డని భాసించినట్టి రజతముయొక్కయు రెండవ చంద్రునియొక్కయు నభావము ప్రమాణకాలమునస్మరింపఁబడుచున్నది. ఇట్టిస్మర ణమువలన నచట నధిష్ఠానరూప మగు శుక్తికయుఁ జంద్రుఁడును సత్యములనియు నందుఁ దెలియవచ్చెడి రజతము రెండవచంద్రుఁడు ననృతము లనియు నిట్లనృతము లగు రజతాదు లెట్లుభాసించిన వన, నిదమిత్థ మ్మని నిర్వచించుటకు వీలులేకపోవు టంజేసి యనిర్వచనీయమని చెప్పఁబడుచున్నది. కావున నానిర్వచనీయవాదము

యు క్తిసహము ననుభవ పూర్వకము నగుచుండుటచే "సర్వథా స్మృతిరూపః పరత్ర పూర్వదృష్టావభాస" యను భాష్యకారలక్షణ మప్రతిహతముగాఁ బరఁగుచున్నది.

ఇందు నధిష్ఠానబోధక మగు 'పరత్ర' యను పదము లేకుండినచో నుప పత్తిరహిత మగు నిరధిష్ఠానాధ్యాసవాదిమతమునందు లక్షణ మతివ్యాప్త మగును. ఈపక్ష ముపపత్తిరహిత మెట్లన— లోకములో నెచటను, నిరధిష్ఠాన మగు నధ్యాసము చూడఁబడుట లేదు; సంభవింపనేరదు. అందుచే నియ్యది నిరుపపత్తిక మగుచున్నది. ఇచ్చో లక్షణ మతివ్యాపకము కాకుండుటకై 'పరత్ర' యను పద మావశ్యక మగుచున్నది.

ఇందు స్మృతిరూపశబ్దము లేనిచో లక్షణ మర్థలబ్ధ మగు స్మృతియందతి వ్యాపకమై యధ్యాసమునకు స్మృతిరూపత్వము బోధింపనేరదు.

ఇందుఁ బూర్వదృష్టపదము లేనిచో నవభాసమునకు విశేషణముగా నుండు స్మృతిరూపశబ్దమునకుఁ గారణము మృగ్య మగుచున్నది. కారణరహిత మగుచో విశేషణము సార్థకము గానేరదు. కావున విశేషణ మగు స్మృతిరూప శబ్దమునకు సార్థకతను గల్పింపఁ బూర్వదృష్టపద మావశ్యకము. కావున నధ్యాస లక్షణము యథోక్తముగానే గ్రహింపఁబడవలయును. ఇయ్యది సార్వలౌకిక మగు నధ్యాససామాన్యలక్షణము. ఇఁక యుష్మదస్మత్ప్రత్యయగోచరములకు మాత్రము సంబంధించిన యధ్యాసలక్షణ మన్ననో "అతస్మింస్తద్బుద్ధిః" "పరత్ర పరావభాసః" "అన్యత్ర అన్యధర్మావభాస" యని నిర్వచించినంతనే లక్షణసమన్వయ మగును. ఏలయన నీయధ్యాసము నైసర్గిక మగుటంజేసి యిందు స్మృతిరూప పూర్వదృష్టత్వాదు లెంతమాత్రము సంభవింపనేరవు. అట్టి యాశయముతోడనే భాష్యకారులు వివాదాధ్యాసితము లగు నధ్యాస లక్షణములనుండి "అన్యత్రాన్యధర్మావభాసతాం న వ్యభిచరతి" యని సామాన్యమాత్రముయొక్క యవ్యభిచారమును బ్రదర్శించియున్నారు. దానంజేసి "పరత్ర పరావభాస" యను లక్షణము సర్వలోకప్రత్యక్షసిద్ధ మగు రజ్జుసర్పాదిస్థలములందు సలక్షణముగ వర్తింప నేరదు. కావున నట్టిదృష్టాంతములయందు "స్మృతిరూపః పరత్ర పూర్వదృష్టావభాస" యను లక్షణమునే గ్రహింపవలయును.

అధ్యాసలక్షణోపసంహారమున "శుక్తికా హి రజతవదవభాసతే" "ఏకశ్చంద్రస్సద్వితీయవత్" ని ప్రతీతిద్వయము దృష్టాంతముగాఁ బ్రదర్శింపఁబడియె. అందు శుక్తికోదాహరణము నిరంజన మగు నస్మత్ప్రత్యయగోచరమునందు యుష్మత్ప్రత్యయగోచర మగు నహంకార మధ్యస్తము గావింపఁబడిన దని సూచించుటకును, ద్విచంద్రోదాహరణ మస్మత్ప్రత్యయగోచరమునందు యుష్మత్ప్రత్యయగోచరము లగు జీవేశ్వరులయొక్కయు జీవులయొక్కయు భేదమును

కథం పునః ప్రత్యగాత్మన్యవిషయేఽధ్యాసో విషయతద్ధర్మాణామ్ ।
సర్వో హి పురోఽవస్థితే విషయే విషయాన్తరమధ్యస్యతి; యు-

సూచించుటకుఁ గాను నియఁబడినవి. చంద్రుఁ డొక్కఁడే యైనను నేత్రమండలి కాచ కామలాదిదోషముచే రెండవవానితోఁ గూడియున్నట్లు తోఁచుభంగి నస్మత్ప్రత్యయగోచరమున, మిథ్యాజ్ఞానము సంక్రమింప బయలువెడలిన విక్షేప మండలి జీవేశ్వరాదిభేదముచే సద్వితీయత్వము ఘటించుచున్నది. కావున నస్మత్ప్రత్యయగోచరమున భాసించెడి సద్వితీయత్వము సత్య మెంతమాత్రము గాదని పరమతాత్పర్యము.

"కోఽయమధ్యాసో నామ"యను స్థలమునఁ బ్రశ్నాక్షేపములు రెండును సమానముగాఁ దెలియవచ్చుటంజేసియు నందు విశేషమును గ్రహించుట కవకాశము చాలకుండుటంజేసియు నట నుండువాఁడు సామాన్యముగాఁ బ్రశ్నించివాఁడను తలంపుతో నింతవఱకు నధ్యాసస్వరూపము నిరూపింపఁబడెను. ఇట్లధ్యాసస్వరూపమును నిరూపించినంతనే యట నుండువాఁడు నిర్దేశింపఁబడిన నధ్యాసము సంభవింప నేరదని తలంచి వానియధిక్షేపాభిప్రాయమును "కథం పునః ప్రత్యగాత్మన్యవిషయేఽధ్యాసో విషయతద్ధర్మాణామ్మ"ని వివరించుచున్నాఁడు. అనఁగా నధ్యాసమునకుఁ బూర్వోక్తలక్షణము సమంజసమే; కాని యీలక్షణ మిచట సంభవింపనేరదు. ఏలయన "సర్వో హి పురోఽవస్థితే విషయే విషయాంతరమధ్యస్యతి,యుష్మత్ప్రత్యయాపేతస్య చ ప్రత్యగాత్మనోఽవిషయత్వం బ్రవీషి" యని హేతువును నిరూపించుచున్నాఁడు. దీనియాశయ మేమన- లోకములో నెల్లరును బురోఽవస్థిత మగు శుక్త్యాదివిషయమునందే రజతాదివిషయాంతరము నధ్యాసముచేయుచున్నారు. యుష్మత్ప్రత్యయగోచరముకంటె భిన్న మగు ప్రత్యగాత్మ యవిషయమని నీచేఁ జెప్పఁబడుచున్నదిగదా! అవిషయమునందలియధ్యాస మిదివఱ కెన్నఁడును జూడఁబడలేదు; సంభవింపఁజాలదు. కావున నస్మత్ప్రత్యయగోచరమున యుష్మత్ప్రత్యయగోచరమున కధ్యాస మసమంజస మన, సమాధానము. ఉచ్యతే = చెప్పబడుచున్నది. ఎట్లన- "న తావదయమేకాంతేనావిషయః, అస్మత్ప్రత్యయవిషయత్వా"త్తని. అనఁగా నీయాత్మ యస్మత్ప్రత్యయమునకు విషయ మగుటవలన నత్యంత మవిషయము గాదు. అనఁగా నీప్రత్యగాత్మ యొకింత విషయము గూడ నగుచున్న దని యభిప్రాయము. ఎట్లన- లోకదృష్టిచే విషయములన్నిఁటికిని సాక్షి యగుటఁజేసి విషయిగాఁ జెప్పఁబడుటవలన ఘటపటాదులవలె వేద్యమగు విషయ మెంతమాత్రము గాదు. అస్మత్ప్రత్యయమునకు విషయ మగుటంజేసి ఘటపటాదులవలె వేద్యము కాకపోయినను స్వమహిమచే స్వయంప్రకాశమాన మగుటను నధ్యాసమునకుఁ దగు విషయ మగుచున్నది. అస్మత్ప్రత్యయగోచరమునందు

వ్మత్ప్రత్యయాపేతస్య చ ప్రత్యగాత్మనోఽవిషయత్వం బ్రవీషి । ఉచ్యతే—న తావదయ మేకాన్తేనావిషయః, అస్మత్ప్రత్యయ విషయత్వాత్, అపరోక్ష త్వాచ్చ, ప్రత్యగాత్మప్రసిద్ధేః । న చాయమస్తి నియమః, పురోఽవస్థిత ఏవ విషయే విషయాన్తరమధ్యసితవ్యమితి। అప్రత్యక్షేఽపి హ్యాకాశే బాలా స్తలమలి-నతాద్యధ్యస్యన్తి। ఏవమవిరుద్ధః ప్రత్యగాత్మన్యప్యనాత్మాధ్యాసః ।

---

విషయిత్వవిషయత్వములు దెలియవచ్చు చున్నవి. ఘటపటాదులయం దన్ననో కేవలవిషయత్వముమాత్రమే తెలియవచ్చుచున్నది. దానంజేసి ఘటపటాదుల నుండి యస్మత్ప్రత్యయగోచరమును వేఱుసేసి వ్యవహరించుటకుఁ గాను నద్దాని యందుఁ దెలియవచ్చెడి విశేష మగు విషయిత్వము మాత్రమే గ్రహింపఁబడి సామాన్య మగు విషయత్వ ముపేక్ష సేయఁబడినది గాని విషయత్వ మత్యంతము వారింప బడినఁ దను నభిప్రాయ మెంతమాత్రము లేదు.

ఇట్టివిషయత్వము సర్వలోకానుభవసిద్ధ మని "అపరోక్షత్వాచ్చ ప్రత్య-గాత్మప్రసిద్ధే" యను హేతువాక్యముచేఁ బ్రదర్శింపఁబడుచున్నది. ప్రత్యగాత్మ యొక్క యస్తిత్వప్రసిద్ధి సర్వజనానుభవమువలననే గ్రహింపఁబడుచున్న దని యీవాక్యమున కర్థము. అనఁగా సర్వజనులును దమయొక్క ప్రత్యగాత్మ నప రోక్షముగఁ దెలిసికొనుచున్నారు. కావున నద్దానియొక్క స్థితి సుప్రసిద్ధముగాఁ దెలియవచ్చుచున్నది. లేనిచో నద్దానియొక్క యునికిని గ్రహించుట కెంత మాత్రము వీలులేదుగదా! దానంజేసి ప్రత్యగాత్మ యస్మత్ప్రత్యయగోచర మగుచున్నది. కావున విషయమందు విషయాంతరము నధ్యాసముచేయవలయు నను నియమము యుష్మదస్మత్ప్రత్యయగోచరములందుఁ గూడ వర్తించుచునే యున్నది.

అట్లగుచోఁ బరోక్షమాత్రమునం దెచట నధ్యాస మిదివఱకుఁ జూడఁ బడుటలేదు. అంతటను నేత్రముతో సంబంధించినట్టియుఁ బురోఽవస్థిత మగు నట్టియు నపరోక్షమునందే యధ్యాసము చూడఁబడుచున్నది. దానంజేసి నేత్ర ముతో సంబంధించి పురోఽవస్థిత మగు విషయమునందే విషయాంతరాధ్యాసము చేయవలయు నన్నచో నట్టి నియమ మెంతమాత్రము లేదనియు నప్రత్యక్ష మగు నాకాశమునం దవివేకులు "తలమలినత్వా"దికము నధ్యాసముచేయుట సుప్రసిద్ధ మనియును "న చాయమస్తి నియమః పురోఽవస్థిత ఏవ విషయే విషయాంతర-మధ్యసితవ్యమితి" "అప్రత్యక్షేఽపి హ్యాకాశే బాలా స్తలమలినతాద్యధ్యస్యన్తి" యని సమాధానము చెప్పఁబడుచున్నది. అవకాశదాత యగు నాకాశము రూప స్పర్శరహి మగుటంజేసి బాహ్యేంద్రియప్రత్యక్షముగాదు. అసహాయతమగు

తమేత మేవంలక్షణ మధ్యాసం పండితా అవిద్యేతి మన్యన్తే ।
తద్వివేకేన చ వస్తుస్వరూపావధారణం విద్యా మాహుః।

---

మనస్సునకు బాహ్యవిషయములందుఁ బ్రవృత్తి లేకపోవుటఁజేసి మనస్సుచేఁగూడ నియ్యది గ్రహింపఁబడదు. కావున నాకాశ మప్రత్యక్షము. (బాలాః = అవివేకులు, తలం = ఇంద్రనీలతపూలసదృశము, మలినతాం = నైల్యాదివర్ణభావమును) అప్రత్యక్షమగు నాకాశమం దవివేకముచేఁ దలమలినతాదిభావ మెట్లారోపింపఁబడుచున్నదో, యాతీరుననే ప్రత్యగాత్మ యగు నస్మత్ప్రత్యయగోచరమందు ననాత్మ యగు యుష్మత్ప్రత్యయగోచరముయొక్క యధ్యాస మెంతమాత్రము విరోధము లేక పుష్కలముగ నారోపింపఁబడి నిర్ధారిత మగుచున్నదని "ఏవమవిరుద్ధః ప్రత్యగాత్మన్యప్యనాత్మాధ్యాస" యని యధ్యాసముయొక్క సంభవము నిరూపింపఁబడుచున్నది.

భాష్యకారులు గ్రంథారంభమున లాక్షణికముగఁ బ్రయోగించిన నస్మత్ప్రత్యయగోచరమునకుఁ బ్రత్యగాత్మ యనియు యుష్మత్ప్రత్యయగోచరమునకు ననాత్మ యనియు నీసంభావనాగ్రంథమునందుఁ బర్యాయపదముల్గ గ్రహించి యుత్తరగ్రంథమున లాక్షణికపదములనుండి విరమించి పర్యాయపదములగు నాత్మానాత్మపదములనే ప్రయోగించియున్నారు. కావున నిటుపైభాష్యమునం దాత్మశబ్దముచే భాష్యకారాభిమత మగు నస్మత్ప్రత్యయగోచరమును ననాత్మశబ్దముచే యుష్మత్ప్రత్యయగోచరమును గ్రహింపవలయును గాని యన్యార్థముల్ల నెంతమాత్రము గ్రహింపఁగూడదు.

ఇట్లాక్షేప సమాధాన లక్షణ సంభావనాగ్రంథములచే సునిరూపిత మగు నధ్యాసము భాష్యకారస్వకపోలకల్పితము గాని శ్రుతిస్మృతిప్రమాణసిద్ధము గాదను నాక్షేపము గలుగ నీయధ్యాసము శ్రుతిస్మృతిప్రమాణసిద్ధమే యని "తమేతమేవంలక్షణమధ్యాసం పండితా అవిద్యేతి మన్యంతే" యని చెప్పఁబడుచున్నది. తం = పూర్వపక్షముచే నాక్షిప్త మగునట్టియు, ఏతం = ఈసమాధానముచెప్పఁబడినట్టియు, ఏవంలక్షణం= లక్షణ సంభావనలచే నిరూపింపఁబడినట్టి, అధ్యాసం = ఆత్మానాత్మలయొక్క యితరేతరాధ్యాసమునే, పండితాః = ప్రమాణకుశలు లగు బ్రహ్మవిదులు, అవిద్యేతి = అజ్ఞానమని, మన్యంతే= తలంచుచున్నారు. అనఁగాఁ బ్రమాణకుశలు లగు బ్రహ్మవిదులు సర్వానర్థములకు నవిద్య యనునది మూలకారణ మని శ్రుతిస్మృతులచేఁ దెలిసికొని నిరూపించియున్నారనియు నట్టిప్రమాణసిద్ధ మగు నవిద్యయే యీయధ్యాసము గాని వేఱొండు గాదనియు నిర్వచించుటచే భాష్యకారులు తమకంటెఁ బూర్వు లగు బ్రహ్మవిదులచే సర్వవిధముల ననర్థహేతువుగా నిరూపింపఁబడిన యవిద్యనే యధ్యాసమును పేర

తత్త్రైవం సతి యత్ర యదధ్యాసస్తత్కృతేన దోషేణ గుణేన వాఽణు-
మాత్రేణాపి స న సంబధ్యతే।

సోపపత్తికముగ నిరూపించియుండిరి. కావున నియ్యది భాష్యకారస్వకపోల కల్పితము గాక పవిత్రము లగు సకలప్రమాణములచే నుద్ఘోషింపఁబడుచున్న దేయని సువ్యక్త మగుచున్నది.

ప్రమాణకుశలు లగు పండితు లెట్టిప్రమాణములచే నవిద్యను బ్రదర్శించిరను విషయ మొకింత నిరూపింపఁబడుచున్నది.

"తత్సృష్ట్వా త దేవానుప్రావిశత్", "అనేన జీవేనాత్మనాఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి", "అయమాత్మా బ్రహ్మ", "తత్త్వమసి", "తదేవ బ్రహ్మ త్వమి"త్యాదిశ్రుతిసహస్రములచే జీవుఁడు బ్రహ్మముకంటె నన్యుఁడు గాఁడని యుపదేశింపఁబడుచున్నది.

అట్లయిన నిట్టిబ్రహ్మము "న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం। నేమా విద్యుతో భాంతి కుతోఽయమగ్నిః ।తమేవ భాంతమనుభాతి సర్వం । తస్య భాసాసర్వమిదం విభాతి॥"యనుశ్రుతిచే స్వయంజ్యోతిస్స్వభావమని చెప్పఁబడుచుండ నట్టిబ్రహ్మమునం దవిద్యారూపమగుదోషముండుననుటకవకాశము లేదన్న,నట్లుగాదు. శ్రుతివలనను శ్రుత్యర్థాపత్తివలనను నవిద్యయొక్క యస్తిత్వము దెలియఁబడుచున్నది. ఎట్లన—"అనృతేన హి ప్రత్యూఢాః" "త ఇమే సత్యాః కామాః అనృతాభిధానాః" "అనీశయా శోచతి ముహ్యమానః" "అవిద్యాయామంతరే వర్తమానాః" "మాయాం తు ప్రకృతిం విద్యాత్" "అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః" "ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి" "అనాది-మాయయా సుప్తో యదా జీవః ప్రబుధ్యతే। అజమనిద్రమస్వప్న మద్వైతం బుధ్యతే తదా" యిత్యాదిశ్రుతిస్మృతులచే నవిద్య నిరూపింపఁబడు చున్నది.

ఇఁక నర్థాపత్తి యన్ననో శ్రుతులయందు బ్రహ్మవిషయ మగు విద్యవలన మోక్షము గలుగు నని చెప్పఁబడుచుండుటచే విద్యచేఁ దొలఁగు బంధ మవిద్యాస్వరూప మనియు నయ్యది నైసర్గికముగా నున్న దనియుఁ దెలియవచ్చుటం జేసి శ్రుతిస్మృతిన్యాయకోవిదు లేకరస మగు బ్రహ్మ మనాదిసిద్ధావిద్యావచ్ఛిన్నానంతజీవనిర్భాసాస్పద మని వక్కాణించుచున్నా రని యభిప్రాయము. ఈయవిద్యయే శ్రుతిస్మృతిపురాణేతిహాసములందు నామరూపము, అవ్యాకృతము, అవిద్య, మాయ, ప్రకృతి, అగ్రహణము, అవ్యక్తము, తమస్సు, కారణము, లయము, శక్తి, మహాసుప్తి, నిద్ర, అక్షరము, ఆకాశ మని పలువిధములఁ బేర్కొనఁబడుచున్నది. కావున నీయధ్యాసవర్ణనము సర్వప్రమాణసిద్ధము. ఇట్టియనర్థరూప మగు నవిద్యయొక్క నిరోధోపాయము విద్వత్సమ్మతిపూర్వకముగ "తద్వివేకేన

తమేతమవిద్యాఖ్యమాత్మానాత్మనోరితరేతరాధ్యాసం పురస్కృత్య సర్వే ప్రమాణ-ప్రమేయవ్యవహారా లౌకికా వైదికాశ్చ ప్రవృత్తాః। సర్వాణి చ శాస్త్రాణి విధి-ప్రతిషేధమోక్షపరాణి।కథం పునరవిద్యావద్విషయాణి ప్రత్యక్షాదీని ప్రమాణాని

చ వస్తుస్వరూపావధారణం విద్యామాహుః” యని చెప్పఁబడుచున్నది. తద్వివేకేన చ=అధ్యస్త మగు సత్యదూపము యొక్క వివేకముచే, వస్తుస్వరూపావధారణం= వస్తుస్వరూపమును నిస్సందేహముగాఁ దెలిసికొనుట, విద్యాం =విద్యఁగా, ఆహుః= పండితులు; చెప్పుచున్నారు. అనఁగా నపరోక్షాత్మసాక్షాత్కారమును బడయుటచే నీయవిద్య దొలఁగు నని ప్రమాణకుశలు లగు బ్రహ్మవిదులు చెప్పియున్నారు. కావున బ్రహ్మవిద్యయే యవిద్యానిబర్హణసాధన మని తాత్పర్యము.

దీర్ఘవాసనచేఁ గూడిన యీయవిద్య, విద్యచే బాధింపఁబడినప్పటికిని స్వవాసనానుగుణముగ మఱలఁ గలిగి స్వోచిత మగు కార్యమును బ్రవర్తింపఁజేయవచ్చు నను సందియము గలుగ నట్లెంతమాత్రము గలుగనేర దని “తత్రైవం సతి యత్ర యదధ్యాసస్తత్కృతేన దోషేణ గుణేన వాఽణుమాత్రేణాఽపి స న సంబధ్యతే” యని చెప్పఁబడుచున్నది. తత్ర ఏవం సతి=నిర్విచికిత్స మగు జ్ఞానముచే వస్తుస్వరూపావధారణము గలుగఁగా, యత్ర = ఏయధిష్ఠానమునందు, యదధ్యాసః = ఏయారోప్యముయొక్క యధ్యాసము గలుగుచున్నదో, తత్కృతేన=ఆయధ్యాసకార్య మగు, దోషేణ = దోషముచేఁ గాని, గుణేన వా = గుణముచేఁ గాని, సః = ఆయధిష్ఠానము, అణుమాత్రేణాపి = లేశమాత్ర మైనను, న సంబధ్యతే = సంబంధింపదు. అనఁగా నధ్యాసకార్యమువలనఁ గలుగు గుణముచేఁ గాని దోషముచేఁ గాని యధిష్ఠాన మెంతమాత్రము నంటుపడ దని లోకసిద్ధముగఁ దెలియవచ్చునట్లే యవిద్యావిషయమునఁ గూడ నని గూఢాభిసంధిపురస్సరంబుగఁ జెప్పఁబడుచున్నది. దానంజేసి యవిద్యారూప మగు ననర్థ మవాస్తవ మనియు ననృత మనియు సువ్యక్త మగుచున్నది. అట్లు గాక సత్యమే యగుచో జ్ఞానమాత్రముచే నివర్తించు నను ప్రతిజ్ఞ సిద్ధింపనేరదు.

ఇంతవఱకు “యుష్మదస్మత్ప్రత్యయగోచరయోః” యను పదము మొదలు “నైసర్గికోఽయం లోకవ్యవహారః” యను వాక్య మంతముగాఁ గల భాష్యముచే భాష్యకారు లాత్మానాత్మల కితరేతరవిషయ మగునట్టియు, సిద్ధ మగుదానివలె నుపన్యసింపఁబడినట్టియు నవిద్య యను పేరు గల యధ్యాసను సాధింప నిశ్చయించి యద్దానియొక్క లక్షణమును జెప్పి యాలక్షణ మాత్మయందు సంభవించుటను బ్రదర్శించిరి. ప్రకృతమున నద్దానిసద్భావనిశ్చయమును సోపపత్తికముగ నుపపాదింపనిశ్చయించి “తమేతమవిద్యాఖ్యమాత్మానాత్మనోరితరేతరాధ్యాసం పురస్కృత్య సర్వే ప్రమాణప్రమేయవ్యవహారాః లౌకికా వైదికాశ్చ ప్రవృత్తాః;

శాస్త్రాణి చేతి। ఉచ్యతే— దేహేన్ద్రియాదిష్వహంమమాభిమానరహితస్య ప్రమాతృత్వానుపపత్తౌ ప్రమాణప్రవృత్త్యనుపపత్తేః।

---

సర్వాణి చ శాస్త్రాణి విధిప్రతిషేధమోక్షపరాణి।" యని పలుకుచున్నారు. తం= ఆక్షేపింపఁబడి సమాధానము చెప్పఁబడినట్టియు, ఏతం= పైఁజెప్పినలక్షణముచే లక్షిత మగునట్టియు, అవిద్యాఖ్యం= అవిద్య యని సంభావింపఁజేయఁబడినట్టియు, ఆత్మానాత్మలయొక్క యితరేతరాధ్యాసమును, పురస్కృత్య=పురస్కరించుకొనియే, లౌకికాః=లోకసిద్ధ మగునట్టియు, వైదికాః=వేదముచే సిద్ధ మగునట్టియు, సర్వే= సమస్తము లగు, ప్రమాణప్రమేయవ్యవహారాః= ప్రమాణ ప్రమేయము లనెడి వ్యవహారములు, ప్రవృత్తాః= వరఁగుచున్నవి. అపౌరుషేయ మని యెన్నఁబడు శాస్త్రములు గూడ నధ్యాసమూలకములా యను సందేహమును వారింప "సర్వాణి చ శాస్త్రాణి = సకలశాస్త్రములునుగూడ" నని ప్రత్యేకముగా గ్రహింపఁబడినది. శాస్త్రస్వరూపము "విధిప్రతిషేధమోక్షపరాణి" యను పదముచే వ్యక్తీకరింపఁ బడుచున్నది. విధు లనఁ గర్తవ్యతావిశేషమును బోధించునట్టియుఁ జోదనయే స్వరూపముగాఁ గల్గినట్టియు లిఙ్‌లోట్తవ్యప్రత్యయఘటితము లగునట్టి వాక్యములు. ప్రతిషేధము లనఁగా ననర్థ హేతువు లగుటఁజేసి హేయములు న్అకర్తవ్యములగు విషయములను బోధించెడి నఞ్ విశిష్టలిఙ్‌లోట్తవ్యప్రత్యయఘటితవాక్యములు. మోక్షపరము లన, విధిప్రతిషేధశూన్యములై సిద్ధవస్తుబోధకములునై పరమ పురుషార్థసాధన మగు సర్వక్రియానివృత్తిని బోధించెడి వాక్యములు.

ఇట్లు మూఁడువిధము లగు విషయములు ప్రధానముగాఁ గల్గి వేద మనెడి శాస్త్రము ప్రవర్తించుటవలన శాస్త్రములు "విధిప్రతిషేధమోక్షపరాణి" యని చెప్పఁబడుచున్నవి. ఇట్లీసకలవ్యవహారములు నధ్యాసమూలమున బయలుదేరి నవి గావున నీవ్యవహారమే దృష్ట మగు నధ్యాసరూపముగ వర్ణింపఁబడుచున్నది.

ఇట్లు సకలవ్యవహారము లధ్యాసమూలకము లని వక్కాణింప నద్దానిని సహింపఁజాలక యాక్షేప్త "కథం పునరవిద్యావద్విషయాణి ప్రత్యక్షాదీని ప్రమాణాని శాస్త్రాణి చ" యని ప్రశ్నించుచున్నాఁడు. ఈవాక్యమునకుఁ బూర్వపక్షి యొక్క యుద్దేశము ననుసరించి రెండువిధము లగు నర్థము దెలియవచ్చుచున్నది.

1. ప్రత్యక్షాదిప్రమాణములును శాస్త్రములును నవిద్యావద్విషయము లెట్లగును ? అనఁగా నవిద్వాంసునిఁ గూర్చి యెట్లు ప్రవర్తించును ? అవిద్వాంసు నకు శాస్త్రములతోఁ గాని ప్రమాణములతోఁ గాని యెంతమాత్రము ప్రయోజన ముండదుగదా ?

2. అవిద్వాంసునిఁ గూర్చి చెప్పఁబడిన ప్రత్యక్షాదులు గాని శాస్త్ర ములు గాని ప్రమాణము లెట్లగును? అనఁగాఁ బ్రత్యక్షాదులు శాస్త్రమును ప్రమా

న హీంద్రియాణ్యనుపాదాయ ప్రత్యక్షాదివ్యవహారః సంభవతి, న చాధిష్ఠానమంతరేణేంద్రియాణాం వ్యవహారస్సంభవతి। న చానధ్యస్తాత్మభావేన దేహేన కశ్చిద్వ్యాప్రియతే । న చైతస్మిన్ సర్వస్మిన్నసతి అసంగస్యాత్మనః ప్రమాతృత్వముపపద్యతే। న చ ప్రమాతృత్వమన్తరేణ ప్రమాణప్రవృత్తిరస్తి। తస్మాదవిద్యావద్విషయాణ్యేవ ప్రత్యక్షాదీని ప్రమాణాని శాస్త్రాణి చ। పశ్వాదిభిశ్చావిశేషాత్।

ణము లెంతమాత్రము గానేరవని యాశయము. ప్రత్యక్షాదు లనఁగ ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము, అర్థాపత్తి, యనుపలబ్ధి యనునవి. ఇట్టి యాక్షేపమునకు సమాధానము, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది. ఎట్లన — "దేహేంద్రియాదిష్వహంమమాభిమానరహితస్య ప్రమాతృత్వానుపపత్తౌ ప్రమాణప్రవృత్త్యనుపపత్తే" యని. దేహేంద్రియాదిషు = దేహేంద్రియాదులయందు, దేహ మనఁగాఁ ద్వగింద్రియమునకు నిరపేక్షాధార మగునట్టియు శిరము మొదలుగాఁ గల యవయవములతోఁ గూడినట్టియు సప్తధాతుమయమగు పిండము. ఇంద్రియము లనఁగా శ్రోత్రము, త్వక్కు, చక్షుస్సు, జిహ్వ, ఘ్రాణ మను జ్ఞానేంద్రియము లైదును, వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ యనెడి కర్మేంద్రియములును. ఆదిశబ్దముచే దేహావయవములు గ్రహింపఁ బడవలయును. అహంమమాభిమానహీనస్య = 'నేన'నియు 'నాద'నియు నభిమానము లేనట్టి నిద్రించుచున్న పురుషునకు, ప్రమాతృత్వానుపపత్తౌ = నేనీ విషయములను గ్రహించుచుంటి ననెడి ప్రమాతృభావము సంభవింపకపోఁగా, ప్రమాణప్రవృత్త్యనుపపత్తేః = ప్రత్యక్షాదిప్రమాణములయొక్క ప్రవృత్తి సంభవింపదుగావునఁ బ్రమాణములును శాస్త్రములును గూడ నవిద్యావద్విషయములే యని యాశయము. ఈ హేతువాక్యము భాష్యకారులయొక్క వస్తుసంగ్రహవాక్య మని చెప్పఁబడుచున్నది. ఇట్టిసంగ్రహవాక్యములే వ్యాఖ్యానవిశేషములకు భాష్య మను ఖ్యాతిశయమును గలుగఁజేయుచున్నవి. ఈవాక్యమునందలి సంగృహీతార్థము— "న హీంద్రియాణ్యనుపాదాయ" యను వాక్య మాదిగాఁ గల భాష్యముచే వివరింపఁబడినది. "న హీంద్రియాణ్యనుపాదాయ ప్రత్యక్షాదివ్యవహారః సంభవతి." ఇంద్రియాణి= ఇంద్రియములను, అనుపాదాయ= పరిగ్రహింపక, అనఁగా దేహమం "దహమ్మ"ను నభిమానమును బొంది, యింద్రియములందు మమాభిమానమును బొందకపోయినచో, ప్రత్యక్షాదివ్యవహారః = ప్రత్యక్షాదులయొక్క వ్యవహారము; అనఁగా బ్రమాతృ ప్రమాణ ప్రమేయ వ్యవహారము. న హి సంభవతి = ఎంతమాత్రమును సంభవింపదు. "న చాధిష్ఠానమంతరేణేంద్రియాణాం వ్యాపారః సంభవతి" అధిష్ఠానమంతరేణ= అధిష్ఠానము లేకుండ, అధిష్ఠాన మనఁగా యింద్రియముల కాధారభూత మగు శరీరము. అందు నే నను నభిమానము లేకుండ,

ఇంద్రియాణాం=ప్రమాణములయొక్క, వ్యాపారః=వ్యాపారము, న హి సంభవతి= ఎంతమాత్రమునుగలుగ నేరదు. "నచానధ్యస్తాత్మభావేన దేహేనకశ్చిద్వ్యాప్రియతే" అనధ్యస్తాత్మభావేన=ఆత్మభావ మధ్యస్తముచేయఁబడని, దేహేన=దేహముచేత, ననఁగా నీశరీరమే తా నని యనుకొననివాఁడు, కశ్చిత్ = ఒకానొకఁడును, న చ వ్యాప్రియతే= ఎంతమాత్రమును వ్యాపారమునందుఁ బ్రవర్తింపఁడుగదా! అనఁగా నీపరిదృశ్యమాన మగు దేహమే తా నను నభిమానము లేనివాఁ డెట్టివ్యాపారమును జేయఁడుగదా! ఇందులకు నిదర్శనము సుషుప్తుఁడే. నిద్రించుచున్నవానికి నటఁ బడియుండుదేహమునందుఁ దా నను నభిమానము లేకపోవుటచేతనే సర్వవ్యవహారము లుడిగి నిద్రించుట గలుగుచున్నది. "న చైతస్మిన్ సర్వస్మిన్నసత్యసంగస్యాత్మనః ప్రమాతృత్వముపపద్యతే" ఏతస్మిన్ సర్వస్మిన్=ఈసర్వము, అనఁగా దేహమందలియధ్యస్తాత్మభావము,తదాశ్రయము లగు నింద్రియములయందు మమత్వాభిమానమును లేకపోయినచో, అసంగస్య= సంగహీనుఁ డైన, ఆత్మనః= ప్రత్యగాత్మకు, ప్రమాతృత్వమ్=విజ్ఞాతృత్వము, తత్కార్యములగు కర్తృత్వభోక్తృత్వములును, న చ ఉపపద్యతే= ఎంతమాత్రమును సంభవింపనేరదు. ఆత్మ యసంగ మని యనుటకు "అసంగో హ్యయం పురుషః" "అసంగో న హి సజ్జతే" యను శ్రుతులు ప్రమాణము.

"న చ ప్రమాతృత్వమంతరేణప్రమాణప్రవృత్తిరస్తి" ప్రమాతృత్వమంతరేణ=అసంగుఁ డగు నాత్మకుఁ బ్రమాతృత్వము లేకుండ, ప్రమాణప్రవృత్తిః=ప్రత్యక్షాదిప్రమాణవ్యవహారము, న చాస్తి=ఎంతమాత్రము గలుగనేరదు. కావునఁ బ్రత్యక్షాదిప్రమాణములు శాస్త్రములు నవిద్యావంతుఁ డగు ప్రమాత నుద్దేశించి ప్రవర్తించుచున్నవే యని "తస్మాదవిద్యావద్విషయాణి ప్రత్యక్షాదీని ప్రమాణాని శాస్త్రాణి చ" యని యుపసంహారము చేయఁబడుచున్నది.

ప్రత్యక్షాదిప్రమాణములును శాస్త్రములును బ్రమాత నాధారముగాఁ గల్గి ప్రవర్తించుటఁజేసి యవిద్యావిషయము లనియు నట్టిప్రమాతృభావ మవిద్యామూలక మనియుఁ జెప్పఁబడియె. ప్రమాతృభావ మవిద్యామూలక మని యనుభవపూర్వకముగఁ బ్రదర్శింప హేత్వంతరము "పశ్వాదిభిశ్చావిశేషాత్"ను వసుసంగ్రహవాక్యముచేఁ బ్రదర్శింపఁబడుచున్నది. ఇందలి 'చ' అను నవ్యయము హేత్వంతరసూచకము. పశ్వాదిభిః = పసుపక్ష్యాదులతోడ, అనఁగాఁ బసుపక్ష్యాదులయొక్క ప్రమాతృభావముతోఁ గూడ, అవిశేషాత్ = విద్వాంసులయొక్క ప్రమాతృభావమునకు నెంతమాత్రము విశేషము లేకపోవుటవలన, వ్యుత్పన్నులయొక్క ప్రమాతృత్వముగూడ నట్లే యని యభిప్రాయము. ఈసంగ్రహవాక్యము

యథా హి పశ్వాదయః శబ్దాదిభిః శ్రోత్రాదీనాం సంబంధే సతి శబ్దాదిజ్ఞానే ప్రతికూలే జాతే తతో నివర్తన్తే అనుకూలే చ ప్రవర్తన్తే। యథా దండో-ద్యతకరం పురుషమభిముఖముపలభ్య మాం హంతుమయమిచ్ఛతీతిపలాయితు-మారభన్తే, హరితతృణపూర్ణపాణిముపలభ్య తం ప్రత్యభిముఖీభవన్తి। ఏవం పురుషా అపి వ్యుత్పన్నచిత్తాః క్రూరదృష్టీ నాక్రోశతః ఖడ్గోద్యతకరాన్బలవత ఉపలభ్య తతో నివర్తన్తే। తద్విపరీతాన్ ప్రతి ప్రవర్తన్తే। అతస్సమానః—

"యథా హి పశ్వాదయః" అను వాక్యమాటిగాఁ గల భాష్యముచే వివరింపఁబడుచున్నది. యథా హి=ఏతీరున, పశ్వాదయః=పశుపక్ష్యాదులు, శబ్దాదిభిః=శబ్దాది విషయములతోడ, శ్రోత్రాదీనాం=శ్రోత్రాదీంద్రియములకు, సాంబంధే సతి=సంబంధముకలుగఁగా, అనఁగా జ్ఞానేంద్రియములచేఁ దద్విషయములను గ్రహించునపుడు, అట్టి, శబ్దాదివిజ్ఞానే = శబ్దాదివిషయములయొక్క విజ్ఞానము, ప్రతికూలే జాతే = దుఃఖకర మని తెలియఁగా, తతః = ఆశబ్దాదివిషయములనుండి, నివర్తంతే = మరలిపోవుచున్నవి. అనుకూలే చ = ఆశబ్దాదివిజ్ఞానము సుఖకర మగుచో, ప్రవర్తంతే = ఆవిషయములను గూర్చి ప్రవర్తించుచున్నవో, యథా = ఏతీరున, దండోద్యతకరం = కఱ్ఱ చేతియందుఁ గలిగి వచ్చుచున్న, పురుషం = పురుషుని, అభిముఖం = ఎదురుగా, ఉపలభ్య = తెలిసికొని, మాం = నన్ను, హంతుం = కొట్టుటకు, అయం = ఈపురుషుఁడు, ఇచ్ఛతీతి = కోరుచున్నాఁ డని నిశ్చయించి, పలాయితుం = పరుగెత్తుటకు, ఆరభంతే = ప్రారంభించుచున్నవో, తం = ఆపురుషుని, హరితతృణపూర్ణపాణిం=చేతియందుఁ బచ్చనిగడ్డి గలవానిఁగా, ఉపలభ్య = తెలిసికొని, ఆసమయమున, ప్రత్యభిముఖీభవంతి = వాని కెదురుగా నగుచున్నవో, ఏవం = ఈతీరుననే, వ్యుత్పన్నచిత్తాః = శాస్త్రసంస్కారము గల, పురుషా అపి = పురుషులు గూడ, బలవతః=తనకంటె బలవంతు లగునట్టియు, ఆక్రోశతః=బొబ్బలిడుచున్నట్టియు, క్రూరదృష్టీన్=క్రౌర్యవిశిష్ట మగుదృష్టి గలిగినట్టియు, ఖడ్గోద్యతకరాన్=ఖడ్గము చేఁబూనిన పురుషులను, ఉపలభ్య=పొంది, తతః=వారివలన, నివర్తంతే=మరలుచున్నారు. తద్విపరీతాన్ ప్రతి=అట్టివారలకంటె భిన్నులగుసౌమ్యులఁగూర్చి, ప్రవర్తంతే=సమీపించుచున్నారు. అనఁగా నింద్రియములచే విషయములను గ్రహించి యావిషయములయొక్క గుణదోషములను విచారించి యనుకూలప్రతికూలభావములను లెస్సగాఁ దెలిసికొని లోకమునఁ జరించుట పశుపక్ష్యాదులకును మనుష్యులకును సమానమే. కావునఁ బ్రత్యక్షానుమాన ప్రమాణవ్యవహారము పురుషులకును బశువులకును సమానముగనే తెలియవచ్చుచున్న దని "అతః సమానః పశ్వాదిభిః పురుషాణాం ప్రమాణప్రమేయవ్యవహార" యను వాక్యముచేఁ జెప్పఁబడుచున్నది.

పశ్వాదిభిః పురుషాణాం ప్రమాణప్రమేయ వ్యవహారః। పశ్వాదీనాం చ ప్రసిద్ధోఽవివేకపురస్సరః ప్రత్యక్షాదివ్యవహారః। తత్సామాన్యదర్శనాద్వ్యుత్పత్తిమతామపి పురుషాణాం ప్రత్యక్షాదివ్యవహారస్తత్కాలస్సమాన ఇతి నిశ్చీయతే। శాస్త్రీయే తు

---

ఇంకఁ బశ్వాదులయొక్క ప్రత్యక్షాది వ్యవహార మన్ననో యవివేకపురస్సరమని యెల్లరకును దెలిసినవిషయమే యని "పశ్వాదీనాం చ ప్రసిద్ధోఽవివేకపురస్సరః ప్రత్యక్షాదివ్యవహార" యను వాక్యముచేఁ జెప్పఁబడుచున్నది.

ఇట్లు పశుపక్ష్యాదివ్యవహారమునకును వ్యుత్పన్నచిత్తునియొక్క వ్యవహారమునకును భేద మించుకేనియు లేకుండుటఁజేసి వ్యుత్పన్నచిత్తులయొక్క వ్యవహారము గూడ వ్యవహారకాలమునం దవివేకపురస్సరమే యని "తత్సామాన్యదర్శనాద్వ్యుత్పత్తిమతామపి పురుషాణాం ప్రత్యక్షాదివ్యవహారస్తత్కాలస్సమాన ఇతి నిశ్చీయతే' యను వాక్యముచేఁ జెప్పఁబడుచున్నది. తత్కాలః, తస్య= అధ్యాసముయొక్క, కాలః ఏవ= కాలమే, యస్య= వ్యవహారమునకో సః = ఆవ్యవహారము, "తత్కాల" యనఁబడును ఈవాక్యమునందు 'పశ్వాదిభి' యనుపద మధ్యాహృతము.

వ్యుత్పన్నచిత్తుల కాహారనిద్రాదియత్నంబులతోఁ గూడిన వ్యవహారము పశ్వాదివ్యవహారముతోఁ దుల్యమే యై దేహాత్మాభిమానపురస్సరమగుట నవిద్యామూలకమే యైనను సయ్యది శాస్త్రదృష్టిలేనిలౌకికప్రజ్ఞాధురీణుల విషయము గాని శ్రుతాధ్యయనసంపత్తిఁ గలిగి దేహముకంటె విలక్షణమగు నాత్మను గ్రహించి బుద్ధిపూర్వకముగ శ్రౌతస్మార్తాదికర్మనిష్ఠయం దుండువారల విషయ మెంతమాత్రమును గానేరదు దేహతాదాత్మ్యాభిమాన మధ్యాసమూలకము. తద్విలక్షణ మగు దేహవిలక్షణాత్మజ్ఞానము జ్ఞానమే యగును. అట్టి జ్ఞానముతోఁ నొప్పువాఁ డవిద్యావంతుఁ డెట్లగును ? అట్టియాత్మజ్ఞానము గలవానిని గూర్చి ప్రవర్తించినశాస్త్ర మవిద్యావద్విషయ మెట్లు గానోపును ? అనుచో, దేహముకంటె విలక్షణ మగు భిన్నాత్మజ్ఞానము సత్య మగు జ్ఞాన మెంతమాత్రము గాదు. అట్టిజ్ఞానముతో నొప్పువాఁడు వాస్తవ మగు జ్ఞాని యని యెంతమాత్రము దలఁచుటకు వీలులేదు. బుద్ధిపూర్వకముగాఁ గర్మల నాచరించువాఁడు నవిద్యావంతుఁడే గాని జ్ఞాని యనఁబడుటకు వీలులేదు. కావున నట్టివాని నుద్దేశించి ప్రవర్తించిన శాస్త్రముకూడ నవిద్యావద్విషయమే యని "శాస్త్రీయే తు వ్యవహారే యద్యపి బుద్ధిపూర్వకారీ నావిదిత్వాఽఽత్మనః పరలోకసంబంధమధిక్రియతే, తథాఽపి న వేదాంతవేద్యమశనాయాద్యతీతమపేతబ్రహ్మక్షత్త్రాది-భేదమసంసార్యాత్మతత్త్వమధికారేఽపేక్ష్యతే. అనుపయోగాదధికారవిరోధాచ్చ। ప్రాక్చ తథాభూతాత్మవిజ్ఞానాత్ప్రవర్తమానం శాస్త్రమవిద్యావద్విషయత్వం నాతివర్తతే" యను గ్రంథముచేఁ జెప్పఁబడుచున్నది. శాస్త్రీయే తు వ్యవహారే =

వ్యవహారే యద్యపి బుద్ధిపూర్వకారీనావిదిత్వాత్మనః పరలోకసంబంధమధిక్రియతే తథాపి న వేదాంతవేద్యమశనాయాద్యతీతమపేతబ్రహ్మక్షత్రాదిభేదమసంసార్యాత్మతత్త్వమధికారేఽపేక్ష్యతే, అనుపయోగాదధికారవిరోధాచ్చ । ప్రాక్చ తథాభూతాత్మవిజ్ఞానాత్ప్రవర్తమానం శాస్త్రమవిద్యావద్విషయత్వం నాతివర్తతే ।

శాస్త్రీయ మగు శ్రౌతస్మార్తకర్మాచరణమం దన్ననో, బుద్ధిపూర్వకారీ = శాస్త్రహృదయమును గ్రహించి తత్ఫలమును బడయవలయు నను నిశ్చయముతోఁ గర్మల నాచరించువాఁడు, ఆత్మనః= తనకు, పరలోకసంబంధం = స్వర్గలోకసంబంధమును, అవిదిత్వా = తెలిసికొనకుండఁగా, నాధిక్రియతే యద్యపి = అధికారము గలవాఁడెంతమాత్రము కాకపోయినవాఁ డైనను, ననఁగా బుద్ధిపూర్వకారి యగు శాస్త్రీయ కర్మానుష్ఠానమునకు దేహముకంటె విలక్షణ మగు నాత్మజ్ఞాన మవసరమే యైనను నట్టి యాత్మజ్ఞాన మాత్మజ్ఞానము కాదు. అంతకంటె నుత్తమ మగు నట్టియు వేదాంతవేద్య మగు నాత్మజ్ఞానము కర్మానుష్ఠానమున కుపయోగింపకపోవుట యటుండ నధికారవిరోధముగూడ నని, "నాధికారేఽపేక్ష్యతే ఽనుపయోగాదధికారవిరోధాచ్చ" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. ఎట్టియాత్మతత్త్వ మధికారవిరుద్ధమును ననుపయోగమును నన "వేదాంతవేద్యం = వేదాంతములవలనఁ దెలియవచ్చెడిదియు, అశనాయాద్యతీతం = ఆఁకలి దప్పిక మొదలుగాఁ గల వికారముల కతీత మగునట్టిదియు, అపేతబ్రహ్మక్షత్త్రాదిభేదం = బ్రాహ్మణుఁడు క్షత్త్రియుఁడు వైశ్యుఁ డను నభిమానములనుండి తొలఁగినట్టిదియు, అసంసార్యాత్మతత్త్వం = ప్రమాతృత్వ కర్తృత్వ భోక్తృత్వవిరహిత మగు నాత్మతత్త్వ మని యర్థము.

ఇట్టియాత్మతత్త్వ మనుపయోగము నధికారవిరోధమును నెట్లన, నిట్టి యాత్మతత్త్వమును సాక్షాత్కారమునొందిన విద్వాంసుఁడు ప్రమాతృత్వభావమును గోలుపోవుటచే నట్టిప్రమాతచేఁ దెలిసికొనఁబడు క్రియాకారకఫలవిజ్ఞానమంతయు శుక్తిరజతమందలి మిథ్యాజ్ఞానమట్లు దలఁపఁబడుటచే నద్దానియందు హేయోపాదేయబుద్ధి పుష్కలముగ నశింప సర్వకర్తవ్యతాశూన్యుఁ డగుటంజేసి సర్వకర్మలనుండి నివృత్తిఁ జెందునుగాని యెట్టి కర్మమునందు నెంతమాత్రము ప్రవృత్తిఁ జెందఁడు.

కావున నట్టివేదాన్తవేద్యాదివిశేషములతో నొప్పునాత్మజ్ఞానము గలుగుటకుఁ బూర్వము అనఁగా దేహముకంటె విలక్షణ మగు సామాన్యాత్మజ్ఞానమాత్రమాలవాలముగాఁ జేసికొనినశాస్త్ర మంతయు నవిద్యావద్విషయమే గాని వేఱొండెంతమాత్రము గాదని "ప్రాక్చ తథాభూతాత్మవిజ్ఞానాత్ప్రవర్తమానం శాస్త్రమవిద్యావద్విషయత్వం నాతివర్తతే" యను వస్తుసంగ్రహవాక్యముచేఁ జెప్పఁబడు

తథాహి — "బ్రాహ్మణో యజేత" ఇత్యాదీని శాస్త్రాణ్యాత్మని వర్ణాశ్రమవయోఽవస్థాదివిశేషాధ్యాసమాశ్రిత్య ప్రవర్తన్తే। అధ్యాసో నామాతస్మింస్తద్బుద్ధిరిత్యవోచామ। తద్యథా పుత్రభార్యాదిషు వికలేషు సకలేషు వా, అహమేవ వికలః సకలో వేతి బాహ్యధర్మానాత్మన్యధ్యస్యతి, తథా దేహధర్మాన్ — స్థూలోఽహం, కృశోఽహం, గౌరోఽహం, తిష్ఠామి, గచ్ఛామి, లంఘయామి చేతి। తథేన్ద్రియ-

---

చున్నది. ఈ వాక్యము చే సంగ్రహింపఁబడిన యర్థము "తథాహి" యనుపదముతోఁ బ్రారంభ మగు భాష్యముచే వివరింపఁబడుచున్నది. తథాహి= అది యెట్లనిన— "బ్రాహ్మణో యజేత ఇత్యాదీని" = "బ్రాహ్మణో యజేత" యను వాక్యము మొదలుగాఁ గల, శాస్త్రాణి= చోదనారూప మగు వాక్యములు, ఆత్మని= దేహము నాత్మగా భావించునాత్మయందు, వర్ణాశ్రమవయోవస్థాదివిశేషాధ్యాసం = వర్ణము, ఆశ్రమము, వయస్సు, అవస్థ మొదలుగాఁ గలిగినవిశేషముల యొక్క యధ్యాసమును, ఆశ్రిత్య = ఆలవాలముగాఁ జేసికొని, ప్రవర్తన్తే = ప్రవర్తించుచున్నవి ఇచట "బ్రాహ్మణో యజేత" యనునది వర్ణాధ్యాసబోధకము. "అష్టవర్షం బ్రాహ్మణముపనయీత" యనునది వర్ణవయోఽవస్థాఽధ్యాసబోధకము. "న హ వై స్నాత్వా భిక్షేత" యనునది యవస్థాఽధ్యాసబోధకము. "యో వై జ్యోగామయావీ స్యాత్ స ఏతామిష్టిం నిర్వపేత్"నునది యవస్థాఽధ్యాసబోధకము. "జ్యోగామయావీ" యన, సంపూర్ణముగ రోగగ్రస్తుఁ డని యర్థము. ఆది శబ్దముచే "యావజ్జీవమగ్నిహోత్రం జుహుయాత్"ను జీవనాధ్యాసబోధక మగు వాక్యము గ్రహింపనగును.

ఇట్లధ్యాససద్భావమును సాధించి "స్మృతిరూప" యను పదము మొదలు "సర్వథాపి త్వన్యస్యాన్యధర్మావభాసతాం న వ్యభిచరతి" యను వాక్య మంతముగాఁ గలిగిన భాష్యముచే లక్షితమగు నధ్యాసము "అధ్యాసో నామాతస్మింస్తద్బుద్ధిరిత్యవోచామ" యని నిరుపచరితముగను నతదారోపముగను బరామర్శ చేయఁబడుచున్నది. అతస్మిన్= యుష్మత్ప్రత్యయగోచరము కాని యస్మత్ప్రత్యయగోచరమందు, తద్బుద్ధిః = యుష్మత్ప్రత్యయగోచరముయొక్క యవభాస మని యాశయము. అట్టి యధ్యాసము "తద్యథా" యను వాక్య మాదిగాఁ గల గ్రంథముచే నిరూపింపఁ బడుచున్నది. ఎట్లన, తద్యథా = అయ్యది యెట్లనిన, పుత్రభార్యాదిషు=తనకంటె నత్యంతము భిన్నులుగాఁ దెలియవచ్చెడి పుత్రభార్యాదులు, వికలేషు = వికలత్వము నొందఁగా లేక, సకలేషు వా = సకలత్వము నొందఁగాఁ గాని, అహమేవ= నేనే, వికలః= వికలుఁడను, సకలో వా= సకలుఁడను గాని, ఇతి=అని, బాహ్యధర్మాన్ = బాహ్యవస్తువులయందలి వికలత్వసకలత్వములను, ఆత్మని = తనయందు, అధ్యస్యతి= ఆరోపించుకొనుచున్నాఁడు. తథా=అటులనే, దేహధర్మాన్ = దేహధర్మములను

ధర్మాన్ — మూకః, కాణః, క్లీబః, బధిరః, అన్ధోఽహమితి । తథాన్తః-కరణధర్మాన్ కామసంకల్పవిచికిత్సాధ్యవసాయాదీన్ । ఏవమహంప్రత్యయినమశేషస్వప్రచార సాక్షిణి ప్రత్యగాత్మన్యధ్యస్య తం చ ప్రత్యగాత్మానం సర్వసాక్షిణం తద్విపర్యయేణాన్తఃకరణాదిష్వధ్యస్యతి । ఏవమయమనాదిరనన్తో నైసర్గికోఽధ్యాసో మిథ్యాప్రత్యయరూపః కర్తృత్వభోక్తృత్వప్రవర్తకః సర్వలోక-

---

ఆరోపించుకొని, స్థూలోఽహం, కృశోఽహం, గౌరోఽహం, తిష్ఠామి, గచ్ఛామి, లంఘయామి చేతి = ఈస్థూలత్వాదిధర్మముల నారోపించుకొని వైరీతిగా వ్యవహరించుచున్నాఁడు. అనఁగా స్థూలదేహమే తానని తలఁచి స్థూలత్వాదులను, జరామరణాదుల నాత్మయం దారోపించుకొనుచున్నాఁడు. ఇయ్యది ధర్మ్యధ్యాసపురస్సరం బగు ధర్మాధ్యాసము. ఇఁక ధర్మ్యధ్యాసము లేకుండఁగా ధర్మాధ్యాసమును "తథేంద్రియధర్మాన్, మూకః, కాణః, క్లీబః, బధిరః, అంధోఽహమ్మ"ని వాగాదీంద్రియములతోఁ దాదాత్మ్యాధ్యాసము లేకుండ నాయింద్రియధర్మములనుమాత్రమే యారోపించుకొనుచున్నాఁడు.

అటులనే యంతఃకరణముతోఁ దాదాత్మ్యమును జెంది యాయంతఃకరణధర్మములగు కామము, సంకల్పము, విచికిత్స, యధ్యవసాయము మున్నగు ధర్మములనుగూడ నారోపించుకొనుచున్నాఁడు ఇచట నాదిశబ్దముచే "కామస్సంకల్పోఽశ్రద్ధా = శ్రద్ధా ధృతిరధృతి ర్హ్రీర్ధీర్భీరిత్యేతత్ సర్వం మన ఏవ" యను శ్రుతియందుఁ దెలియవచ్చెడి శ్రద్ధాదులు గ్రాహ్యంబులు. ఇచట నంతఃకరణమనఁగా నహంప్రత్యయియొక్క విజ్ఞానశక్తి యని గ్రహింపవలయును. అద్దానియొక్క ధర్మములే కామాదులు.

ఇంతవఱకు ధర్మాధ్యాసమును బ్రదర్శించి ధర్మ్యధ్యాసమాత్రమును "ఏవమహంప్రత్యయినం సర్వసాక్షిణమ్మ"ను వాక్యముచేఁ బ్రదర్శించుచున్నారు. ఏవం= ఈరీతిగా, అహంప్రత్యయినం, ప్రత్యయాః= కామాదులు, అస్యేతి= వీనికిఁ గలవు గాన నీతఁడు "ప్రత్యయి" యగుచున్నాఁడు. "అహం చాసౌ ప్రత్యయీచ" యను విగ్రహముచే నహమ్మను ప్రత్యయి యీతఁడు గాఁగ నహంప్రత్యయి యగుచున్నాఁడు. అనఁగా నహమ్మని తన్నుఁ దెలిసికొను ప్రమాత. అట్టివానిని, అశేషస్వప్రచారసాక్షిణి = స్వప్రచారము లగు కామసంకల్పకర్తృత్వాదులకుఁ బుష్కలముగ సాక్షి యగు ప్రత్యగాత్మను, స్వస్వరూపమునందు, అధ్యస్య=ఆరోపించి, తం = అట్టి, సర్వసాక్షిణం = బుద్ధ్యాదివిషయాంతరూప మగు జగత్తునకు సాక్షియగు, ప్రత్యగాత్మానం= స్వస్వరూపమును, తద్విపర్యయేణ=అంతఃకరణాది విపర్యయములచేతఁ బ్రత్యగాత్మను, అంతఃకరణాదిషు= అంతఃకరణము, ఇంద్రియములు, దేహము, దారపుత్రాదులు లోనుగాఁ గలవానియందు, అధ్యస్యతి =ఆరో

ప్రత్యక్షః॥ అస్యానర్థహేతోః ప్రహాణాయాత్మైకత్వవిద్యాప్రతిపత్తయే సర్వే పించుచున్నాఁడని, యీ ఆత్మానాత్మల యొక్క యితరేతరాధ్యాసము నిరూపింపఁబడుచున్నది.

ఇట్లాత్మానాత్మలయొక్క యితరేతరాధ్యాసమును సర్వవిధములఁ బ్రదర్శించి “ఏవమయమనాదిరనన్తో నైసర్గికోఽధ్యాసో మిథ్యాప్రత్యయరూపః కర్తృత్వభోక్తృత్వప్రవర్తకః సర్వలోకప్రత్యక్షః” యని యధ్యాసము నుపసంహరించుచున్నారు.

సమ్భావన భాష్యమున “నైసర్గికోఽయం లోకవ్యవహారః” యని లోకవ్యవహారము నైసర్గిక మని చెప్పఁబడుచున్నది. ప్రకృతమున నధ్యాసము నైసర్గిక మనియు ననాది యనియు నధికముగాఁ జెప్పఁబడుచున్నది. ఇట్టియధికావాప మెట్లు సమంజస మగునని జెప్పఁబడుచున్నది. సమ్భావనభాష్యమునఁ గూడఁ బ్రత్యగాత్మయందలి యహంకారాధ్యాసమే నైసర్గిక మగు లోకవ్యవహార మని తలంపఁబడుచున్నది. అహంకారాధ్యాసమున కధిష్ఠాన మగు ప్రత్యగాత్మ యన్ననో యనాదిసిద్ధము. అట్టి ప్రత్యగాత్మకు నైసర్గిక మగు నధ్యాసమున కనాదిత్వ మర్థసిద్ధమే యగుచున్నది. దానంజేసి సమ్భావనభాష్యమున కనువాదమే యీయుపసంహారము గాని యధికావాప మెంతమాత్రము గానేరదు.

తత్త్వజ్ఞానము గలుగకుండ నంతమునొందదు గావున నియ్యది యనంత మని చెప్పఁబడుచున్నది. “మిథ్యాప్రత్యయరూప” మను రూపగ్రహణ మద్దాని స్వభావబోధక మగుచున్నది గాని వ్యవహారముచేఁ జెప్పఁబడినది యెంతమాత్రము గాదు. ఏలయన- లోకవ్యవహారము వ్యవహారకాలమున సత్యముగా నున్నట్లు దోఁచుచుండును. కాని యధ్యాసస్వరూపస్వభావములను విచారించిన నద్దానిని సత్తని గాని యసత్తని గాని యిదమిత్థమ్మని నిర్ణయించుట కెంతమాత్ర మవకాశము లేదు. అందుచే ననిర్వచనీయమై యున్నను వ్యావహారికదృష్టిచే సత్యముగా భాసించుచున్న దని యభిప్రాయము. ఇట్టి యధ్యాస మనర్థహేతు వని “కర్తృత్వ-భోక్తృత్వప్రవర్తక” యను పదముచే నిరూపించుచున్నారు.

“సర్వలోకప్రత్యక్ష” యనుదానిచే “దేహేంద్రియాదిష్వహంమమాభి-మానరహితస్య” యను వాక్యము మొదలుగాఁ గలిగిన భాష్యముచే నిరూపింపఁబడినయర్థము స్మరింపఁబడి యుపసంహరింపఁబడుచున్నది.

ఇంతవఱకు సూత్రముచేఁ బ్రదర్శింపఁబడిన విషయప్రయోజనసిద్ధి కొఱకు నర్థసిద్ధ మగు జీవునియొక్క యబ్రహ్మస్వభావమును నధ్యాసస్వభావమును బ్రదర్శించి, వేదాంతములయొక్క విషయప్రయోజనములను “అస్యానర్థహేతోః

వేదాంతా ఆరభ్యన్తే। యథా చాయమర్థః సర్వేషాం వేదాన్తానాం తథా వయ మస్యాం శారీరకమీమాంసాయాం ప్రదర్శయిష్యామః।

ప్రహాణాయ ఆత్మైకత్వవిద్యాప్రతిపత్తయే సర్వే వేదాంతా ఆరభ్యన్తే" యను గ్రంథముచేఁ జెప్పుచున్నారు.

ఇందు అనర్థప్రహాణ మనఁగా నాల్స్తియుం దధ్యస్త మగు ప్రమాతృత్వ కర్తృత్వ భోక్తృత్వాదిరూప మగు బంధమును దొలఁగించుట యని యభిప్రాయము. ఇట్టి యనర్థము "తత్త్వమసి" "అయమాత్మా బ్రహ్మ" యను మొదలుగాఁ గల వాక్యములచే దెలియవచ్చెడి యాత్మైకత్వవిద్యాప్రతిపత్తివలనఁ దొలఁగు నని చెప్పఁబడుచున్నది.

వేదాంతములయందు "స యో హ వై తత్పరమం బ్రహ్మ వేద, బ్రహ్మైవ భవతి" "బ్రహ్మవిదాప్నోతి పరమ్" "యో వై భూమా తత్సుఖమ్" "విజ్ఞానమానందం బ్రహ్మ" మొదలుగాఁ గల శ్రుతులవలన నిరతిశయసుఖావాప్తి ఫలముగా వినవచ్చుచున్నది. "తరతి శోకమాత్మవిత్" "జుష్టం యదా పశ్యత్య-న్యమీశమస్య మహిమానమితి వీతశోకః" యను శ్రుతులవలన శోకనివృత్తియు ఫలముగా వినవచ్చుచుండ అనర్థనివృత్తి సుఖావాప్తి యను రెండును ప్రయోజనములుగ వర్ణించుటకు మారుగ నొక్క యనర్థప్రహాణమే ప్రయోజనముగ వర్ణించుట యేల యన — సుఖావాప్తి యనునది యాత్మైకత్వవిద్యాప్రతిపత్తి యనుదానిచే సంగత మగుచున్నది. కావున నయ్యది ప్రత్యేకముగా వర్ణింపఁబడుట కవసరము లేదు ఏల యన, నాత్మైకత్వవిద్యాప్రతిపత్తి యనఁగా జీవునకు బ్రహ్మభావమును ఘటింపఁజేయుటయే. జీవునకు బ్రహ్మభావమును ఘటింపఁజేయుట యనఁగా జీవుఁడు నిరతిశయసుఖరూప మగు బ్రహ్మమే దా నని దెలిసికొనుట. అద్దానిచేఁ గల్గు సుఖరూప మగు బ్రహ్మభావము నొందుటవలననే యనర్థములు నివృత్తిఁ జెందును గాని వేఱొకవిధమున నివృత్తిఁ జెందకపోవుటచే, ననర్థనివృత్తిచే సుఖావాప్తి సూచింపఁబడుచున్నది. కావున సుఖావాప్తిరూప మగు ఫల మర్థసిద్ధ మగుటంజేసి ప్రత్యేకముగా నిరూపింప నవసరము లేదని భావము.

ఇచట నాత్మైకత్వవిద్యయే వేదాంతములయందు విషయ మని ప్రదర్శింపఁబడెను. వేదాంతములయం దన్నిటి యీవిషయ మేకదేశవిషయమై యింతకంటె భిన్నము లగు విషయములు పలువిధములుగ దెలియవచ్చుచున్నవి. కాఁగా నొక్క యాత్మైకత్వవిద్యాప్రతిపత్తికొఱకే వేదాంతములు ప్రారంభింపఁబడుచున్న నని చెప్పుట కవకాశ మెంతుఁ గల దను నద్దానికి సమాధానము "యథా చాయమర్థస్సర్వేషాం వేదాంతానాం తథా వయమస్యాం శారీరక-మీమాంసాయాం ప్రదర్శయిష్యామః" యని చెప్పఁబడుచున్నది.

వేదాంతమీమాంసాశాస్త్రస్య వ్యాచిఖ్యాసితస్యేదమాదిమం సూత్రమ్.

"శరీరమేవ శరీరకమ్, తత్ర నివాసీ శారీరకః జీవాత్మా తస్య త్వంపదాభిధేయస్య తత్పదాభిధేయపరమాత్మరూపతా మీమాంస్యతే యయా సా శారీరకమీమాంసా" యను వ్యుత్పత్తిచే జీవునికి బ్రహ్మభావమును బ్రదర్శించుమీమాంస శారీరకమీమాంస యని యాశయము. 'ఇయ్యది శ్రీవిద్యాశంకరభగవత్పాదకృతమగు భాష్యమునకు సాభిప్రాయమగు నామవిశేషము. సకలవేదాంతములును నాత్మైక్యమునం దెట్లు సమన్వయమగుచున్నవో యావిధ మీశారీరకమీమాంసయందు సోపపత్తికముగఁ బ్రదర్శింపఁబడుచున్నదని భాష్యకారులగు శ్రీవిద్యాశంకరభగవత్పాదులయొక్క ప్రతీకము.

ఇచట శారీరకమీమాంస, భాష్యమని చెప్పఁబడుచున్నది. భాష్యమనఁగా "సూత్రార్థో వర్ణ్యతే యత్ర వాక్యైః సూత్రానుకారిభిః, స్వపదాని చ వర్ణ్యంతే భాష్యం భాష్యవిదో విదుః' యను నభియుక్తోక్తిచే నొకవ్యాఖ్యానవిశేషముగాఁ జెప్పఁబడుచున్నది. వ్యాఖ్యానమనఁగా "పదచ్ఛేదః పదార్థోక్తిర్విగ్రహో వాక్యయోజనా । ఆక్షేపస్య సమాధానం వ్యాఖ్యానం పంచలక్షణమ్" అను నార్యోక్తిచే నైదువిషయములతో నొప్పునదిగాఁ జెప్పఁబడుచున్నది. వ్యాఖ్యానశబ్ద మీయైదవయవములతోఁ గూడిన రచనావిశేషమునకు సామాన్యనామముగా నొప్పుచున్నను, వృత్తి, టీక, వివరణము, వ్యాఖ్య యను విశేషనామములతో నలరారుచున్నది. ఈవిశేషనామములతోఁ గూడిన రచనావిశేషముల కొక విశేషస్వరూప మెద్దియును దెలియరాదు కాని భాష్యమను వ్యాఖ్యానవిశేషము మాత్ర మీయైదవయవములతోఁ బాటు సంగ్రహవాక్యములనెడి సూత్రముల ననుకరించు విశేషవాక్యములలో నొప్పుచుండవలయును. శారీరకమీమాంస యన నొక వ్యాఖ్యానవిశేష మని తెలిసినది వ్యాఖ్యాన మొకమూలగ్రంథము నపేక్షించుచుండును. అట్టిమూలగ్రంథ మెద్ది యన— "వ్యాచిఖ్యాసితస్య వేదాంతమీమాంసాశాస్త్రస్య" యని భాష్యకారులచే వేదాంతమీమాంసాశాస్త్ర మని చెప్పఁబడుచున్నది. ఇచట మీమాంసాశబ్దము విచారపరము. శాస్త్రమన 'శిష్యతేఽనేన" యను వ్యుత్పత్తిచే శాసించునది, నియమించునది యని యర్థము. "మీమాంసాయాః శాస్త్రం= మీమాంసాశాస్త్రం" అను విగ్రహముచే వేదాంతవిచారమును నియమించునది యను నర్థము గలుగుచున్నది. ఇట్టి వేదాంతమీమాంసాశాస్త్ర మెద్దియన "ఇదమాదిమం సూత్రం "అథాతో బ్రహ్మజిజ్ఞాసేతి" యని భాష్యకారులు నిర్దేశించుచున్నారు. గాన నీవేదాంతమీమాంసాశాస్త్రమునకు "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యను నది మొదటిసూత్రముగా భాష్యకారులచే నిర్వచింపఁబడినదని తెలియుచున్నది. కనుక "అథాతో బ్రహ్మజిజ్ఞాసా"

శ్రీః

జిజ్ఞాసాధికరణమ్

## అథాతో బ్రహ్మజిజ్ఞాసా ॥ 1

తత్రాథశబ్ద ఆనంతర్యార్థః పరిగృహ్యతే నాధికారార్థః, బ్రహ్మజిజ్ఞాసాయా యను సూత్రముతో వేదాంతమీమాంసా శాస్త్రము ప్రారంభింపఁబడుచున్న దని సుస్పష్టము. కావున నీసూత్రము శాస్త్రబహిర్భూతము. శాస్త్రము "జన్మాద్యస్య యత" యను రెండవసూత్రముతోఁ బ్రారంభింపఁబడుచున్న దను వాద మసంగత మని తెలియవలయును

ఈ మొదటిసూత్రముచే సర్వవేదాంతములకును విషయమును ప్రయోజనమును గూడ సూత్రకారులు బ్రహ్మశబ్దముచేఁ బ్రతిజ్ఞచేసి యట్టి బ్రహ్మయొక్క లక్షణమును బూర్వసూత్రముతో సంబంధింపఁజేసియే "జన్మాద్యస్య యత" యని నిర్వచించియున్నారు. కావున మొదటిరెండుసూత్రములకును జక్కనిసంబంధము సుస్పష్టముగాఁ దెలియవచ్చుచుండ మొదటిసూత్రము శాస్త్రబహిర్భూత మని చెప్పుటకంటె వేఱొకయవివేక మెంచను దెలియఁబడదు. కావున వేదాంత మీమాంసాశాస్త్రము "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యను సూత్రముతోడనే ప్రారంభింపఁబడుచున్నది.

సూత్రమన్ననో బహ్వర్థసూచక మని యర్థము. ఇట్టియర్థము "లఘూని సూచితార్థాని స్వల్పాక్షరపదాని చ। సర్వతః సారభూతాని సూత్రాణ్యాహుర్మనీషిణ" యను నభియుక్తోక్తివలనఁ దెలియవచ్చుచున్నది. దీనినిబట్టి శ్రీవిద్యాశంకర భగవత్పాదకృతి మగు శారీరకమీమాంస యను భాష్యము శ్రీకృష్ణద్వైపాయన వేదవ్యాసమునిప్రణీత మగు వేదాంతమీమాంసాశాస్త్రముయొక్క వ్యాఖ్యాన విశేషమే గాని వేఱొండు స్వతంత్రగ్రంథ మంతసూత్రము గాదని సుస్పష్ట మగుచున్నది.

ఈపవిత్రతమం బగు వేదాంతమీమాంసాశాస్త్రమునకు వ్యాఖ్యానమును జేయుచున్నా నను ప్రతిజ్ఞను గావించి "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యను మొదటిసూత్రమునకు "తత్రాథశబ్ద ఆనంతర్యార్థః పరిగృహ్యతే నాధికారార్థ" యను సంగ్రహవాక్యముచే సూత్రమందలి 'అథ' శబ్దముయొక్క యర్థమును నిర్వచించుచున్నారు. అనఁగా సూత్రమునందలి 'అథ' శబ్దమునకు నానంతర్య మను నర్థమునే గ్రహింపవలయును. అధికారమనఁగాఁ బ్రారంభించుట యను నర్థమును గ్రహింపఁగూడదు. ఇచట నథశబ్దమున కారంభార్థనిషేధ మర్థాంతరనిషేధోపలక్షణ మని గ్రహింపవలయును. దానంజేసి యథశబ్దమునకు ననంతర మనునర్థ

అనధికార్యత్వాత్। మంగళస్య చ వాక్యార్థే సమన్వయాభావాత్। అర్థాన్తరప్రయుక్త ఏవ హ్యథశబ్దః శ్రుత్యా మంగళప్రయోజనో భవతి।

---

మునే గ్రహింపవలయును గాని మఱియొకయర్థము నెంతమాత్రము గ్రహింపఁ గూడ దని యభిప్రాయము. అథశబ్దమున కర్థాంతరములను నెవ్వలనఁ గ్రహింపఁ గూడదో యయ్యది సక్రమముగను సయుక్తికముగను సూత్రభాష్యములచే వివరింపఁ బడుచున్నది. ఎట్లన— "బ్రహ్మజిజ్ఞాసాయా అనధికార్యత్వాత్" యనియారంభార్థము తొలుత నిషేధింపఁబడుచున్నది. బ్రహ్మజ్ఞానమును గూర్చిన యిచ్ఛ యనఁగా సకలావ పురుషకర్తృక మగు కర్మ కాదు. అనఁగా బుద్ధివ్యాపారజన్యము కాదు. కావున వ్యాపారరూపమగు నధికారమునకుఁ గల్గిన దెంతమాత్రము కాకపోవుటచే నారంభార్థకశబ్దముతో సంబంధించి తనయర్థమును బోధింపనేరదు. ఆరంభార్థబోధకశబ్దము లున్ననో, 'ప్రారభ్యతే, కర్తవ్యా' మున్నగునవి. ఇచట బ్రహ్మజిజ్ఞాసాశబ్దము 'ప్రారభ్యతే, కర్తవ్యా' యను పదములతోఁ గూడి యర్థావబోధమును గల్గింపనేరదు. కావున నథశబ్దమునకు నదర్థమును గ్రహించుటచే సూత్రమునిరర్థకమయ్యెడిని. కావున నథశబ్దమున కిట్టియర్థము నెంతమాత్రము చెప్పఁగూడదు.

ఆతీరుననే యథశబ్దమునకు మంగళార్థమునుగూడ గ్రహింపఁగూడ దని "మఙ్గళస్య చ వాక్యార్థే సమన్వయాభావాత్"ని చెప్పఁబడుచున్నది. అనఁగా నథశబ్దమునకు మంగళ మను నర్థమును గ్రహించినచో "బ్రహ్మజిజ్ఞాసా మంగళమ్మ"ని సూత్రార్థబోధకవాక్య మగును. ఇట్టివాక్య మెట్టియర్థమును బోధింప నేరదు. కావున నథశబ్దమునకు మంగళమను నర్థమును గూడ గ్రహింపఁగూడదు. అథశబ్దమునకు మంగళార్థమును గ్రహింపనిచో గ్రంథాదియందుఁ జేయఁబడవలసిన మంగళము సిద్ధింపకపోవుటచే సూత్రకారులు శిష్టాచారము నుల్లంఘించినదోషము నకుఁ బాల్పడరా? యనుచో నట్టిదోషము వాటిల్లదని "అర్థాన్తరప్రయుక్త ఏవ హ్యథశబ్దః శ్రుత్యా మంగళప్రయోజనో భవతి" యని చెప్పఁబడుచున్నది. అథశబ్ద మర్థాంతరప్రయుక్తమైనను ననఁగా మంగళ మను నర్థముకంటె వేఱగునర్థమునఁ బ్రయోగింపఁబడినను నాశబ్దము, శ్రుత్యా= శ్రవణమాత్రము చేతనే, మంగళమును గలుగఁజేయుచున్నదని శ్రవణమాత్రము చేతనే యథశబ్దము మంగళమును సిద్ధింపఁజేయుచుండఁ బ్రత్యేకముగా మంగళార్థమును గ్రహింప నవసరము లేదని "ఓంకారశ్చాథశబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా। కంఠం భిత్త్వా వినిర్యాతౌ తస్మాన్మాంగళికావుభౌ" యను స్మృతివలనఁ దెలియవచ్చుచున్నది. కావున మంగళ మను నర్థము నథశబ్దమునకుఁ బ్రత్యేకముగా గ్రహింప నవసరము

పూర్వప్రకృతాపేక్షాయాశ్చ ఫలత ఆనంతర్యావ్యతిరేకాత్। సతి చానంతర్యార్థత్వే యథా ధర్మజిజ్ఞాసా పూర్వవృత్తం వేదాధ్యయనం నియమేనాపేక్షత ఏవం బ్రహ్మజిజ్ఞాసాపి యత్పూర్వవృత్తం నియమేనాపేక్షతే తద్వక్తవ్యమ్।

లేదని తాత్పర్యము అట్లు గ్రహించినచో నర్థసందర్భము గూడఁ గలుగనేర దని యు గ్రహింపవలయును. దానంజేసి యథశబ్దమున కానంతర్యార్థము గ్రహింపఁ బడినను శ్రవణమాత్రముచేతనే మంగళము సిద్ధించుచున్నది

ఇఁక "అథైవం మన్యసే" యనుచో నథశబ్దమునకుఁ దాను జెప్పఁదలఁచినదానికంటెఁ బూర్వ మొకవిషయము దప్పక దెలియవచ్చుచున్నటుల నథశబ్దముచేఁ దెలివచ్చుటఁ జేసి యా పూర్వప్రకృతార్థబోధకమే యథశబ్దమగున ట్లనఁగా నచట నథశబ్దమునకుఁ బూర్వప్రకృతమే యర్థ మని తెలియవచ్చుచున్న ట్లిచటను నథశబ్దమునకుఁ గూడఁ బూర్వప్రకృత మను నర్థమును గ్రహింపఁ గూడదా యనిన "పూర్వప్రకృతాపేక్షాయాశ్చ ఫలత ఆనంతర్యావ్యతిరేకాత్" ని సమాధానము చెప్పఁబడుచున్నది. దీనియాశయ మేమనిన నథశబ్దమునకుఁ బూర్వప్రకృతమను నర్థము గ్రహించిన నయ్యది యానంతర్యమునకు భిన్న మెంతమాత్రముగాదు. ఎట్లనఁగాఁ జెప్పఁదలఁచినదానికి నియమముగా నెయ్యది పూర్వవృత్త మగునో యట్టి పూర్వవృత్తమున కనంతరమున నెయ్యది తప్పక చెప్పఁబడునో యచటఁ జెప్పఁబడుదానికిఁ బూర్వవృత్తము తప్పక హేతుభూత మగు నర్థమై యుండవలయును. కావున నట్టి హేతుభూత మగు నర్థమే ప్రకృతమై తదనంతరమునఁ గలుగఁబోవుదానిని గూడ నథశబ్దము సూచించుటచే నథశబ్దార్థ మానంతర్యార్థమునకంటె నెంతమాత్రము భిన్నము కానేరదు. ఎట్లన— ఫలతః = ఫలస్య = ప్రక్రియమాణస్య, అనఁగాఁ జెప్పఁదలఁచినదానికి, పూర్వప్రకృతాపేక్షాయాశ్చ = పూర్వప్రకృతముగా నెయ్యది యపేక్షింపఁబడుచున్నదో యద్దానియొక్క, ఆనంతర్యావ్యతిరేకాత్ = ఆనంతర్యమని యథశబ్దమున కర్థమును గ్రహించినచో నెంతమాత్రము విరుద్ధము గానేరదని భావము.

ఇట్లథశబ్దమునకుఁ దెలియవచ్చెడి మంగళారంభానంతర్యపూర్వప్రకృతము లనెడి నాలుగర్థములను విమర్శించి యం దీసూత్రమునందలియథశబ్దమునకు నానంతర్యార్థమే సర్వవిధముల సిద్ధించెనని "సతి చానంతర్యార్థత్వే" యను వాక్యముచే నిరూపింపఁబడుచున్నది. అనఁగా నానంతర్యార్థమే యథశబ్దమునకు సిద్ధమగుచుండఁగా నని యర్థము.

అథశబ్దమున కానంతర్యార్థము సిద్ధము గాఁగఁ బ్రకృతమునఁ జెప్పఁబడిన బ్రహ్మజిజ్ఞాసకు నియమముగా నుండవలయు పూర్వవృత్త మెద్ది యని "యథా ధర్మ-జిజ్ఞా......తద్వక్తవ్యమ్మ"ను భాష్యముచే నడుగఁబడుచున్నది. అనఁగా

స్వాధ్యాయానంతర్యం తు సమానమ్। నన్విహ కర్మావబోధానంతర్యం విశేషః। న। ధర్మజిజ్ఞాసాయాః ప్రాగప్యధీత వేదాంతస్య బ్రహ్మజిజ్ఞాసోపపత్తేః। యథా చ హృదయాద్యవదానానామానంతర్యనియమః, క్రమస్య వివక్షితత్వా-

---

జైమినికృతమగు "అథాతో ధర్మజిజ్ఞాసా" యను సూత్రమున నథశబ్దమున కానంతర్యార్థమే గ్రహింపఁబడి యట్టియానంతర్యార్థముచే ధర్మజిజ్ఞాసకు సూచింపఁబడు పూర్వవృత్తము వేదాధ్యయన మని నిర్ణయింపఁబడిన ట్లే బ్రహ్మజిజ్ఞాసకుఁ బూర్వవృత్త మెయ్యది నిరూపింపఁబడవలయు నని యడుగ స్వాభిమతార్థము పక్షాంతర నిరసనపూర్వకముగ "స్వాధ్యాయానంతర్యంతు సమానమ్మ"నుపదము మొదలుగాఁ గల భాష్యముచేఁ బ్రదర్శింపఁబడుచున్నది. అందు మొదటిపక్షము. జైమినికృతమగు ధర్మజిజ్ఞాస కేస్వాధ్యాయము పూర్వవృత్త మని నిర్ణయింపఁబడెనో యాస్వాధ్యాయమే యీబ్రహ్మజిజ్ఞాసకుఁగూడఁబూర్వవృత్తమన నయ్యది సామాన్య కారణము కాని విశేషమగు పుష్కలకారణ మెంతమాత్రము కాదను నాశయము మీఁఱ "స్వాధ్యాయానంతర్యం తు సమానమ్మ"ని చెప్పఁబడు చున్నది. స్వాధ్యాయ మనఁగా గురుముఖోచ్చారణపూర్వకమగు స్వోచ్చారణముచేఁ బుష్కలముగ గ్రహింపఁబడిన వేద మని యర్థము. అట్టివేదాధ్యయనము ధర్మజిజ్ఞాసకు నెట్లవసరమో యాతీరుననే బ్రహ్మజిజ్ఞాసకుఁ గూడ నవసరమే యని యర్థసిద్ధమగుచున్నది. కావున నుభయజిజ్ఞాసలకును సామాన్యమే యగుటంజేసి బ్రహ్మజిజ్ఞాసకుఁ బుష్కలకారణ మెంతమాత్రము గానేర దని యభిప్రాయము.

బ్రహ్మజిజ్ఞాసకు వేదాధ్యయనము పూర్వవృత్తము కానిచో ధర్మజిజ్ఞాస పూర్వవృత్తమగునా యని "నన్విహ కర్మావబోధానంతర్యం విశేష" యను వాక్యముచే మధ్యస్థుఁడు ప్రశ్నించుచున్నాఁడు. అ ట్లెంతమాత్రమును గాదని "న" యను సమాధానము చెప్పఁబడి యందులకు హేతువు "ధర్మజిజ్ఞాసాయాః ప్రాగప్యధీతవేదాన్తస్య బ్రహ్మజిజ్ఞాసోపపత్తే" యని ప్రతిపాదింపఁబడుచున్నది. అనఁగా వేదాంతముల నధ్యయనముఁ గావించినవానికి ధర్మజిజ్ఞాస గలుగుటకుఁ బూర్వమే బ్రహ్మజిజ్ఞాస గలుగుటకు సావకాశ ముండుటఁ జేసి ధర్మజిజ్ఞాసకుఁ గార్యమగు కర్మావబోధ మెంతమాత్రము బ్రహ్మజిజ్ఞాసకుఁ బూర్వవృత్తము కానేర దని యభిప్రాయము. అనఁగా "హృదయస్యాగ్రేఽవద్యతి, అథ జిహ్వాయాః, అథ వక్షస" యను వాక్యమున హృదయము మొదలుగాఁ గల పశుద్రవ్యముల యవదానమున నథశబ్దములచేఁ గ్రమనియమముకలన నానంతర్యనియమ మెట్లు గ్రహింపఁబడుచున్నదో యాతీరుననే ధర్మజిజ్ఞాసానంతరము బ్రహ్మజిజ్ఞాస యని "యథా చ హృదయాద్యవదానానామానంతర్యనియమః క్రమస్య వివక్షితత్వాత్త"ని మధ్యస్థుఁ డడుగ, నట్టిక్రమ మిచట నెంతమాత్రమును వివక్షింపఁబడలే దని

న్న తథేహ క్రమో వివక్షితః, శేషశేషిత్వేఽధికృతాధికారే వా ప్రమాణా - భావాత్, ధర్మబ్రహ్మజిజ్ఞాసయోః ఫలజిజ్ఞాస్యభేదాచ్చ ॥

---

"న తథేహ క్రమో వివక్షితః" యని సమాధానము చెప్పఁబడుచున్నది. క్రమవివక్ష లేకుండుటకుఁ గల కారణములు "శేషశేషిత్వే, అధికృతాధికారే వా, ప్రమాణాభావాద్ధర్మబ్రహ్మజిజ్ఞాసయోః" యను వాక్యముచేఁ జెప్పఁబడుచున్నది. దీని యభిప్రాయ మేమన, నొకపురుషునిచే రెండుకార్యము లొకదానివెనుక మఱియొకటి సక్రమముగా జరుపఁబడవలయు నను నియమముకు నే యంగీకరింపవలయు ననుచో నా రెండుకార్యములకును శేషశేషిత్వము గాని యధికృతాధికారము గాని యుండి తీరవలయును. అట్టి శేషశేషిత్వము గాని యధికృతాధికారము గాని ధర్మబ్రహ్మ జిజ్ఞాసల రెండిటికి నెంతమాత్ర మున్నట్లు ప్రమాణము లేకపోవుటంజేసి ధర్మజిజ్ఞాసానంతరము బ్రహ్మజిజ్ఞాసాప్రవృత్తి గలుగుననుట కెంతమాత్రము వీలు లే దని యభిప్రాయము. శేషశేషిత్వ మన సంగాంగిభావమని యర్థము. దర్శపూర్ణమాసేష్టులయందు నాగ్నేయాదియాగములు ప్రధానము లగుచు శేషి యనియు నంగి యనియుఁ జెప్పఁబడుచున్నవి. అందుఁ బ్రయాజ లను హోమము లాప్రధానయాగములకుఁ బూర్వాంగములుగను ననుయాజము లను హోమము లుత్తరాంగములుగను దెలియవచ్చుచున్నవి. అంగములతోఁ గూడిన ప్రధానయాగము ఫలము నొందించున దగుటఁజేసి యవియ్యవి నియత మగు క్రమమున నాచరింపఁబడవలయు నను నియమ మొకటి గలుగుచున్నది. అట్లు ధర్మబ్రహ్మజిజ్ఞాసలకు నంగాంగిభావము ను బోధించు ప్రమాణ మెచటను దెలియరాదు. ఇఁక నధికృతాధికార మన్ననో "అష్టవర్షం బ్రాహ్మణముపనయీత। తమధ్యాపయీత॥" యను విధివలన నెవ్వనికి నుపనయనమునం దధికారము గలదో యట్టివానికే యధ్యయనాధికారము గల దని యుపనయనమునం దధికృతునకే యధ్యయనమునం దధికారము తెలియవచ్చుభంగి ధర్మబ్రహ్మజిజ్ఞాసలకు నధికృతాధికారము దెలియకుండుటఁజేసి క్రమవర్తిత్వము చెప్పుటకు వీలు లేదు ఇట్లు క్రమవర్తిత్వబోధకము లగు విశేష హేతువులు ధర్మబ్రహ్మజిజ్ఞాసలకు లేవని చెప్పుటకుఁ బ్రమాణాభావమే గాక హేత్వంతరము గూడ "ఫలజిజ్ఞాస్యభేదాచ్చ" యను సంగ్రహవాక్యముచేఁ బ్రదర్శింపఁబడుచున్నది రెండుగ్రంథముల కెద్దియేని సంబంధ మున్నచో నా రెండుగ్రంథములు నొకేవిధమగు విషయప్రయోజనములను గలిగియుండవలయును అట్టిధర్మబ్రహ్మజిజ్ఞాసలకు విషయప్రయోజనములు రెండును సమానము లెంతమాత్రమును గాకపోవుట యటుండ నత్యంతవైలక్షణ్యముతో నొప్పుచున్న వని యీసంగ్రహవాక్య తాత్పర్యము. ఫల మనఁగాఁ బ్రయోజనము. జిజ్ఞాస్య మనఁగా విషయము.

అభ్యుదయఫలం ధర్మజ్ఞానం తచ్చానుష్ఠానాపేక్షమ్, నిఃశ్రేయసఫలం తు బ్రహ్మ-విజ్ఞానం న చానుష్ఠానాంతరాపేక్షమ్। భవ్యశ్చ ధర్మో జిజ్ఞాస్యో న జ్ఞానకాలేఽస్తి, పురుషవ్యాపారతంత్రత్వాత్। ఇహ తు భూతం బ్రహ్మ జిజ్ఞాస్యం నిత్యత్వాన్న పురుషవ్యాపారతంత్రమ్। చోదనాప్రవృత్తిభేదాచ్చ।

---

ధర్మబ్రహ్మజిజ్ఞాసలయందలి ఫలభేదము "అభ్యుదయఫలం ధర్మజ్ఞానం తచ్చానుష్ఠానాపేక్షం, నిశ్శ్రేయసఫలం తు బ్రహ్మవిజ్ఞానం, నచానుష్ఠానాన్తరాపే-క్షమ్మ్॥"ని వివరింపఁబడుచున్నది. అనఁగా ధర్మజిజ్ఞాసవలన ధర్మజ్ఞానము గల్గు, ననియు నయ్యది యభ్యుదయ మనఁగా స్వర్గాదికము ఫలముగాఁ గలిగిన దనియు నట్టిఫలము పురుషకర్తృక మగు కర్మానుష్ఠానము నపేక్షించు ననియు ననఁగాఁ గర్మానుష్ఠానముచే వేఱొకవిధమున నలవడ దనియు నభిప్రాయము. ఇఁక బ్రహ్మజిజ్ఞాసచేఁ గల్గు బ్రహ్మవిజ్ఞాన మన్ననో నిశ్శ్రేయస మనెడి మోక్షము ఫలముగాఁ గల్గినదియు జ్ఞానముకంటె భిన్న మగు ననుష్ఠానము నెంతమాత్ర మపేక్షింపనిదియుఁ గావున ధర్మబ్రహ్మజిజ్ఞాసల రెండిటికి ఫలమునందు భేదము గల దనియు నర్థము.

ఇఁక ధర్మబ్రహ్మజిజ్ఞాసలకుఁ గల జిజ్ఞాస్యభేద మనఁగా విషయభేదము. "భవ్యశ్చ ధర్మః...న పురుషవ్యాపారతంత్రమ్మ్"ని చెప్పఁబడుచున్నది. ధర్మజిజ్ఞాసయందుఁ దెలియవచ్చెడి విషయ మగు ధర్మము భవ్యము. అనఁగా సాధ్యము. అయ్యది జ్ఞానకాలమున ననఁగా నద్దానిని దెలిసికొనుసమయమున నెంతమాత్రమును స్థితిని గలిగియుండదు ఏలయన నయ్యది పురుషవ్యాపారముచే సాధింపఁబడఁదగినదియే పురుషవ్యాపారతంత్ర మనఁగాఁ బురుషవ్యాపారాధీనమే యని. ఇఁక బ్రహ్మజిజ్ఞాసయం దన్ననో జిజ్ఞాస్య మగు బ్రహ్మము భూతము. అనఁగా నిత్యము సిద్ధమును గావునఁ బురుషవ్యాపారతంత్ర మెంతమాత్రమును గాదు. అందుచేఁ గర్మబ్రహ్మజిజ్ఞాసలయం దత్యంత భేదము దెలియఁబడుచున్నది.

ఇట్లు ధర్మ బ్రహ్మజిజ్ఞాసల రెండిటికి ఫల జిజ్ఞాస్యభేద ముండుటంజేసి యీ రెండిటికిని శేషశేషిత్వము సంభవింపకపోవుటచే నయ్యవి యొకేపురుషునిచేఁ జేయఁదగినవి కావు. కనుక నవ్వానికిఁ గ్రమనియమ మెంతమాత్రము ఘటింపదు.

ధర్మ బ్రహ్మజిజ్ఞాసలకు సంబంధము, లేకపోవుటకు "చోదనాప్రవృత్తి-భేదాచ్చ" యని వేఱొక హేతువు సంగ్రహముగాఁ జెప్పఁబడుచున్నది. చోదన యనునది వైదికశబ్దము. ఇయ్యది ధర్మబోధకమనియు బ్రహ్మబోధక మనియును ద్వివిధము. ధర్మబోధకశబ్దమును వినునప్పుడు పురుషునికిఁ గల్గు ప్రవృత్తికిని బ్రహ్మబోధక శబ్దమును వినునప్పుడు పురుషునికిఁ గల్గు ప్రవృత్తికిని నత్యంతవైలక్షణ్య,ముండుటవలన ధర్మ బ్రహ్మజిజ్ఞాసలకు శేషశేషిత్వముగాని యధికృతాధి

ఉచ్యతే—నిత్యానిత్యవస్తువివేకః, ఇహాముత్రార్థభోగవిరాగః, శమదమాది-సాధనసంపత్. ముముక్షుత్వం చ। తేషు హి సత్సు ప్రాగపి ధర్మజిజ్ఞాసాయా ఊర్ధ్వం చ శక్యతే బ్రహ్మ జిజ్ఞాసితుం జ్ఞాతుం చ న విపర్యయే। తస్మాదథశబ్దేన యథోక్తసాధనసంపత్త్యానంతర్యముపదిశ్యతే।

---

వేపూర్వవృత్త ముండినచో బ్రహ్మజిజ్ఞాస గలుగు నని చెప్పఁబడునో యట్టిపూర్వవృత్త మెద్ది యని భావము. అట్టిసమర్థ మగు పూర్వవృత్తము "ఉచ్యతే—...న విపర్యయే" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది "నిత్యానిత్యవస్తువివేకః" నిత్యానిత్యయోః = నిత్యానిత్యములయందు, వర్తతే = ఉండునది, గాఁగ (వస్తు = ధర్మము) నిత్యానిత్యవస్తు = నిత్యానిత్యములయందలిధర్మము; ఆ నిత్యానిత్యములయొక్కయుఁ దద్ధర్మములయొక్కయు, వివేకః = విభాగజ్ఞానము. అనఁగా నిత్యానిత్యములయందలి ధర్మములయొక్క విభాగజ్ఞానము నిత్యానిత్యవస్తువివేక మనఁబడును. ఇహాముత్రార్థభోగవిరాగః. ఇహ = ఈలోకమందును, అముత్ర = స్వర్గాదులయందును, గల, అర్థ = ఫలములయొక్క, భోగ = అనుభవమందలి విరాగః = హేయభావము, అనఁగా నుపేక్షాబుద్ధి, శమాదిసాధనసంపత్— శమ = వశీకారము, అనఁగా మనోవిజయము. ఇచట నాదిశబ్దముచే దమము ఉపరతి తితిక్ష శ్రద్ధ మొదలుగాఁ గల ధర్మములు గ్రహింపఁబడవలయు నని "తస్మాచ్ఛాంతో దాంత ఉపరతస్తితిక్షుః శ్రద్ధావిత్తో భూత్వాఽఽత్మన్యేవాత్మానం పశ్యే"త్తను శ్రుతివలనఁ దెలియుచున్నది. సాధన = పైఁ జెప్పఁబడిన శమాదిసాధనములయొక్క, సంపత్ = ప్రకర్షము. ముముక్షుత్వం = జననమరణప్రవాహరూప మగు సంసారమునుండి విముక్తిని జెందఁ దీవ్రేచ్ఛను గలిగి యుండుట. నిత్యానిత్యవస్తువివేకాదు లవశ్యము బ్రహ్మజిజ్ఞాసకుఁ బూర్వవృత్తము లని యన్వయవ్యతిరేకముచే "తేషు చ సత్సు ప్రాగపి ధర్మజిజ్ఞాసాయా ఊర్ధ్వం చ శక్యతే బ్రహ్మ జిజ్ఞాసితుం జ్ఞాతుం చ న విపర్యయే" యని నిర్వచింపఁబడుచున్నది. వివేకాదిసాధనములు గలిగినచో ధర్మజిజ్ఞాసకుఁ బూర్వమందైనఁ బరమందైనను బ్రహ్మమును దెలిసికొనఁగోరుటకును దెలిసికొనుటకును గూడ నవకాశము గలుగుచున్నది. కాని యట్టి వివేకాదివిపర్యయమునం దెంతమాత్రము జిజ్ఞాస గలుగనేర దని యర్థము. ఇట్లు వివేకాదిసాధనసంపత్తి బ్రహ్మజిజ్ఞాసకుఁ బూర్వవృత్త మని నిరూపించి "తస్మాదథశబ్దేన యథోక్తసాధనసంపత్త్యానంతర్యముపదిశ్యతే" యని ప్రకృతము నుపసంహరించుచున్నారు. అనఁగా నథశబ్దముచే వివేకాదిసాధనసంపత్తియొక్క యానంతర మను నర్థము గ్రహింపఁబడుచున్న దని తాత్పర్యము.

'అతః' శబ్దో హేత్వర్థః, యస్మాద్వేద ఏవాగ్నిహోత్రాదీనాం శ్రేయఃసాధనానా-మనిత్యఫలతాం దర్శయతి— "తద్యథేహ కర్మచితో లోకః క్షీయత ఏవమేవా-ముత్ర పుణ్యచితో లోకః క్షీయతే" (ఛాందో 8. 1. 6.) ఇత్యాదిః। తథా బ్రహ్మ-విజ్ఞానాదపి పరం పురుషార్థం దర్శయతి— "బ్రహ్మవిదాప్నోతి పర"మిత్యాదిః।

---

ఇట్లు అథశబ్దముయొక్క అర్థమును ప్రదర్శించి క్రమప్రాప్తమగు అతః శబ్దముయొక్క యర్థమును ప్రదర్శించుచున్నారు- 'అతఃశబ్దో హేత్వర్థ' యని. అతః శబ్దార్థ మగు హేతువు "తద్యథేహ ఇత్యాది" యను భాష్యముచేఁ బ్రదర్శింపఁబడు చున్నది. ఇచట హేతుద్వయము ప్రదర్శింపఁబడుచున్నది అందు మొదటిహేతువు శ్రౌతస్మార్తాదికర్మఫలముయొక్క యనిత్యత్వ మనియు రెండవది బ్రహ్మవిజ్ఞానము పరమపురుషార్థసాధన మనియును అందు మొదటిది "యస్మాద్వేద ఏవ ... క్షీయతే ఇత్యాది" యను భాష్యముచే నిరూపింపఁబడుచున్నది. ఎట్లన— "తత్ = అచ్చోట, యథా = ఏప్రకారము, ఇహ = ఈలోకమునందు, కర్మణా చితః = కృష్యాది కర్మలచే సంపాదింపఁబడిన, లోకః = సస్యాదిభోగ్యజాతము, క్షీయతే = నశించు చున్నదో, ఏవమేవ = ఈప్రకారమే, పుణ్యచితః = పుణ్యముచే సంపాదింపఁబడిన, అముత్ర = భావిస్వర్గసంబంధ మగు, లోకః = భోగము, క్షీయతే = నశించును. అని.

ఇట్టిశ్రుతులచే శ్రేయస్సాధనముగా వేదముచే నుపదేశింపఁబడిన యగ్ని-హోత్రాదులకు ననిత్యఫలమే వేదముచేఁ జూపఁబడుచున్నది. అందుచే నగ్ని-హోత్రాది కర్మలవలనఁ గల్గు ఫల మనిత్య మని తెలియవచ్చుచున్నది. అగ్ని-హోత్రాదు లనుచో నాదిశబ్దముచే శ్రౌతస్మార్తకర్మలను మాత్రమే గాక యోగా-నుష్ఠానము దేవతోపాసనము మొదలుగాఁ గల కర్మవిశేషములన్నియు గ్రహింపఁ బడును.

ఇచట "ఇత్యాది" యనుచో నాదిశబ్దముచే "ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపా అష్టాదశోక్తమవరం యేషు కర్మ, ఏతచ్ఛ్రేయో యేఽభినందంతి మూఢా జరామృత్యుం పునరేవాపి యంతి" యను మొదలుగాఁ గల శ్రుతులు గ్రాహ్యములు.

ఇఁక రెండవకారణము "తథా బ్రహ్మవిజ్ఞానాదపి...ఫల మిత్యాది" యను భాష్యముచేఁ బ్రదర్శింపఁ బడుచున్నది. అనఁగా నగ్నిహోత్రాది కర్మల యొక్క ఫల మనిత్య మని యెల్లు చెప్పఁబడెనో యాతీరుననే "బ్రహ్మవిత్ = బ్రహ్మమును దెలిసికొనినవాఁడు, పరం = పర మగు బ్రహ్మమును, ఆప్నోతి = పొందుచున్నాఁడ"ను శ్రుతి మొదలుగాఁ గల శ్రుతులచే బ్రహ్మవిజ్ఞానమువలన పరమపురుషార్థము ప్రదర్శింపఁ బడుచున్న దని యర్థము. ఇచట "ఇత్యాదిః"

(తై. త్తి. 2. 1.) తస్మాద్యథోక్తసాధనసంపత్త్యనంతరం బ్రహ్మజిజ్ఞాసా కర్తవ్యా। బ్రహ్మణో జిజ్ఞాసా బ్రహ్మజిజ్ఞాసా।

అనుచో "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" "తరతి శోకమాత్మవిత్" మొదలుగాఁ గల శ్రుతులు గ్రాహ్యములు. వేదముచేతనే శ్రేయస్సాధనములుగా నుపదేశింపఁబడిన యగ్నిహోత్రాదులయొక్క ఫలము లనిత్యము లని, ప్రతిపాదింపఁబడుట వలనను బ్రహ్మవిజ్ఞానమే పరమపురుషార్థసాధన మని బోధింపఁబడుటవలనను నని 'అతః' శబ్దమున కర్థము. ఈ హేతువు కాకాక్షిన్యాయముచేనథశబ్దముచేసూచింపఁబడు పూర్వవృత్తమునకును, బ్రహ్మజిజ్ఞాసకును గూడ సంబంధించుచున్నది. ఎట్లన — వేదముచేఁ గర్మఫల మనిత్య మనియు బ్రహ్మవిజ్ఞాన ముత్కృష్టపురుషార్థహేతు వనియుఁ దెలియవచ్చుటచేఁ బూర్వోక్త మగు వివేకాదిసాధనసంపత్తి గలుగుట కెంతమాత్రము ప్రతిబంధము లేదని పూర్వప్రకృతముతో సంబంధము గలుగుచున్నది.

ఇఁక వివేకాదిసాధనసంపత్తు గలిగినవానికి బ్రహ్మజిజ్ఞాసయే గలుగునా? లేక వేఱొకజిజ్ఞాస గలుగునా? యను సందియము గలుగ బ్రహ్మజిజ్ఞాసయే గలుగు ననుట కీహేతువు బ్రహ్మజిజ్ఞాసతో సంబంధించుచున్నది. ఇట్టి హేతుద్వయవివక్షాసూచకముగ నతఃశబ్దార్థము "తస్మాద్యథోక్తసాధనసంపత్త్యనంతరం బ్రహ్మజిజ్ఞాసా కర్తవ్యా" యని నిర్వచింపఁబడుచున్నది. పుష్కల మగు కారణము వెంటనే తప్పక కార్యమును జనింపఁజేయును గావున కార్యోత్పత్తియొక్క యావశ్యకతను భాష్యకారులు 'కర్తవ్యా' యను పదముచే వ్యక్తీకరించుచున్నారు. అనఁగా సాధనచతుష్టయసంపత్తి గలిగినచోఁ దప్పక బ్రహ్మజ్ఞానేచ్ఛ జనించు నను నిశ్చయసూచక మీ 'కర్తవ్యా' యను పదము గాని వేఱొకవిధ్యర్థబోధక మెంతమాత్రము గాదు. దానంజేసి యిచట "కర్తవ్యా" యను పదమునకు "భవతి" యను లఁడర్థము నే గ్రహింపవలయును. అట్లు గాక 'కర్తవ్యా' యను పదమునకు విధ్యర్థమును గ్రహించినచో బ్రహ్మజిజ్ఞాస యధికార్య మను నర్థము గలుగును. అట్లు గలుగ నథశబ్దమున కధికారార్థమును గ్రహించు టసమంజసమే యగును. బ్రహ్మజిజ్ఞాస యనధికార్యము గావున నథశబ్దమున నారంభార్థమును గ్రహింపఁగూడ దని ప్రథమమున శాసించిన భాష్యకారు లిచట "కర్తవ్యా" యను పదమును విధ్యర్థమునందుఁ బ్రయోగించినచో నయ్యది పూర్వాపరసందర్భవిహీనమై స్వవచనవ్యాఘాతదోషముచే దూషిత మగును. కావున నీ 'కర్తవ్యా' పదము విధ్యర్థమున భాష్యకారులు గ్రహింపలేదని తప్పక గ్రహింపవలయును.

కావునఁ బురుషార్థమును బోధించు నాగమవాక్యములవలన యథోక్తసాధనసంపత్తును నద్దానివలన బ్రహ్మజిజ్ఞాసయును గలుగు నని సిద్ధ మగుచున్నది.

బ్రహ్మ చ వక్ష్యమాణలక్షణం "జన్మాద్యస్య యతః" ఇతి. అత ఏవ న బ్రహ్మశబ్దస్య జాత్యాద్యర్థాన్తరమాశంకితవ్యమ్। బ్రహ్మణ ఇతి కర్మణి షష్ఠీ న శేషే, జిజ్ఞాస్యాపేక్షత్వాజ్జిజ్ఞాసాయాః,

ఇట్లు అథ–అతః శబ్దములయొక్క వ్యాఖ్యానమును గావించి "బ్రహ్మణో జిజ్ఞాసా= బ్రహ్మజిజ్ఞాసా" యని బ్రహ్మజిజ్ఞాసాశబ్దమును వ్యాఖ్యానమును గావించు చున్నారు. ఇచట షష్ఠీసమాసము ప్రదర్శింపఁబడుటచే "బ్రహ్మణే + జిజ్ఞాసా = బ్రహ్మజిజ్ఞాసా" యను ప్రాచీనవృత్తికారులయొక్క చతుర్థీసమాసము నిరాకరింపఁ బడుచున్నది. ఎందుచే ననఁగా— బ్రహ్మణే + జిజ్ఞాసా" అను విగ్రహమున సమాసవిధాయకశాస్త్రము "చతుర్థీ తదర్థార్థబలిహితసుఖరక్షితైః" యను పాణిన్యను శాసన మని చెప్పితీరవలయును కాని యీ యనుశాసన మిచ్చోఁ బ్రవర్తించుట కవకాశము లేదు. అటఁ "తదర్థ" పదముచే బలిరక్షితగ్రహణము ననుసరించి ప్రకృతివికృతిరూప మగు తదర్థమును గ్రహించి "యూపాయ + దారు యూపదారు" "కుండలాయ + అష్టాపదం=కుండలాష్టాపదం" మున్నగునవియే గ్రహింపఁ బడును. ప్రకృత మన్ననో బ్రహ్మమునకు జిజ్ఞాసకును ప్రకృతివికృతిభావము లేకపోవుటచేనా యనుశాసన మిచట నెంతమాత్రమును ప్రవర్తింపనేరదు. ఆహేతువుచేతనే "అశ్వఘాసం" మున్నగురూపములు షష్ఠీసమాసములే గాని చతుర్థీసమాసము లెంతమాత్రము గావని నిర్వచింపఁబడినది.

బ్రహ్మశబ్దమునకు నానార్థములు దెలియవచ్చుటఁజేసి సూత్రమందలి బ్రహ్మశబ్దముచే నేయర్థమును గ్రహింపవలయు నను సంశయము గల్గుచున్నది. అట్టి సంశయనివృత్తికి సూత్రకారాభిమతబ్రహ్మలక్షణమును "బ్రహ్మ చ వక్ష్యమాణలక్షణమ్, జన్మాద్యస్య యత ఇతి" యని భాష్యకారులు నిర్వచించి యున్నారు. దానంజేసి బ్రహ్మశబ్దమునకు సూత్రకారాభిమతార్థము తక్క వేఱొకయర్థము నాశంకించుట కెంతమాత్ర మవకాశము లేదని "అత ఏవ న బ్రహ్మశబ్దస్య జాత్యాద్యర్థాన్తర మాశంకితవ్యమ్" అని చెప్పఁబడుచున్నది. జాత్యాద్యర్థాంతరము లనఁగా బ్రాహ్మణజాతి, జీవుఁడు, వేదము, హిరణ్యగర్భుఁడు, లోకము, విష్ణువు, శివుఁడు, గణపతి, నారాయణుఁడు మొదలుగాఁ గలవి. ఇచట "బ్రహ్మణ" యనునపుడు గ్రహింపఁబడిన షష్ఠీవిభక్తియొక్క యర్థము "బ్రహ్మణ ఇతి కర్మణి షష్ఠీ, న శేషే" యని చెప్పఁబడుచున్నది. వృత్త్యంతరమున నీషష్ఠి శేషలక్షణ మని చెప్పఁబడుటచే నయ్యది మాత్రము గాదని 'న శేషే' యనుదానిచే నిరసింపఁబడుచున్నది. అట్లు శేషషష్ఠి నిరసింపఁబడుటకుఁ గల హేతువు "జిజ్ఞాస్యాపేక్షత్వాజ్జిజ్ఞాసాయాః" యని చెప్పఁబడుచున్నది. జిజ్ఞాస యన జ్ఞానేచ్ఛ. అయ్యది యొకవిషయమును జిజ్ఞాస్యముగా నపేక్షించుఁ గావున నట్టిజిజ్ఞాస్య మెల్లప్పుడును

  

జిజ్ఞాస్యాంతరానిర్దేశాచ్చ । నను శేషషష్ఠీపరిగ్రహేఽపి బ్రహ్మణో జిజ్ఞాసాకర్మత్వం న విరుధ్యతే, సంబంధసామాన్యస్య విశేషనిష్ఠత్వాత్, ఏవమపి ప్రత్యక్షం బ్రహ్మణః కర్మత్వముత్సృజ్య సామాన్యద్వారేణ పరోక్షం కర్మత్వం కల్పయతో వ్యర్థః ప్రయాసః స్యాత్ । న వ్యర్థః, బ్రహ్మాశ్రితాశేషవిచారప్రతిజ్ఞానార్థత్వాదితి చేన్న, ప్రధానపరిగ్రహే తదపేక్షితానామర్థాక్షిప్తత్వాత్ । బ్రహ్మ హి జ్ఞానేనాప్తుమిష్టతమత్వాత్ప్రధానమ్ ।

---

గర్మమే యగును. కావున నిచటఁ గర్మార్థమందే షష్ఠిని గ్రహింపవలయు నని యభిప్రాయము. అట్టిజిజ్ఞాస్యము బ్రహ్మ యొక్కటియే గాక మఱి యెద్దియైనం గలదా యనిన నట్టిది దెలియఁబడ దని "జిజ్ఞాస్యాంతరానిర్దేశాచ్చ" యని చెప్పఁబడుచున్నది. జిజ్ఞాసకు బ్రహ్మమే జిజ్ఞాస్య మగుటచేతను దానికంటె వేఱొక జిజ్ఞాస్యము నిర్దేశింపఁబడకపోవుటచేతను నిచట షష్ఠిఁ గర్మార్థమునే గ్రహింపవలయు నని తాత్పర్యము.

శేషషష్ఠీవాది గూఢాభిసంధిపురస్సరంబుగ "నను శేషషష్ఠీపరిగ్రహేఽపి ...విశేషనిష్ఠత్వాత్త్" ని ప్రశ్నించుచున్నాఁడు. సంబంధసామాన్య మభిప్రేత మగుచో నాసామాన్యముతో సంబంధించిన విశేషము గూడఁ బరిగణింపఁబడవలసి వచ్చుటచే బ్రహ్మమునకుఁ గూడ జిజ్ఞాసాకర్మత్వము కలుగును. కావున శేషషష్ఠిని గ్రహించినప్పుడు విరోధ మొంతమాత్రము సంభవింప నేరదే యన నందులకు సమాధానము "ఏవమపి...వ్యర్థః ప్రయాసః స్యాత్త్"ని చెప్పఁబడుచున్నది. అనఁగా బ్రహ్మమునకుఁ బ్రత్యక్షముగ సంభవించు కర్మభావమును విడిచి సామాన్య ద్వారముచేఁ బరోక్షముగాఁ గర్మత్వమును గల్పించుట వ్యర్థమగు ప్రయాస మగు నని భావము. అంత శేషషష్ఠీవాది 'యయ్యది యొంతమాత్రము వ్యర్థము గాదు. బ్రహ్మముతో సంబంధించిన యశేషవిచారమును బ్రతిజ్ఞచేసిన ఫలము గల్గునే' యని "న వ్యర్థః, బ్రహ్మాశ్రితాశేషవిచారప్రతిజ్ఞానార్థత్వాత్త్"ను భాష్యముచేఁ బలుక, నయ్యది యసమంజస మని భాష్యకారులు "ఇతి చేత్, న" యని నిరసించుచున్నారు. నిరసనమునకుఁగల హేతువు "ప్రధానపరిగ్రహే తదపేక్షితానామర్థాక్షిప్తత్వాత్త్"ను సంగ్రహవాక్యముచేఁ జెప్పఁబడుచున్నది. అనఁగాఁ బ్రధానమును స్వీకరించినపు డద్దానిచే నపేక్షింపఁబడు సామాన్యవిషయము లన్నియు నర్థలభ్యము లగును. కావున సామాన్యమాత్రమును గ్రహించి విశేషము నర్థలభ్యముగాఁ గొనుట వ్యర్థమగు ప్రయాసమే యగు నని యభిప్రాయము. ఇట్టియభిప్రాయము సువ్యక్తము గాఁగ సంగ్రహవాక్యము "బ్రహ్మ హి...గమయముక్తం భవతి తద్వృత్త్"ను భాష్యముచే వివరింపఁబడుచున్నది. జ్ఞానముచేఁ బొందఁబడుటకు నభిలషింపఁబడు నది బ్రహ్మమే యగుటం జేసి యయ్యదియే ప్రధానము. అట్టి ప్రధాన వ[illegible]



తస్మిన్ప్రధానే జిజ్ఞాసాకర్మణి పరిగృహీతే యైర్జిజ్ఞాసితైర్వినా బ్రహ్మజిజ్ఞాసితం న భవతి తాన్యర్థాక్షిప్తాన్యేవేతి న పృథక్సూత్రయితవ్యాని। యథా రాజాఽసౌ గచ్ఛతీత్యుక్తే సపరివారస్య రాజ్ఞో గమనముక్తం భవతి తద్వత్। శ్రుత్యనుగమాచ్చ। "యతో వా ఇమాని భూతాని జాయన్తే" (తైత్తి. 3-1) ఇత్యాద్యాః శ్రుతయః,

మును జిజ్ఞాసకుఁ గర్మగాఁ గ్రహించిన, నేసామాన్యములు జిజ్ఞాసచేయఁబడకుండ బ్రహ్మము జిజ్ఞాసచేయఁబడదో యట్టిసామాన్యము లన్నియు నర్థలబ్ధములే యగును కావున నవ్వానిని వేఱుగా నిర్వచింపనవసరము లేదు. 'మహారాజు వెళ్ళుచున్నాఁ డ'ని పలుకఁ 'బరివారముతోఁ గూడిన మహారాజు వెడలుచున్నాఁ డ'ని చెప్పుట యుచిత మగున ట్లియ్యదియు సమంజసమే యగును. కావునఁ గర్మార్థమందు షష్ఠిని గ్రహించిన నశేషవిచారమును బ్రతిజ్ఞచేయఁబడినదియే యగు నని భావము.

ప్రకృతమున శేషషష్ఠిని గ్రహించినచో సామాన్యము, సామాన్యముచే నపేక్షింపఁబడు విశేషమును నభిప్రేతము లగుచున్నవి. కర్మార్థమునందు షష్ఠిని గ్రహించినచోఁ బ్రధానముచే నర్థలబ్ధ మగు సామాన్యమును నభిప్రేతము లగుచున్నవి. ఇట్లుభయపక్షములందును బ్రహ్మతో సంబంధించిన యశేషవిచారము ప్రతిజ్ఞచేయఁబడినదే యగుచుండ శేషషష్ఠిని నిరసించుటకును గర్మషష్ఠిని గ్రహించుటకునుగల యభినివేశ మెందులకనినఁ గర్మషష్ఠియే శ్రుతిసమ్మతమని "శ్రుత్యనుగమాచ్చ" యను ప్రబలహేతువు నిరూపింపఁబడుచున్నది. ఈజిజ్ఞాసాసూత్రమే శ్రుత్యర్థమును బ్రదర్శించుటకు సూత్రకారులచేఁ బ్రదర్శింపఁబడెనో యాశ్రుత్యర్థము ననుసరించినచోఁ గర్మషష్ఠియే చేకొనవలయు నని యభిప్రాయము. అట్లు కర్మషష్ఠిని గ్రహించినపుడే శ్రుతిసూత్రముల కైకరూప్యము దెలియఁబడి సూత్రమునకుఁ బ్రమాణభావము ఘటించును. అట్లు శ్రుతిసూత్రముల కైకరూప్యము ఘటింపక పోయినచో నాసూత్రము శ్రుతివిరుద్ధ మగు స్మృతి యగుటంజేసి యనపేక్ష మగును. కావున సూత్రములయొక్క ప్రమాణనిర్వహణమునకు నాసూత్రముచే సూచింపఁబడిన శ్రుతి సర్వవిధముల మున్ముందు నిరూపింపఁబడవలయు నను నాశయముతో నీసంగ్రహవాక్యము చెప్పఁబడినది. అట్లైనచో నీజిజ్ఞాసాసూత్రముచే నేశ్రుతిని సూత్రకారులు వివక్షించియుండి రన- "యతో వా ఇమాని భూతాని జాయంతే" ఇత్యాద్యాః శ్రుతయః, 'తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మ' ఇతి ప్రత్యక్షమేవ బ్రహ్మణః జిజ్ఞాసాకర్మత్వం దర్శయంతి" యని నిర్వచింపఁబడుచున్నది. ఇచట "ఇత్యాద్యాః శ్రుతయ" యనుచో "యేన జాతాని జీవంతి," "యత్ప్రయంత్యభిసంవిశంతీతి" అను శ్రుతివాక్యము లని యభిప్రాయము. ఏల యన "తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మ" యను వాక్యముతో, "యతో వా ఇమాని భూతాని జాయన్తే" "యేన జాతాని జీవంతి" "యత్ప్రయంత్యభిసంవిశంతీతి" యను నీమూఁడుశ్రుతులే

"తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మ" ఇతి ప్రత్యక్షమేవ బ్రహ్మణో జిజ్ఞాసాకర్మత్వం దర్శయన్తి। తచ్చ కర్మణిషష్ఠీపరిగ్రహే సూత్రేణానుగతం భవతి। తస్మాద్బ్రహ్మణ ఇతి కర్మణిషష్ఠీ, జ్ఞాతుమిచ్ఛా జిజ్ఞాసా, అవగతిపర్యన్తం జ్ఞానం సన్వాచ్యాయా ఇచ్ఛాయాః కర్మ, ఫలవిషయత్వాదిచ్ఛాయాః।

---

సంబంధించియుండుటచే నిచట వేఱొకశ్రుతి కెంతమాత్రమవకాశము లేదు. కావున నీజిజ్ఞాసాసూత్రమునకు మూలభూత మగు శ్రుతి "తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మ" యనునది యనియు, నద్దానియందుఁ దచ్ఛబ్దముచే గ్రహింపఁబడు బ్రహ్మము "విజిజ్ఞాసస్వ" అను క్రియకుఁ గర్మగాఁ దెలియఁబడుటచే నిచట షష్ఠి కర్మార్థకముగా గ్రహింపఁబడినపుడే శ్రుతిసూత్రముల కైకరూప్యము సిద్ధ మగుచున్న దనియు "తచ్చ కర్మణిషష్ఠీపరిగ్రహే సూత్రేణానుగతం భవతి" యని భాష్యకారులు ప్రదర్శించుచున్నారు. ఇట్లు శ్రుతిసూత్రములయొక్క యైకరూప్యము నాధారముగాఁ జేసికొని ప్రకృతమును "తస్మాద్బ్రహ్మణ ఇతి కర్మణి షష్ఠీ" యని యుప సంహరించుచున్నారు.

ఇట్లు షష్ఠ్యర్థనిర్వచనము చేసి జిజ్ఞాసాపదముయొక్క యవయవార్థమును "జ్ఞాతుమిచ్ఛా = జిజ్ఞాసా" యని నిర్వచించుచున్నారు. ఇచట జిజ్ఞాస యనఁగాఁ దెలిసికొనుటకు నిచ్ఛ యని యర్థము. ఇచట నిచ్ఛ యను నర్థమును ముఖ్యముగాఁ దలంచుటచేతనే భాష్యకారు లితఃపూర్వము "బ్రహ్మజిజ్ఞాసాయా అనధికార్యత్వాత్తే"ని నిర్వచించియున్నారు. కావున "తస్మాదథోక్తసాధనసంపత్త్యనంతరం బ్రహ్మజిజ్ఞాసా కర్తవ్యా" యనుచో "కర్తవ్యా" యను పదము గూడ నధికారార్థ మెంతమాత్రము గాదనియు దానంజేసి విధ్యర్థ మెంతమాత్రమును గాక "భవతి" యను లడర్థమాత్రమునే సూచించుచున్న దనియుఁ దెలియవలయును. కావున నిచటఁ దవ్యప్రత్యయమునకు లిఙర్థ మత్యంత ముపేక్షచేయఁబడినట్లు సువ్యక్త మగుచున్నది.

ఇచట 'జిజ్ఞాసా' శబ్దమునందు 'జ్ఞా' యను ధాతువు ప్రకృతి యనియు, సన్ననునది ప్రత్యయ మనియుఁ దెలియుచున్నది. 'జ్ఞా' ధాతువున కవబోధమును, సన్ప్రత్యయమున కిచ్ఛయును నర్థ మగుటంజేసి "జిజ్ఞాసా" శబ్దమునకు 'జ్ఞాతుమిచ్ఛా' యను నర్థము నిర్వచింపఁబడెను. ఫలాభిసంధి లేని యిచ్ఛ యప్రసిద్ధము గావున నిచట సన్ప్రత్యయవాచ్య మగు నిచ్ఛకు నేమి ఫలము విషయమై యుండు నన నయ్యది ప్రకృత్యర్థ మగు నవబోధమే యని సువ్యక్త మగుచున్నది. ఇట్టియవబోధ మిచట నవగతి యని చెప్పఁబడుచున్నది. ఈయవగతిరూప మగు జ్ఞానమే యిచ్ఛకు విషయ మని సహేతుకముగ "అవగతిపర్యంతం జ్ఞానం సన్వాచ్యాయా ఇచ్ఛాయాః కర్మ, ఫలవిషయత్వాదిచ్ఛాయా" యను భాష్యముచే

జ్ఞానేన హి ప్రమాణేనావగంతుమిష్టం బ్రహ్మ । బ్రహ్మావగతిర్హి పురుషార్థః, నిశ్శేషసంసారబీజావిద్యాద్యనర్థనిబర్హణాత్। తస్మాద్బ్రహ్మ విజిజ్ఞాసితవ్యమ్। ।

---

[illegible] 'అవగతి' యన నపరోక్షానుభవము. జ్ఞాన మన్ననో యనుభవాత్మక మగు పరోక్షమునకుం గూడ వర్తించును. ప్రకృతమున నవగతిపర్యంత మగు జ్ఞాన మిచ్చటి కర్మ, యనఁగా విషయ మని చెప్పఁబడు చున్నది. [illegible] యన నిం దుపదేశింపఁబడు బ్రహ్మము, జ్ఞాన మను ప్రమాణముచేతనే తెలిసికొనఁబడుట కభిలషింపఁబడుచున్న దని "జ్ఞానేనైవ హి ప్రమాణే-నావగంతుమిష్టం బ్రహ్మ" యని నిర్వచింపఁబడుచున్నది. బ్రహ్మమునే యెందులకుఁ దెలిసికొనవలయు నన బ్రహ్మావగతియే పరమపురుషార్థ మని "బ్రహ్మావగతిర్హి పురుషార్థః" యని చెప్పఁబడుచున్నది. బ్రహ్మావగతియే పరమపురుషార్థ మనుటకుఁ గారణము "నిశ్శేషసంసారబీజావిద్యాద్యనర్థనిబర్హణాత్త" ని చెప్పఁబడుచున్నది. అనఁగా సంసారమునకుఁ గారణభూత మగు నవిద్య మొదలుగాఁ గల యనర్థమును బుష్కలముగఁ దొలఁగించుటచే ననఁగా బ్రహ్మసాక్షాత్కారముచే ననర్థహేతు వగు నవిద్యాదులు పుష్కలముగాఁ దొలఁగు నని యభిప్రాయము. 'అవిద్యాది' యనుచో నాదిశబ్దముచే, నస్మిత, రాగము, ద్వేషము, అభినివేశ మనునవి గ్రాహ్యములు ఇచట బ్రహ్మావగతికిఁ బరమప్రమాణము జ్ఞానమే యని "జ్ఞానేన హి ప్రమాణేన" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. ఇయ్యది యపరోక్ష జ్ఞాన మనియు నపరోక్షానుభవ మనియుఁ జెప్పఁబడుచున్నది. ఇట్టిజ్ఞానమునకుఁ దగు సాధనములు ముందుఁ జెప్పఁబడుచున్నవి.

ఇట్లు సూత్రమందలిపదములకుఁ బ్రత్యేకప్రత్యేకముగా వ్యాఖ్యానముచేసి సూత్రార్థము "తస్మాద్బ్రహ్మ విజిజ్ఞాసితవ్యమ్మ"ని యుపసంహరించుచున్నారు. అనఁగాఁ బరమపురుషార్థసాధన మగు బ్రహ్మజ్ఞానేచ్ఛ జనింప నట్టి బ్రహ్మము జ్ఞాన మనెడి ప్రమాణముచేతనే తెలియఁబడునది యగుటంజేసి యట్టిజ్ఞానమును జిజ్ఞాసువు సర్వవిధములఁ బడయుటకు జ్ఞానసాధనముల నన్వేషింపవలయు నని పరమతాత్పర్యము. జ్ఞానసాధన మన్ననో "పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేన । తద్విజ్ఞానార్థం స గురుమే-వాభిగచ్ఛేత్సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్"॥ "తద్విద్ధి ప్రణిపాతేన పరి-ప్రశ్నేన సేవయా" యను శ్రుతిస్మృతులచే జ్ఞానసాధనములుగ నుపదేశింపఁ బడిన గురూపసదనమును జేయవలయు నని తెలియవచ్చుచున్నది. గురూప సదనము చేసి యేమి చేయవలయు నన "ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో. మంతవ్యో నిదిధ్యాసితవ్య" యను విధిచే నాత్మసాక్షాత్కారము నుద్దేశించి విధింపఁబడిన శ్రవణమును మననమును నిదిధ్యాసనమును జేయవలయు నని

తెలియవచ్చుచున్నది. ఇచట శ్రవణ మనఁగా, వేదాంత వాక్యముల యొక్క యర్థమును వినుట యని యర్థము వేదాంతవాక్యములయొక్క యర్థమన్ననో యీ వేదాంతమీమాంసయందు నప్రతిహతముగ వివరింపఁబడుచుండెను యీ గ్రంథమునందుఁ బొందికచేయఁబడిన యర్థముతో వేదాంతములయొక్క యర్థమును గురుముఖమున శ్రవణముచేయవలయు నని యభిప్రాయము. అట్టి శ్రవణముచే బ్రహ్మావగతి గల్గినచో నట్టివాఁడు ధన్యుఁడే యగును. అట్లుగలుగనిచో 'మంతవ్యః' మననముఁ గావింపవలయును. మనన మనఁగా గురుముఖమున వినినయర్థమును యుక్తులతోఁ బొందిక చేసికొని వాక్యార్థమును విచారించుకొనుట. అట్టిమననముచేఁ గూడ బ్రహ్మావగతి గలుగనిచో "నిదిధ్యాసితవ్యః" నిశ్చయముగ ధ్యానముచేయవలయును. ఇట్లు శ్రవణ మనన నిదిధ్యాసనరూపసాధనముల నవలంబించుటచే బ్రహ్మసాక్షాత్కారము గలుగును. కావున బ్రహ్మజ్ఞానేచ్ఛతో గురూపసదనపూర్వకముగ వేదాంతవాక్యార్థమును వినవలయు నని జిజ్ఞాసాసూత్రము యొక్క యర్థాధికారము.

ఇది యిట్లుండ నీ 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' యను సూత్రమునకు "ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్య" యను శ్రుతి మూలభూత మనియు నా శ్రుతితో సమాన మగు నర్థము నీసూత్రమునకుఁ జెప్పుటకు 'కర్తవ్యా' యను పదము సూత్రమందు నధ్యాహారము చేయవలయు ననియుఁ గొందఱును, నిట్టియాశయముతోడనే భాష్యకారులచే "తస్మాద్యథోక్తసాధనసంపత్త్యనంతరం బ్రహ్మజిజ్ఞాసా కర్తవ్యా" యను భాష్యమందలి "కర్తవ్యా" పదము ప్రయోగింపఁబడిన దని కొందఱును విశేషకథనమును గావించి సూత్రార్థమునఁ బలువిధములగు వ్యాఖ్యానములను గావించియున్నారు. ఎట్లనఁ బంచపాదికావివరణమున —

"అమృతత్వసాధనమాత్మదర్శనం 'ద్రష్టవ్య' ఇత్యనూద్య తాదర్థ్యేన మనననిదిధ్యాసనాభ్యాం ఫలోపకార్యంగాభ్యాం సహ శ్రవణం నామాంగి విధీయతే ఇతి" "తత్ర — భగవాన్ బాదరాయణః సాధనచతుష్టయసంపన్నస్య మోక్షసాధనబ్రహ్మజ్ఞానాయ వేదాంతవాక్యవిచారం విదధతో విధేరపేక్షితాధికారవిషయఫలానుబంధత్రయమాగమికమపి న్యాయేన నిర్ణేతుం సూత్రయామాస అథాతో బ్రహ్మజిజ్ఞాసేతి శ్రుతిసూత్రయోరేకరూప్యావగమాత్। మనననిదిధ్యాసనయోశ్చ శ్రవణాంగత్వముత్తరత్ర వక్ష్యామః ఇతి"

"తత్ర అథాతో బ్రహ్మజిజ్ఞాసేతి సూత్రే ఽనువాదపరిహారాయ శాస్త్రీపురుషప్రవృత్తిసిద్ధయే చ కర్తవ్యేతి పదమధ్యాహర్తవ్యమ్। తత్ర జిజ్ఞాసాపదేనాంతర్ణీయతం విచారము ఫలజ్ఞానుష్ఠానయోగ్యతయా సాధనచతుష్టయసంపన్నస్య బ్రహ్మజ్ఞానాయ విచారః కర్తవ్య ఇతి సూత్రవాక్యస్య శ్రౌతోఽర్థః సంపద్యతే।"

యనియు, రత్నప్రభయందు—

"ఇహ ఖలు స్వాధ్యాయోఽధ్యేతవ్యః ఇతి నిత్యాధ్యయనవిధినాఽధీత-సాంగస్వాధ్యాయే "తద్విజిజ్ఞాసస్వ" సోఽన్వేష్టవ్యః" "స విజిజ్ఞాసితవ్యః" "ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యః" ఇతి శ్రవణవిధిరుపలభ్యతే। — తత్ర కశ్చిదిహాజన్మని జన్మాంతరే వాఽనుష్ఠితయజ్ఞాదిభిర్నితాంతవిమలస్వాంతోఽస్య శ్రవణవిధేః కో విషయః? కిం ఫలం ? కోఽధికారీ ? కః సంబంధః ? ఇతి జిజ్ఞాసతే। తం జిజ్ఞాసుముపలభమానః భగవాన్ బాదరాయణస్తదనుబంధచతుష్టయం శ్రవణాత్మకశాస్త్రారంభప్రయోజకం న్యాయేన నిర్ణేతుమిదం సూత్రం రచయాంచకార "అథాతో బ్రహ్మజిజ్ఞాసేతి"

"అత్ర శ్రవణవిధిసమానార్థత్వాయ కర్తవ్యేతి ప్రదమధ్యాహర్తవ్యమ్। అధ్యాహృతం చ భాష్యకృతా। బ్రహ్మజిజ్ఞాసా కర్తవ్యేతి। తత్ర ప్రకృతిప్రత్యయార్థయోః జ్ఞానేచ్ఛయోః కర్తవ్యత్వాసన్వయాత్ ప్రకృత్యా ఫలీభూతం జ్ఞానమజహల్లక్షణయోచ్యతే। ప్రత్యయేనేచ్ఛాసాధ్యో విచారః జహల్లక్షణయా, తథా చ బ్రహ్మజ్ఞానాయ విచారః కర్తవ్య ఇతి సూత్రస్య శ్రౌతోఽర్థస్సంపద్యతే" యనియును.

భాష్యకారులనిర్వచనమును లెస్సఁగాఁ బరిశీలించినచో నీశ్రవణవిధికిని జిజ్ఞాసాసూత్రమునకు నైకరూప్యసంబంధ మెంతమాత్ర మున్నట్లు చెప్పుట కవకాశము లేదు. ఏలయన- "బ్రహ్మణః + జిజ్ఞాసా = బ్రహ్మజిజ్ఞాసా" యనుచోఁ గర్మషష్ఠిని నిరూపించుటకు "శ్రుత్యనుగమాచ్చ" యను హేతువు భాష్యకారులచేఁ బ్రదర్శింపఁబడినది. అట్టి హేతువుయొక్క వివృతి "యతో వా ఇమాని భూతాని జాయంతే" ఇత్యాద్యాః శ్రుతయః "తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మ" ఇతి ప్రత్యక్షమేవ బ్రహ్మణో జిజ్ఞాసాకర్మత్వం దర్శయంతి। తచ్చ కర్మణిషష్ఠీపరిగ్రహే సూత్రేణానుగతం భవతి" యని చేయఁబడినది. దీనిఁబట్టి తైత్తిరీయోపనిషత్తునందలి భృగువల్లియందు వినవచ్చెడి "తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మ" యను శ్రుతి యీసూత్రమునకు మూలభూత మని సుస్పష్టముగాఁ దెలియవచ్చెడిని.

ఇఁక భాష్యకారులు ప్రథమమున "బ్రహ్మజిజ్ఞాసాయాః అనధికార్యత్వాత్త"ని నిర్వచించి పిమ్మట "తస్మాత్ యథోక్తసాధనసంపత్త్యనన్తరం బ్రహ్మజిజ్ఞాసా కర్తవ్యా" యనుచోటఁ 'కర్తవ్యా' యను పదము నొకదానిఁ బ్రయోగించియున్నారు. కాని యద్దానియర్థమును గాని యద్దానివలనఁ గలుగునని వ్యాఖ్యాతలు గ్రహించిన జహదజహల్లక్షణాదులచే నర్థగ్రహణమును గాని గావించియుండలేదు. 'కర్తవ్యా' యను పదము మాత్రము భాష్యకారులచేఁ బ్రయోగింపఁబడినది. కాని యయ్యది యేకారణముచే నెట్టియర్థమునందుఁ బ్రయోగింపఁబడెనో

యయ్యది నిర్వచింపఁబడక యుపేక్ష చేయఁబడెను.

ఇఁక సూత్రార్థమును నిర్వచించుటలో భాష్యకారులు 'బ్రహ్మజిజ్ఞాసా' యను పదమునుండి జిజ్ఞాసాపదమును వేఱుఁజేసి యద్దానితోఁ దవ్యప్రత్యయమును జేర్చి, "తస్మాత్ బ్రహ్మ జిజ్ఞాసితవ్యమ్" అని నిర్వచించియున్నారు. కావున నీ తవ్యప్రత్యయార్థమును సూచింపఁ 'కర్తవ్యా' యను పదమును బ్రయోగించి రని యూహింపనోపు. దానంజేసి "బ్రహ్మజిజ్ఞాసా కర్తవ్యా, బ్రహ్మ జిజ్ఞాసితవ్య" మ్మని యర్థమును బ్రతిపాదించినట్లుసువ్యక్తమగుచున్నది. "బ్రహ్మ జిజ్ఞాసితవ్యమ్మ"న "బ్రహ్మ విజిజ్ఞాసస్వ" యనుటయే. దీనిఁబట్టి యీసూత్రమునకు "బ్రహ్మజిజ్ఞాసస్వ" యను శ్రుతియే మూలభూత మని సర్వవిధములఁ దెలియవచ్చుచున్నది. ఇయ్యది భాష్యకారాశయము.

సూత్రకారులన్ననో యిందులకు భిన్నముగా నున్నట్లు వివరణకారునిచే వ్యాఖ్యానముచేయఁబడియున్నట్లు స్పష్టమే గదా! వివరణకారుఁడు శ్రవణవిధితో నీసూత్రమునకు సంబంధ ముండుటచే "శ్రుతిసూత్రయోరైకరూప్యావగమాత్ = శ్రుతిసూత్రముల యైకరూప్యము సిద్ధించుచున్న దని పలికియున్నాఁడు. వివరణ కారాభిమత మగు శ్రవణవిధి "ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో నిదిధ్యాసితవ్య" యనిగదా! ప్రకృతపుజిజ్ఞాసాసూత్రమున 'శ్రు'ధాతువు గాని యాత్మ శబ్దము గాని యున్నట్లెక్కడిని గన్పట్టదుగదా! ఇట్టిస్థితియందు జిజ్ఞాసాసూత్రమునకును శ్రవణవిధికిని గల యైకరూప్యము వివరణకారదృష్టికే భాసింపవలయును గాని వేఱొకరికి భాసించుట కవకాశము లేదు.

ఇఁక భృగువల్లియందు వినవచ్చెడి "తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మ" యను వాక్యమును, నాలుగుసారు లుచ్చరింపఁబడిన "తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ" యను ననువాదమును బ్రకృతపువేదవ్యాసస్మృతి యగు "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యను సూత్రమునకు మూలభూత మని చెప్పిన నయ్యది సర్వవిధముల నప్రతిహతముగ నుండుట కించుకేనియు సందేహము లేదు. దీనివలననే యీశ్రుతికిని సూత్రమునకును నైకరూప్యనియమము సర్వవిధముల సమంజస మగుచున్నది. కావున నీవివరణకారునియొక్క యపూర్వకల్పనము శ్రుతిసూత్రభాష్యముల మూఁడిటికి నత్యంతవిరుద్ధ మగుటంజేసి సర్వవిధముల హేయ మని తెల్లమయ్యెడిని. దానంజేసి యీవివరణకారకల్పనము నంధగోలాంగూలన్యాయమునఁ జేకొని బయలువెడలిన యపూర్వవ్యాఖ్యానములు గూడఁ గువ్యాఖ్యలే యగుటంజేసి యయ్యవియు హేయములే యగుచున్నవి.

అట్టికువ్యాఖ్యానప్రశంస యటుంచి సూత్రకారాశయ మొకింత ప్రదర్శింపఁబడుచున్నది.

సూత్రకారులు సకలశ్రుతిశిరోభూతంబగు "బ్రహ్మవిదాప్నోతి పరం" "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" యను శ్రుతులచేఁ బరమపురుషార్థసాధనముగా నుపదేశింపఁబడిన బ్రహ్మజ్ఞానము బ్రహ్మజిజ్ఞాసాయత్తమని "తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ" యను ననువాదముతోఁ గూడిన "తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మ" యను వాక్యమునందుఁ దెలిసికొనిరి. తరువాత నట్టి జిజ్ఞాస యెట్లైనను జనింపదా యను సందేహము గలుగుటయే గాక జైమినీయతంత్రముల చేతను సాంఖ్యాదితంత్రముల చేతను బ్రదర్శింపఁబడిన యర్థవిశేషముల చేత నట్టిజిజ్ఞాస గలుగుటకు నవకాశము లేదను పూర్వపక్షము గలుగఁగా నెల్లరకును సామాన్యముగా బ్రహ్మజ్ఞానేచ్ఛ గలుగుట కవకాశము లేకపోయినను వివేకాదిసాధనసంపత్తిగలిగినవానికిఁ దప్పక బ్రహ్మజ్ఞానేచ్ఛ జనించు నను గొప్పయాశయముతో "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యను సూత్రమును స్మరించిరి. ఇట్లు స్మరించుటలో బ్రహ్మజ్ఞానేచ్ఛ గలుగుటకుఁ దగు విషయప్రయోజనములఁ గూడ నసూత్రమున స్మరించిరి. ఈసూత్రముచే సువ్యక్తమగు విషయప్రయోజనములు రెండును బ్రహ్మమే యని పూర్వోదాహృతశ్రుతులవలనఁ దెలియుచున్నది. ఇట్లు సూత్రమును రచించుటలో "బ్రహ్మ విజిజ్ఞాసస్వ" యను వాక్యమందలి 'విజిజ్ఞాసస్వ' యను పదముయొక్క 'లోట్' ప్రత్యయమును ద్రోసి ప్రకృతిశబ్దమగు జిజ్ఞాసాపదమును వాక్యమందలి 'విజిజ్ఞాసస్వ' యను బ్రహ్మపదముతోఁ బొందికచేసి "బ్రహ్మజిజ్ఞాసా" యనునపదమును సూత్రమున బ్రయోగించియున్నారు. ఇట్లువిధ్యర్థబోధకమగు లోట్ప్రత్యయమును నత్యంతమును నిరాకరించుటయందు సూత్రకారాశయ మేమై యుండును? జిజ్ఞాస్యమగు బ్రహ్మము విధిలో విషయము గాదనియా లేక బ్రహ్మమునందు విధి సంభవింపదనియా? యనినచో బ్రహ్మము సిద్ధవస్తు వగుచుఁ గర్మమువలె సాధ్యము గాకపోవుటచే విధిరహితమాత్రము సంభవింపదనియు శ్రుతియందుఁగూడ 'విజిజ్ఞాసస్వ' యనునదియపూర్వార్థబోధకము నగు విధి యెంతమాత్రము గాదని దెలియవచ్చుటఁజేసియు విధిబోధకప్రత్యయము నిషేధించఁబడినట్లు నిశ్చయింపనోపు. ఈ "బ్రహ్మ విజిజ్ఞాసస్వ" యను ప్రకరణసందర్భమును బట్టిన నీ "విజిజ్ఞాసస్వ" యనునది యపూర్వార్థబోధక మెంతమాత్రము గాదని సుస్పష్టమగును. ఇటఁ బ్రకరణసందర్భమేమన వరుణపుత్రుఁడగు భృగువు తండ్రి యగు వరుణుని నుపసదనవిధిఁజేరఁబోయి ("అధీహి భగవో బ్రహ్మ") బ్రహ్మమును దెలియఁజెప్పు మని యడుగనా వరుణుఁడు "యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి, యత్ప్రయంత్యభిసంవిశంతి, తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మ" యని పలికియున్నాఁడు. కావున గురువువలన నిదివఱకుఁ దెలిసికొన నిచ్ఛయింపఁబడిన బ్రహ్మమే "తద్విజిజ్ఞాసస్వ" "తద్బ్రహ్మ" యని యుపదేశింపఁబడుటచే నీవాక్యముచే నపూర్వ

మగు బ్రహ్మము విధింపబడిన నెంతమాత్రము చెప్పుచున్నాడు. ఇట్లే యా భృగు వల్లియందు వినఁబడెడి 'బ్రహ్మ విజిజ్ఞాసస్వ' యను పదము లన్నియు విధిబోధకము లెంతమాత్రమును గానేరవు కాదు. నాలవస్త్రమువ్యయ యుపపత్తి గలుగ బ్రహ్మజ్ఞానేచ్ఛ యత్యంతావశ్యకముగఁ గలుగును. ఆ యిచ్ఛ గలుగ నాజిజ్ఞాసువు దన యభీష్టసిద్ధికై యొకరి ప్రేరణ యెంతమాత్రమును లేకుండగనే దావాగ్నిమధ్యమునఁ బడినవాఁ డెట్లో యొకవిధమున బహుప్రయత్నము జేసికొనుటకు వేఱొక్కరి ప్రేరణ లేకుండఁగనే తాను స్వతంత్రముగ సర్వకర్మసంన్యాసమును గావించి గుర్వన్వేషణమును జేయు ననునభిప్రాయమును వ్యక్తీకరించుటయందే "పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేన, తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్। శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్" అను శ్రుతికిఁ బర్యవసితార్థము కావున నందలి 'ఆయాత్' 'అభిగచ్ఛేత్' అను లిఙ్లకుఁ గాని, "తద్విద్ధి ప్రణిపాతేన" యనుచోనుండెడి లోట్టునకుఁ గాని, "ఆత్మా వా౽రే ద్రష్టవ్యః, శ్రోతవ్యః, మన్తవ్యః, నిదిధ్యాసితవ్య" యనుచో నుండెడి తవ్యప్రత్యయమునకుఁ గాని స్వార్థమునం దెంతమాత్రము ప్రయోజనము లేకపోవుటచే నాప్రత్యయములు కుంఠీభావము నొందుచున్నవి

అట్లు గాక యాప్రత్యయములకు భావనయే సిద్ధ మగుచో నాశ్రుతి శ్రవణమాత్రము చేతనే యెల్లరును సర్వకర్మసంన్యాసపూర్వక గురూపసదనమునకు సంసిద్ధులు గావలయును. అట్లైనటను వ్యవహారము గానరాదు. ఏతద్విషయము నాలవసూత్రము యొక్క భాష్యవ్యాఖ్యాన సందర్భమునఁ గూడ వివరింపఁ బడును. దానం జేసి భాష్యకారులిచటఁ గర్తవ్యాపదమును బ్రయోగించిన 'భవతి' యను శబ్దమును బ్రయోగించిన నొక్కటియే 'కర్తవ్యా' యను పదమును బ్రయోగించుటచేతను నద్దానిచే సూత్రార్థమునం దెట్టివిశేషము నించుకేనియుఁ బ్రకటింపకపోవుటచేతను లిఙర్థము పేక్షింపఁబడిన ట్లవశ్యము నిశ్చయింపవచ్చును. మన నిశ్చయ మేల? నాలవసూత్రము యొక్క భాష్యముచే లిఙాదులయొక్క కుంఠీభావము ముక్తకంఠముగఁ జెప్పఁబడినది. కావున వివరణకారునిచేఁ గాని తదితరులచేఁ గాని యాజిజ్ఞాసాసూత్రమునకుఁ బ్రతిపాదింపఁబడిన యర్థవిశేషములు శ్రుతిసూత్రభాష్యములకు విరుద్ధములగుటం జేసి యనర్థవిశేషములే గావున నయ్యవి సర్వవిధములఁ హేయములే యగుచున్నవి.

ఇఁకఁ బ్రకృతము ననుసరింతము. భాష్యకారులు సూత్రమునందలి పదములయొక్క యర్థములను సూత్రార్థమును వివరించి యధికరణమును బ్రారంభించుచున్నారు. అధికరణ మనఁగా, "విషయో విశయశ్చైవ పూర్వపక్షస్తథోత్తరమ్

తత్పునర్బ్రహ్మ ప్రసిద్ధమప్రసిద్ధం వా స్యాత్। యది ప్రసిద్ధం న జిజ్ఞాసితవ్యమ్। అథాప్రసిద్ధం నైవ శక్యం జిజ్ఞాసితుమ్, ఇతి। ఉచ్యతే—అస్తి తావద్బ్రహ్మ నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావం సర్వజ్ఞం సర్వశక్తిసమన్వితమ్। బ్రహ్మశబ్దస్య హి వ్యుత్పాద్యమానస్య నిత్యశుద్ధత్వాదయోఽర్థాః ప్రతీయన్తే, బృహతేర్ధాతోరర్థానుగమాత్।

---

సంగతిశ్చేతి పంచాంగం శాస్త్రేఽధికరణం స్మృతమ్మ"ను నభియుక్తోక్తి వలనం దెలియవచ్చెడి పంచావయవములతోఁ గూడిన మీమాంసాన్యాయము. ఇచట సంగతి యనఁ బూర్వోత్తరపక్షములవిచారణచేఁ గలుగు నిర్ణయ మని యాశయము. ప్రకృతమున "తస్మాత్ బ్రహ్మ విజిజ్ఞాసితవ్యమ్మ"ను వాక్యమువిషయము. అనఁగా బ్రహ్మ జిజ్ఞాస్య మనునది సంశయాస్పద మగుటంజేసి యయ్యది యధికరణమున విషయముగా నొప్పుచున్నది. జిజ్ఞాస్య మని ప్రతిజ్ఞచేయఁబడిన బ్రహ్మము ప్రసిద్ధమా యప్రసిద్ధమా యను విశయము "తత్పునర్బ్రహ్మ ప్రసిద్ధమప్రసిద్ధం వా స్యాత్త్"ను భాష్యముచే నిరూపింపఁబడుచున్నది. బ్రహ్మము ప్రసిద్ధమే యగుచో నద్దానిని గూర్చి జిజ్ఞాసచేయ నవసరము లేదు. అప్రసిద్ధ మగుచో జిజ్ఞాసచేయుటకు సాధ్యమే కాదు. కావున బ్రహ్మ మెంతమాత్రము జిజ్ఞాస్యముగాదని "యది ప్రసిద్ధం నజిజ్ఞాసితవ్యమ్। అథాప్రసిద్ధం నైవ శక్యం జిజ్ఞాసితుమ్మ"ను పూర్వపక్షము గలుగ నుత్తరము "ఉచ్యతే" యని చెప్పఁబడుచున్నది. "అస్తి తావద్బ్రహ్మ" యనఁగా బ్రహ్మము ప్రసిద్ధమే యని యర్థము. సుప్రసిద్ధ మగు బ్రహ్మ మెట్టి దన "నిత్యశుద్ధముక్తస్వభావమ్మ"ని చెప్పఁబడుచున్నది. నిత్య మన దుఃఖహేతు వగు నాశము లేని దని భావము. అనఁగా సర్వకాలసర్వావస్థలయందు నొకేవిధమునఁ బ్రకాశించునది యని యభిప్రాయము. శుద్ధమన దేహము మొదలుగాఁ గల యుపాధులతోఁ గూడియున్నను రాగాదిదోషశూన్య మని యభిప్రాయము. బుద్ధమనఁగా ననితరాధీనప్రకాశము. అనఁగా స్వయంప్రకాశమును నానందము నని యభిప్రాయము. ముక్త మన నెల్లపుడును దేహాదులతో సంబంధమును బ్రమాతృత్వాదికమును లేనిది యని భావము. ఇట్టి నిత్యము శుద్ధము బుద్ధము ముక్త మనునవే స్వభావముగాఁ గలది యగు నిరుపాధికబ్రహ్మరూప మీపదముచేఁ బ్రదర్శింపఁబడుచున్నది. ఇట్టినిరుపాధిక బ్రహ్మమునకు నవిద్య యనెడి యుపాధిచేఁ గల్గు సోపాధికస్వరూపము "సర్వజ్ఞం సర్వశక్తిసమన్వితమ్మ"ని ప్రదర్శింపఁబడుచున్నది. ఈసర్వజ్ఞసర్వశక్తిపదములచే బ్రహ్మమునకు జగత్కారణత్వము ప్రదర్శింపఁబడుచున్నది. ఇయ్యది బ్రహ్మమునకుఁ దటస్థలక్షణము. నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావ మన్ననో స్వరూపలక్షణము. బ్రహ్మమున కిట్టిస్వరూపమా బ్రహ్మశబ్దముయొక్క వ్యుత్పత్త్యర్థముచేతనే దెలియవచ్చుచున్న దని "బ్రహ్మ-

సర్వస్యాత్మత్వాచ్చ బ్రహ్మాస్తిత్వప్రసిద్ధిః । సర్వో హ్యాత్మాస్తిత్వం ప్రత్యేతి; న నాహమస్మీతి। యది హి నాత్మాస్తిత్వప్రతీతిః స్యాత్ సర్వో లోకో నాహమస్మీతి ప్రతీయాత్। ఆత్మా చ బ్రహ్మ।

---

శబ్దస్యైవ వ్యుత్పాద్యమానస్య నిత్యశుద్ధత్వాదయోఽర్థాః ప్రతీయన్తే" యని చెప్పఁబడుచున్నది. బ్రహ్మశబ్దనిర్వచన మన్ననో "బృహతేర్ధాతోరర్థానుగమాత్" అను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. 'బృహి' ధాతువుయొక్క యర్థము ననుసరించుటవలన నిత్యశుద్ధత్వాదులు దెలియవచ్చుచున్న వని యభిప్రాయము. అనఁగా బృహిధాతువునకు వృద్ధికర్మ యర్థము. అట్టివృద్ధిని సంకోచము లేకుండ నిరతిశయముగ గ్రహించినచోఁ బైనిఁజెప్పినస్వభావము బ్రహ్మమునకు సువ్యక్త మయ్యెడిని. ఎట్లన- గొప్పది యనఁగా దేశముచేతను కాలముచేతను వస్తువుచేతను బరిచ్ఛేదము నొందింపఁబడదు గావున ననంత మని యర్థము. ఎయ్యది యనంతమో యయ్యది నిత్యము. ఆతీరుననే పరిచ్ఛిన్నస్వభావములుగా లోకమునఁ దెలియఁబడ్డువానియొక్క పరిచ్ఛేదభావమును దొలఁగించి బృహిధాత్వర్థ భావముచే నాయాయిధర్మములయొక్క నిరతిశయభావమును గ్రహించినచో శుద్ధబుద్ధముక్తస్వభావము సర్వజ్ఞత్వము సర్వశక్తిత్వము గూడ బ్రహ్మమునం దున్నట్లు దెలియవచ్చెడి నని యభిప్రాయము.

బ్రహ్మముయొక్క ప్రసిద్ధిని గూర్చి బ్రహ్మశబ్దార్థనిర్వచనమే గాక హేత్వంతరము "సర్వస్యాత్మత్వాచ్చ బ్రహ్మాత్మత్వప్రసిద్ధి" యని సంగ్రహదర్శింపఁబడుచున్నది. సర్వస్య = ఆబాలగోపాలముగ నెల్లరకును, ఆత్మత్వాత్ = స్వరూపమే యగుటవలన ననఁగా 'నేను నేన'ను వ్యవహారము గల్గుచుండుటవలన, బ్రహ్మముయొక్క యునికి సుప్రసిద్ధముగఁ దెలియఁబడుచున్న దని యభిప్రాయము. ఈసంగ్రహవాక్యాభిప్రాయమే "సర్వో హ్యాత్మాస్తిత్వం ప్రత్యేతి, న నాహమస్మీతి। యది హి నాత్మాస్తిత్వప్రసిద్ధిః స్యాత్ సర్వో లోకో నాహమస్మీతి ప్రతీయాత్"ని చెప్పఁబడుచున్నది, సర్వజనులును 'నేనున్నాన'ని చెప్పుచుండుటచే నాత్మయొక్క యస్తిత్వము సువ్యక్తమగుచునే యున్నది ఎప్పుడును 'నేను లేన'ని చెప్పఁడుగదా! ఆత్మకు నస్తిత్వప్రసిద్ధియే లేకపోయినచో సకలజనులును 'నేను లేను, నేను లేన'ని వ్యవహరింపవలయును. కాఁగా నెల్లరును "నేనున్నాన''ను నిశ్చయముతో వ్యవహరించుచున్నారు గావున నేనని వ్యవహరించు నాత్మ లేదని యెంతమాత్రము చెప్పుట కవకాశము లేదు. కావున నాత్మ ప్రసిద్ధముగాఁ దెలియవచ్చుచున్నది.

అట్లైన సర్వలోకప్రసిద్ధిచే నాత్మయొక్క ప్రసిద్ధి దెలియవచ్చుచున్నది గాని బ్రహ్మముయొక్క ప్రసిద్ధి దెలియఁబడదే యన నాత్మయే బ్రహ్మము కావున

యది తర్హి లోకే బ్రహ్మాత్మత్వేన ప్రసిద్ధమస్తి, తతో జ్ఞాతమేవేత్యజిజ్ఞాస్యత్వం పునరాపన్నమ్। న। తద్విశేషం ప్రతి విప్రతిపత్తేః। దేహమాత్రం చైతన్యవిశిష్టమాత్మేతి ప్రాకృతా జనా లోకాయతికాశ్చ ప్రతిపన్నాః।

---

నాత్మయొక్క ప్రసిద్ధిని బ్రహ్మమునొక్క ప్రసిద్ధి సిద్ధించుచున్నదని "ఆత్మా చ బ్రహ్మ" యను భాష్యముచే బ్రదర్శింపఁబడుచున్నది. ఇచట చ కారమే వకారార్థకము. ఆత్మయే బ్రహ్మమైనచో నట్టియాత్మరూపముచే బ్రహ్మమునకుఁ బ్రసిద్ధి గలుగ బ్రహ్మము తెలియఁబడినదే యగుచున్నది. దానంజేసి బ్రహ్మమును గూర్చిన సందియమే గలుగనేరదు. అసందిగ్ధము నప్రయోజనము నగు వస్తు వెంతమాత్ర మేరిచేఁ గూడఁ దెలిసికొన నిచ్ఛయింపఁబడదుగదా! కావునఁ దెలియఁబడుచున్న బ్రహ్మమును గూర్చి జిజ్ఞాస యెంతమాత్రమును గలుగనేరదు. కావున బ్రహ్మము జిజ్ఞాస్య మెంతమాత్రమును గాదు. కాఁగా నీవేదాంతశాస్త్రమునకు విషయప్రయోజనము లెంతమాత్రము సిద్ధింపనేరవను నాక్షేపము మఱలఁ గలుగుచునే యున్నదే యను పూర్వపక్షము "యది తర్హి లోకే బ్రహ్మాత్మత్వేన ప్రసిద్ధమస్తి, తతో జ్ఞాతమేవేత్య-జిజ్ఞాస్యత్వం పునరాపన్నమ్" అని పూర్వపక్షి వచించు నట్టియాక్షేపమునకుఁ దావు లేదని "న" యని పరిహరించుచున్నారు. అందులకు హేతువు "తద్విశేషం ప్రతి విప్రతిపత్తేః" యని చెప్పఁబడుచున్నది. బ్రహ్మమే యాత్మయగుచు నెల్లరకుఁ దెలియఁబడుచున్న నద్దానివిశేషస్వరూపమును గూర్చి పలువిధము లగు విప్రతిపత్తులు గలుగుటయెట్లు? — కావున నట్టివిప్రతిపత్తులకు బ్రహ్మము సందిగ్ధ మగుచు ననర్థహేతు వగుటంజేసి యట్టియనర్థనివృత్తికి హేతుభూత మగు యథార్థజ్ఞానము కొఱకు బ్రహ్మము జిజ్ఞాస్యమే యగుచున్నదని యభిప్రాయము. ఈసంగ్రహవాక్యార్థమే యుత్తరగ్రంథముచే వివరింపఁబడుచున్నది. ఆత్మను గూర్చిన విప్రతిపత్తులలో స్థాలీపులాకన్యాయమునఁ గొన్నిమాత్ర మిచటఁ బ్రదర్శింపఁబడుచున్నవి. అందు మొదటిది "దేహమాత్రం చైతన్యవిశిష్టమాత్మా" యని. దేహమాత్రమన శిరముతోఁ గూడిన పిండమే యని యభిప్రాయము ఇచట మాత్రశబ్దముచే దేహముకంటె భిన్న మగు చైతన్య మెంతమాత్రమును లేదనియు నట్టిచైతన్యము దేహాకారముగఁ బరిణమించిన పృథివ్యప్తేజోవాయువు లనెడి నాలుగుభూతములయందే యంతర్భావము నొందుచున్నదనియు నట్టిదేహమే యాత్మయనియు ననఁగా నహంప్రత్యయమునకు నాధారమనియును దెలియవలయును. ఇట్టియభిప్రాయము నెవ్వరు గల్గియుండిరన "ప్రాకృతా జనా లోకాయతికాశ్చ" అని చెప్పఁబడుచున్నది. ప్రాకృతజను లనఁగా శాస్త్రోపదేశసంస్కారము లేనట్టియుఁ బ్రత్యక్షముచే గ్రహింపఁబడినవిషయములే సత్యము లని వ్యవహరించునట్టియు జనులు. లోకాయతికు లనఁ జార్వాకు లని ప్రసిద్ధిఁగాంచిన భూతచతుష్టయతత్త్వవాదులు. లోకాయతికులలో మతాం

ఇంద్రియాణ్యేవ చేతనాన్యాత్మేత్యపరే। మన ఇత్యన్యే। విజ్ఞానమాత్రం క్షణికమిత్యేకే। శూన్యమిత్యపరే। అస్తి దేహాదివ్యతిరిక్తః సంసారీ కర్తా భోక్తేత్యపరే। భోక్తైవ కేవలం న కర్తేత్యేకే। అస్తి తద్వ్యతిరిక్త ఈశ్వరస్సర్వజ్ఞః సర్వశక్తిరితి కేచిత్। ఆత్మా స భోక్తురిత్యపరే।

---

తరము "ఇంద్రియాణ్యేవ చేతనాన్యాత్మా" యనునది చక్షురాదీంద్రియములు చేతనవిశిష్టము లనియు నయ్యవియే యాత్మ యనియును వారియాశయము. మూఁడవది లోకాయతికులలో మతాంతరము— "మన ఇత్యన్యే" యని. అనఁగా నహంప్రత్యయమునకు విషయ మగు మనస్సు చేతన మనియు నయ్యదియే యాత్మ యనియుఁ గొందఱి యభిప్రాయము. నాలవది బౌద్ధైకదేశు లగు యోగాచారులమతము "విజ్ఞానమాత్రం, క్షణికమ్మ"ని. క్షణిక మగు విజ్ఞానమాత్రమే యాత్మ, యన మనస్సునుండి వేఱుచేయఁబడిన క్షణికవిజ్ఞాన మని యభిప్రాయము. అయిదవది బౌద్ధైకదేశు లగు మాధ్యమికులమతము "శూన్యమ్మ"ని. అనఁగా సుషుప్తియందు విజ్ఞానలేశమే లేకుండుటచేతను 'అహ'మ్మను జ్ఞానము హఠాత్తుగ జనించుటచేతను నిష్కారణముగ నొకప్పుడు బయలువెడలువిషయము పారమార్థికము గాక పోవుటచేత నహంకార మసదవభాస మగుటంజేసి యాత్మ శూన్య మని యభిప్రాయము. ఆఱవది నైయాయికాదిమతము "అస్తి దేహాదివ్యతిరిక్తః సంసారీ కర్తా-భోక్తా"యని. దేహముకంటె విలక్షణ మగు కర్తయు భోక్తయు సంసారియు నగు నాత్మ నిశ్చయముగ నున్న దని యాశయము. ఏడవది సాంఖ్యమతము "భోక్తైవ కేవలం, న కర్తా" యని. దేహేంద్రియాదులకంటె విలక్షణ మగు నాత్మ కేవలభోక్తయే గాని కర్త యెంతమాత్రము గాఁడని భావము. ఎనిమిదవది యోగులమతము "అస్తి తద్వ్యతిరిక్తః సర్వజ్ఞః సర్వశక్తి" యని. దేహాదిభిన్న మగు భోక్తకంటె భిన్నమును సర్వనియంతయు నగు సర్వజ్ఞుఁడును సర్వశక్తియు నగు నీశ్వరుఁ డున్నాఁ డని యోగులు తలఁచుచున్నా రని భావము. తొమ్మిదవది వేదాంతిమతము "ఆత్మా స భోక్తు" యని. అవిద్యోపాధికుఁ డగు భోక్తయొక్క యాత్మ యన నవిక్రియాత్మస్వరూపమే యాపరమాత్మ. అనఁగా బ్రహ్మ మని వేదాంతిమతము.

ఇట్లు పలువిధము లగు విప్రతిపత్తులకుఁ గారణము "ఏవం బహవో విప్రతిపన్నా యుక్తివాక్యతదాభాససమాశ్రయాః సంత" యని చెప్పఁబడుచున్నది. అనఁగా యుక్త్యాభాసములను వాక్యాభాసములను నభినివేశముతో నాశ్రయించుటచేఁ బలువురు పలువిధములుగ నొక్కబ్రహ్మమునందు విరుద్ధార్థమును గ్రహించి రని విప్రతిపత్తు లుపసంహరింపఁబడుచున్నవి. ఇట్లు విప్రతిపత్తులను బ్రదర్శించి ప్రకృతపు

పదం బహవో విప్రతిపన్నాః • యుక్తివాక్యతదాభాససమాశ్రయాః సన్తః తత్రావిచార్య యత్కించిత్ప్రతిపద్యమానో నిఃశ్రేయసాత్ప్రతిహన్యేత, అనర్థం చేయాత్ తస్మాద్బ్రహ్మజిజ్ఞాసోపన్యాసముఖేన వేదాన్తవాక్యమీమాంసా తదవిరోధితర్కోపకరణా నిఃశ్రేయసప్రయోజనా ప్రస్తూయతే॥ 1.

గ్రంథము నారంభించుటకుఁ గల కారణము "తత్రావిచార్య యత్కించిత్ప్రతిపద్యమానః నిఃశ్రేయసాత్ ప్రతిహన్యేత, అనర్థం చేయాత్"ని చెప్పఁబడుచున్నది. అనఁగా నిట్టివిప్రతిపత్తులు దెలియవచ్చుచుండ నవ్వానియం దెద్దియేని యొక యర్థము నభినివేశముచే గ్రహించినచో నట్టివాఁడు సత్యమును గ్రహింపక విపరీతమును గ్రహించుటచే నిఃశ్రేయసమును బొందకపోవుట యటుండ ననర్థములకుఁ బాల్పడును. కావున నీవిప్రతిపత్తు లన్నియుఁ బ్రమాణపురస్సరంబుగా విచారింపఁబడినవెనుక యథార్థము నిర్ణయింపఁబడవలయును.

కావున వేదాంతమీమాంసాశాస్త్రము సూత్రకారులచేఁ బ్రస్తావము చేయఁబడుచున్నదని"తస్మాద్బ్రహ్మజిజ్ఞాసోపన్యాసముఖేన వేదాంతవాక్యమీమాంసా తదవిరోధితర్కోపకరణా నిఃశ్రేయసప్రయోజనా ప్రస్తూయతే" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. బ్రహ్మజిజ్ఞాసోపన్యాసముఖేన = బ్రహ్మజిజ్ఞాసేచ్ఛచే నుపసదనముఁ గావించినవానికి "తస్మై స విద్వాన్ ఉపసన్నాయ సమ్యక్ ప్రశాంతచిత్తాయ శమాన్వితాయ। యేనాక్షరం పురుషం వేద సత్యం ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్"ను శ్రుతిచేఁ బ్రతిపాదింపఁబడినవిధమున నుపదేశించుటకుఁ జేయఁబడు నుపన్యాస మను మిషచే, వేదాంతమీమాంసా=వేదాంతవాక్యములయొక్క మీమాంస, మీమాంస యన విషయాదిపంచావయవోపేత మగు నధికరణన్యాయప్రదర్శనము. ఈప్రదర్శన మెట్టియుపకరణములచే రచింపఁబడుచున్న దన— "తదవిరోధితర్కోపకరణా" యని చెప్పఁబడుచున్నది. అనఁగా తైః=వేదాంతములతో, అవిరోధి = విరోధింపని, తర్క = యుక్తి, ఉపకరణం = సహాయకారణము, యస్యాః = దేనికో, అయ్యది. అనఁగా వేదాంతములకు విరోధింపని యుక్తులతో నలరారునట్టి మీమాంస యని యభిప్రాయము. ఈ మీమాంసవలని ప్రయోజన మెద్ది యన నయ్యది "నిఃశ్రేయసప్రయోజనా" యని చెప్పఁబడుచున్నది. అనఁగాఁ బరమపురుషార్థ మగు ముక్తియే ప్రయోజనము యభిప్రాయము. ఇట్టియుపదేశశాస్త్రము శ్రీకృష్ణద్వైపాయనభగవానులచే జిజ్ఞాసువుల కుపదేశించుటకుఁ గాను, ప్రస్తూయతే = పుష్కలముగ నారంభింపఁబడుచున్నది. కావున జిజ్ఞాసువు లీశాస్త్రమును శ్రీకృష్ణద్వైపాయనసంప్రదాయస్థులగు బ్రహ్మనిష్ఠులవలన నుపదేశమును బొందవలయు నని యీజిజ్ఞాసాధికరణము ప్రారంభింపఁబడుచున్నది.

ఇది జిజ్ఞాసాధికరణము.

## జన్మాద్యధికరణమ్.

బ్రహ్మ జిజ్ఞాసితవ్యమిత్యుక్తమ్ । కింలక్షణం పున స్తద్బ్రహ్మేత్యత ఆహ భగవాన్ సూత్రకారః। జన్మాద్యస్య యత ఇతి —

## జన్మాద్యస్య యతః ॥ 2.

---

భాష్యకారులు వేదాంతమీమాంసాశాస్త్రముయొక్క మొదటి సూత్రమునకు వ్యాఖ్యానమును గావించి రెండవ సూత్రమునకు వ్యాఖ్యానముఁ జేయఁదలఁచి పూర్వోత్తరగ్రంథసందర్భమును వ్యక్తీకరింపఁ బూర్వసూత్రార్థమును "బ్రహ్మ జిజ్ఞాసితవ్యమిత్యుక్తమ్" అని నిర్వచించుచున్నారు. అనఁగా బ్రహ్మజిజ్ఞాసాభిలాషిచే నీ వేదాంతమీమాంసాశాస్త్రము శ్రోత్రియుఁడగు బ్రహ్మనిష్ఠుని వలన శ్రవణము చేయవలయు నని పూర్వగ్రంథముచేఁ జెప్పఁబడె నని యభిప్రాయము. ఇట్లు నిర్వచించుటచే బ్రహ్మముయొక్క లక్షణము ప్రమాణము యుక్తిసాధనము ప్రయోజన మను సర్వమును దెలిసికొనఁబడవలసిన విషయముగాఁ బ్రతిజ్ఞ చేయఁబడినట్లు సువ్యక్త మగుచున్నది. అందు బ్రహ్మముయొక్క స్వరూపము పూజనీయ మగుటఁజేసి ప్రథమమున నిరూపింపఁబడవలయు నను "కింలక్షణం పున స్తద్బ్రహ్మ" యని యుత్తరగ్రంథసందర్భము వ్యక్తీకరింపఁబడుచున్నది. జిజ్ఞాస్య మని ప్రతిజ్ఞచేయఁబడిన బ్రహ్మమునకు లక్షణ మేమి యనుచో కింశబ్ద మాక్షేపార్థకము. ఎట్లన — లోకమునఁ దెలియవచ్చెడి సకలవస్తువులును బరిమితములును నపరిశుద్ధములును నబుద్ధములును నశ్వరములును నై తెలియవచ్చుచున్నవి. దానంజేసి తద్విరుద్ధ మగు నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావమును బ్రహ్మముయొక్క స్వరూపముగా నిరూపించుట దుశ్శకము. కావునఁ బదార్థముకానిబ్రహ్మమునకు వాక్యార్థముచే లక్షణమును నిరూపించుట యసమంజసము కాఁగా బ్రహ్మమునకు లక్షణము గలుగనేరదు. కావున బ్రహ్మము జిజ్ఞాస్య మెంతమాత్రముగానేర దని భావము. ఇట్లాక్షేపము గలుగ నట్టియాక్షేపమును బరిహరించుటకు సూత్రకారులు "జన్మాద్యస్య యత" యను సూత్రముచే లక్షణమును బ్రతిజ్ఞ చేయుచున్నా రని "అత ఆహ భగవాన్ సూత్రకారః 'జన్మాద్యస్య యత' ఇతి" యను భాష్యముచే నిర్వచింపఁబడుచున్నది.

పైఁ జెప్పఁబడిన యాక్షేపమునకు సమాధానముగా నీ యధికరణము గలుగుటఁజేసి యీయధికరణమునకు సంగతి యాక్షేపసంగతి.

ఈ సూత్రముచే వస్తుసిద్ధికి నియామకము లగు లక్షణప్రమాణములు నిర్వచింపఁబడుటయే గాక యుక్తికూడ నర్థసిద్ధ మగుచున్నది.

జన్మోత్పత్తిరాదిరస్యేతి తద్గుణసంవిజ్ఞానో బహువ్రీహిః । జన్మస్థితిభంగం సమాసార్థః । జన్మనశ్చాదిత్వం శ్రుతినిర్దేశాపేక్షం వస్తువృత్తాపేక్షం చ ।

---

సూత్రముసందలి పదములను బ్రత్యేకముగా వ్యాఖ్యానము చేయ "జన్మాది" యను మొదటిపదము తొలుత "జన్మోత్పత్తిరాదిరస్యేతి తద్గుణసంవిజ్ఞానో బహువ్రీహి" యని విగ్రహింపఁబడుచున్నది. జన్మ = ఉత్పత్తి, ఆదిః = మొదలు, అస్యేతి = దీనికిఁ గాఁగా, 'జన్మాది' యనఁబడు నని తద్గుణసంవిజ్ఞానబహువ్రీహిసమాసము. ఈ భాష్యముచేఁ బదచ్ఛేదము పదార్థము పదవిగ్రహ మను వ్యాఖ్యానాంశములు మూఁడును వివరింప బడుచున్నవి. శ్రూయమాణ మగు విశేషణమును విశేష్యమున కంగముగాఁ గావించి క్రియాన్వయము చేయునపుడు తద్గుణసంవిజ్ఞానబహువ్రీహి నాఁబడును. ఎట్లన- లోకమున, "లంబకర్ణమానయ" యని ప్రయోగించినయెడల విశేషణవిశిష్టుఁ డగు పురుషునికే యానయనక్రియాకర్మత్వము గలుగుచున్నది. కనుక నయ్యది తద్గుణసంవిజ్ఞాన బహువ్రీహియనఁబడును తస్య గుణాః=తద్గుణాః, తద్గుణాఃసంవిజ్ఞాయన్తే౽త్రేతితద్గుణసంవిజ్ఞానః, స చాసౌ బహువ్రీహి' యని విగ్రహము. అట్లే యతద్గుణసంవిజ్ఞానబహువ్రీహు లని "దృష్టసముద్రమానయ" మన్నగు ప్రయోగమందలి దృష్టసముద్రాది పదములు వ్యవహరింపఁబడుచున్నవి. అతద్గుణసంవిజ్ఞానబహువ్రీహి యనఁగా విశేష్యార్థము విశేషణార్థముతోఁ గూడకయే క్రియయం దన్వయించును. పైనిఁజెప్పఁబడిన దృష్టసముద్రశబ్దముచేఁ దెలియఁబడు పురుషునియొక్క యానయనక్రియ యందు 'లంబకర్ణమానయ' యనుచోఁ గర్ణములకువలె సముద్రమున కెంతమాత్ర మానయనము సంభవింపదు. కావున నయ్యది యతద్గుణసంవిజ్ఞానబహువ్రీహి నాఁబడుచున్నది. ప్రకృతమునఁ దద్గుణసంవిజ్ఞానబహువ్రీహిని గ్రహించుటయందుఁ గలుగు ప్రయోజనము "జన్మస్థితిభంగం సమాసార్థ" యని వివరింపఁబడుచున్నది. అనఁగా జన్మాది యన జన్మస్థితిభంగ మని యర్థము. ఇచట 'జన్మాది' యను పదమును సూత్రకారులు ప్రయోగించుటయందును దానిని 'జన్మస్థితిభంగమ్మ'ని భాష్యకారులు వివరించుటయందును నపుంసకలింగనిర్దేశముచే జన్మస్థితిలయముల యొక్క సమూహమే యభిప్రేత మగుచున్నది. ఇచట సమాహారమున జన్మమును మొదటిదానిఁగా గ్రహించుటకుఁ గల కారణము "జన్మనశ్చాదిత్వం శ్రుతినిర్దేశాపేక్షం, వస్తువృత్తాపేక్షం చ" యను సంగ్రహవాక్యముచే నిరూపింపఁబడుచున్నది. శ్రుతినిర్దేశము ననుసరించుటచేతను వస్తువృత్తమును గమనించుటచేతను జన్మము మొట్టమొదట గ్రహింపఁబడుచున్నదని యర్థము. శ్రుతినిర్దేశము "శ్రుతినిర్దేశస్తావత్ ... క్రమదర్శనాత్త"ను భాష్యముచే నిరూపింపఁబడుచున్నది. తైత్తిరీయశ్రుతి

శ్రుతినిర్దేశస్తావత్ "యతో వా ఇమాని భూతాని జాయన్తే" (తైత్తి. 3-1) ఇత్యస్మిన్ వాక్యే జన్మస్థితిప్రలయానాం క్రమదర్శనాత్ । వస్తువృత్తమపి జన్మనా లబ్ధసత్తాకస్య ధర్మిణః స్థితిప్రలయసంభవాత్ । అస్యేతి ప్రత్యక్షాదిసన్నిధాపితస్య ధర్మిణ ఇదమా నిర్దేశః । షష్ఠీ జన్మాదిధర్మసంబన్ధార్థా । యత ఇతి కారణనిర్దేశః । అస్య జగతో నామరూపాభ్యాం వ్యాకృతస్యానేకకర్తృభోక్తృసంయుక్తస్య ప్రతినియతదేశకాలనిమిత్తక్రియాఫలాశ్రయస్య మనసాఽప్యచిన్త్యరచనారూపస్య జన్మస్థితిభఙ్గం యతః సర్వజ్ఞాత్సర్వశక్తేః కారణాద్భవతి తద్బ్రహ్మేతి వాక్యశేషః ।

---

యందలి "యతో వా ఇమాని భూతాని జాయన్తే" యను వాక్యమునందు జన్మస్థితిప్రళయములు క్రమముగా నిరూపింపఁబడుటచే జన్మ మొదటిదిగాఁ దెలియవచ్చుచున్న దనియభిప్రాయము. ఇఁక వస్తువృత్తమన్ననో "వస్తువృత్తమపి... స్థితిప్రళయసంభవాత్త"ను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. అనఁగా జన్మచే నునికిని బొందిన ధర్మికి స్థితిప్రళయములు గల్గుట సహజము గావున జన్మ మొదటఁ జెప్పఁబడిన దని తాత్పర్యము. జన్మాదిపదమున కర్థవివక్ష చేసి "అస్య" యను పదమునకు "అస్యేతి" యను భాష్యముచే నర్థము నిరూపించుచున్నారు. 'అస్య' యను దానియొక్క ప్రాతిపదిక మగు 'ఇదమ్మ'నుదానిచేఁ బ్రత్యక్షాదిప్రమాణములచేఁ దెలియవచ్చెడి యావద్విషయము నభిప్రేత మగుచున్నది. షష్ఠీవిభక్తి యిదంశబ్దార్థమునకును జన్మాదులకును గల సంబంధమును నిరూపించుచున్నది.

ప్రత్యక్షాదిప్రమాణములచేఁ దెలియవచ్చెడి యావద్విషయములతో సంబంధించినజన్మస్థితిలయము లని యర్థము. 'యత ఇతి కారణనిర్దేశః' యని యతశ్శబ్దముయొక్క యర్థము చెప్పఁబడుచున్నది. ఇచట 'యత' యను స్థలమందలి పంచమీవిభక్తిప్రత్యయముచే యచ్ఛబ్దవాచ్యముగాఁ బ్రకృతి యగు నుపాదానకారణమే యభిప్రేత మగుచున్నది. ఇట్లు సూత్రమునందలి శబ్దములయొక్క యర్థమును వివరించి వాక్యార్థము సమగ్రముగా "అస్య జగతః ... వాక్యశేష" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది. ఇందు 'అస్య' యను పదముచే నీపరిదృశ్యమాన మగు జగము గ్రహింపఁబడి యట్టిజగత్తుయొక్క విశేషము సాభిప్రాయము లగు నాల్గువిశేషణములచేఁ జెప్పఁబడుచున్నది. ఎట్లన—

1. "నామరూపాభ్యాం వ్యాకృతస్య= నామరూపములచే వికారమును జెందినట్టి" యను విశేషణముచే నీజగత్కారణము చేతనమే గావలయును గాని యచేతనము లగు ప్రధానము పరమాణువులు కాలము క్రియ మున్నగునవి యెంత

మాత్రము కారణము గానేరదని సూచింపఁబడుచున్నది లోకమున ఘటపటాది నామరూపవ్యాకరణము చేతనకర్తృకముగా దెలియవచ్చుటఁజేసి నామరూపాత్మక మగునీజగము గూడఁ జేతనకర్తృకమే గావలయును గాని వేఱొకయచేతనకర్తృకము గానేరదు. 'నామరూపాభ్యాం'' నను చోఁ దృతీయావిభక్తి స్వరూపమాత్రబోధకము. అనఁగా నిత్థంభావమందుఁ దృతీయ యని భావము.

2 "అనేకకర్తృభోక్తృసంయుక్తస్య= అనేకులగు కర్తలతోడను భోక్తలతోడను గూడియున్నట్టియు" నను విశేషణముచే నామరూపములతో నలరారు కర్తలు భోక్తలు గూడ నామరూపాత్మకజగదంతఃపాతులే యగుటంజేసి జగత్తుకంటె భిన్నులెంతమాత్రము గారనియు నట్టిచేతనులగు కర్తలతోడను భోక్తలతోడను గూడియుండు జగత్తునకుఁ జేతనమే కారణము గావలయును గాని యచేతనములగు ప్రధానాదులు గాని నిరాత్మకమగు శూన్యము గాని కారణము గాదనియు నభిప్రేతమగుచున్నది. ఇచట లోకమునఁ గర్తృత్వభోక్తృత్వములు సామాన్యముగా నేకపురుషాశ్రయములుగాఁ దెలియవచ్చుచున్నను గొన్నిస్థలముల యందు, ననఁగా సూపకారఋత్విగ్యజమానులయందుఁ గర్తృత్వ భోక్తృత్వములు భిన్ననిష్ఠములుగా భాసించుటఁజేసి యిచటఁ గర్తృభోక్తృశబ్దములు వేఱువేఱుగా గ్రహింపఁబడుచున్నవి.

3. ప్రతినియతదేశకాలనిమిత్తక్రియాఫలాశ్రయస్య = ప్రతి కర్మను గూర్చి నియతము లగునట్టి దేశము, కాలము, నిమిత్తము, క్రియ, ఫలము గలిగినట్టిది యను విశేషణమువలన నీజగం బాకస్మికము గాక చేతనకర్తృకమే యగుచు స్వభావలబ్ధ మెంతమాత్రము గాదని యభిప్రాయము.

4. మనసాఽప్యచింత్యరచనారూపస్య=మనసుచేఁ గూడఁ జింతించుటకు శక్యముగాని రచనావిశేషముతోఁ గూడినట్టియు, నను విశేషణముచే నెంతబుద్ధిమంతునిచేనైన నించుకేనియు నూహించుటకు దుర్ఘటమగు రచనావిశేషముతో నొప్పారుచున్న దను నర్థము గలుగుటవలన నిర్మించుట కించుకేనియు నవకాశము లేదను విషయము నైరుక్తికన్యాయలబ్ధము

ఇట్టివిశేషములతోఁ గూడిన జగత్తునకు జన్మస్థితిభంగము లెట్టి సర్వజ్ఞము సర్వశక్తియు నగు కారణమువలనఁ గలుగునో యయ్యదియే బ్రహ్మ మని 'తద్బ్రహ్మ" యను వాక్యముయొక్క యధ్యాహారముచే సూత్రార్థము నిరూపింపఁబడుచున్నది. అనఁగాఁ బైనిఁ జెప్పఁబడిన విశేషణములతో నొప్పు జగత్తుయొక్క సృష్టిస్థితిలయములకారణము సర్వజ్ఞము సర్వశక్తి యగు బ్రహ్మముకంటె వేఱొకటి యెంతమాత్రము గాదని పరమతాత్పర్యము.

అన్యేషామపి భావవికారాణాం త్రిష్వేవాన్తర్భావ ఇతి జన్మస్థితినాశానామిహ గ్రహణమ్। యాస్కపరిపఠితానాం తు 'జాయతేఽస్తి' ఇత్యాదీనాం గ్రహణే తేషాం జగతః స్థితికాలే సంభావ్యమానత్వాన్మూలకారణాదుత్పత్తిస్థితినాశా జగతో న గృహీతాః స్యురిత్యాశఙ్క్యేత, తన్మా శఙ్కీతి యోత్పత్తిర్బ్రహ్మణః శ్రుతా తత్రైవ స్థితిః ప్రళయశ్చ త ఏవ గృహ్యన్తే। న యథోక్తవిశేషణస్య జగతః

---

ఇచట 'జన్మాది' యను జన్మస్థితిలయములు మూఁడుమాత్రమే యేల గ్రహింపఁబడవలయును? జన్మ మొదలుగాఁ గలిగిన భావవికారములలో వేఱొకటి మూఁడగు వృద్ధిపరిణామాపక్షయము లను భావవికారములు గూడ వినవచ్చుచున్నవే యన నామూఁడు కూడ నీమూఁడిటియందే యంతర్భావము నొందుచున్నవని "అన్యేషామపి గ్రహణమ్" అను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది.

ఇంతియకాదు; "జాయతే, అస్తి, వర్ధతే, విపరిణమతే, అపక్షీయతే, నశ్యతి" యను యాస్కవాక్యముచే నుచ్చరింపఁబడిన యాఆఱుభావవికారముల నిచట జన్మాదిశబ్దముచే గ్రహించినచో నీభావవికారములు జగదంతఃపాతివస్తువులతో సంబంధించినవే యగుటంజేసి జగదంతఃపాతివస్తువులయొక్క యుత్పత్తిస్థితిలయములకు మాత్రమే బ్రహ్మము కారణ మని భాసించును గాని జగత్తుయొక్క యుత్పత్తిస్థితిలయములకు బ్రహ్మము కారణ మని భాసింపకపోవచ్చు నను నాశంక గలుగును. అట్టియాశంక గలుగకుండవలయు నను తలంపుతో శ్రుతియందు వినవచ్చెడి జన్మస్థితిలయములు మూఁడుమాత్రమే గ్రహింపఁబడుచున్నవనియు, బ్రహ్మమువలన నేజగత్తుయొక్క యుత్పత్తి వినఁబడుచున్నదో యాబ్రహ్మమందే యాజగత్తుయొక్క స్థితియు లయమును గూడఁ గలుగుచున్నద ను నర్థము సువ్యక్తము గాఁగ జన్మస్థితిభంగములు మూఁడుమాత్రమే గ్రహింపఁబడవలయు నని "యాస్కపరిపఠితానాం తు... గృహ్యన్తే" యను భాష్యముచే నిరూపింపఁబడుచున్నది. యాస్కుఁ డన నిరుక్తమును రచియించిన మహర్షి. మూలకారణాత్ =బ్రహ్మమువలన నని యర్థము. "యతో వా ఇమాని భూతాని జాయన్తే" యను శ్రుతిచేతనే గాక జగదుత్పత్తిస్థితిలయములకుఁ గారణము సర్వజ్ఞము సర్వశక్తియు నగు బ్రహ్మ మని నిరూపించుటయే గాక యుక్తిచేఁ గూడ నిట్టిబ్రహ్మమే జగదుత్పత్తిస్థితిలయములకుఁ గారణము గావలయుఁ గాని వేఱొకటి కారణ మగుటకు నెంతమాత్ర మవకాశము లేదని "న యథోక్తవిశేషణస్య జగతః... సంభావయితుం శక్యమ్" అను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది.

'యథోక్తవిశేషణస్య' అనఁగా "నామరూపాభ్యాం వ్యాకృతస్య" యను విశేషణ మాదిగాఁ గల నాల్గువిశేషణములతో నొప్పునట్టి యని యర్థము. యథోక్తవిశేషణ మనఁగా 'సర్వజ్ఞం' 'సర్వశక్తి' యను విశేషణములు గలిగినది

న యథోక్తవిశేషణస్యేశ్వరం ముక్త్వాఽన్యతః ప్రధానాదచేతనాదణుభ్యోఽభావాత్సం-సారిణో వా ఉత్పత్త్యాది సంభావయితుం శక్యమ్। న చ స్వభావతః, విశిష్టదేశ-కాలనిమిత్తానామిహోపాదానాత్। ఏతదేవానుమానం సంసారివ్యతిరిక్తేశ్వరాస్తిత్వా-దిసాధనం మన్యన్త ఈశ్వరకారణినః। నన్విహాపి తదేవోపన్యస్తం జన్మాదిసూత్రే।

---

యని యర్థము. బ్రహ్మముకంటె వేఱగునవి కారణములు గావనుటలో నాలుగు వాదము లిచట ప్రదర్శింపఁబడుచున్నవి.

1. 'ప్రధానాదచేతనాత్' న నచేతన మగు ప్రధాన మని యర్థము. ఈ ప్రధానము త్రిగుణాత్మకము జడము స్వతంత్రము పరిణామియు నగుచున్న దనియు నయ్యదియే జగత్కారణ మనియు సాంఖ్యులయాశయము.

2. 'అణుభ్య' యనఁ బరమాణువు లని యర్థము ఈపరమాణువులు గూడ జడములు. ఈపరమాణువులు జగత్కారణ మని వైశేషికాదులు తలంచు చున్నారు.

3. 'సంసారిణ' యన జీవుఁ డని యర్థము. ఏకాదశరుద్రులు, ద్వాదశా దిత్యులు, అష్టవసువులు, ఇంద్రుఁడు, ప్రజాపతి యను ముప్పది మువ్వురు దేవతలు జగత్కారణ మని మీమాంసకులు దలంచుచున్నారు.

4. "అభావాత్"నఁగా శూన్యము. శూన్యము జగత్కారణ మని బౌద్ధులు తలంచుచున్నా రని.

ఉత్పత్త్యాది = ఉత్పత్తిస్థితిలయములు.

"న చ స్వభావతః విశిష్టదేశకాలనిమిత్తానామిహోపాదానాత్"ను భాష్యముచే స్వభావవాదము నిరసింపఁబడుచున్నది. ఈజగత్తునందుఁ బ్రతికార్యము నకును నియత మగు దేశము కాలము నిమిత్త మనఁగాఁ గారణము గ్రహింపఁ బడుచున్నవి. కావున దేశకాలనిమిత్తాపేక్ష యించుకేనియు లేకుండ నాకస్మికముగ జగత్తు బయలువెడలె ననువాద మసమంజస మని యర్థము. జగదుత్పత్తిస్థితిలయ ములకు నానావిధము లగు కారణాంతరములు నిరసింపఁబడుచున్నవి. ఎట్టివాదు లెట్టి కారణాంతరములఁ బ్రదర్శించి రనునవి యన్నియు నీమైదువాదములయం దంతర్భా వము నొందుచుండుటఁజేసి యవ్వాని నిచట వేఱుగా గ్రహింపలేదు.

ఇట్లు యుక్తిచేఁ గూడ బ్రహ్మమే జగదుత్పత్తిస్థితిలయకారణ మని నిర్వచింప, మధ్యస్థుఁడు "ఏతదేవానుమానం...జన్మాదిసూత్రే" యని ప్రశ్నించు చున్నాఁడు. అనఁగా యథోక్తవిశేషణములతోఁ గూడినజగత్తునకు యథోక్తవిశేషణ ములతోఁ గూడిన యీశ్వరునివలననే యుత్పత్తిస్థితిలయములు గలుగునను యుక్తిని బ్రదర్శింప నీయుక్తినే ప్రధానముగాఁ జేసికొని 'యీశ్వరకారణవాదు లగు

న। వేదాన్తవాక్యకుసుమగ్రథనార్థత్వాత్సూత్రాణామ్। వేదాన్తవాక్యాని హి సూత్రైరుదాహృత్య విచార్యన్తే। వాక్యార్థవిచారణాధ్యవసాననిర్వృత్తా హి బ్రహ్మావగతిర్నానుమానాదిప్రమాణాన్తరనిర్వృత్తా। సత్సు తు వేదాన్తవాక్యేషు జగతో జన్మాదికారణవాదిషు తదర్థగ్రహణదార్ఢ్యాయానుమానమపి వేదాంతవాక్యావిరోధి ప్రమాణం భవన్న నివార్యతే, శ్రుత్యైవచ సహాయత్వేన తర్కస్యాభ్యుపేతత్వాత్।

---

నైయాయికాదులు సంసారికంటె భిన్నుడగు నీశ్వరునియొక్క యస్తిత్వమును నిరూపించుచున్నారు. అట్టియుక్తిరూప మగు ననుమానమే ''జన్మాద్యస్య యతః'' యను సూత్రముచే నభిప్రేత మగుచున్నదా? అనఁగా నీజన్మాదిసూత్ర మనుమాన ప్రమాణముచే నీశ్వరుని సాధించుటకై వర్తించుచున్నదా? యని ప్రమాణమును గూర్చి శంక గలుగ నీజన్మాదిసూత్ర మనుమానప్రమాణసూచక మెంతమాత్రము కాదని సహేతుకముగ ''న। వేదాంతవాక్యకుసుమగ్రథనార్థత్వాత్సూత్రాణామ్''ని వారింపఁబడుచున్నది. హేతుసంగ్రహవాక్యము ''వేదాంతవాక్యాని హి ... వేదాంత వాక్యప్రదర్శనార్థమ్''ను భాష్యముచే వివరింపఁబడుచున్నది. ఈశాస్త్రముచేఁ బరమపురుషార్థసాధనముగా నభిలషింపఁబడు బ్రహ్మావగతి వేదాంతములయొక్క యర్థవిచారణవలనఁ గల్గెడు నిశ్చయముచేఁ బొందఁబడునదియే గాని యనుమానము మొదలుగాఁ గల ప్రమాణాంతరములచే నెంతమాత్రము పొందఁబడునది కాదు. కావున నీసూత్రములచే వేదాంతవాక్యములుదాహరింపఁబడి విచారింపఁబడుచున్నవి. కావున నీసూత్రములకు వేదాంతవాక్యములతోడిసంబంధమును గ్రహింపనిచో నర్థము నించుకేనియును గ్రహించుటకు సావకాశము లేదు. న్యాయవైశేషికసాంఖ్యయోగాదిదర్శనములయందువలె నీ సూత్రములు స్వతంత్రముగ నర్థప్రత్యాయకము లెంతమాత్రము గావు మీమాంసా సూత్రముల కెట్లు శ్రుతివాక్యసంబంధమును గ్రహించి యర్థమును దెలిసికొనవలయునో యాతీరుననే యీసూత్రములకు వేదాంతవాక్యసంబంధమును గ్రహించి యర్థమును జెప్పితీరవలయు నని పైవ్రాసిన హేతుసంగ్రహవాక్యార్థము ''వేదాంతవాక్యాని... నానుమానాదిప్రమాణాంతరనిర్వృత్తా'' అను భాష్యముచేఁ బ్రదర్శింపఁబడుచున్నది.

అట్లైనచో నీవేదాంతవాక్యార్థగ్రహణమునకు ననుమానప్రమాణముతో నెంతమాత్ర మవసరము లేదా? యను శంక గలుగ వేదాంతవాక్యార్థనిశ్చయమును గూర్చి వేదాంతవాక్యముకవిరుద్ధమగు ననుమానముగూడఁ బ్రమాణముగా గ్రహింపఁబడుచుండు నని ''సత్సు తు ... న నివార్యతే'' యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. వేదాంతవాక్యార్థనిశ్చయముచేతనే బ్రహ్మావగతి గలుగ ననుమానప్రమాణము నెందులకు స్వీకరింపవలయు నన శ్రుతిచేతనే తర్కసహాయము

శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః" (బృహ. 2-4-5) ఇతి శ్రుతిః "పండితో మేధావీ గన్ధారానేవమేవేహాచార్యవాన్ పురుషో వేద" (ఛాందో. 6-14-2) ఇతి చ పురుషబుద్ధిసాహాయ్యమాత్మనో దర్శయతి। న ధర్మజిజ్ఞాసాయామివ శ్రుత్యాదయ ఏవ ప్రమాణం, బ్రహ్మజిజ్ఞాసాయామ్। కింతు శ్రుత్యాదయోఽనుభవాదయశ్చ యథాసంభవమిహ ప్రమాణం, అనుభవావసానత్వాద్భూతవస్తువిషయత్వాచ్చ బ్రహ్మవిజ్ఞానస్య। కర్తవ్యే హి విషయే నానుభవాపేక్షాఽస్తీతి శ్రుత్యాదీనామేవ ప్రామాణ్యం స్యాత్పురుషాధీనాత్మలాభత్వాచ్చ కర్తవ్యస్య।

---

గూడ నంగీకరింపఁబడుటంజేసి తర్క మంగీకరింపఁబడుచున్న దని "శ్రుత్యైవ చ సహాయత్వేన తర్కస్యాభ్యుపేతత్వాత్" అని హేతువాక్యము ప్రదర్శింపఁబడుచున్నది. ఈ హేతువాక్యము "తథాహి... దర్శయతి" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది. "శ్రోతవ్యః మంతవ్య" యను శ్రుతియందు "మంతవ్య" యను శబ్దముచే యుక్తిసహాకృత మగు మననము విధింపఁబడుటంజేసి యుక్తి యొక్క యావశ్యకత చూపఁబడుచున్నది. మేధావి యగు పండితుఁ డాప్తోపదేశముచేఁ దనగాంధారదేశముల నెట్లు పొందెనో యాతీరుననే యాచార్యోపదేశమును బడసిన పురుషుఁడు గూడఁ దెలిసికొను నను శ్రుతి పురుషబుద్ధిరూప మగు తర్కముయొక్క సాహాయ్య మీ వేదాంతశాస్త్రశ్రవణ మందావశ్యక మని యభిప్రాయము. వేదవాక్యార్థనిర్ణయము నలసినే ప్రయోజనము గలుచోఁ దదర్థనిర్ణాయకములగు శ్రుతిలింగవాక్యప్రకరణస్థానసమాఖ్య లను షట్ప్రమాణములనే ధర్మజిజ్ఞాసయందువలె నేల గ్రహింపఁగూడదు? అనుమానాదిప్రమాణముల కవసర మేల? యనఁగా నిందు శ్రుత్యాదులు ననుభవాదులును గూడ యథోచితముగఁ బ్రమాణము లని "న ధర్మజిజ్ఞాసాయామివ ... ప్రమాణమ్" అను భాష్యముచే వివరింపఁబడుచున్నది. అనుభవాదులను గూడఁ బ్రమాణముగా గ్రహించుటకుఁ గారణము "అనుభవావసానత్వాద్భూతవస్తువిషయత్వాచ్చ బ్రహ్మవిజ్ఞానస్య" అను వాక్యముచేఁ బ్రదర్శింపఁబడుచున్నది. బ్రహ్మవిజ్ఞానము సిద్ధవస్తువిషయ మగుటంజేసి యనుభవము గలుగకపోయినచో జిజ్ఞాస నివృత్తిఁ జెందదు. కావున ననుభవముగూడఁ బ్రమాణముగా గ్రహింపఁబడుచున్నదని యర్థము. ఈ హేతువాక్యము "కర్తవ్యే హి విషయే... భూతవస్తువిషయత్వాత్" అను భాష్యముచే వివరింపఁబడుచున్నది. ధర్మజిజ్ఞాసయందుఁ గర్తవ్యమే విషయముగా నుపదేశింపఁబడుచున్నది. కర్తవ్యమన్ననో యొకపురుషునియొక్క వ్యాపారమున కధీనమగు స్వరూపము గలదియగుటంజేసి స్వతస్సిద్ధరూపము నెట్టిదానిని గలిగియుండకపోవుటచే నద్దానిని దెలిసికొనుట కనుభవముతో నెంతమాత్రమును బనిలేదు. కావునఁ గర్తవ్యమగు కర్మ నెట్లు నిర్వర్తింపవలయునో యద్దానిని యథోచితముగఁ దెలిసి

కర్తుమకర్తుమన్యథా వా కర్తుం శక్యం లౌకికం వైదికం చ కర్మ । యథాఽశ్వేన గచ్ఛతి, పద్భ్యామన్యథా వా, న వా గచ్ఛతీతి తథా "అతిరాత్రే షోడశినం గృహ్ణాతి, నాతిరాత్రే షోడశినం గృహ్ణాతి" "ఉదితే జుహోతి, అనుదితే జుహోతి" ఇతి విధిప్రతిషేధాశ్చాత్రార్థవంతః స్యుః, వికల్పోత్సర్గాపవాదాశ్చ ।

---

కొనుటకు శ్రుత్యర్థముమాత్రమే యవసరమగుటంజేసి శ్రుత్యాదులుమాత్రమే ధర్మజిజ్ఞాసయందుఁ బ్రమాణములుగాఁ గ్రహింపఁబడుచున్నవని "కర్తవ్యే హి విషయే... ......కర్తవ్యస్య విషయస్య" యను భాష్యముచే నిర్వచించి ధర్మజిజ్ఞాసయందనుభవాదుల కవసరము లేదని చెప్పుచున్నారు

ఇంతియ కాదు; కర్తవ్యము వాక్యములచే బోధింపఁబడినను సద్వాని స్వరూపము సిద్ధముగాక పురుషాధీనమే యనుటకు నుద్దేశింపఁబడిన కార్యము పురుషునిచేఁ జేయఁబడుటకుఁగాని, చేయఁబడకుండుటకుఁగాని, వేఱొకవిధమునఁ జేయఁబడుటకుఁగాని సావకాశము నిచ్చుచుండును. ఎట్లన — గమన మను క్రియ పురుషాధీనమై కాళ్లతోఁగాని గుఱ్ఱముపైఁగాని లేక మఱియొకరీతిగాఁగాని చేయఁబడుట కవకాశము గలిగియుండుటయేగాక మానివేయఁబడుటకుఁగూడ నవకాశము నిచ్చుచున్నది. లౌకికమగు గమనక్రియ యెట్లు పురుషాధీనమో యాతీరుననే వైదికక్రియగూడఁ బురుషాధీనమే యనుటకుఁ బలునిదర్శనములు వేదమందుఁ దెలియవచ్చుచున్నవి. ఎట్లన—అతిరాత్ర మను క్రతువునందు 'షోడశి' యను గ్రహమును గ్రహింపవలయుననియు గ్రహింపనక్కఱలేదనియుఁ జెప్పు సమాన బలము గల శ్రుతివాక్యములు వినవచ్చుటచే షోడశిగ్రహమును గ్రహించినను గ్రహింపకపోయినను నతిరాత్రక్రతువువలనఁ బ్రత్యవాయము గలుగ నేరదు. గ్రహణాగ్రహణములు పురుషాధీనములుగదా ! అతీరుననే యుదితానుదిత హోమములు గూడను. అగ్నిహోత్రహోమము సూర్యోదయమునకుఁ బూర్వమునఁగాని పరమునఁగాని చేయవలయునని శ్రుతులు వినవచ్చుచున్నవి. ఇట్లు విధులును ప్రతిషేధములును వికల్పములు నుత్సర్గములు నపవాదములును ధర్మజిజ్ఞాసయందుఁ బ్రయోజనములను గనుచున్నవి. విధ్యాదులయందలి విషయములు సిద్ధవస్తువులు గాక కర్మరూపములే యగుటంజేసి యవ్వానిఁ గూర్చి యనుభవమున కెంతమాత్రము ప్రయోజనములేదు. కావున ధర్మజిజ్ఞాసయందు శ్రుత్యాదులే ప్రమాణమని "కర్తుమకర్తుం... వికల్పోత్సర్గాపవాదాశ్చ" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది.

విధులన "యావజ్జీవమగ్నిహోత్రం జుహుయాత్" "అహరహస్సంధ్యాముపాసీత" మున్నగునవి. ప్రతిషేధములన్ననో "నానృతం వదేత్" "న పరదారాన్ గచ్ఛేత్" "న కలంజం భక్షయేత్"నునవి. వికల్పములు "వ్రీహిభిర్యవైర్వా జు-

న తు వస్త్వేవం నైవమస్తి నాస్తీతి వా వికల్ప్యతే। వికల్పనాస్తు పురుషబుద్ధ్యపేక్షాః। న వస్తుయాథాత్మ్యజ్ఞానం పురుషబుద్ధ్యపేక్షమ్ । కిం తర్హి వస్తుతంత్రమేవ తత్ । నహి స్థాణావేకస్మిన్ స్థాణుర్వా పురుషోఽన్యో వేతి తత్త్వజ్ఞానం భవతి । తత్ర పురుషోఽన్యో వేతి మిథ్యాజ్ఞానం। స్థాణురేవేతి తత్త్వజ్ఞానం, వస్తుతంత్రత్వాత్। ఏవం భూతవస్తువిషయాణాం ప్రామాణ్యం వస్తుతంత్రమ్ ।

---

హోతి'' మున్నగునవి. ఉత్సర్గ మనఁగా సామాన్యశాస్త్రము. ''నహింస్యాత్సర్వా-భూతాని'' మున్నగునవి. అపవాదమన విశేషశాస్త్రము ''అగ్నిషోమీయం పశు-మాలభేత'' మున్నగునవి. కర్మయందుఁ జేయుట మానుట వేఱొకవిధముగఁ జేయుట యను వికల్పములకవకాశముగల్గునట్లు సిద్ధవస్తువులయందు నెట్టివికల్పము లకు నవకాశము లేదు. "ఈవస్తువిట్లున్నది; ఇట్లు లేద"నువికల్పములకు వస్తువునం దెంతమాత్ర మవకాశము లేదు. ఏలయన, వికల్పములన్ననో పురుషబుద్ధ్యపేక్షములు. వస్తుయాథాత్మ్యజ్ఞాన మన్ననో పురుషబుద్ధి నెంతమాత్ర మపేక్షింపదు. కావున వస్తుయాథాత్మ్యజ్ఞానమున కనుభవాపేక్ష గలదని "నతు వస్తు... పురుష-బుద్ధ్యపేక్షమ్మ"ను భాష్యముచేఁ బ్రదర్శింపఁబడుచున్నది. పురుషబుద్ధి యనఁగా నంతఃకరణమని యభిప్రాయము. వికల్పన మన సంశయవిపర్యయములు. వస్తు యాథాత్మ్యజ్ఞానము పురుషబుద్ధి నపేక్షింపనిచో మఱియెద్దానిన పేక్షించు నని మధ్యస్థ ప్రశ్నము "కిం తర్హి" యనుదానిచేఁ బ్రదర్శింపఁబడుచున్నది. వస్తుయాథాత్మ్య జ్ఞానము వస్త్వధీనమని "వస్త్వధీనమేవ తత్త"ను భాష్యముచే సంగ్రహముగఁ జెప్పఁ బడి యాసంగ్రహవాక్యము "న హి... భూతవస్తువిషయత్వాత్త''ను భాష్యముచే వివరింపఁబడుచున్నది. ఈభాష్యమునందు దృష్టాంతప్రదర్శనపురస్సరంబుగ మిథ్యా జ్ఞాన తత్త్వజ్ఞానములు ప్రదర్శింపఁబడుచున్నవి. ఎట్లన నొకస్థాణువునందుఁ బురుషుఁడా? స్థాణువా? లేక వేఱొకటియా? యనునంతఃకరణవికల్పము తత్త్వజ్ఞానమెంతమాత్రము గాదని "నహి భవతి" యనుభాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. పైమూఁడువికల్పముల యందును బురుషుఁడనియుఁగాని వేఱొకటియనియుఁ గాని తలంచుట మిథ్యారూప మగునజ్ఞానమని చెప్పఁబడుచున్నదని "తత్రపురుషోఽన్యో వేతి మిథ్యాజ్ఞానమ్మ"ను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. అయ్యది పురుషుఁడుగాదు వేఱొకటియునుగాదు స్థాణువే' యను నిశ్చయము తత్త్వజ్ఞానము. ఏలయన నియ్యది వస్త్వధీనమై వస్తుస్వరూపబోధకమగుటం జేసియే యని "స్థాణురేవేతి తత్త్వజ్ఞానం, వస్తుతంత్ర త్వాత్త"ను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. ఇట్టి దృష్టాంతముచే సిద్ధమగు వ్యాప్తిని "ఏవం భూతవస్తువిషయాణాం ప్రామాణ్యం వస్తుతంత్రమ్మ"ని నిర్వచించు చున్నారు. అనఁగా భూతవస్తువుల ననఁగా సిద్ధవస్తువులఁ గూర్చిన ప్రామాణ్యము

తత్రైవం సతి బ్రహ్మజ్ఞానమపి వస్తుతంత్రమేవ, భూతవస్తువిషయత్వాత్ ।నను భూత-వస్తుత్వే బ్రహ్మణః ప్రమాణాన్తరవిషయత్వమేవేతి వేదాన్తవాక్యవిచారణాఽనర్థికైవ ప్రాప్తా । న। ఇంద్రియావిషయత్వేన సంబంధాగ్రహణాత్ । స్వభావతో విషయవిషయాణీంద్రియాణి న బ్రహ్మవిషయాణి ।

---

వస్తుతంత్రమేయని యర్థము.

ఇట్టి లోకసిద్ధమగు వ్యాప్తిచేఁ బ్రకృతము "తత్రైవం సతి బ్రహ్మజ్ఞాన-మపి వస్తుతంత్రమేవ, భూతవస్తువిషయత్వాత్త"ను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. అనఁగా బ్రహ్మజ్ఞానముగూడ భూతవస్తువిషయమే యగుటంజేసి యయ్యది యు వస్తుతంత్రమేకాని వేఱొకవిధమున నలవడునదికాదు. కావున శ్రుత్యాదులు ననుభవాదులుగూడ బ్రహ్మజ్ఞానమునందు యథోచితములగు ప్రమాణము లని తాత్పర్యము.

బ్రహ్మము భూతవస్తువేయగుచోఁ బ్రత్యక్షానుమానము లను ప్రమాణ ములచే గ్రహింపఁబడునదియేయగును. అట్లు గ్రహింపఁబడినచో వేదాంతవాక్య విచారమువలనఁ గల్గుప్రయోజనము తెలియఁబడదు కావున బ్రహ్మజ్ఞానమును గూర్చి వేదాంతవాక్యవిచారణ నిరర్థకమే యగునని "నను భూతవస్తుత్వే బ్రహ్మణః... అనర్థికైవప్రాప్తా" యని మధ్యస్థుఁడు ప్రశ్నించుచున్నాఁడు. ప్రమా ణాంతరవిషయత్వమనఁ బ్రత్యక్షానుమానములచేఁ దెలియఁబడునదియని యభిప్రా యము. ఇట్టి యాక్షేపము 'న' యని పరిహరింపఁబడుచున్నది. పరిహారమునకు హేతువు "ఇంద్రియావిషయత్వేన సంబంధాగ్రహణాత్త"ను సంగ్రహవాక్య ముచేఁ జెప్పఁబడుచున్నది. బ్రహ్మ మింద్రియములకు విషయముకాకపోవుటచే లింగలింగిసంబంధము ఘటింపకపోవుటవలన బ్రహ్మము ప్రమాణాంతరములచే గ్రహింపఁబడదని యభిప్రాయము. పైసంగ్రహవాక్యము "స్వభావతః......... నిశ్చేతు"మ్మను భాష్యముచే వివరింపఁబడుచున్నది. ఇంద్రియములు స్వభావముచే శబ్దాదివిషయములను మాత్రమే విషయములనుగా గ్రహించుచుండును గాని బ్రహ్మము నెంతమాత్రమును గ్రహింపఁజాలవని "స్వభావతః విషయవిషయాణీంద్రియాణి న బ్రహ్మవిషయాణి" యను భాష్యముచే నింద్రియ సామర్థ్యము వ్యక్తీకరింపఁబడుచున్నది. ఇఁక బ్రహ్మ మింద్రియములకుఁ దెలియఁ బడినపుడు గదా, యీకార్యరూపమగు జగము బ్రహ్మముతో సంబంధించె నని తెలిసికొనఁబడును. అట్లు గాక కార్యరూపమగు నీజగత్తే యింద్రియములచేఁ దెలిసికొనఁబడుచున్నది గాని ఈజగత్తు బ్రహ్మముతో సంబంధించియున్నదో మఱియొకదానితో సంబంధించియున్నదో నిశ్చయించుట కవకాశము చాలమి బ్రహ్మము ప్రమాణాంతరవిషయ మెంతమాత్రము గాదు. కావున వేదాంత

సతి హీంద్రియవిషయత్వే బ్రహ్మణః ఇదం బ్రహ్మణా సంబద్ధం కార్యమితి గృహ్యేత । కార్యమాత్రమేవ తు గృహ్యమాణం కిం బ్రహ్మణా సంబద్ధం కిమన్యేన కేనచిద్వా సంబద్ధమితి న శక్యం నిశ్చేతుమ్ । తస్మాజ్జన్మాదిసూత్రం నానుమానోపన్యాసార్థమ్, కిం తర్హి వేదాంతవాక్యప్రదర్శనార్థమ్ । కింపునస్తద్వేదాంతవాక్యం యత్సూత్రేణేహ లిలక్షయిషితమ్। "భృగుర్వై వారుణిః । వరుణం పితరి ముపససార । అధీహి భగవో బ్రహ్మేతి " ఇత్యుపక్రమ్య ఆహ— " యతో వా ఇమాని భూతాని జాయన్తే. యేన జాతాని జీవంతి । యత్ప్రయన్త్యభిసంవిశన్తి। తద్విజిజ్ఞాసస్వ । తద్బ్రహ్మేతి" (తైత్తి 3-1) ।

---

వాక్యార్థవిచారణ యెంతమాత్రము నిరర్థకము గాదను నాశయముచే "సతి హి... నిశ్చేతుమ్మ" ను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది.

ఇట్లు బ్రహ్మజ్ఞానము వేదాంతవాక్యార్థ నిర్ణయముచేఁ దక్క వేఱొక విధమున నలవడదని చెప్పి ప్రకృతము "తస్మాజ్జన్మాదిసూత్రం నానుమానోపన్యాసార్థమ్మ"ని యుపసంహరింపఁబడుచున్నది. అనఁగా "జన్మాద్యస్య యత"యను సూత్రమనుమానముయొక్క యుపన్యాసముకొఱకుఁ గాదని యర్థము. అట్లైనచో "కిం తర్హీమితి యెందులక"ని మధ్యస్థుఁ డడుగ "వేదాంతవాక్యప్రదర్శనార్థమ్మ"ని సమాధానము జెప్పఁబడుచున్నది. అనఁగా నీజన్మాదిసూత్రము వేదాంతవాక్యములఁ బ్రదర్శించుటయే ప్రయోజనముగాఁ గలిగి ప్రవర్తించుచున్నదని భావము అట్లైనచో నీసూత్రముచే నిచటఁ బ్రదర్శింపఁదలఁచిన వేదాంతవాక్యమెయ్యది యని "కిం పునః ... లిలక్షయిషితమ్మ" ను వాక్యముచే మధ్యస్థుఁడు ప్రశ్నింప నీయధికరణమునకు విషయవాక్యము "భృగుర్వై వారుణిః, ... అభిసంవిశంతీతి" యను భాష్యముచే సుస్పష్టముగఁ బ్రదర్శింపఁబడుచున్నది. ఈభాష్యముచేఁ దైత్తిరీయోపనిషత్తునందలి భృగువల్లి యనుదానియం దుపక్రమము మొదలు "ఆనందం ప్రయంత్యభిసంవిశంతి" యను వాక్యమువఱకును గల గ్రంథమంతయు నిచట విషయవాక్యమనియు నద్దానివలనఁ దెలియవచ్చెడి యర్థమే సకలశ్రుతిశిరోవతంస మగు నిర్ణయమనియు సూచింపఁబడుచున్నది. ఈప్రకరణము (భృగువల్లి) "భృగుర్వై వారుణిః, వరుణం పితరముపససార" యను వాక్యములతోఁ బ్రారంభమై "ఇత్యుపనిషత్తు" ను పదములతో ముగియుచున్నది. ఇందలివిషయ మేమన 'వరుణపుత్రుఁడగు భృగువనునాతఁడు బ్రహ్మవేత్తయుత్కృష్టతను బొందుననుట లౌకికప్రసిద్ధిని వైదికప్రసిద్ధిని బుష్కలముగఁ దెలిసికొనినవాఁడై యట్టిపరమపురుషార్థసాధనం బగు బ్రహ్మమును, దెలిసికొనవలయునను తీవ్రేచ్ఛతో "పరీక్ష్య లోకాన్కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేన తద్విజ్ఞానార్థం స గురు-

మేవాభిగచ్ఛేత్ శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్" "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా" యను శ్రుతిస్మృతులచే విధింపఁబడిన విధమునఁ దండ్రి యగు వరుణుని కడకుఁ జని "అధీహి భగవో బ్రహ్మ" యను మంత్రపురస్సరంబుగఁ దనకు బ్రహ్మము నుపదేశింపు మని ప్రార్థింప నా వరుణుండు "అన్నం ప్రాణం చక్షుః శ్రోత్రం మనో వాచమ్మ"ని బ్రహ్మోపలబ్ధిద్వారములను బ్రదర్శించి పిమ్మట "యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి, యత్ప్రయం-త్యభిసంవిశంతి, తద్విజిజ్ఞాసస్వ। తద్బ్రహ్మ" యని బ్రహ్మలక్షణమును తటస్థముగ నుపదేశించి యట్టిబ్రహ్మమును గూర్చి విశేషవిచారంబును జేయు మని యాజ్ఞాపిం-చెను. పిమ్మట నాభృగువు దీర్ఘతపం బొనరించి యన్నమువలననే సకలభూతములు పుట్టుటయుఁ బుట్టినవి యన్నముచే జీవించుటయు నన్నమునందే లయముఁ జెందుటయుఁ జూచియన్నమే బ్రహ్మమని తెలిసికొనెను. కాని యన్నము నశ్వర మగుటను, దెలిసి యద్దానిని బ్రహ్మముగా నిర్ణయించుటకు సంశయ మొంది మఱలఁ దండ్రి కడకుఁ జని బ్రహ్మ నుపదేశింపుఁ డని ప్రార్థింపఁగాఁ దండ్రి మఱల తపస్సే బ్రహ్మము కావునఁ దపస్సుచే బ్రహ్మమును విచారింపు మని యానతిచ్చెను. పిమ్మట భృగువు దీర్ఘతపం బాచరించి ప్రాణమువలన సకలభూతములు జనించుటయుఁ బ్రాణముచే జీవించుటయుఁ బ్రాణమునందు లయముఁ జెందుటయుఁ దెలిసికొని ప్రాణమును బ్రహ్మముగాఁ దెలిసికొనెను. కాని ప్రాణమును బ్రహ్మముగా నిర్ణయింపఁజాలక తిరుగఁ దండ్రికడకుఁబోయి బ్రహ్మమును బోధింపవలయు నని ప్రశ్నింప నాతఁడు తపస్సే బ్రహ్మము, తపస్సుచే బ్రహ్మమును విచారింపు మని మఱల నాజ్ఞాపించెను. పిమ్మట భృగువు దీర్ఘతపం బొనరించి మనస్సువలన సకలభూతములు పుట్టుటయు మనస్సుచే జీవించుటయు మనస్సునందు లయముఁ జెందుటయుఁ దెలిసికొని మనస్సును బ్రహ్మముగాఁ దెలిసికొనెను. కాని యట్టిమనస్సును బ్రహ్మముగానిర్ణయింపఁజాలక సంశయమునుజెంది మఱలఁ దండ్రికడకుఁ జని బ్రహ్మము నుపదేశింపుఁడని ప్రార్థించెను. తండ్రియన్నతో మఱల "తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ। తపో బ్రహ్మ" యని యానతిచ్చె. పిమ్మట భృగువు తపం బొనరించి విజ్ఞానమువలన సకలభూతములు జనించుటయుఁ విజ్ఞానముచే జీవించుటయు విజ్ఞానమునందు లయము చెందుటయు తెలిసికొని విజ్ఞానమును బ్రహ్మముగాఁ దెలిసికొనెను. కాని యట్టివిజ్ఞానము కూడ బ్రహ్మముగా నిర్ణయింపఁజాలక సంశయగ్రస్తుఁడై మఱలఁ దండ్రికడకుఁ జని బ్రహ్మము నుపదేశింపుఁ డని ప్రార్థింపఁగాఁ దండ్రి "తపోబ్రహ్మ, తపసాబ్రహ్మ విజిజ్ఞాసస్వ" యని మఱల నానతిచ్చెను. భృగు వన్నతో దీర్ఘతపం బాచరించి యానందమువలన సకలభూతములు జనించుటయు నానందముచే జీవించుటయు నానందమునందే

తస్య చ నిర్ణయవాక్యమ్— "ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే। ఆనందేన జాతాని జీవంతి । ఆనందం ప్రయంత్యభిసంవిశన్తీతి" (తై. 3-6.) అన్యాన్యప్యేవంజాతీయకాని వాక్యాని నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావసర్వజ్ఞస్వరూప-కారణవిషయాణ్యుదాహర్తవ్యాని॥ ౨.

మగ్న మగుటయుఁ దెలిసికొనుటయే గాక యట్టియానందమే బ్రహ్మమని నిర్ణయముఁ జెందెను. ఆనిర్ణయముచేఁ గృతకృత్యత నొందుటవలనఁ దిరుగఁ దండ్రి కడకుఁ జనినట్లు వినవచ్చుటలేదు.

ప్రకృతపుభృగువల్లియందు బ్రహ్మమును దెలియఁగోరిన భృగు వన్న ప్రాణమనోవిజ్ఞానానందములఁ బుష్కలముగ విచారించి యన్నప్రాణమనోవిజ్ఞానము లెంతమాత్రమును బ్రహ్మరూపములు గావనియు నానంద మొక్కటియే బ్రహ్మ మనియుఁ దెలిసికొనుటచే, భృగువుచేఁ దెలిసికొనఁబడిన యానంద మొక్కటియే బ్రహ్మ మనియుఁ దద్భిన్నపదార్థము లెవ్వియును బ్రహ్మ మెంత మాత్రమును గానోప వనియు నట్టియానందరూప మగు బ్రహ్మమును దెలిసికొనుటచే మాత్రమే పరమపురుషార్థ మగు ముక్తి యలవడు నన్నియు భృగువల్లి వలనఁ దేటతెల్ల మగుచున్నది. ఈభృగువల్లియందు నన్నప్రాణమనోవిజ్ఞానానంద ములకంటె భిన్నము లగు పదార్థము లెవ్వియును వినఁబడకపోవుటచేతను నేతద్భిన్నము లగు పదార్థముల నించుకేనియు బ్రహ్మముగా విచారణకోటియందు స్వీకరింపకపోవుటచేతను నేతద్భిన్నపదార్థములు సంశయకోటియందుఁ గూడ నెక్కుటకు వీలులేనట్లు దెలియవచ్చుచున్నది. ఇంతియ కాదు. దీనివలన బ్రహ్మ మానందమాత్రమే కాని వేఱొండు గాదనియుఁ గూడఁ దెలియవచ్చుచున్నది. దానంజేసి వేదవ్యాసభగవానులు జగజ్జన్మాదికారణం బగు బ్రహ్మ మానంద మాత్రమే కాని వేఱొండు గానోప దని యుపదేశింపను నీచతుస్సూత్రిని బ్రదర్శించి నట్లు సువ్యక్త మగుచున్నయది. ఇట్టిపరిస్థితులయందుఁ జతుస్సూత్రిచేఁ బ్రతిజ్ఞ చేయఁబడిన బ్రహ్మమును నారాయణుఁడు, హరి, శివుఁడు, కృష్ణుఁడు, రాముఁడు, శక్తి, ప్రధానము, పరమాణువు లని, యిట్లు పలువిధముల వ్యక్తీకరించుచు గ్రంథాడంబరములఁ గావించిన మహనీయుల నేమనవలయునో ప్రాజ్ఞులు నిర్ణయింతురుగాక !

భృగువల్లియందు "భృగుర్వై వారుణిః। వరుణం పితరముపససార। అధీహి భగవో బ్రహ్మేతి" యను వాక్యము "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యను సూత్రమునందలి "అథ" యను శబ్దార్థమును వ్యక్తీకరించుచున్నది. 'తద్విజిజ్ఞాసస్వ। తద్బ్రహ్మ' యను వాక్యార్థమును, 'బ్రహ్మజిజ్ఞాసా' యను శబము సూచించు

## శాస్త్రయోనిత్వాధికరణమ్

జగత్కారణత్వప్రదర్శనేన సర్వజ్ఞం బ్రహ్మేత్యుపక్షిప్తం తదేవ ద్రఢయన్నాహ—

## శాస్త్రయోనిత్వాత్ ॥ 3.

చున్నది. "యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి, యత్ప్రయంత్యభిసంవిశంతి, తద్బ్రహ్మ" యను వాక్యములను "జన్మాద్యస్య యతః" యను సూత్రము సూచించుచు బ్రహ్మముయొక్క యుపలక్షణమును గూడ సూచించుచున్నది. ఇయ్యది యుపలక్షణ మని "తస్య చ నిర్ణయవాక్యమ్మ"ను భాష్యముచే సూచింపఁబడుచున్నది. నిర్ణయవాక్యమునం దానందము బ్రహ్మముగా వినఁబడుటచే నిందు బ్రాధానాదుల శంకించుట కెంతమాత్రము నవకాశము లేదని సుస్పష్టము. ఈతైత్తిరీయశ్రుతి యొక్కటియేగాక ఈతైత్తిరీయశ్రుతితో సమాన మగు నర్థముగల వేదాంతవాక్యములు గూడ విషయవాక్యములుగా గ్రహింపవచ్చుననియు నితరస్థలములందుఁ దెలియవచ్చెడి శ్రుతులుఁ గూడ నీసూత్రమునందు గ్రథనము చేయఁబడుచున్న వనియు "అన్యాన్యప్యేవంజాతీయకాని వాక్యాన్యుదాహర్తవ్యాని" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. ఎట్టివాక్యము లిట నభిప్రేతము లగుచున్న వన "నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావసర్వజ్ఞస్వరూపకారణవిషయాణి" యని నిరూపింపఁబడుచున్నది. నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావ మనుపద మానందపదవివరణమే. ఇచట సర్వజ్ఞ మనఁగా విజ్ఞానఘన మని యుత్తరాధికరణమువలనఁ దెలియవచ్చుచున్నది. ఇది జన్మాద్యధికరణము.

## శాస్త్రయోనిత్వాత్

ఉత్తరాధికరణ మన్ననో జన్మాద్యధికరణమువలెనే బ్రహ్మమునకు లక్షణప్రమాణములుఁ ప్రదర్శించుటకును నీయధికరణముచే బోధింపఁబడినవిషయమునే ధ్రువపఱుచుటకును సర్వవిధములఁ బ్రవర్తించుచున్న దను నాశయమును వ్యక్తీకరించుచు "జగత్కారణత్వప్రదర్శనేన సర్వజ్ఞం బ్రహ్మేత్యుపక్షిప్తమ్ తదేవ ద్రఢయన్నాహ-శాస్త్రయోనిత్వాదితి" యను భాష్యముచేఁ బ్రదర్శింపఁబడుచున్నది. అనఁగా జగత్కారణ మని ప్రదర్శింపఁబడిన బ్రహ్మమును సర్వజ్ఞ మనుటకు హేతువుగా నీశాస్త్రయోనిత్వాధికరణ మలరారుచున్న దని యభిప్రాయము. ఈ'శాస్త్రయోనిత్వా'త్తను సూత్రము బ్రహ్మమునకు లక్షణపరముగను ప్రమాణపరముగను రెండువిధము లగు వ్యుత్పత్తిని గల్గి రెండువిధము లగు విషయవాక్యములను సూచించుచు రెండధికరణములను బ్రదర్శించుటచే దంత్రముగా గ్రహింప

మహత ఋగ్వేదాదేః శాస్త్రస్యానేకవిద్యాస్థానోపబృంహితస్య ప్రదీపవ-త్సర్వార్థావద్యోతినః సర్వజ్ఞకల్పస్య యోనిః కారణం బ్రహ్మ । న హీదృశస్య

---

సూత్రతాత్పర్య కభిప్రేత మని గ్రహింపవలయును. శాస్త్రయోనిశబ్దమునకు "శాస్త్రం, యోనిః= కారణం, ప్రమాణమస్య బ్రహ్మణః స్వరూపాధిగమే" యను బహువ్రీహిపరముగా నర్థమును గ్రహింపవలయును. శాస్త్రయోనిశబ్దము నకు షష్ఠీతత్పురుషపరముగా నర్థమును గ్రహించినచో శాస్త్రమునకు బ్రహ్మము కారణము గావున బ్రహ్మ సర్వజ్ఞ మను నర్థము లభించును. బహువ్రీహిపరముగా నర్థము గ్రహించినచో శాస్త్రము ప్రమాణముగాఁ గలది బ్రహ్మమను నర్థము లభించును. మొదటియర్థముచే బ్రహ్మలక్షణమును రెండవయర్థముచే బ్రహ్మప్రమాణ మును సిద్ధించునట్లు వేదవ్యాసభగవాను లీసూత్రమును రచించినారు. షష్ఠీతత్పురు షము నుద్దేశించి "మహత ఋగ్వేదాదేః ... సర్వశక్తిత్వం చేతి" యను భాష్యమును, బహువ్రీహ్యర్థము ననుసరించి "అథవా యథోక్తం ... యతో వా ఇమాని భూతాని జాయంత ఇత్యాది" యను భాష్యమును ప్రదర్శింపఁబడుచున్నవి. "శాస్త్రస్య యోనిః = శాస్త్రయోని" యనుచో 'శాస్త్రస్య' యను పదము యొక్క యర్థ మైనుపదములచే నిరూపింపఁబడుచున్నది. ఎట్లన — మహతః = గొప్పదియు ననఁగా గ్రంథముచే నర్థముచేఁ గూడ గొప్పది యని యభిప్రాయము. ఋగ్వేదాదేః = ఋగ్వేదము మొదలుగాఁ గలిగిన, యనఁగా ఋగ్యజుస్సామాథర్వ ణములే స్వరూపముగాఁ గలది యని యభిప్రాయము.

అనేకవిద్యాస్థానోపబృంహితస్య = శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, జ్యోతిషము, నిరుక్తము, కల్పము, పురాణములు, న్యాయము, మీమాంస, ధర్మశాస్త్ర మను పదివిద్యాస్థానములచేఁ బ్రకాశింపఁజేయఁబడు నర్థము గలిగి నదియు, సర్వార్థావద్యోతినః = సకలవిషయముల నన లౌకికవైదికముల నన్నిం టిని గూడఁ బ్రకాశింపఁజేయునదియు, సర్వార్థావద్యోతిత్వమునందు దృష్టాంతము "ప్రదీపవత్తని, సర్వజ్ఞకల్పస్య = సర్వజ్ఞునితో సదృశ మగునట్టిదియు నని.

ఇచట యోనిశబ్దము కారణపరము. అనఁగా శాస్త్రమునకుఁ గారణము బ్రహ్మ మగుటవలన బ్రహ్మము సర్వజ్ఞ మని సూత్రతాత్పర్యము. శాస్త్రమునకుఁ గారణ మగుటచే బ్రహ్మము సర్వజ్ఞ మనుటకుఁ దగు యుక్తి "న హీదృశస్య... సంభవోఽస్తి" యని ప్రదర్శింపఁబడుచున్నది. అనఁగా నిట్టిఋగ్వేదాదిస్వరూపము గల శాస్త్రము సర్వజ్ఞుఁడును సర్వశక్తియు నగు బ్రహ్మముకంటె వేఱగు మఱి యొకనివలనఁ గలుగుట కెంతమాత్ర మవకాశము లేదు. అనఁగా సర్వజ్ఞుఁ డగు నీశ్వరునివలననే గల్గినదని యభిప్రాయము. ప్రకృతపు యుక్తికిఁ దగువ్యాప్తి దృష్టాంతపురస్సరంబుగ "యద్యద్విస్తరార్థం శాస్త్రం...ప్రసిద్ధం లోకే" యను

శాస్త్రస్య ఋగ్వేదాదిలక్షణస్యానేకవిద్యాస్థానోపబృంహితస్య ప్రదీపవత్సర్వార్థావద్యోతినః సర్వజ్ఞకల్పస్య యోనిః కారణం బ్రహ్మ। న హీదృశస్య శాస్త్రస్య ఋగ్వేదాదిలక్షణస్య సర్వజ్ఞగుణాన్వితస్య సర్వజ్ఞాదన్యతః సంభవోఽస్తి యద్యద్విస్తరార్థం శాస్త్రం యస్మాత్పురుషవిశేషాత్సంభవతి, యథా వ్యాకరణాది పాణిన్యాదేర్జ్ఞేయైకదేశార్థమపి స తతోఽప్యధికతరవిజ్ఞాన ఇతి ప్రసిద్ధం లోకే। కిము వక్తవ్యమనేకశాఖాభేదభిన్నస్య దేవతిర్యఙ్మనుష్యవర్ణాశ్రమాదిప్రవిభాగహేతోర్ఋగ్వేదాద్యాఖ్యస్య సర్వజ్ఞానాకరస్యాప్రయత్నేనైవ లీలాన్యాయేన పురుషనిశ్వాసవద్యస్మాన్మహతో భూతాద్యోనేః సంభవః "అస్య మహతో భూతస్య నిశ్వసితమేతద్యదృగ్వేదః" (బృహ. 2-4-10) ఇత్యాదిశ్రుతేః। తస్య మహతో భూతస్య నిరతిశయం సర్వజ్ఞత్వం సర్వశక్తిమత్త్వం చేతి।

---

భాష్యముచేఁ బ్రదర్శింపఁబడుచున్నది. లోకములోఁ దెలిసికొనఁబడు విషయములలో నేకదేశములగు వ్యాకరణాదులను రచించిన పాణిన్యాదులే యాయాయి గ్రంథములందుఁ దెలియవచ్చెడి జ్ఞానముకంటె నెక్కుడు జ్ఞానమును గలిగి యున్నట్లు తెలియవచ్చుచున్నది. కావున నేయేపురుషునివలన నెంతెంత విపుల మగు నర్థముతోఁ గూడిన శాస్త్రము బయలువెడలుచున్నదో యాపురుషుఁ డంతకంటె నెక్కుడు విజ్ఞానముతో నలరారు చున్నట్లు లోకమునఁ బ్రసిద్ధము గదా యని యర్థము. ఇట్టివ్యాప్తిజ్ఞానముచే యోజించినను, ననేకశాఖాభేదభిన్న మగునట్టియు దేవతిర్యఙ్మనుష్య వర్ణాశ్రమాదిప్రవిభాగ హేతు వగునట్టియు ఋగ్యజుస్సామాథర్వణము లను పేరు గలిగినట్టియు సకల జ్ఞానముల కాధారభూత మగునట్టియు శాస్త్రము ప్రయత్నముగాఁ బురుషనిశ్వాసము వలె లీలాన్యాయమున నేమహాభూతరూప మగు కారణమువలనఁ బుట్టెనో యట్టిమహాభూతమగు బ్రహ్మము నిరతిశయ మగు సర్వజ్ఞము సర్వశక్తియు నని వేఱఁ జెప్పవలయునా యను కైముతికన్యాయముచే "కిం వక్తవ్యమ్...సర్వశక్తిమత్త్వం చేతి" యను భాష్యముచే దార్ష్టాంతిక మగు బ్రహ్మమునందు సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వములు ప్రదర్శింపఁబడుచున్నవి. బ్రహ్మమువలన ఋగ్వేదాదులు బయలువెడలిన వనుటకుఁ బరమప్రమాణ మగు శ్రుతి "అస్య మహతో భూతస్య నిశ్వసితమేతద్యదృగ్వేదః" ఇత్యాదిశ్రుతే" యను భాష్యముచేఁ బ్రదర్శింపఁ బడుచున్నది. కావున "శాస్త్రస్య యోనిః = శాస్త్రయోని" యనునపు డిచట నుదాహరింపఁబడిన శ్రుతిచే బృహదారణ్యకమందలి మైత్రేయీబ్రాహ్మణ మిచట విషయవాక్య మగుచు "అస్య మహతో భూతస్య నిశ్వసితమేతద్యదృగ్వేదో యజుర్వేదస్సామవేదోఽథర్వాంగిరస ఇతిహాసః పురాణం విద్యా ఉపనిషదః శ్లోకాస్సూత్రాణ్యనువ్యాఖ్యానాని వ్యాఖ్యానాన్యస్యైవైతాని నిశ్వసితాని" యను వాక్యముచే మహాభూత మగు బ్రహ్మమునకు శాస్త్రకారణత్వమును బ్రదర్శించుచు

అథవా యథోక్తమృగ్వేదాదిశాస్త్రం యోనిః కారణం ప్రమాణమస్య బ్రహ్మణో యథావత్స్వరూపాధిగమే । శాస్త్రాదేవ ప్రమాణాజ్జగతో జన్మాదికారణం బ్రహ్మాధిగమ్యత ఇత్యభిప్రాయః।

---

నుత్తరవాక్యమును "ఇదం మహద్భూతమనంతమపారం విజ్ఞానఘన ఏవ" యను వాక్యముచే నాపుహాభూత స్వరూపము విజ్ఞానఘన మని బోధించుచున్నది.

పూర్వాధికరణమున జగజ్జన్మాదికారణత్వ ముపలక్షణముగాను నానందము స్వరూపలక్షణముగాను నెట్లభిప్రేతము లగుచున్నవో యాతీరుననే యీ యధికరణమునందు శాస్త్రకారణత్వ ముపలక్షణముగాను విజ్ఞానఘనము స్వరూపలక్షణముగాను నభిప్రేత మగుచున్నది. ఇంకొకవిశేష మిందుఁ గలదు. మైత్రేయీ బ్రాహ్మణమున శాస్త్రకారణ మగు విజ్ఞానఘన మాత్మ యని వినఁబడుచున్నది. అట్టి శాస్త్రకారణ మగు విజ్ఞానఘనము బ్రహ్మమే యని యిచట సూత్రకారులచే స్మరింపఁబడుచున్నది. కావున బ్రహ్మాత్మల రెండింటికి నభేదము సూత్రకారులచే నప్రతిహతముగ నంగీకరింపఁబడుచున్నట్లు సుస్పష్టముగదా !

ఇఁక బ్రహ్మము ప్రజ్ఞానఘన మనుటకు "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" విజ్ఞానమానందం బ్రహ్మ, ప్రజ్ఞానం బ్రహ్మ, స యథా సైంధవఘనోఽనంతరోఽబాహ్యః కృత్స్నో రసఘన ఏవైవం వా అరేఽయమాత్మాఽనంతరోఽబాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవ, ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తః। యో వై ప్రాణః స ప్రజ్ఞా యా వై ప్రజ్ఞా స ప్రాణ" యను మొదలుగాఁ గల శ్రుతులు సర్వవిధములఁ దోడ్పడుచున్నవి. కావున నీయధికరణవిషయమందు "శాస్త్రయోనిత్వాద్బ్రహ్మ ప్రజ్ఞానఘనమ్మ"ని సూత్రము యొక్క స్వరూపమును గ్రహింపవలయును.

ఇఁక నీయధికరణమునందలియర్థమును బూర్వాధికరణార్థముతోఁ బొందుపఱచి గ్రహించిన బ్రహ్మము విజ్ఞానమును నానందమును స్వరూపముగాఁ గల దని తెలియుచున్నది. ఇయ్యది "శాస్త్రయోనిత్వాత్"ను సూత్రమునకు లక్షణపరముగా సమన్వయము.

ఇఁకఁ బ్రమాణపరముగా ననఁగా బహువ్రీహిసమాసము నుగ్రహించి నచో స్ఫుట మగు నర్థము "అథవా యథోక్తం ఋగ్వేదాదిశాస్త్రం యోనిః కారణం ప్రమాణమస్య బ్రహ్మణో యథావత్స్వరూపాధిగమే" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది. ఇచట యోనిశబ్దము ప్రమాణపర మని "కారణం ప్రమాణమ్మ"ని చెప్పఁబడుచున్నది. ఈయర్థమే ప్రకారాంతరముచే "శాస్త్రాదేవ...ఇత్యభిప్రాయ"యను భాష్యముచే వివరింపఁబడుచున్నది. అనఁగా శాస్త్ర మను ప్రమా

శాస్త్రముదాహృతం పూర్వసూత్రే! "యతో వా ఇమాని భూతాని జాయన్తే" ఇత్యాది! కిమర్థం తర్హీదం సూత్రం, యావతా పూర్వసూత్ర ఏవైవం జాతీయకం శాస్త్రముదాహరతా శాస్త్రయోనిత్వం బ్రహ్మణో దర్శితమ్! ఉచ్యతే —తత్ర పూర్వసూత్రాక్షరేణ స్పష్టం శాస్త్రస్యానుపాదానాజ్జన్మాదికేవలమనుమానముపన్యస్తమిత్యాశంక్యేత! తామాశంకాం నివర్తయితుమిదం సూత్రం ప్రవవృతే శాస్త్రయోనిత్వాదితి॥ 3.

---

ణముచేతనే జగజ్జన్మాదికారణము బ్రహ్మమని తెలియవచ్చెడినిగాని వేఱొకవిధమున నెంతమాత్రము తెలియరాదని యభిప్రాయము ఏశాస్త్రముచే బ్రహ్మము జగజ్జన్మాదికారణమని తెలియఁబడుచున్నదనః బూర్వసూత్రమునం దుదాహరింపఁబడిన భృగువల్లిచేతనే యని "శాస్త్ర ముదాహృతం ..ఇత్యాది" యను భాష్యముచే నిర్వచింపఁబడుచున్నది పూర్వసూత్రమునం దిట్టిశాస్త్రము నుదాహరించుటచే బ్రహ్మమునకు శాస్త్రయోనిత్వ మనఁగా శాస్త్రప్రమాణకత్వము దెలియఁబడఁగా మఱల నేల యీయధికరణముచే విశదము చేయవలయు నని "కిమర్థం తర్హీదం సూత్రం... దర్శితమ్మ"ని మధ్యస్థుఁడు ప్రశ్నింప, నందులకు సమాధానము "ఉచ్యతే... శాస్త్రయోనిత్వాత్త"ను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. అనఁగాఁ బూర్వసూత్రార్థనిరూపణావసరమున శ్రుతి యుదాహరింపఁబడి యర్థము నిరూపింపఁబడినను శాస్త్రప్రమాణకత్వము విస్పష్టముగా వినఁబడక పోవుటచే జన్మాదిసూత్ర మనుమానోపన్యాసార్థ మని యాశంక చేయఁబడెను. అట్టియాశంక కవకాశము లేకుండ "శాస్త్రయోనిత్వాత్త"ను సూత్రము తంత్రముగా స్మరింపఁబడెను. కావున నిట బహువ్రీహిపరముగా నీసూత్రమున కర్థమును నిరూపించుట సర్వవిధముల సూత్రకారాభిమతమే యగుచున్నది.

ఇట్లీ 'శాస్త్రయోనిత్వాత్త'ను సూత్రము జన్మాదిసూత్రమువలెనే బ్రహ్మముయొక్క లక్షణప్రమాణములను బ్రదర్శించుచున్నది.

ఇది శాస్త్రయోనిత్వాధికరణము.

## తత్తు సమన్వయాత్

విజ్ఞానము నానందమును స్వరూపముగాఁ గలిగిన యానంద మనెడి సిద్ధవస్తువు శాస్త్రముచే నుపదేశింపఁబడుచున్న దనియు నద్దానిని దెలిసికొనుటచే బ్రహ్మభావాపత్తిరూప మగు పురుషార్థము లభించు ననియు నింతవఱకునుపదేశింపఁబడియె. ఇట్టియుపదేశము సహింపని జైమినీయు లట్టి బ్రహ్మముశాస్త్రముచే నెంతమాత్రము బోధింపఁబడలే దను నభినివేశముతో జైమిని ప్రోక్తమగు

## సమన్వయాధికరణమ్

కథం పునర్బ్రహ్మణః శాస్త్రప్రమాణకత్వముచ్యతే, యావతా "ఆమ్నాయస్య క్రియార్థత్వాదానర్థక్యమతదర్థానామ్" (జై. సూ. 1-2-1) ఇతి క్రియాపరత్వం శాస్త్రస్య ప్రదర్శితమ్। అతో వేదాన్తానామానర్థక్యమ్। అక్రియార్థత్వాత్। కర్తృ-దేవతాదిప్రకాశనార్థత్వేన వా క్రియావిధిశేషత్వమ్, ఉపాసనాదిక్రియాన్తరవిధా-నార్థత్వం వా। న హి పరినిష్ఠితవస్తుప్రతిపాదనం సంభవతి, ప్రత్యక్షాదివిషయత్వాత్పరి-నిష్ఠితవస్తునః। తత్ప్రతిపాదనే చ హేయోపాదేయరహితే పురుషార్థాభావాత్।

---

ధర్మమీమాంసను నాలవాలముగాఁ జేసికొని "కథం పునర్బ్రహ్మణః శాస్త్ర-ప్రమాణకత్వముచ్యతే" యని ప్రశ్నించుచున్నారు. అనఁగా బ్రహ్మము శాస్త్రముచే నెట్లు బోధింపఁబడుచున్నది? అన నెంతమాత్రము శాస్త్రము బ్రహ్మమును బోధింపలేదని భావము. అందులకుఁ దగుహేతువు "యావతా...స్వవాక్యగతో-పాసనాదికర్మపరత్వమ్మ"ను గ్రంథముచే నుపపాదింపఁబడుచున్నది. శాస్త్రమంతయుఁ గ్రియాపరమే గాని సిద్ధవస్తుబోధక మెంతమాత్రము గాదని "ఆమ్నా-యస్య క్రియార్థత్వాదానర్థక్యమతదర్థానామ్మ"ను సూత్రముచే నిరూపింపఁబడుచున్నది. వేద మంతయుఁ గ్రియాపరమే యగుటంజేసి క్రియాపరములు గాని వాక్యముగ లనర్థకములని పైదానియర్థము. కావున వేదాంతములు సిద్ధవస్తుబోధకము లగుటంజేసి క్రియాపరములు గావనినచో నయ్యవి నిరర్థకము లగు నని "అతో వేదాంతానామానర్థక్యమ్। అక్రియార్థత్వాత్త"ను దోషమును బ్రదర్శించి యాదోషనివృత్తికై "కర్తృదేవతాదిప్రకాశనార్థత్వేన వా క్రియావిధిశేషత్వమ్, ఉపాసనాదిక్రియాంతరవిధానార్థత్వం వా" యని యుపనిషత్తులకుఁ బ్రయోజన మొకటి కల్పింపఁబడుచున్నది అనఁగా వేదమందు విధింపఁబడిన కర్మలతో సంబంధించిన కర్తృస్వరూపమును గాని దేవతాస్వరూపమును గాని ప్రకాశింపఁ జేయుటకైనను లేదా వేదాంతములందుఁ దెలియవచ్చెడి యుపాసనము మొదలుగాఁ గలిగిన క్రియాంతరముల విధించుటకైనను వేదాంతములు ప్రవర్తించిన వనినచో వేదాంతవాక్యములు క్రియావిధులతో సంబంధించినవే యగుచుఁ బ్రయోజనమును గనును అట్లు గాక సిద్ధవస్తువునే వేదాంతములు బోధించిన వనుచో, సిద్ధవస్తువులు ప్రత్యక్షాద్యులచేఁ దెలియఁబడునవి యగుటంజేసి శాస్త్రముచే నెంతమాత్ర ముపదేశింపఁబడ వనియు నొకవేళ సిద్ధవస్తువే యుపదేశింపఁబడినను నయ్యది హేయోపాదేయశూన్య మగుటంజేసి యట్టియుపదేశము పురుషార్థహేతువు గానేర దనియు "నహి పరినిష్ఠితవస్తుప్రతిపాదనం ... పురు-షార్థాభావాత్త"ను భాష్యముచే సిద్ధవస్తుప్రతిపాదకవాక్యముల కానర్థక్యము శంకింపఁబడుచున్నది. అట్టియానర్థక్యమును వారించుటకై జైమిని యర్థవాదవాక్యములకుఁ బ్రామాణ్యమును గల్పించిన విధమున వేదాంతములకుఁ గూడ నర్థ

అత ఏవ "సో౽రోదీత్" ఇత్యేవమాదీనామానర్థక్యం మాభూదితి "విధినా త్వేకవాక్యత్వాత్ స్తుత్యర్థేన విధీనాం స్యుః" (జై. సూ. 1-2-7) ఇతి స్తావకత్వేనార్థవత్త్వముక్తమ్। మన్త్రాణాంచ "ఇషే త్వా" ఇత్యాదీనాం క్రియాతత్సాధనాభిధాయిత్వేన కర్మసమవాయిత్వముక్తమ్। న క్వచిదపి వేదవాక్యానాం విధిసంస్పర్శమన్తరేణార్థవత్తా దృష్టోపపన్నా వా। న చ పరినిష్ఠితే వస్తుస్వరూపే విధిః సంభవతి, క్రియావిషయత్వాద్విధేః। తస్మాత్కర్మాపేక్షితకర్తృస్వరూపదేవతాది-ప్రకాశనేన క్రియావిధిశేషత్వం వేదాన్తానామ్।

---

వాఁగతౌల్యమును సంపాదింపఁదలంచు గూఢాభిసంధితో "అత ఏవ సో౽రోదీత్ ... అర్థవత్త్వముక్తమ్"ను భాష్యము చెప్పఁబడుచున్నది. అనఁగా "సో౽రోదీత్"ను వాక్యముతోఁ దుల్య మగు నర్థవాదవాక్యములు క్రియను బోధింపకపోవుటంజేసి యనర్థకములే యగుచున్నవి. కావున నవ్వానికిఁ బ్రామాణ్యమును గూర్చుటకై యట్టి వాక్యములకు విధివాక్యములతో నేకవాక్యత గలుగఁజేసిన నా వాక్యములా విధులను స్తుతించుచు విధులతో సంబంధించినవే యగుచున్నవి. కావునఁ బ్రమాణభావము వడయఁగలవను నాశయముతో నర్థవాదములకు స్తావకత్వముచేఁ బ్రయోజనము నిరూపింపఁబడియున్నది.

ఇఁక నర్థవాదములతోపాటు "ఇషే త్వా" యనునది మొదలుగాఁ గలిగిన మంత్రములకుఁ గూడ నానర్థక్యము గలుగుచుండ నామంత్రములు క్రియలను గ్రియలకుఁ దగు సాధనములను బోధించుటచేఁ గ్రియతో సంబంధించినవే యగుచుఁ బ్రమాణభావమును బొందుచున్నవని "మంత్రాణాం చ కర్మసమవాయిత్వముక్తమ్"ని చెప్పఁబడుచున్నది.

ఇట్లర్థవాదములను మంత్రములను గూడ విధివాక్యములతోఁ బొందుపఱచి ప్రామాణ్యమును గలుగఁజేయుటచే వేదవాక్యములకు నొకానొకప్పు డైనను విధితో సంబంధములేక ప్రయోజన మించుకమాత్రమును జూడఁబడదు; ఉచితమును గూడఁ గాదని "నక్వచిదపి వేదవాక్యానాం విధిసంస్పర్శమంతరేణార్థవత్తా దృష్టా। ఉపపన్నా వా" యని సామాన్యన్యాయ మొకటి ప్రదర్శింపఁబడుచున్నది. ఇంతియ కాదు. విధి యెప్పుడును గ్రియావిషయమే యగుటంజేసి పరినిష్ఠితవస్తువును బోధించుటయందు విధి యొంతమాత్రము ప్రవర్తింపనేరదు. కావున వేదాంతములు పరినిష్ఠితవస్తుబోధకములగుట యుక్తము గాదని "న చ పరినిష్ఠితే వస్తుస్వరూపే .. విధే" యను భాష్యముచేఁ జెప్పుచు వేదాంతములు విధివిహితములగు కర్మలచే నపేక్షింపఁబడు కర్తృస్వరూపమును దేవతాదిస్వరూపమును బ్రకాశింపఁజేయుచుఁ గ్రియావిధులకు నంగములేయగుటచేఁ బ్రమాణభావము గల్గుచున్నదని "తస్మాత్ ... వేదాంతానామ్"ని పూర్వమీమాంసకులలో నేకదేశి దనయొక్క వాదము నుప

అథ ప్రకరణాన్తరభయాన్నైతదభ్యుపగమ్యతే, తథాపి స్వవాక్యగతోపాస-నాదికర్మపరత్వమ్। తస్మాన్న బ్రహ్మణః శాస్త్రయోనిత్వమితి ప్రాప్తే ఉచ్యతే—

తత్తు సమన్వయాత్ ॥ ౪.

తుశబ్దః పూర్వపక్షవ్యావృత్త్యర్థః। తద్బ్రహ్మ సర్వజ్ఞం సర్వశక్తి జగదుత్పత్తిస్థితి-లయకారణం వేదాన్తశాస్త్రాదేవావగమ్యతే।

---

సంహరించుచున్నాఁడు అయినను నీయుపనిషద్వాక్యములకుఁ గ్రియావిధులకును బ్రకరణసంపర్కము లేకపోవుటచే నీవాదము సమంజసము గాదను భయమువలన నొకానొకవేళ నీవేదాంతవాక్యములు క్రియావిధిశేషములు గాకపోయినను దమయందుఁ దెలియవచ్చెడి యుపాసనాదికర్మపరము లైనఁ గావచ్చునని "అథ ప్రకరణాంతరభయాత్ ... ఉపాసనాదికర్మపరత్వమ్"ని ప్రకారాంతరముచే వేదాంతములకుఁ గర్మపరత్వమును సూచించుచు "తస్మాత్ న బ్రహ్మణః శాస్త్రయోనిత్వమ్" పూర్వోక్తకారణములచే బ్రహ్మమునకు శాస్త్రయోనిత్వ మెంతమాత్రము ఘటింపనేరదని పూర్వపక్షము నుపసంహరించుచున్నాఁడు.

పూర్వపక్షియభిప్రాయము వేద మంతయు విధి, ప్రతిషేధ, అర్థవాద, మంత్రము లను నాల్గువిధములుగ విభజింపఁబడుచున్నదనియు, విధిప్రతిషేధములను బోధించు లిఙ్లోట్తవ్యప్రత్యయఘటితపదములతో నొప్పు వాక్యములు పరమ ప్రమాణములనియు, నట్టి వాక్యములచే బోధింపఁబడు క్రియలలోఁ బ్రయోజనమును బడయుటచే మంత్రశేషములకును నట్టిక్రియలను స్తుతించుటచే నర్థవాదములకును బ్రమాణభావము గలుగుచున్నదనియు నాతీరుననే యుపనిషద్వాక్యములు గూడ నెద్దియో యొకతీరునఁ గ్రియావిధులతో సంబంధమును గల్గియుండక సిద్ధవస్తుమాత్రమునే బోధించినచో నిరర్థకము లగు ననియు దానంజేసి వేదాంతములు పరినిష్ఠితవస్తువగు బ్రహ్మమును బోధించుట కెంతమాత్ర మవకాశము లేదనియు స్పష్టమగుచున్నది.

ఇట్లు పూర్వపక్షము గలుగ సమాధానమును సూత్రకారులు చెప్పుచున్నా రని "ఇతి ప్రాప్తే ఉచ్యతే—"తత్తు సమన్వయాత్"ని భాష్యకారులు చెప్పుచున్నారు. ఇచట 'తత్తు సమన్వయాత్'నునది సూత్రము. అందలి 'తు' శబ్దము పూర్వపక్షనిరాసార్థ మని "తుశబ్దః పూర్వపక్షవ్యావృత్త్యర్థ' యని చెప్పఁబడుచున్నది సూత్రమందలి 'తత్'నుపదము 'శాస్త్రయోనిత్వాత్'ను సూత్రముచేఁ జేయఁబడిన ప్రతిజ్ఞను వ్యక్తీకరించుచున్నటుల "తద్ బ్రహ్మ సర్వజ్ఞం సర్వశక్తి జగదుత్పత్తిస్థితిలయకారణం వేదాంతశాస్త్రాదేవావగమ్యతే" సర్వజ్ఞము సర్వశక్తియు జగత్తుయొక్క యుత్పత్తిస్థితిలయములకుఁ గారణము నగు బ్రహ్మము

కథమ్, సమన్వయాత్ సర్వేషు హి వేదాన్తేషు వాక్యాని తాత్పర్యేణైతస్యార్థస్య ప్రతిపాదకత్వేన సమనుగతాని॥ "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయమ్" (ఛాందో. 6-2-1) "ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్" ఐత. 2-1-1-1) "తదేతద్బ్రహ్మాపూర్వమనపరమనన్తరమబాహ్యమ్" అయమాత్మా బ్రహ్మ సర్వానుభూః (బృహ, 2-5-19) 'బ్రహ్మైవేదమమృతం పురస్తాత్" (ముండక 2-2-11) ఇత్యాదీని

---

వేదాంతశాస్త్రమువలననే తెలియుచున్నదను వాక్యముచే దెలియుచున్నది. వేదాంతశాస్త్రముచే నట్టిబ్రహ్మము "కథం" ఎట్లు చెప్పబడుచున్నదని పూర్వపక్షి యడుగ సమాధానము సమన్వయాత్తని చెప్పబడుచున్నది. సమన్వయశబ్దార్థము "సర్వేషు హి...సమనుగతాని" యను వాక్యముచే జెప్పబడుచున్నది. అనగా సకలవేదాంతములయందును దెలియవచ్చెడి వాక్యములయొక్క తాత్పర్యమును యోజించినచో నీయర్థమే లెస్సగా బొందబడుచున్న దని భావము. తాత్పర్యమును గ్రహించుట యన నుపక్రమము ఉపసంహారము, అభ్యాసము, అపూర్వత, ఫలము, అర్థవాదము నుపపత్తులను లింగముల పొందికచే బ్రకరణసందర్భమును నర్థమును గ్రహించుటయని భావము. ఇట్లు ప్రకరణసందర్భములచే నేయేవేదాంతవాక్యములకు దాత్పర్యమును గ్రహించిన నభిమతార్థసిద్ధి యగునో యట్టివాక్యములు నాలుగు వేదములనుండి యుదాహరింపబడుచున్నవి.

1. సోమ్య ! = ప్రియదర్శనుడా ! ఇదమ్ = ఈపరిదృశ్యమాన మగు జగత్తు, అగ్రే = సృష్టికి బూర్వకాలమున, ఏకమ్ = స్వగతభేదరహితమును, ఏవ = సజాతీయభేదరహితమును, అద్వితీయమ్ = విజాతీయభేదరహితము నగు, సత్ ఏవ = సన్మాత్రముగనే, ఆసీత్ = ఉండెనని సామవేదవాక్యము

2. ఇదమ్ = ఈపరిదృశ్యమాన మగు జగత్తు, అగ్రే = సృష్టికి బూర్వము, ఏకః = ఒక్కటి యగు, అనగా సజాతీయ విజాతీయ స్వగతభేదరహిత మగు, ఆత్మా వై = ఆత్మమాత్రమే, ఆసీత్ = ఉండెనని ఋగ్వేదవాక్యము.

3. తదేతద్బ్రహ్మ = ఆయీబ్రహ్మము, అపూర్వమ్ = కారణరహితమును అనపరమ్ = కార్యరహితమును, అనంతరమ్ = అంతరము లేనిది, అబాహ్యమ్ = బాహ్యము లేనిది, సర్వానుభూః = సర్వసాక్షియగు, అయం = ఈ, ఆత్మా = ఆత్మయే, బ్రహ్మ = బ్రహ్మమని యజుర్వేదవాక్యము.

4 పురస్తాత్ = ముందుభాగమున, ఇదం = ఈపరిదృశ్యమానమగు, జగత్ = జగత్తు, అమృతమ్ = మరణరహిత మగు, బ్రహ్మైవ = బ్రహ్మమే యని యథర్వణవేదవాక్యము.

ఈ నాల్గువాక్యములచే దెలియవచ్చెడి 'సత్ ఆత్మా, బ్రహ్మ' యను

న చ తద్గతానాం పదానాం బ్రహ్మస్వరూపవిషయే నిశ్చితే సమన్వయేఽవగమ్యమానేఽర్థాన్తరకల్పనా యుక్తా, శ్రుతహాన్యశ్రుతకల్పనాప్రసఙ్గాత్‌ । న చ తేషాం కర్తృస్వరూపప్రతిపాదనపరతాఽవసీయతే, "తత్కేన కం పశ్యేత్‌" (బృహ. 2. 4.13) ఇత్యాదిక్రియాకారకఫలనిరాకరణశ్రుతేః । న చ పరినిష్ఠితవస్తుస్వరూపత్వేఽపి ప్రత్యక్షాదివిషయత్వం బ్రహ్మణః, 'తత్త్వమసి' (ఛాందో. 6. 8. 7.) ఇతి బ్రహ్మాత్మభావస్య శాస్త్రమన్తరేణానవగమ్యమానత్వాత్‌ । యత్తు హేయోపాదేయరహితత్వాదుపదేశానర్థక్యమితి, నైష దోషః । హేయోపాదేయశూన్యబ్రహ్మాత్మతావగమాదేవ సర్వక్లేశప్రహాణాత్పురుషార్థసిద్ధేః ।

---

పదములు పర్యాయపదములుగ నలరారుచు జగదుత్పత్తిస్థితిలయకారణమును సర్వజ్ఞమును సర్వశక్తియు నగు బ్రహ్మబోధకములే యని ప్రదర్శింపఁబడుచున్నది.

ఇట్లు నాల్గువేదములతో సంబంధించిన వేదాంతములయందుఁ దెలియనచ్చెడి పదములకు బ్రహ్మస్వరూపమును బోధించుటయందు సమన్వయము నిశ్చయింపఁబడి తెలియవచ్చుచుండ నవ్వానికి వేఱొకయర్థమును గల్పించుట యుక్తము గాదని "న చ తద్గతానాం...యుక్తా" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. అర్థాంతరముఁ గల్పించినఁ గల్గెడి దోషము "శ్రుతహాన్యశ్రుతకల్పనాప్రసంగాత్త"ని చెప్పఁబడుచున్నది. అనఁగా వినవచ్చుచుండెడి యర్థమును ద్రోసిపుచ్చుట, వినఁబడనియర్థమును గల్పించుట యను దోషములు వాటిల్లు నని భావము. వేదాంతవాక్యములు కర్తృస్వరూపమును బోధించున న్లెంతమాత్రమును దలంపఁగూడ దని "నచ తేషాం కర్తృస్వరూపప్రతిపాదనపరతాఽవసీయతే" యని చెప్పఁబడుచున్నది. ఏలయన–'తత్కేన కం పశ్యేత్త'నునది మొదలుగాఁ గలిగిన శ్రుతులచే నాత్మజ్ఞానము గలుగఁ గ్రియాకారకఫలములను వేదము నమసిపోవుటం జేసి కర్తృభావమే యుపశమించుచున్న దని "తత్కేన కం పశ్యేత్" ఇత్యాదిక్రియాకారకఫలనిరాకరణశ్రుతే"యను వాక్యముచేఁ జెప్పఁబడుచున్నది. బ్రహ్మ పరినిష్ఠితవస్తువైనను "తత్త్వమసి"యను బ్రహ్మాత్మభావమును బోధించు శాస్త్రము లేకుండఁ దెలియఁబడుటకవకాశము లేకుండుటం జేసి ఘటపటాదులవలెఁ బ్రత్యక్షాదుల కెంతమాత్రము విషయము గాదని "న చ పరినిష్ఠితవస్తుస్వరూపత్వేఽపి... అనవగమ్యమానత్వాత్త"ను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. బ్రహ్మము హేయోపాదేయశూన్యమగుటచే నద్దాని నుపదేశించుటవలనఁ బ్రయోజనము లేదనుట "యత్తు హేయోపాదేయరహితత్వాదుపదేశానర్థక్యమితి" యనున దేదియో యయ్యది దోషమెంతమాత్రము గాదని 'నైష దోష' యని చెప్పఁబడుచున్నది. దోషము గాకుండుటకుఁ గల కారణము "హేయోపాదేయశూన్యబ్రహ్మాత్మతావగమాదేవ సర్వక్లేశప్రహాణాత్పురుషార్థసిద్ధే" యని చెప్పఁబడుచున్నది. అనఁగా హేయోపాదేయ

దేవతాదిప్రతిపాదనస్య తు స్వవాక్యగతోపాసనార్థత్వేఽపి న కశ్చిద్విరోధః । న తు తథా బ్రహ్మణ ఉపాసనావిధిశేషత్వం సంభవతి, ఏకత్వే హేయోపాదేయశూన్యతయా క్రియాకారకాదిద్వైతవిజ్ఞానోపమర్దోపపత్తేః । న హ్యేకత్వవిజ్ఞానేనోన్మథితస్య ద్వైతవిజ్ఞానస్య పునః సంభవోఽస్తి. యేనోపాసనావిధిశేషత్వం బ్రహ్మణః ప్రతిపద్యేత।

---

శోధ్యమగు బ్రహ్మము నాత్మగాఁ దెలిసికొనుటచేతనే సర్వక్లేశములు నశింపఁ బడునట్టి పురుషార్థరూప మగు మోక్షము ఘటించును. కావున నట్టియుపదేశమే సర్వవిధముల శ్రేయస్సాధన మగుటంజేసి ప్రయోజనకర మగుచున్న దని తాత్పర్యము.

వేదాంతములయందు దేవతాదులను బ్రతిపాదించెడి వాక్యము లున్నను నయ్యవి వేదాంతములందుఁ దెలియవచ్చెడి యుపాసనావిధులతో సంబంధించి యున్నను వానివలన సిద్ధవస్తుబోధకము లగు వాక్యముల కెంతమాత్రమును విరోధము గలుగ దని "దేవతాదిప్రతిపాదనస్య ... న కశ్చిద్విరోధః" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. దేవతాదుల కుపాసనావిధులతో సంబంధ మున్నట్లు బ్రహ్మమునకుఁ గూడ సంబంధము గలుగదా? యనిన నల్లించుకమాత్రమును బ్రహ్మమున కుపాసనావిధులతో సంబంధము లేదని "న తు తథా బ్రహ్మణ ఉపాసనావిధిశేషత్వం సంభవతి" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. అట్లు సంభవింపకపోవుటకుఁ గల కారణము "ఏకత్వే హేయోపాదేయశూన్యతయా క్రియాకారకాదిద్వైతవిజ్ఞానోపమర్దోపపత్తేః" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది.

ఏకత్వే=బ్రహ్మముయొక్క యేకత్వము తెలియఁబడుటయందు, హేయోపాదేయశూన్యతయా= హేయ మగునట్టియు నుపాదేయ మగునట్టియు వస్త్వంతరమే లేకపోవుటచే, క్రియాకారకాదిద్వైతవిజ్ఞానోపమర్దోపపత్తేః = క్రియ కారకము మొదలుగాఁ గల ద్వైతముయొక్క విశేషవిజ్ఞానము పూర్తిగా నశించుటకుఁ గారణము కలుగుటచే, నుపాసకుఁడు, ఉపాస్యము, ఉపాసన యను త్రివిధవ్యవహార ములు లుప్తములగును. కావున నట్టివ్యవహారలోపకాలమున బ్రహ్మము నుపాసించుట యే ఘటింపదు. కావున బ్రహ్మమున కుపాసనావిధిశేషత్వము శాస్త్రముచే బోధింపఁబడుచున్న దని చెప్పుటకు వీలులేదని. తాత్పర్యము. పోనిండు; ఒకవేళ నేకత్వవిజ్ఞానముచే వారింపఁబడిన క్రియాకారకాదిద్వైతవిజ్ఞానము కాలాంతరమునఁ గలుగుట కవకాశము కలుగునట్టి కాలమున బ్రహ్మము నుపాసించుటకు నవకాశము గలుగు నను నాశయముచే బ్రహ్మమున కుపాసనావిధిశేషత్వము గలుగఁ గూడదా యనిన నేకత్వవిజ్ఞానముచే నశించిన ద్వైత విజ్ఞానము తిరుగ సంభవించుటకుఁ గూడ నావకాశము లేదని "న హ్యేకత్వవిజ్ఞానేన ... ప్రతిపద్యేత" యని

యద్యప్యన్యత్ర వేదవాక్యానాం విధిసంస్పర్శమన్తరేణ ప్రమాణత్వం న దృష్టం। తథాప్యాత్మవిజ్ఞానస్య ఫలపర్యన్తత్వాన్న తద్విషయస్య శాస్త్రస్య ప్రామాణ్యం శక్యం ప్రత్యాఖ్యాతుమ్। న చానుమానగమ్యం శాస్త్రప్రామాణ్యం, యేనాన్యత్ర దృష్టం నిదర్శనమపేక్షేత। తస్మాత్సిద్ధం బ్రహ్మణః శాస్త్రప్రమాణకత్వమ్॥

---

చెప్పఁబడుచున్నది. ఉన్మథితస్య = నశింపఁజేయఁబడిన, ద్వైతవిజ్ఞానస్య = ఉపాస కోపాస్యాదిభేదజ్ఞానముయొక్క, సంభవః = పుట్టుక, పునః = తిరిగి, నాస్తి = కలుగదు. వేదవాక్యములకు, అనఁగా నర్థవాద వాక్యములకు విధివాక్యములతో సంబంధము లేకుండఁ బ్రామాణ్యము లేదనునది, కర్మకాండమునందలి వేదవాక్యములకు వర్తించు నని "యద్యప్యన్యత్ర ... దృష్టమ్మ"ను భాష్యముచే నంగీకరించుచు నంతమాత్రముచే నట్టినియమము నాత్మవిజ్ఞానమే పరమప్రయోజనముగా బోధించు వేదాంతవాక్యములకు వర్తింపఁజేసి స్వతఃప్రామాణ్యమును ద్రోసిపుచ్చుట యుక్తము గాదని "తథాపి...ప్రత్యాఖ్యాతుమ్మ"ను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. వేదవాక్యానామ్ = అర్థవాదవాక్యములకు, అన్యత్ర = కర్మకాండము నందు, విధిసంస్పర్శమంతరేణ = విధివాక్యములతో సంబంధము లేకుండ, ఫలపర్యంతత్వాత్ = ఫలముయొక్క పరిసమాప్తి యగుటవలన, తద్విషయస్య = ఆత్మజ్ఞానము విషయముగాఁ గలిగిన, శాస్త్రస్య = వేదాంతమునకు, ప్రామాణ్యం = ప్రమాణభావమును, ప్రత్యాఖ్యాతుమ్ = నిరాకరించుకొనుటకు న శక్యమ్ = శక్యముగాదు.

వేదాంతశాస్త్రముయొక్క ప్రామాణ్య మనుమానప్రమాణముచే సాధింపఁబడుటకు వీలులేదు గావున శాస్త్రము స్వతఃప్రమాణమని "న చానుమాన-గమ్యం శాస్త్రప్రామాణ్య మ్మ"ను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. శాస్త్ర ప్రామాణ్య మనుమానగమ్యము కాదనుటకు హేతువు "యేనాన్యత్ర దృష్టం నిదర్శన మపేక్షేత"యని చెప్పఁబడుచున్నది. అనఁగా ననుమానముచే సాధింపఁబడు విషయమునకుఁ బ్రత్యక్షసిద్ధమగు దృష్టాంత మొకటి యుండితీరవలయును. అట్టి దృష్టాంతము శాస్త్రప్రామాణ్యమును సాధించెడి యనుమానమునకు లేకపోవుట వలన శాస్త్రప్రామాణ్య మనుమానముచే సాధింపంబడునది కాదని భావము. యేన = ఏయనుమాన ప్రమాణముచే, అన్యత్ర = వేఱొకచో, దృష్టమ్ = ప్రత్యక్షసిద్ధమగు, నిదర్శనమ్ = దృష్టాంతము అపేక్షేత = అపేక్షించునో. వేదాంతములు స్వతః ప్రమాణము లగుటచేతను నట్టి వేదాంతములచే ననన్యశేషముగ హేయోపాదేయశూన్యమగు బ్రహ్మ ముపదేశింపఁబడుటచేతను నట్టిబ్రహ్మమును దెలిసికొనుటచే సర్వక్లేశప్రహాణపురస్సరముగఁ బురుషార్థము లభించుటచేతను బ్రహ్మమునకు శాస్త్రప్రమాణకత్వము సర్వవిధముల సిద్ధించుచున్న దని "తస్మాత్సిద్ధం బ్రహ్మణః శాస్త్రప్రమాణకత్వమ్మ"ని సమాధాన ముపసంహరింపఁబడుచున్నది.

అత్రాపరే ప్రత్యవతిష్ఠన్తే — యద్యపి శాస్త్రప్రమాణకం బ్రహ్మ, తథాపి ప్రతిపత్తివిధివిషయతయైవ శాస్త్రేణ బ్రహ్మ సమర్ప్యతే। యథా యూపాహవనీయాదీన్యలౌకికాన్యపి విధిశేషతయా శాస్త్రేణ సమర్ప్యన్తే తద్వత్। కుత ఏతత్

---

ఇట్లు పూర్వమీమాంసకైకదేశికి సమాధానముం జెప్ప మఱికొండఱు పూర్వమీమాంసకులు ప్రకారాంతరమునం బూర్వపక్షముఁ జేయుచున్నా రని "అత్రాపరే ప్రత్యవతిష్ఠంతే" యని చెప్పంబడుచున్నది. అత్ర = బ్రహ్మమునకు శాస్త్రప్రమాణకత్వము సిద్ధించుటయందు, అనఁగా బ్రహ్మము శాస్త్రముచే సిద్ధించుచున్న దని చెప్పఁగా, అపరే = మఱికొండఱు పూర్వమీమాంసకులు, ప్రత్యవతిష్ఠన్తే = నిలుచుచున్నారు.

పూర్వపక్షము "యద్యపి, శాస్త్రప్రమాణకం బ్రహ్మ" యను వాక్యము మొదలు "బ్రహ్మేత్యవగంతవ్యమ్మ"ను వాక్యమువఱకు గల భాష్యముచే నుపపాదింపఁబడుచున్నది.

ఇదివఱకు మీమాంసకైకదేశి యన్ననో వేద మంతయుఁ గ్రియను బోధించుచున్న దనియు సిద్ధవస్తువుల నెంతమాత్రము బోధింపలే దనియు సాహసముతో వచియింప నద్దానికిఁ బరిహారముగా సిద్ధవస్తు వగు బ్రహ్మమును బోధించు వేదాంతవాక్యములను బ్రదర్శింప నాతఁడు సమాధానాంతరముఁ జెప్పఁజాలక మిన్నకుండెను. ఆతని పొరపాటును సవరించి స్వాభిమతమును వ్యక్తీకరింప బ్రహ్మము శాస్త్రముచేఁ బ్రతిపాదింపఁబడ లే దని చెప్పుటకు వీలులేదుగాని పూర్వోదాహృతవచనములచే బ్రహ్మ ముపదేశింపఁబడుచున్నట్లు "యద్యపి శాస్త్రప్రమాణకం బ్రహ్మ" బ్రహ్మము శాస్త్రముచే నుపదేశింపఁబడుచున్నప్పటికి నని చెప్పి యాబ్రహ్మ ముపాసనావిధి కంగముగా శాస్త్రముచే బోధింపఁబడుచున్నది గాని స్వతంత్రముగ బోధింపఁబడ లే దని "తథాపి ప్రతిపత్తివిధివిషయతయైవ శాస్త్రేణ బ్రహ్మ సమర్ప్యతే' యని యొకవిశేషముగ నిర్వచింపఁబడుచున్నది. ప్రతిపత్తివిధి యన నుపాసనావిధి యని యర్థము. ఇట్టి నిర్వచనమును "'యథా యూపాహవనీయాది" యను దృష్టాంతముచే బలపఱచుచున్నాఁడు. దృష్టాంతసందర్భ మేమన- శాస్త్రము విధులచేఁ గర్మల బోధించుచు నాకర్మల కంగముగా యూపము ఆహవనీయము మొదలుగాఁ గలిగిన యలౌకికపదార్థములఁ గొన్నిటిని బోధించుచున్నట్టులనే యుపాసనావిధిచే నుపదేశింపఁబడు నుపాసనా కర్మకు నంగముగ నుపాస్య మగు బ్రహ్మ మనెడి యలౌకికపదార్థమును బోధించుచున్న దని మీమాంసకైకదేశి యొకఁడు వచియించుచున్నాఁడు.

ఇట్టివాదమునకు 'కుత ఏతత్" కారణ మేమని మధ్యస్థుఁ డడుగ

ప్రవృత్తి నివృత్తి ప్రయోజనత్వాచ్ఛాస్త్రస్య। తథాహి శాస్త్రతాత్పర్యవిద ఆహుః- "దృష్టో హి తస్యార్థః కర్మావబోధనమ్" ఇతి। "చోదనేతి క్రియాయాః ప్రవర్తకం వచనమాహుః" "తస్య జ్ఞానముపదేశః" (జై. సూ. 1-1-5) "తద్భూతానాం క్రియార్థేన సమామ్నాయః" (జై. సూ 1-1-25) "ఆమ్నాయస్య క్రియార్థత్వాదానర్థక్యమత- దర్థానామ్" (జై. సూ. 1-2-1) ఇతి చ। అతః పురుషం క్వచిద్విషయ విశేషే ప్రవర్తయత్కుతశ్చిద్విషయవిశేషాన్నివర్తయచ్చార్థవచ్ఛాస్త్రమ్।

---

సమాధానము "ప్రవృత్తినివృత్తిప్రయోజనత్వాచ్ఛాస్త్రస్య" అను సంగ్రహ వాక్యముచేఁ జెప్పఁబడుచున్నది. అనఁగా శాస్త్రము ప్రవృత్తినివృత్తులే ప్రయో జనముగాఁ గలిగిన దని యర్థము "తథాహి...అర్థవత్త్వం స్యాత్" అను భాష్యముచేఁ బైసంగ్రహవాక్యము వివరింపఁబడుచున్నది.

ఇచట మీమాంసకైకదేశి స్వాభిమతమును బోషించుకొనుటకు శాబర భాష్యమునందలి వాక్యముల రెండింటిని జైమినిసూత్రముల మూఁడిటిని బ్రద ర్శించుచున్నాఁడు.

1. కర్మావబోధనం = కర్మయొక్క నిశ్చయమే, తస్య = వేదము యొక్క, అర్థః = ప్రయోజన మని, దృష్టో హి=నిశ్చయముగఁ జూడఁబడుచున్నది।

2. చోదనా ఇతి = చోదన యనునది, అనఁగా "చోదనాలక్ష- ణోఽర్థో ధర్మః" యని ధర్మమునకు లక్షణముగాఁ జెప్పఁబడిన చోదన యనునది, క్రియాయాః = క్రియతో సంబంధించినట్టియు, ప్రవర్తకం=ప్రవర్తింపఁజేయునట్టి, వచనం = వాక్యము.

3. తస్య = కర్మయొక్క, జ్ఞానం = తెలివియే, ఉపదేశః = వేదము యొక్క యుపదేశము.

4. తత్ = ఆవేదమునందుఁ దెలియవచ్చెడి, భూతానామ్= సిద్ధవస్తు వులకు, క్రియార్థేన = క్రియయొక్క ప్రయోజనము నుద్దేశించుటచేతనే, సమామ్నాయః = ఉపదేశము.

5. ఆమ్నాయస్య = వేదము, క్రియార్థత్వాత్ = క్రియయే ప్రయో జనముగాఁ గలది యగుటవలన, అతదర్థానాం = క్రియార్థములు కానివానికి, ఆనర్థక్యం = వైయర్థ్యమే యని పైవాక్యముల యర్థము. ఈవాక్యములయొక్క పర్యాలోచనముచేఁ గలెడి యర్థవిశేషము, "అతః పురుషం...అర్థవచ్ఛా- స్త్రమ్మ" ను వాక్యముచే వివరింపఁబడుచున్నది. ఏమన- శాస్త్రము పురుషుని నొకానొక మంచి దగు కర్మయందుఁ బ్రవర్తింపఁజేయుటచేతనో లేక యొకానొక దుష్టమగు కర్మనుండి మఱలించుటచేతనో ప్రయోజనమును గనుచున్నది. అనఁగా నుపాదేయమగు కర్మవిశేషమును గాని హేయమగు కర్మవిశేషమును

తచ్ఛేషతయా వోపయుక్తమ్। తత్సామాన్యాద్వేదాన్తానామపి తథైవార్థ-
వత్త్వం స్యాత్। సతి చ విధిపరత్వే యథా స్వర్గాదికామస్యాగ్నిహోత్రాదిసా-
ధనం విధీయతే ఏవమమృతత్వకామస్య బ్రహ్మజ్ఞానం విధీయత ఇతియుక్తమ్।
నన్విహ జిజ్ఞాస్యవైలక్షణ్యముక్తమ్ । కర్మకాండే భవ్యో ధర్మో జిజ్ఞాస్యః। ఇహ
తు భూతం నిత్యనిర్వృత్తం బ్రహ్మ జిజ్ఞాస్యమితి। తత్ర ధర్మజ్ఞానఫలాదనుష్ఠానా-
పేక్షాద్విలక్షణం బ్రహ్మజ్ఞానఫలం భవితుమర్హతి నార్హత్యేవం భవితుమ్।
కార్యవిధిప్రయుక్తస్యైవ బ్రహ్మణః ప్రతిపాద్యమానత్వాత్।

---

గాని బోధించుచున్నవి కావున వేదాంతములు గూడ శాస్త్రమే యగుటంజేసి యుపాస్యవిధి గూడ సమావేశము గాని ప్రేరణము గాని యగు కర్మవిశేషములనే బోధించవలయును గాని కేవలతత్త్వానిని బోధించిన ప్రయోజనము లేదని "తత్సా-మాన్యాద్వేదాన్తానామపి తథైవార్థవత్త్వం స్యాత్" అని నిర్వచించుటచే వేదాంతములు గూడ విధిపరములే యని నిర్ణయింపఁబడుచున్నది.

వేదాంతములు విధిపరములైనచోఁ గల్గు ప్రయోజనము "సతి చ...ఇతి యుక్తమ్"ను భాష్యముచే వివరింపఁబడుచున్నది. అనఁగా వేదమునందు, స్వర్గాదుల నభిలషించువానికి నగ్నిహోత్రాదిసాధనము లెట్లు విధింపఁబడుచున్నవో యాతీరుననే యమృతత్వమును నభిలషించువానికి బ్రహ్మజ్ఞాన మను సాధనము వేదాంతములచే నుపదేశింపఁబడుచున్న దని సుకరముగ గ్రహింపవచ్చు నని తాత్పర్యము.

'సతి చ విధిపరత్వే' వేదాంతములు విధిపరములని యంగీకరించినచో, ఇట్లు ధర్మజిజ్ఞాసకును బ్రహ్మజిజ్ఞాసకును సామ్యమును బ్రదర్శింప నట్టి సామ్యము లేదని యిదివఱకుఁ జెప్పఁబడినదే యని "నను...భవితుమర్హతి" యను వాక్యములచే మధ్యస్థుఁడు ప్రశ్నించుచున్నాఁడు.

అనఁగాఁ గర్మకాండమున భవ్య మగు ధర్మము జిజ్ఞాస్య మనియు వేదాంతములం దన్ననో నిత్యసిద్ధ మగు బ్రహ్మము జిజ్ఞాస్య మనియు నీవిషయమున జిజ్ఞాస్యములయందలి వైలక్షణ్యము చెప్పఁబడినదే. ఇంతియ కాదు. ధర్మజ్ఞాన ఫల మన్ననో జ్ఞానానంతర మనుష్ఠానము నపేక్షించుచున్నది. బ్రహ్మజ్ఞానఫల మన్ననో యట్టియనుష్ఠాన మక్కఱలేకయే బ్రహ్మజ్ఞానముచేఁ గల్గుచున్నది. కావున ధర్మ బ్రహ్మజిజ్ఞాసల రెండిటికని సమానత్వాంశము లేదే యని భావము. అంతట మీమాంసకుఁడు "నార్హత్యేవం భవితుమ్" ఇట్లు జిజ్ఞాస్యవైలక్షణ్య మున్న దని యనుట యుక్తము గాదని నిరాకరించుచున్నాఁడు. నిరాకరణమునందలి హేతువును "కార్యవిధిప్రయుక్తస్యైవ బ్రహ్మణః ప్రతిపాద్యమానత్వాత్"ను సంగ్రహవచనముచేఁ బల్కుచున్నాఁడు అనఁగా క్రియను బోధించు విధులతో సంబంధింపఁ

"ఆత్మా వా అరే ద్రష్టవ్యః" (బృహ. 2-4-5) ఇతి। "య ఆత్మా అపహత-పాప్మా ... సోఽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః" (ఛాందో. 8-7-1) "ఆత్మేత్యేవోపాసీత" (బృహ. 1-4-7) "ఆత్మానమేవ లోకముపాసీత" (బృ. 1-4-15) "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" ముం. (3-2-9) ఇత్యాదివిధానేషు సత్సు "కోఽసావాత్మా కిం తద్బ్రహ్మ" ఇత్యాకాంక్షాయాం తత్స్వరూపసమర్పణేన సర్వే వేదాంతా ఉప-యుక్తాః — "నిత్యః సర్వజ్ఞః సర్వగతో నిత్యతృప్తో నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావో విజ్ఞానమానందం బ్రహ్మ" ఇత్యేవమాదయః। తదుపాసనాచ్చ శాస్త్రదృష్టోఽదృష్టో మోక్షః ఫలం భవిష్యతీతి।

---

సిద్ధం బ్రహ్మము శాస్త్రముచే బోధింపఁబడుచున్న దని సంగ్రహవాక్యమున కర్థము "ఆత్మా వాఽరే ద్రష్టవ్యః ... ఫలం భవిష్యతీతి" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది. ఇందుఁ బ్రదర్శింపఁబడిన విధివాక్యములవలన నాత్మ యను పద "ద్రష్టవ్యః, అన్వేష్టవ్య, విజిజ్ఞాసితవ్యః, ఉపాసీత" యను విధివాక్యములతో సంబంధించియే యుపదేశింపఁబడుచున్నది ఇట్టివిధివాక్యములు దెలియవచ్చు చుండ నీవిధివాక్యములచే నుపదేశింపఁబడు నాత్మ యెట్టిది, బ్రహ్మ మెట్టి దను నాకాంక్ష గలుగఁగా నట్టియాకాంక్షానివృత్తికై యాత్మస్వరూపమును బోధింప నన్నివేదాంతములును బరఁగుచున్న వని "తత్స్వరూపసమర్పణేన సర్వే వేదాంతా ఉపయుక్తా" యని వేదాంతములయొక్క ప్రయోజనము చెప్పఁబడుచున్నది. తత్స్వరూపసమర్పణేన = ఆబ్రహ్మముయొక్క స్వరూపమును బ్రదర్శించుటచేత. వేదాంతములచే బ్రహ్మస్వరూప మెట్లు బోధింపఁబడుచున్న దన నయ్యది "నిత్యః సర్వజ్ఞః ఆనందం బ్రహ్మ ఇత్యేవమాదయ" యని నిరూపింపఁబడు చున్నది. ఈ విధులచే నుపదేశింపబడిన బ్రహ్మమువలన ప్రయోజనము 'తదు-పాసనాచ్చ...భవిష్యతి' యని చెప్పఁబడుచున్నది అనఁగా నట్టిబ్రహ్మము నుపా సించుటవలన శాస్త్రముచేఁ బ్రదర్శింపఁబడుచున్నట్టియు నిహమున దృష్టముకాకుండ స్వర్గాదులవలె కాలాంతరమున ననఁగా దేహపాతానంతరమునఁ గల్గునట్టి మోక్ష మనెడి ఫలము గల్గు ననియుఁ జెప్పఁబడుచున్నది. అనఁగా యాగాదికర్మలచేఁ గాలాంతరమున స్వర్గ మెట్లు లభించునో బ్రహ్మోపాసనారూప మగు కర్మచే మోక్ష మనెడి ఫలము కాలాంతరమున నట్లే లభించు నని యర్థము. అదృష్ట మనఁగా నీలోకమున ననుభవింపఁబడని దని యర్థము.

ఇం దొకవిశేషము గలదు. ప్రకృతమున బ్రహ్మస్వరూపమును గూర్చి మీమాంసకులు భిన్నాభిప్రాయమును వెలిఁబుచ్చుచున్నట్లు దెలియరాదు. కాని యట్టి బ్రహ్మ ముపాస్యమని మీమాంసకుఁడు దలఁచుచు నుపాసనచేతనే ఫలము నభిలషించుచున్నాఁడు. కాని జ్ఞానమాత్రముచే నెంతమాత్రము ఫలము నభిలషింప

కర్తవ్యవిధ్యననుప్రవేశే వస్తుమాత్రకథనే హానోపాదానాసంభవాత్। సప్తద్వీపా వసుమతీ, రాజాఽసౌ గచ్ఛతీత్యాదివాక్యవద్వేదాన్తవాక్యానామానర్థక్యమేవ స్యాత్। నను వస్తుమాత్రకథనేఽపి "రజ్జురియం, నాయం సర్పః" ఇత్యాదౌ భ్రాన్తిజనితభీతినివర్తనేనార్థవత్త్వం దృష్టం, తథేహాప్యసంసార్యాత్మవస్తుకథనేన సంసారిత్వభ్రాన్తినివర్తనేనార్థవత్త్వం స్యాత్। స్యాదేతదేవమ్, యది రజ్జుస్వరూపశ్రవణ ఇవ సర్పభ్రాన్తిః, సంసారిత్వభ్రాన్తిర్బ్రహ్మస్వరూపశ్రవణమాత్రేణ నివర్తేత। న తు నివర్తతే, శ్రుతబ్రహ్మణోఽపి యథాపూర్వం సుఖదుఃఖాదిసంసారిధర్మదర్శనాత్।

---

లేదు. ఏలయనఁ గర్తవ్యవిధికి సంగము గాకుండ బ్రహ్మముగాని మఱి యెద్దియేని గాని యుపదేశింపఁబడినచో నద్దానివలన నించుకేనియుఁ బ్రయోజనము లభింపక పోవుటచే నా వేదాంతవాక్యము లనర్థకము లగు నని "కర్తవ్యవిధ్యననుప్రవేశే తు ...ఆనర్థక్యమేవ స్యాత్త"ను భాష్యముచే స్వాభిమతమును బ్రదర్శించుచున్నాఁడు. వేదాంతవాక్యములు "సప్తద్వీపా వసుమతీ, రాజాసౌ గచ్ఛతి" యను వాక్యముల వలె నిరర్థకము లగు నను నాశయమును మీమాంసకుఁడు వెలిఁబుచ్చ వేదాంతములు వస్తుమాత్రమును బోధించుటచే సనఁగా సిద్ధవస్తు వగు బ్రహ్మమును బోధించుటచే "రజ్జురియం, నాయం సర్పః" యనువాక్యములచే భ్రాంతిచేఁ బుట్టిన భయము దొలఁగింపఁబడినట్లు పురుషునకు సంసారిత్వభ్రాంతిని నశింపఁజేసి బ్రహ్మభావము నొందించు ప్రయోజనమును గలిగియున్నవే యని "నను... అర్థవత్త్వం స్యాత్త"ను భాష్యముచే మధ్యస్థుఁడు ప్రశ్నించుచున్నాఁడు. అసంసార్యాత్మవస్తుకథనేన = సంసారరహిత మగు నాత్మవస్తువును బోధించుటచే. ఇందలియభిప్రాయ మేమన—వేదాంతములు "సప్తద్వీపా వసుమతీ, రాజాసౌ గచ్ఛతి" యను వాక్యములవంటివి గాక "రజ్జురియం నాయం సర్పః" యను వాక్యములవలె సప్రయోజనములు గాఁగూడదా యని యిట్టిప్రశ్నమును గూర్చి వేదాంతములు "రజ్జురియం, నాయం సర్పః" యను వాక్యముల వంటివిగావని ప్రత్యక్షానుభవముచే దెలిసికొనఁబడుచున్నదని "స్యాదేతదేవం... సుఖదుఃఖాదిసంసారిధర్మదర్శనాత్త"ను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. దీనియభిప్రాయ మేమన- రజ్జుస్వరూపశ్రవణమాత్రముచే సర్పభ్రాంతినశించునట్లు బ్రహ్మస్వరూప శ్రవణమాత్రముచే సంసారిత్వభ్రాంతి నశించినచో "ఏతదేవంస్యాత్ = వేదాంతము ప్రయోజనమును బొందించునదియే యగును. కాని న తు నివర్తతే = సంసారిత్వభ్రాంతి నివర్తించుటలేదే యని చెప్పి నివర్తించుట లేదనుటకు హేతువును 'శ్రుతబ్రహ్మణోఽపి యథాపూర్వం సుఖదుఃఖాదిసంసారిధర్మదర్శనాత్త'ని చెప్పుచున్నాడు. శ్రుతబ్రహ్మణోఽపి=బ్రహ్మను గూర్చి శ్రవణముచేసినవానికిఁ గూడ, యథాపూర్వమ్ = శ్రవణముచేయుటకుఁ

శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః (బృ 2-4-5) ఇతి చ శ్రవణోత్తరకాల మనననిదిధ్యాసనవిధిదర్శనాత్ । తస్మాత్ ప్రతిపత్తివిధివిషయతయైవ శాస్త్రప్రమాణకం బ్రహ్మాభ్యుపగంతవ్యమితి । అత్రాభిధీయతే — న । కర్మబ్రహ్మవిద్యాఫలయోర్వైలక్షణ్యాత్ । శారీరం వాచికం మానసం చ కర్మ శ్రుతిస్మృతిప్రసిద్ధం ధర్మాఖ్యం, యద్విషయా జిజ్ఞాసా । "అథాతో ధర్మజిజ్ఞాసా" (జై. సూ. 1-1-1) ఇతి సూత్రితా, అధర్మోఽపి హింసాదిః ప్రతిషేధచోదనాలక్షణత్వాత్ జిజ్ఞాస్యః పరిహారాయ

---

పూర్వమందువలెనే, సుఖము దుఃఖము మొదలగు సంసారిధర్మములు తెలియ వచ్చుటవలన వేదాంతములు ప్రయోజనమును బొందింపనేరవని యభిప్రాయము. ఇది లోకానుభవమే గాదు, శ్రవణమాత్రముచే బ్రయోజనము లేదను విషయము 'శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః' యను విధివలనఁ దెలియుచున్నది. ఎట్లనఁ శ్రవణోత్తరకాలమునందు మనననిదిధ్యాసనములు విధింపఁబడుటచే నని "శ్రవణోత్తరకాలయోర్మనననిదిధ్యాసనయోర్దర్శనాత్" అని చెప్పఁబడుచున్నది. అనఁగా మనననిదిధ్యాసములయొక్క యావశ్యకత వినబడుటచే శ్రవణమాత్రముచే వేదాంతములకుఁ బ్రయోజనమును బ్రదర్శింపక యుపాసనచేఁ బ్రయోజనమును బ్రదర్శించుచున్నదని యభిప్రాయము. స్వీయలోకానుభవముచేతను శ్రుతివచనములచేతను స్వాభిమతార్థమును బ్రదర్శించి స్వీయవాదమును "తస్మాత్ ప్రతిపత్తివిధివిషయతయైవ శాస్త్రప్రమాణకం బ్రహ్మాభ్యుపగంతవ్యమ్" అని యుపాసనావిధికంగముగనే బ్రహ్మమును శాస్త్రము బోధించుచున్నది గాని ప్రత్యేకముగా నుపదేశించుట లేదని యుపసంహారము చేయుచున్నాఁడు. ఇట్టి పూర్వపక్షము యుక్తము కాదని "న" యని సమాధానము చెప్పఁబడుచున్నది. అత్ర = ఇట్టి యాక్షేపమునందు, న = పూర్వమునఁ జెప్పినది కాదని యర్థము. పూర్వపక్షమును నిరాకరించుటకుఁ దగు హేతువు "కర్మబ్రహ్మవిద్యాఫలయోర్వైలక్షణ్యాత్" అని చెప్పఁబడుచున్నది. కర్మఫలమునకును బ్రహ్మవిద్యాఫలమునకును వైలక్షణ్యము తెలియఁబడుటవలనఁ బూర్వపక్షము సమంజసము గాదని యభిప్రాయము. సంగ్రహవాక్యము "శారీరం వాచికమ్" అనునది మొదలుగాఁ గల్గి "అతో న కర్తృశేషత్వేన బ్రహ్మోపదేశో యుక్తః" యనునది యంతముగాఁ గలిగిన యుత్తరభాష్యముచే వివరింపఁబడుచున్నది. కర్మస్వరూపము "శారీరం...పరిహారాయ" అను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. శరీరము వాక్కు మనస్సను మూఁడు సాధనములచే నిర్వర్తింపఁబడునది గావున కర్మ శారీరము మానసము వాచికము అని నిర్వచింపఁబడుచున్నది. ఇయ్యది శ్రుతిస్మృతులచే నుపదేశింపఁబడుచు ధర్మమను పేరఁ బరఁగుచున్నది. ఇట్టిధర్మములయొక్క జ్ఞాన మవశ్యము సంపాదింపఁబడవలయు

తయోశ్చోదనాలక్షణయోరర్థానర్థయోర్ధర్మాధర్మయోః ఫలే ప్రత్యక్షే సుఖదుఃఖే శరీర-వాఙ్మనోభిరేవోపభుజ్యమానే విషయేంద్రియసంయోగజన్యే బ్రహ్మాదిషు స్థావ-రాన్తేషు ప్రసిద్ధే, మనుష్యత్వాదారభ్య బ్రహ్మాన్తేషు దేహవత్సు సుఖతారతమ్య-మనుశ్రూయతే ।

---

అని "అథాతో ధర్మజిజ్ఞాసా" యను సూత్రముచే నుపదేశింపఁబడుచున్నది. ఈ ధర్మము చోదనారూప మనియు విధివాక్యములచేఁ దెలియఁబడవలసిన దనియు "చోదనాలక్షణోఽర్థో ధర్మ"యను జైమినిసూత్రముచేఁ జెప్పఁబడుచున్నది. ఇయ్యది "సత్యం వద, ధర్మం చర, అహరహస్సంధ్యాముపాసీత," "సోమేన యజేత" మున్నగు వాక్యములచే బోధింపఁబడుచు నుపాదేయముగాఁ దలంపఁబడుచున్నది. ధర్మముతోపాటు ప్రతిషేధచోదనచేఁ దెలియవచ్చెడి హింసాదిరూప మగు నధర్మము గూడఁ బరిహారముకొఱకు జిజ్ఞాస చేయఁబడవలయును. ప్రతిషేధచోదన యనఁగా "నానృతం వదేత్। న కలంజం భక్షయేత్। న హింస్యాత్సర్వా భూతాని" యను ప్రతిషేధవాక్యములచేఁ దెలియవచ్చెడి కర్మము. ఇట్లు కర్మము ధర్మాధర్మ భేదముచే ద్వివిధము. ఈ ద్వివిధ మగు కర్మము విధిప్రతిషేధచోదనలచేఁ దెలియవచ్చుచు నర్థానర్థములుగఁ దలపఁబడుచు ధర్మాధర్మము లను పేర వ్యవహారముఁ గనుచున్న దనియు నాధర్మాధర్మములయొక్క ఫలములు ప్రత్యక్షము లగు సుఖదుఃఖము లనియు నయ్యవి విషయములకును నింద్రియములకును గల సంయోగముచేఁ బుట్టునవియు శరీరము వాక్కు మన స్సనెడి మూఁడుసాధనము-లచే ననుభవింపఁబడుచు బ్రహ్మ మొదలు స్థావరాంతమువఱకు సుప్రసిద్ధముగ దెలియఁబడుచున్న వని " తయోశ్చోద నాలక్షణయోః...ప్రసిద్ధే"యను భాష్యముచే జెపఁబడుచున్నది. అనఁగాఁ గర్మము ధర్మాధర్మము లని ద్వివిధ మనియు ధర్మముయొక్క ఫలము సుఖ మనియు నధర్మముయొక్క ఫలము దుఃఖ మనియు నీరెండును త్రికరణము లగు మనోవాక్కాయములచేతనే విషయేంద్రియ సంయోగపురస్సరముగా ననుభవింపఁబడుట సార్వజనీనానుభవసిద్ధ మని యభిప్రాయము.

ధర్మాధర్మరూప మగు కర్మఫలము సామాన్యముగాఁ జెప్పఁబడి ''మనుష్యత్వాదారభ్య... తారతమ్యేన వర్తమాన"యను భాష్యముచే ధర్మఫలము విశేషించి నిరూపింపఁబడుచున్నది. తైత్తిరీయశ్రుతియందు 'సైషానన్దస్య మీమాంసా భవతి' యనుచో మనుష్యుఁడు మొదలుకొని బ్రహ్మవఱకుఁ గల దేహధారులయందు సుఖముయొక్క తరతమభావము వినఁబడుచున్నది. ఇట్టిసుఖమునందలి తరతమభావ మునకుఁ గారణ మాయావ్యక్తులచే నాచరింపఁబడిన ధర్మమునందలి తారతమ్య మనియు నట్టిధర్మమునందలి తారతమ్యమునకు నాధర్మము నాచరించు నధికారుల

తతశ్చ తద్ధేతోర్ధర్మస్య తారతమ్యం గమ్యతే। ధర్మ తారతమ్యాదధికారి తారతమ్యమ్। ప్రసిద్ధం చార్థిత్వసామర్థ్యాదికృతమధికారితారతమ్యమ్। తథా చ యాగాద్యనుష్ఠాయినామేవ విద్యాసమాధివిశేషాదుత్తరేణ పథా గమనం, కేవలైరిష్టాపూర్తదత్తసాధనైర్ధూమాదిక్రమేణ దక్షిణేన పథా గమనం తత్రాపి సుఖతారతమ్యం తత్సాధనతారతమ్యం చ శాస్త్రాత్ "యావత్సంపాతముషిత్వా" (ఛాందో. 5-10-5) ఇత్యస్మాద్గమ్యతే।

---

యందలి తారతమ్యమనియనుమానించి తెలిసికొనవచ్చునని "మనుష్యత్వాదారభ్య ... అధికారితారతమ్యమ్మ"ను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. ఇఁక నధికార తారతమ్యమన్ననో యర్థిత్వసామర్థ్యములచేఁ గల్గుచున్నటులను ప్రసిద్ధముగఁ దెలియవచ్చుచున్నదని 'ప్రసిద్ధం చార్థిత్వసామర్థ్యాదికృతమధికార తారతమ్యమ్మ"ను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. అనఁగా లోకమున నొక్కొక్కఁడు దనయొక్క శక్తి కొలఁది ఫలముల నభిలషించుటయుఁ దదనుగుణ మగు కర్మల మాత్రమే యాచరించుటయుఁ జూడఁబడుచున్నది గాని యందఱు నొకేతీరునఁ గోరుటయు నొకేతీరున నాచరించుటయుఁ దెలియఁబడకున్నది. ఎవ్వఁ డెంతఁ గోరునో యద్దానినే జేయును, అద్దానికిఁ దగు ఫలమునే యనుభవించు నని యభిప్రాయము. దానం జేసియే శాస్త్రముచేఁ గూడ ఫలమునందలి తారతమ్యము బోధింపఁబడుచున్న దని "తథా చ ... దక్షిణేన పథా గమనమ్మ"ను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. అనఁగా శ్రుతిచే విధింపఁబడిన యాగాదుల ననుష్ఠించినవారలకు జ్ఞానాతిశయముచే నుత్తరమార్గముగుండ బ్రహ్మలోకప్రాప్తియుఁ గేవల మిష్టాపూర్తదత్తాదిసాధనములనే యాచరించినవారలకు దక్షిణమార్గముద్వారముగఁ జంద్రలోకప్రాప్తియు వినవచ్చుచున్నదని యభిప్రాయము. ఇష్టాపూర్తదత్తము లన—

అగ్నిహోత్రం తపః సత్యం వేదానాం చానుపాలనమ్।
ఆతిథ్యం వైశ్వదేవం చ ఇష్టమిత్యభిధీయతే॥
వాపీకూపతటాకాది దేవతాయతనాని చ।
అన్నప్రదానమారామః పూర్తమిత్యభిధీయతే॥
శరణాగతసంత్రాణం భూతానాం చాప్యహింసనమ్।
బహిర్వేది చ యద్దానం దత్తమిత్యభిధీయతే॥

యని యభియుక్తులచే నిర్వచింపఁబడుచున్నది. ఫలతారతమ్య మనుమేయమే గాక శాస్త్రముచేఁ గూడ బోధింపఁబడుచున్న దని "తత్రాపి ... ఇత్యస్మాద్గమ్యతే" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. సంపాత మన "సంపతతి యేనాస్మాల్లోకాదముం లోకమితి సంపాతః కర్మాశయ" యను నుక్తిచేఁ జంద్రలోకమున సుఖానుభవమునకుఁ గారణభూత మగు పుణ్యవిశేషము. వారివారి

తథా మనుష్యాదిషు నారకస్థావరాన్తేషు సుఖలవశ్చోదనాలక్షణధర్మసాధ్య ఏవేతి-గమ్యతే తారతమ్యేన వర్తమానః। తథోర్ధ్వగతేష్వధోగతేషు చ దేహవత్సు దుఃఖ-తారతమ్యదర్శనాత్తద్ధేతోరధర్మస్య ప్రతిషేధచోదనాలక్షణస్య తదనుష్ఠాయినాం చ తారతమ్యం గమ్యతే। ఏవమవిద్యాదిదోషవతాం ధర్మాధర్మతారతమ్యనిమిత్తం శరీరోపాదానపూర్వకం సుఖదుఃఖతారతమ్యమనిత్యం సంసారరూపం శ్రుతిస్మృతి-న్యాయప్రసిద్ధమ్। తథా చ శ్రుతిః "న హ వై సశరీరస్య సతః ప్రియాప్రియయో-రపహతిరస్తి" ఇతియథావర్ణితం సంసారరూపమనువదతి।

---

పుణ్యవిశేషమున కనుగుణముగఁ జంద్రలోకమున సుఖము ననుభవించి యాపుణ్యవిశేషము క్షీణింప నచటినుండి మఱలివచ్చుటఁజేసి సుఖతారతమ్యము, తత్సాధనమగు కర్మతారతమ్యమును గూడ శాస్త్రసిద్ధములే యగుచున్నవి. మనుష్యుఁడు మొదలు బ్రహ్మవఱకుఁ గల శ్రేష్ఠమగు వ్యక్తులయందు సుఖాతిశయముచే ధర్మతారతమ్య మూహింపఁబడినట్లే మనుష్యుఁ డాదిగాఁ గల్గి నరకసంబంధమగు స్థావరము లంతముగాఁ గల్గిన ప్రాణులయందుఁ గూడ సుఖలేశముయొక్క తారతమ్యము చూడఁబడుటచే నయ్యదియు నాయాయిప్రాణులచే నాచరింపఁబడిన ధర్మతారతమ్యముచేతనే గల్గిన ట్లూహింపవచ్చు నని "తథా మనుష్యాదిషు... తారతమ్యేన వర్తమాన" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. ఇట్లే సుఖతారతమ్యముచే ధర్మతారతమ్యము నూహించినట్లుగనే సకలప్రాణులయందుఁ దెలియవచ్చెడి దుఃఖతారతమ్యముచేత నాయాయిప్రాణులచే నాచరింపఁబడిన యధర్మమునందలి తారతమ్యము గూడ గ్రహింప నొప్పు నని "తథా ఊర్ధ్వగతేషు... తారతమ్యం గమ్యతే" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది.

ఇట్లు శ్రుతిసిద్ధమగు నర్థమును లోకానుభవమును బొందికచేసి యద్దానిచేఁ దెలియవచ్చెడి యర్థమును "ఏవమవిద్యాదిదోషవతాం ... శ్రుతిస్మృతిన్యాయప్రసిద్ధమ్మ"ను భాష్యముచే సంక్షేపముగఁ జెప్పఁబడుచున్నది. అనఁగా నవిద్యాదిదోషముతోఁ గూడిన సకలప్రాణులకు ధర్మాధర్మములయొక్క తారతమ్యమున కనుగుణముగ శరీరము కారణముగాఁ గలిగినట్టి యనిత్యమగు సుఖదుఃఖతారతమ్య మున్నటులను నయ్యదియే సంసారరూపమనియు శ్రుతిస్మృతిన్యాయసిద్ధమై యున్న దని యర్థము. ఇట్టి యాశయమునకు శ్రుతిప్రమాణము "తథా చ శ్రుతిః ... సంసారరూపమనువదతి" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది.

సశరీరస్య = శరీరముతోఁ గూడిన, సతః = సత్పదార్థమగు నాత్మకు, ప్రియాప్రియయోః = సుఖదుఃఖములయొక్క, అపహతిః = తొలఁగిపోవుట, నాస్తి = లేదు. అనఁగా దేహాభిమానముతోఁ గూడిన ప్రాణులకు సుఖదుఃఖములనుండి విముక్తి యెంతమాత్రము గలుగదని భావము. ఈశ్రుతి యిదివఱలో వర్ణింపఁబడిన

"అశరీరం వావ సంతం న ప్రియా ప్రియే స్పృశతః" (ఛాం 8-12-1) ఇతి ప్రియా-ప్రియస్పర్శనప్రతిషేధాచ్చోదనాలక్షణధర్మకార్యత్వం మోక్షాఖ్యస్యాశరీరత్వస్య ప్రతిషిధ్యత ఇతి గమ్యతే ధర్మకార్యత్వే హి ప్రియాప్రియస్పర్శనప్రతిషేధో నోపపద్యతే । అశరీరత్వమేవధర్మకార్యమితి చేన్న, తస్య స్వాభావికత్వాత్ । "అశరీరం శరీరేష్వన వస్థేష్వవస్థితమ్ । మహాన్తం విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి" (కాఠ.1-2-21) "అప్రాణో హ్యమనాః శుభ్రః"

---

సంసారస్వరూపమును బోధించుచున్న దని యభిప్రాయము.

ఇట్లు సంసారరూపమును బ్రదర్శించి మోక్షస్వరూపమును బ్రదర్శించు శ్రుతిని "అశరీరం వావ సంతం న ప్రియాప్రియే స్పృశత" యని ప్రదర్శించుచున్నారు. అశరీరమ్ = శరీరరహిత మగు, సంతమ్ = సత్పదార్థ మగు నాత్మను, ప్రియాప్రియే = సుఖదుఃఖములు, న స్పృశతః = స్పృశింప వని దీని యర్థము.

శరీరరహిత మగు భావము ముక్తి యనియు నద్దానికిఁ బ్రియాప్రియ సంస్పర్శము లేదనియుఁ జెప్పుటచే నాయశరీరభావ మగు ముక్తి ధర్మాధర్మముల కార్య మెంతమాత్రము గాకుండుటంజేసి ధర్మమువలన ముక్తి గలుగు నని చెప్పుట కవకాశము లేదని తెలియవచ్చుచున్నది. అయ్యదియే "ప్రియాప్రియస్పర్శనప్రతి-షేధాత్ ...ఇతి గమ్యతే" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. ఏతద్విషయమే వ్యతిరేకముఖమున "ధర్మకార్యత్వే హి ప్రియాప్రియస్పర్శనప్రతిషేధో నోపపద్యతే" యని చెప్పఁబడుచున్నది. అనఁగా మోక్షము ధర్మకార్యమే యగుచోఁ బ్రియా ప్రియము లద్దానిని స్పృశింప వని చెప్పుట యెంతమాత్రము సమంజసము గానేరదు.

ధర్మముచే విచిత్రము లగు ఫలములు పుట్టుచుండ నశరీర మగు మోక్షము గూడ ధర్మముచేఁ గల్గు నని చెప్పఁగూడదా యని మధ్యస్థుఁ డడుగ నట్లు గాదని 'న' యని నిషేధింపఁబడుచున్నది. అందు హేతువు "తస్య స్వాభావిక-త్వా త్తని చెప్పఁబడుచున్నది. అనఁగా నశరీరము స్వభావసిద్ధ మగుటవలన జన్య మెంతమాత్రము గాదని యభిప్రాయము. అశరీరము స్వభావసిద్ధ మనుటకు "అశరీ-రం...ఇత్యాదిశ్రుతిభ్య" యని శ్రుతు లుదాహరింపఁబడుచున్నవి.

1. అనవస్థేషు = ఉనికి లేనట్టి, శరీరేషు = శరీరములయందు, అశరీరమ్ = శరీరవిలక్షణ మగు భావము, అవస్థితమ్ = ఉన్నది, అట్టి యశరీరభావమును, మహాంతమ్ = గొప్పదియు, విభుమ్ = సర్వవ్యాపకము నగు, ఆత్మానం = స్వస్వరూప మును, మత్వా = తెలిసికొని, ధీరః = వివేకి, న శోచతి = దుఃఖింపఁడు.

2. అప్రాణః = ప్రాణవిలక్షణమును, అమనాః = మనోవిలక్షణమును, శుభ్రః = శుద్ధము నన౽గా రాగాదిదోషరహితమును,

(ముండ. 2-1-2.) "అసంగో హ్యయం పురుషః" (బృ 4-3-15) ఇత్యాదిశ్రుతిభ్యః। అత ఏవానుష్ఠేయకర్మఫలవిలక్షణం మోక్షాఖ్యమశరీరత్వం నిత్యమితిసిద్ధమ్ । తత్ర కించిత్పరిణామి నిత్యం, యస్మిన్విక్రియమాణేఽపి తదేవేదమితి బుద్ధిర్న విహన్యతే। యథా పృథివ్యాదిజగన్నిత్యత్వవాదినామ్ । యథా చ సాంఖ్యానాం గుణాః। ఇదం తు పారమార్థికం కూటస్థనిత్యం వ్యోమవత్సర్వవ్యాపి సర్వవిక్రియారహితం నిత్యతృప్తం నిరవయవం స్వయంజ్యోతిఃస్వభావమ్ ।

3. అయం = ఈ, పురుషః=ఆత్మ, అసంగః = నిస్సంగుఁడు, అనఁగా రెండవదానితో సంబంధము లేనివాఁడు. అని పైశ్రుతులయర్థము.

ఈశ్రుతులవలన నశరీర మగు నాత్మ నిత్యసిద్ధ మని సుస్పష్టమగుచున్నది. దానంజేసి ధర్మకార్య మెంతమాత్రము గాదని "అత ఏవ నిత్యమితి సిద్ధమ్మ"ను భాష్యముచే నుపసంహరింపఁబడుచున్నది. అనుష్ఠేయకర్మఫలవిలక్షణమ్= చేయఁబడవలసినదిగా శాస్త్రముచే విధింపఁబడిన కర్మరూప మగు ధర్మముయొక్క ఫలముకంటె వేఱగునట్టిది

ఇట్లు మోక్ష మగు నశరీరభావము నిత్య మని నిర్వచింప నానిత్యమెట్టి నిత్యము ? పరిణామినిత్యమా ? యని దృష్టాంతపురస్సరముగ "తత్ర కించిత్ . . . సాంఖ్యానాం గుణా"యని మధ్యస్థుఁడు ప్రశ్నించుచున్నాఁడు. ఒకవస్తువును బలుసారులు చూచినపు "డదియే యిది, వేఱొకటి గాద" ను జ్ఞానము గలుగుటయే నిత్య మని గ్రహించుటకుఁ గల కారణ మని నిత్యస్వరూపమును నిర్వచించి, యొకానొకవస్తువునం దేకదేశ మొకింత మార్పుఁజెందినను "నయ్యదియే యిది" యను జ్ఞానము తొలఁగకుండ నుండుఁగావునఁ గొంతవఱకు మార్పుఁజెందుచున్నను నద్దానిని నిత్య మని గ్రహించుటకుఁ దగు పరిణామినిత్యత్వ మాయీయశరీరమునకుఁ దెలియవచ్చెడి నిత్యత్వ మని ప్రశ్నింపఁబడియె. అనఁగాఁ బృథివి మొదలుగాఁ గల జగత్తును నిత్య మని దలఁచువారలు గాని గుణములు నిత్య మని తలంచు సాంఖ్యులు గాని దలంచు పరిణామినిత్యమా యని. ఈయశరీర మట్టిపరిణామినిత్యము గాదనియుఁ గూటస్థనిత్య మనియుఁ బ్రత్యేకముగా "ఇదం తు ... మోక్షాఖ్యమ్మ"ను భాష్యముచే స్వాభిమతనిత్యత్వము పుష్కలముగ వర్ణింపఁబడుచున్నది. అశరీరము పరిణామినిత్యమే యగుచో ధర్మకార్యము గావచ్చు ననియు ధర్మకార్యము కాక స్వాభావిక మని శ్రుతిచేఁ దెలియవచ్చుటవలన నియ్యది పరిణామినిత్యము గాక కూటస్థనిత్యమే యని యభిప్రాయము ఇచటఁ గార్యము లగు వస్తువులకుఁ దెలియవచ్చెడి నాల్గువిధము లగు కర్మత్వముగూడ నీయశరీరమునకుఁ జూడఁబడ దని నాల్గు విశేషణములచేఁ జెప్పఁబడుచున్నది. అది యెట్లన— "కూటస్థనిత్యమ్మ"ను విశేషణముచే ఘటాదులకుఁ దెలియవచ్చెడి నిర్వర్త్యకర్మత్వము నిరాకరింపఁబడు

యత్ర ధర్మాధర్మౌ సహ కార్యేణ కాలత్రయం చ నోపావర్తేతే। తదేతద-శరీరత్వం మోక్షాఖ్యమ్। "అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మాదన్యత్రాస్మాత్కృతాకృతాత్। అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ" (కఠ. 2. 14) ఇత్యాదిశ్రుతిభ్యః। అతస్తద్బ్రహ్మ యస్యేయం జిజ్ఞాసా ప్రస్తుతా। తద్యది కర్తవ్యశేషత్వేనోపదిశ్యేత, తేన చ కర్తవ్యేన సాధ్యశ్చేన్మోక్షోఽభ్యుపగమ్యేత, అనిత్య ఏవ స్యాత్।

---

చున్నది. 'సర్వవ్యాపి' యనుటచే గ్రామాదులకుఁ దెలియవచ్చెడి ప్రాప్యకర్మత్వము నిరాకరింపఁబడుచున్నది. "సర్వవిక్రియారహితమ్మ"నుటచే దధ్యాదులకుఁ దెలియవచ్చెడి వికార్యకర్మత్వము నిరాకరింపఁబడుచున్నది. 'నిరవయవమ్మ'నుటచే వ్రీహులకు ప్రోక్షణము సంస్కార మనెడి యంశము గలుగుచుండుటవలనఁ బ్రాప్త మగు సంస్కార్యకర్మత్వము వారింపఁబడుచున్నది. ఇట్టి నాల్గు విశేషణములచే నశరీరమునకుఁ గర్మత్వము నిరాకరింపఁబడే, 'నిత్యతృప్తం, స్వయంజ్యోతిస్స్వభావమ్మ' ను విశేషణద్వయముచే. బరమ పురుషార్థము జూపఁబడుచున్నది. ఇట్టి యశరీరమునకు ధర్మాధర్మములతోఁ గాని తత్కార్యము లగు సుఖదుఃఖములతోఁ గాని సంబంధ మెన్నఁడును లేదని "యత్రధర్మాధర్మౌ సహ కార్యేణ కాలత్రయం చ నోపావర్తేతే" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. కార్యేణ = సుఖదుఃఖములతో, కాలత్రయం = మూఁడు కాలములయందును, ధర్మాధర్మాది సంబంధ మశరీరమునకు లేదనుటకు "అన్యత్రధర్మాత్...శ్రుతిభ్య" యని శ్రుతి ప్రమాణము ప్రదర్శింపఁబడుచున్నది. ధర్మాత్ = ధర్మముకంటె, అన్యత్ర = విలక్షణము; అధర్మాత్ = అధర్మముకంటె, అన్యత్ర = విలక్షణము, కృతాత్ = కార్యముకంటె, అకృతాత్ = కారణముకంటె, అన్యత్ర = విలక్షణము; భూతాచ్చ = భూతముకంటెను, భవ్యాచ్చ = భవ్యముకంటెను గూడ, ననఁగా భూతభవిష్యత్తులకంటెను, చకారమువలన వర్తమానముకంటెను విలక్షణ మని భావము.

ఇట్టి శ్రుతులవలన బ్రహ్మము కూటస్థనిత్య మని తెలియవచ్చుచున్నది. అట్టి కూటస్థబ్రహ్మముయొక్క జిజ్ఞాస ప్రస్తుత మగుటచే నియ్యది ధర్మజిజ్ఞాసకంటె విలక్షణ మగుచు ధర్మఫలముకంటె విలక్షణ మగు ఫలముతో నొప్పారుచున్న దని "అతస్తద్బ్రహ్మ యస్యేయం జిజ్ఞాసా ప్రస్తుతా" యని వైలక్షణ్యము ప్రదర్శింపఁబడుచున్నది. ఇట్టి బ్రహ్మము కర్తవ్యశేషమే యని యుపదేశింపఁబడినచోఁ గల్గు ననర్థము గూడ "తద్యది...అనిత్య ఏవ స్యాత్త"ని చెప్పఁబడు చున్నది. బ్రహ్మ మనెడి మోక్షము విధిశేషమే యగుచో సాధ్య మగు కర్మఫలము కావలయును. సాధ్యమే యైనచో ననిత్యమే యైతీరవలయు నని యభిప్రాయము.

తత్రైవం సతి యథోక్తకర్మఫలేష్వేవ తారతమ్యావస్థితేష్వనిత్యేషు కశ్చిదతిశయో మోక్ష ఇతి ప్రసజ్యేత, నిత్యశ్చ మోక్షస్సర్వైర్మోక్షవాదిభిరభ్యుపగమ్యతే। అతో న కర్తవ్యశేషత్వేన బ్రహ్మోపదేశో యుక్తః। అపి చ "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" (ముండ. 3.2 9) "క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" (ముండ. 2-2-8) "ఆనందం బ్రహ్మణో విద్వాన్। న బిభేతి కుతశ్చన" (తై. 2 9) "అభయం వై జనక ప్రాప్తోఽసి" (బృహ. 4-2-4)

---

మోక్ష మనిత్యమనినచోఁ గల్గు దోషము "తత్రైవం సతి ... ఇతి ప్రసజ్యేత" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. మోక్ష మనిత్యమే యని యంగీకరించినచోఁ దరతమభావముచేఁ దెలియవచ్చెడి యనిత్యము లగు కర్మఫలములలో నెద్దియో యొక యతిశయ మగు ఫలముగ మోక్షము తలంపఁబడవలయును. కాని నిత్య మని తలంచుట కవకాశము లేదు. నిత్యము మోక్షము గాదని చెప్పఁదలంచినచోఁ గల్గు విప్రతిపత్తి "నిత్యశ్చ మోక్షస్సర్వైర్మోక్షవాదిభిరభ్యుపగమ్యతే" యని చెప్పఁబడుచున్నది. అనఁగా మోక్షవాదు లందఱు మోక్షము నిత్య మని చెప్పుచున్నారు. కావున మోక్షము కర్మఫలమని చెప్పుట యెంతమాత్రము సమంజసము గాదని చెప్పి స్వాభిప్రాయమును "అతో న కర్తవ్యశేషత్వేన బ్రహ్మోపదేశో యుక్తః" క్రియావిధి కంగముగ బ్రహ్మ ముపదేశింపఁబడె నని చెప్పుట యెంతమాత్రము యుక్తము గాదని చెప్పుచున్నారు.

ఇంతియ కాదు. బ్రహ్మజ్ఞానఫలము కర్మఫలమట్లు కాలాంతరభావియు నదృష్టమును గాక దృష్టము జ్ఞానసమకాలిక మనియు జ్ఞానైకలభ్య మనియు శ్రుతులవలనఁ దెలియవచ్చుచున్న దని "అపి చ...నాస్తీతి గమ్యతే" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది శ్రుతులయర్థము దిగువఁ బ్రదర్శింపఁ బడుచున్నది.

1. యః=ఎవ్వఁడు, బ్రహ్మ = బ్రహ్మమును, వేద = స్వస్వరూపముగఁ దెలిసికొనుచున్నాఁడో, సః = అట్టివాఁడు, బ్రహ్మ ఏవ = బ్రహ్మమే, భవతి = అగుచున్నాఁడు.
2. తస్మిన్ = ఆబ్రహ్మమునందు, పరావరే-పరం = కారణము, అవరం = కార్యమును, అనఁగాఁ గార్యకారణములు, దృష్టే = చూడఁబడఁగా, అస్య = ఈ విద్వాంసునియొక్క, కర్మాణి చ = కర్మములును, క్షీయంతే = నశించును.
3. బ్రహ్మణః = బ్రహ్మముయొక్క ఆనందం = ఆనందమును, అనఁగా బ్రహ్మస్వరూప మగు నానందమును, విద్వాన్ = తెలిసికొనినవాఁడు, కుతశ్చన = దేనివలనను, న బిభేతి = భయము నొందఁడు.
4. జనక = ఓయీ జనకుఁడా! అభయం = భయరహిత మగు బ్రహ్మభావమును, ప్రాప్తోఽసి = పొందినవాఁడ వగుచున్నావు.

"తదాత్మానమేవావేదహం బ్రహ్మాస్మీతి । తస్మాత్తత్సర్వమభవత్" (వాజసనేయి-బ్రాహ్మణోప. 1 4-10) "తత్ర కో మోహః కః శోక ఏకత్వమనుపశ్యతః" (ఈశా. 7) ఇత్యేవమాద్యాః శ్రుతయః బ్రహ్మవిద్యానంతరం మోక్షం దర్శయంత్యో మధ్యే కార్యాంతరం వారయన్తి । తథా "తద్ధైతత్పశ్యన్నృషిర్వామదేవః ప్రతిపేదేఽహం మనురభవం సూర్యశ్చ" (బృహ, 1-4-10) ఇతి బ్రహ్మదర్శనసర్వాత్మభావయోర్మధ్యే కర్తవ్యాంతరవారణాయోదాహార్యమ్ ।

5. తత్ = ఆబ్రహ్మమును, ఆత్మానమేవ = స్వరూపముగ, అహం = నేనే, బ్రహ్మ = బ్రహ్మను, అస్మి = అయితిని, ఇతి = ఇట్లు, అవేత్ = తెలిసి కొంటివి. తస్మాత్ = ఆ తెలిసికొనుటవలన, తత్ = ఆపూర్ణ మగు బ్రహ్మమే, సర్వం = అంతయును, అభవత్ = ఆయెను.
6. ఏకత్వం = సార్వాత్మ్యభావమును, అనుపశ్యతః = తెలిసికొనుటవలన, తత్ర = అట్టి సార్వాత్మ్యభావమునందు, మోహః = మోహము, క్వ ? = ఎక్కడ ?, శోకః = శోకము, క్వ = ఎచ్చట ? అనఁగా శోకమోహములఁ గల్గించు రెండవవస్తువు తెలియఁబడ దని భావము.

ఈశ్రుతులయొక్క తాత్పర్యము సంక్షేపముగ "ఇత్యేవమాద్యాః శ్రుతయః ... వారయంతి" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది.
7. తత్ = ఆబ్రహ్మము, ఏతత్ = ఈయాత్మగ పశ్యన్ = తెలిసికొనుచు, ఋషిః వామదేవః = వామదేవుఁ డను ఋషి, అహం = నేను, మనుః = మనువును, అభవం = అయితిని, సూర్యశ్చ = సూర్యుఁడనుగూడ, అభవం = అయితిని. కాలాంతరవర్తి యగు మనువుతోడను, దేశాంతరవర్తి యగు సూర్యునితోడను దాదాత్మ్యభావమును వ్యక్తీకరించుటచే జ్ఞానసమకాలముననే సార్వాత్మ్య భావముఁ బడసినట్లు తెలియవచ్చుచున్నది. కావున నీవామదేవదృష్టాన్తముచేఁ దెలియవచ్చెడి యర్థము దృష్టాన్తపురస్సరముగ "బ్రహ్మదర్శనసర్వాత్మభావయోః ...నాస్తీతి గమ్యతే" యను భాష్యముచే వ్యక్తీకరింపఁబడుచున్నది.

ఇచట "తద్ధైతత్పశ్యన్ ఋషిర్వామదేవః ప్రతిపేదే" యనుచో "పశ్యన్న"ను పదమునందలి శతృప్రత్యయము మఱియొక క్రియావ్యవధానమును వారించుచున్నది. ఎట్లన— 'పశ్యన్న'ను పదముచేఁ జెప్పఁబడు దర్శనము బ్రహ్మప్రతిపత్తిరూప మగు క్రియయందు హేతు వగుచున్నది. కనుకనే "లక్షణహేత్వోః క్రియాయాః" (పాణిని. 3-2-126) అను సూత్రముచే క్రియాహేతు వగు శబ్దముకంటెఁ గలుగు శతృప్రత్యయము నచ్చోఁ సిద్ధమాయెను. హేతు వన నవ్యవధానము లేకుండ కార్యమును బుట్టించునది యని యర్థము.

యథా తిష్ఠన్ గాయతీతి తిష్ఠతిగాయత్యోర్యర్థ్యే తత్కర్తృకం కార్యాంతరం నాస్తీతి గమ్యతే। "త్వం హి నః పితా యోఽస్మాకమవిద్యాయాః పరం పారం తారయసి" (ప్ర. 6-8) "శ్రుతం హ్యేవ మే భగవద్దృశేభ్య స్తరతి శోకమాత్మవిదితి సోఽహం భగవః శోచామి తం మా భగవాఞ్ఛోకస్య పారం తారయతు" (ఛాం. 7-1-3) "తస్మై మృదితకషాయాయ తమసః పారం దర్శయతి భగవాన్ సనత్కుమారః" (ఛాం. 7-26-2) ఇతి చైవమాద్యాః శ్రుతయో మోక్షప్రతిబంధనివృత్తిమాత్రమే-వాత్మజ్ఞానస్య ఫలం దర్శయన్తి ।

---

కనుక నిచట క్రియాహేత్వర్థ మగుశతృప్రత్యయముచే నన్యవ్యవధానము వారింపఁ బడుచున్నది.

బ్రహ్మజ్ఞానముచే మోక్షము గలుగు నన, బ్రహ్మజ్ఞానముచే స్వయముగఁ గాని యపూర్వద్వారముగఁగాని ముక్తి యనునది గలుగు ననుట గాక స్వస్వరూపము దెలియఁబడకుండఁ బ్రతిబంధమాత్రముగ నుండు నావరణరూపమును విక్షేపరూపమును నగు నవిద్యాద్వయనివృత్తిమాత్రమే యని "త్వం హి నః పితా ..., ఫలం దర్శయంతి" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. భరద్వాజుఁడు మొదలుగాఁ గల యార్గులు ఋషులును బిప్పలాదుఁ డను గురువువలన జ్ఞానమును బడసి యట్టిజ్ఞానముచేఁ దమకుఁ గల్గిన ప్రయోజనమును, యః త్వం= ఏనీవు, అస్మాకం= మమ్ములను, అవిద్యాయాః= అవిద్యయొక్క, పరం=ఉత్కృష్ట మగు, పారం= అవధిని, తారయసి= జ్ఞానముచే దాఁటించుచున్నావో, యట్టి కారణముచే, త్వం= అట్టినీవు, నః = మాకు, పితా= నిశ్చయముగఁ దండ్రివే యని పల్కిరి. ఆతీరుననే నారదుఁడు, భగవద్దృశేభ్యః = భగవంతు లగు మీతో సమాను లగు మహనీయులవలన, ఆత్మవిత్= స్వస్వరూపముఁ దెలిసికొనినవాఁడు, శోకం= దుఃఖమును, తరతి= దాఁటుచున్నాఁడు. సోఽహం= అట్లు విన్నట్టి నేను, భగవః= మహానుభావా!, శోచామి= దుఃఖించుచున్నాను. భగవాన్= మహానుభావుల రగు మీరు, తం మా= అట్టినన్ను, శోకస్య= దుఃఖముయొక్క, పారం= అవధిని, తారయతు = దాఁటింపుఁడని ప్రార్థించుచు సనత్కుమారులకడకుఁ బోవ, భగవాన్ సనత్కుమారః = మహానుభావుఁ డగు సనత్కుమారుఁడు, మృదితకషాయాయ = కాలుష్యము నశించుటచేఁ జిత్తశుద్ధి నొందినట్టి, తస్మై=ఆనారదునికొఱకు, తమసః=అజ్ఞానముయొక్క, పారం= అవధిని, దర్శయతి= చూపించుచున్నా రను నీ రెండు శ్రుతులచే నాత్మజ్ఞానముయొక్క ఫలము మోక్షమునకుఁ బ్రతిబంధ మగు నజ్ఞానముయొక్క నివృత్తిమాత్రమే యని సుస్పష్ట మగుచున్నదని భావము. ఆత్మజ్ఞానముచేఁ బ్రతిబంధరూప మగు నజ్ఞానము దొలఁగుటయే ప్రయోజనమని యొక శ్రుతులచేఁ గాదు, స్మృతులచేఁ గూడ సయుక్తికముగ

తథా చాచార్యప్రణీతం న్యాయోపబృంహితం సూత్రమ్— "దుఃఖజన్మప్రవృత్తి-దోషమిథ్యాజ్ఞానానాముత్తరోత్తరాపాయే తదనంతరాపాయాదపవర్గః" (న్యా. సూ. 1-1-2) ఇతి। మిథ్యాజ్ఞానాపాయశ్చ బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానాద్భవతి। న చేదం బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానం సంపద్రూపమ్। యథా 'అనంతం వై మనోఽనంతా విశ్వే దేవా అనంతమేవ స తేన లోకం జయతి' (బృ. 3-1-9) ఇతి। న చాధ్యాసరూపమ్। యథా "మనో బ్రహ్మేత్యుపాసీత' (ఛాం.3-18 1) "ఆదిత్యో బ్రహ్మే-త్యాదేశః" (ఛాం. 3-19-1) ఇతి చ మనఆదిత్యాదిషు బ్రహ్మదృష్ట్యధ్యాసః। నాపి విశిష్టక్రియాయోగనిమిత్తం "వాయుర్వావ సంవర్గః" "ప్రాణో వావ సంవర్గః" (ఛాం. 4-3-13) ఇతివత్। నాప్యాజ్యావేక్షణాదికర్మవత్కర్మాంగ-సంస్కారరూపమ్।

---

నిర్వచింపఁబడుచున్న దని "తథా చాచార్యప్రణీతం ...... అపవర్గ ఇతి" యను భాష్యముచే నక్షపాదసూత్రము గూడఁ బ్రదర్శింపఁబడు చున్నది. న్యాయోప-బృంహితం = యుక్తులచేఁ బోషింపఁబడునట్టి, దుఃఖము, జన్మ, ప్రవృత్తి, దోషము, మిథ్యాజ్ఞాన మను నైదింటిలో నుత్తరోత్తరము నశించుటవలనఁ బూర్వ-పూర్వము నశించుచున్నది గాన నపవర్గము లభించునని సూత్రార్థము. అనఁగా మిథ్యాజ్ఞానము నశింప రాగాది దోషము నశించును. దోషము నశింపఁ గర్మయందలి ప్రవృత్తి నశించును. ప్రవృత్తి నశింప జన్మ నశించును. జన్మము నశింప దుఃఖము నశించు నని భావము. కావున దుఃఖనాశమునకుఁ గాను మిథ్యాజ్ఞానము నశింపవలయు నని చెప్పఁబడుచున్నది. మిథ్యాజ్ఞాననాశ మన్ననో బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానమువలనఁగలుగునని "మిథ్యాజ్ఞానాపాయశ్చ బ్రహ్మాత్మైకత్వ-విజ్ఞానాద్భవతి" యను భాష్యముచే నిరూపింపఁబడు చున్నది. బ్రహ్మాత్మైకత్వ విజ్ఞాన మన, బ్రహ్మము నాత్మయు నొక్కటే, యనఁగా బ్రహ్మమే యాత్మ యను జ్ఞానము గాని వేఱొం డెంతమాత్రము గాదనియు దానంజేసి యీజ్ఞాన ముపాసనలో విషయ మెంతమాత్రము గాదనియు నభిప్రాయము. బ్రహ్మాత్మైకత్వ విజ్ఞాన ముపాసనలో విషయమే యగుచో బ్రహ్మాత్మలు రెండును భిన్నము లగుట వలన నారెండిటికి నెద్దియో యొకతీరున నేకత్వము సంపాదింపఁబడవలసి వచ్చును. అట్లేకత్వమును సంపాదించుట సంపద్రూపము, అధ్యాసరూపము, విశిష్టక్రియా యోగనిమిత్తరూపము, కర్మాంగసంస్కారరూప మను నాల్గువిధములలో నెద్దియేని యొకటి గావలయును. అట్టినాల్గువిధములలో నేవిధమును గాదని నిర్వచింప నానాల్గువిధములును బ్రౌఢముగ "న చేదం ... కర్మాంగసంస్కారరూపమ్మ"ను భాష్యముచే వారింపఁబడుచున్నవి. అందు మొదట సంపద్రూపోపాసన నిరూ పింపఁబడు చున్నది. సంపదుపాస్తి యన నొక యల్ప మగు వస్తువునకును

నొకానొక యుత్కృష్టవస్తువునకును ధర్మసామ్యముచే నేకత్వమును సంపాదించి యల్పవస్తువు నుత్కృష్టవస్తువుగా భావనచేయుట. ఎట్లనిన—మన స్సనంతము లగు వృత్తులతో నొప్పారుటంజేసి యనంతధర్మవిశిష్టము. విశ్వేదేవత లన్ననో యనంత మగు సంఖ్యతో నొప్పారుటంజేసి యనంతధర్మవిశిష్టులు. దానంజేసి యనన్తత్వ సామ్యముచే మనస్సును విశ్వేదేవతలుగా భావనచేసి యుపాసించుటవలన నాయుపాసకుం డనంత మగు లోకమును జయించు ఫలము నొందుచున్నాడు. అతీరుననే జీవునకును బ్రహ్మమునకుం బ్రమాపసామ్యముండుటంజేసి యల్పుం డగు జీవుని నుత్కృష్ట మగు బ్రహ్మముగా భావనచేసి యుపాసించుటచే నమృతత్వము గల్గు ననియుం దెలియవచ్చుచున్నది. అదియునుగూడ సమంజసము గాదని భావము.

ఇంక నధ్యాసోపాసనమున నదికానిదాని నద్దానిగా నుపాసించుట. ఎట్లన, బ్రహ్మముగానిమనస్సును గాని, యాదిత్యుని గాని బ్రహ్మ మని యుపాసించునట్లు బ్రహ్మముకానిజీవుని బ్రహ్మ మని యుపాసించుట గూడ సమంజసము గాదని భావము,

విశిష్టక్రియాయోగనిమిత్తోపాసన యన రెండువస్తువులయందుం దెలియ వచ్చెడి క్రియకు సామ్య ముండుటవలన నారెండువస్తువులు నొకటియే యని యుపా సించుట. ఎట్లన—ప్రలయకాలమున వాయువు పృథివ్యప్తేజస్సు లను భూతములను దనయందు నిమిడ్చికొని 'సంవర్గ' మను సంకేతమును బడయుచున్నది. అతీరుననే ముఖ్యప్రాణ మన్ననో సుషుప్తికాలమున సకలేంద్రియములను దనయందు లయము చేసికొని నిలిచియుండుటంజేసి 'సంవర్గ' మను సంకేతమును బొందుచున్నది. ముఖ్య ప్రాణమునకును వాయువునకు నిట్టిసంవర్గరూపక్రియాసామ్య ముండుటంజేసి ముఖ్య ప్రాణమే వాయు వని యుపాసించువిధమునం బ్రకృతమున జీవునియందును బ్రహ్మ మందును బృంహణక్రియాసామ్య ముండుటంజేసి జీవుండే బ్రహ్మ మని యుపాసిం చుట విశిష్టక్రియాయోగనిమిత్త మని చెప్పంబడుచున్నది. అయ్యదియుం గూడ సమంజసము గాదని తాత్పర్యము.

దర్శపూర్ణమాసప్రకరణమున నుపాంశుయాగమునకు ద్రవ్యముగా విధింపంబడిన యాజ్యము (నెయ్యి) యజమానునియొక్క పత్నిచేం జూడంబడుటచే హోమమునకుం దగు యోగ్యతను బడయుచున్నది. ఈచూచుటచే నాజ్యమునకు నదృష్టరూప మగు సంస్కార మొకటి యూహింపంబడుచున్నది గాని యయ్యది ప్రత్యక్షసిద్ధము గాదు. అతీరుననే కర్మయందు నంగభావమును జెందినకర్త తాను బ్రహ్మ మని భావించుటచే నాజ్యము పడయున ట్లొకింత విశేషమును బడయునన్నచో నీబ్రహ్మాత్మైకత్వజ్ఞానము కర్మాంగసంస్కార మగుచు నెద్ది యేని స్వతంత్రఫలము, లేక కర్మఫలమునకుం బుష్టి నిచ్చునది యగును. అట్టి

సంపదాదిరూపే హి బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానేఽభ్యుపగమ్యమానే "తత్త్వమసి" (ఛాం.6-8-7) "అహం బ్రహ్మాస్మి" (బృ.1-4-10) "అయమాత్మా బ్రహ్మ" (బృ 2-5-19) ఇత్యేవమాదీనాం వాక్యానాం బ్రహ్మాత్మైకత్వవస్తుప్రతిపాదనపరః పదసమన్వయః పీడ్యేత। "భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యన్తే సర్వసంశయాః" (ముండ.2-2-8) ఇతి చైవమాదీన్యవిద్యానివృత్తిఫలశ్రవణాన్యుపరుధ్యేరన్। "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" (ముండ. 3-2-9) ఇతి చైవమాదీని తద్భావాపత్తివచనాని సంపదాదిపక్షే న సామంజస్యేనోపపద్యేరన్। తస్మాన్న సంపదాదిరూపం బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానమ్। అతో న పురుషవ్యాపారతంత్రా బ్రహ్మవిద్యా। కిం తర్హి ప్రత్యక్షాదిప్రమాణవిషయవస్తుజ్ఞానవద్వస్తుతన్త్రా।

---

కర్మాంగసంస్కారరూపమే యీ బ్రహ్మాత్మవిజ్ఞాన మన్నచోఁ బైమూఁడువిధము లగు నుపాసనలకంటె నికృష్టభావము నొందుచున్నది. ఏలయన నామూఁడువిధము లగు నుపాసనలును స్వతంత్రములగు ఫలములకు హేతువు లగుచున్నవి. ఇది యన్ననో యట్లు గాదు. కావున నిట్టి కర్మాంగసంస్కారోపాసన గూడ సమంజసము గాదని భావము.

ఇట్లీనాలుగువిధము లగు నుపాసనలలో నేవిధ మ్మగు నుపాసనతోఁ గూడ బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానమును బొందికచేయఁదలఁచినచో బ్రహ్మాత్మలు రెండు నత్యంతభిన్నములై యుండితీరవలయును. అట్లత్యంతభిన్నము లని చెప్పుటకుఁ దగు ప్రమాణవచనములు లేక బ్రహ్మమే యాత్మ యని శతవిధముల శ్రుతులు ఘోషించుచుండ బ్రహ్మాత్మైకత్వవిజ్ఞాన ముపాసనావిషయమే యనినచో శ్రుతి వ్యాకోపము గలుగు నను నాశయము "సంపదాదిరూపే ... సంపదాదిరూపం బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానమ్మ్"ను భాష్యముచే నిరూపింపఁబడుచున్నది.

బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానము సంపదాదిరూపమే యైనచో బ్రహ్మాత్మలు రెండు నొక్కటే యని వేదాంతవాక్యసమన్వయమును బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానముచే నవిద్య నివృత్తిఁజెందు నను ఫలబోధకవాక్యమును జీవునికి బ్రహ్మభావాపత్తిరూప మగు మోక్షమును బోధించు వాక్యములును సర్వవిధముల నిరర్థకములు గావలసివచ్చును గావున జీవబ్రహ్మములకు నేకత్వమునే యంగీకరింపవలయును గాని భేదము నెంతమాత్రము దలంపఁగూడ దని తాత్పర్యము. బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానము సంపదాదిరూప మగు నుపాసనావిశేషము గాకపోవుటచేఁ గల్గు ఫలము "అతో న పురుషవ్యాపారతంత్రా బ్రహ్మవిద్యా" యని చెప్పఁబడుచున్నది. అనఁగా బ్రహ్మవిద్య యనునది పురుషవ్యాపారతంత్ర మెంతమాత్రము గాదని యర్థము. పురుషవ్యాపారతంత్రము గానిచో మఱి యేమని "కిం తర్హి" యని ప్రశ్నింప వస్తుతంత్ర మని "ప్రత్యక్షాదిప్రమాణవిషయవస్తుజ్ఞానవద్వస్తుతంత్రా"

ఏవంభూతస్య బ్రహ్మణ స్తజ్జ్ఞానస్య చ న కయాచియుక్త్యా శక్యః కార్యానుప్రవేశః కల్పయితుమ్। న చ విదిక్రియాకర్మత్వేన కార్యానుప్రవేశో బ్రహ్మణః, "అన్యదేవ తద్విదితాదథో అవిదితాదధి" (కేన. 1-3) ఇతి విదిక్రియాకర్మత్వప్రతిషేధాత్, "యేనేదం సర్వంవిజానాతి తం కేన విజానీయాత్" (బృ 2-4-13) ఇతి చ। తథోపాస్తిక్రియాకర్మత్వప్రతిషేధోఽపి భవతి– "యద్వాచానభ్యుదితం యేన వాగభ్యుద్యతే" ఇత్యవిషయత్వం బ్రహ్మణ ఉపన్యస్య, "తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే" (కేన. 1-4) ఇతి।

యని చెప్పఁబడుచున్నది. అనఁగా బ్రహ్మజ్ఞానము పురుషతంత్ర మెంతమాత్రము గాక వస్తు వగు బ్రహ్మముయొక్క యధీనమే యగుటంజేసి సిద్ధవస్తు వగు బ్రహ్మమునకుఁ గాని యట్టి బ్రహ్మయొక్క జ్ఞానముచేఁ గాని యెట్టియుక్తిచేఁగూడఁ గార్యముతో సంబంధమును గల్పించుట యెంతమాత్రము శక్యముగాదని సింహగర్జనముతో "ఏవంభూతస్య ... కల్పయితుమ్మ"ను భాష్యముచే నిర్వచింపఁబడుచున్నది. కార్యానుప్రవేశః = కార్యముతో సంబంధము

• అట్లైనచో "బ్రహ్మవిదాప్నోతి పరం" 'బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి' యను శ్రుతులచే బ్రహ్మవేదనము పురుషార్థసాధనముగా వర్ణింపఁబడుచుండ వేదనమునందు బ్రహ్మము విషయ మగుటంజేసి బ్రహ్మమునకు విక్రియతో సంబంధము తెలియవచ్చుచుండ బ్రహ్మమునకుఁ గ్రియతో నెట్టిసంబంధమును బొసఁగ దని చెప్పుట యెట్లని ప్రశ్నింప నందులకు సమాధానము "న చ విదిక్రియాకర్మత్వేన ... కేన విజానీయాత్ ఇతి చ" యను భాష్యముచే విదిక్రియాసంబంధము వారింపఁబడుచున్నది.

తత్ = ఆబ్రహ్మము, విదితాత్ = తెలియఁబడెడి కార్యముకంటెను, అన్యదేవ = విలక్షణమే; అథో = ఇంకను, అవిదితాత్ = తెలియఁబడని కార్యముకంటెను, అన్యదేవ=భిన్నమే; అను శ్రుతిచేతను, యేన=ఏబ్రహ్మముచేతను, ఇదం= ఈపరిదృశ్యమాన మగు, సర్వం = సమస్త మగు జగత్తు, విజానాతి= తెలిసికొనఁబడుచున్నదో, తం=అట్టిబ్రహ్మమును, కేన=ఏసాధనముచేత, విజానీయాత్ = తెలిసికొనవలయు నను శ్రుతులచే బ్రహ్మము విదిక్రియకుఁ గర్మ మెంతమాత్రము గాదని వారింపఁబడుచున్నది. ఆతీరుననే యుపాస్తిక్రియలకు బ్రహ్మము విషయము గాదని "తథోపాస్తిక్రియా... నేదం యదిదముపాసతే"యను భాష్యముచే వారింపఁబడుచున్నది. కేనోపనిషత్తునందు "యత్=ఏవస్తువు, వాచా=వాగింద్రియముచే, అనభ్యుదితం = చెప్పఁబడదో, యేన = ఏవస్తువుచే, వాక్ = వాగింద్రియము, అభ్యుద్యతే = బయలుదేరుచున్నదో" యను శ్రుతిచే బ్రహ్మము విషయము గాదని వివరించి, పిమ్మట, తదేవ- తత్ = అట్టి, బ్రహ్మ = బ్రహ్మము, త్వమేవ = నీవే

అవిషయత్వే బ్రహ్మణః శాస్త్రయోనిత్వానుపపత్తిరితి చేత్ । న । అవిద్యా-కల్పితభేదనివృత్తిపరత్వాచ్ఛాస్త్రస్య। న హి శాస్త్రమిదంతయా విషయభూతం బ్రహ్మ ప్రతిపిపాదయిషతి । కిం తర్హి ప్రత్యగాత్మత్వేనావిషయతయా ప్రతిపాద-యదవిద్యాకల్పితం వేద్యవేదితృవేదనాదిభేదమపనయతి । తథా చ శాస్త్రమ్— "యస్యామతం తస్య మతం, మతం యస్య న వేద సః । అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాతమవిజానతామ్" ( కేన. 2.3 )

---

యని, విద్ధి = తెలిసికొనుము, యత్ = ఏ, ఇదం = ఈపురోవర్తియగు వస్తువును ఉపాసతే = ఉపాసించుచున్నదో, తత్ ఇదం = ఆ యీ పరిదృశ్యమానమగు వస్తువు, న = బ్రహ్మము కాదని యర్థము.

బ్రహ్మము వాసనా విధిక్రియలకుఁ గూడ విషయము కాకపోయిన పోఁ బూర్వాధికరణమందు నిర్దేశింపఁబడినట్లు శాస్త్రమున నుపదేశింపఁబడుట యసమం జసమే యని " అవిషయత్వే ... అనుపపత్తి " యని పూర్వపక్షుఁడు ప్రశ్నింప నట్లు గాదని "ఇతి చేత్, న" యని సమాధానము చెప్పఁబడు చున్నది. అనఁగా బ్రహ్మముయొక్క శాస్త్రప్రమాణకత్వమునకు భంగము లేదని యభిప్రాయము. అందులకు హేతువు " అవిద్యాకల్పితభేదనివృత్తిపరత్వాచ్ఛాస్త్రస్య " యను సంగ్రహవాక్యముచేఁ జెప్పఁబడుచున్నది. శాస్త్ర మవిద్యచేఁ గల్పింపఁబడిన భేద మును దొలఁగించుటయే తాత్పర్యముగాఁ గలిగిన దని యభిప్రాయము. సంగ్రహ వాక్యము "న హి శాస్త్రమిదంతయా ... ఇతి చైవమాది" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది. శాస్త్రం= శాస్త్రము, ఇదంతయా= ఇదమిత్థ మని పురో వర్తిగ నిరూపించుటచే, విషయభూతం= విషయభావమును బొందిన, బ్రహ్మ= బ్రహ్మమును, న హి ప్రతిపిపాదయిషతి= ఘటపటాదులవలెఁ బ్రతిపాదింప నిచ్ఛ యింపలేదు. కిం తర్హి= ఇంకెటు లన, ప్రత్యగాత్మత్వేన= స్వస్వరూపభావముచే, అవిషయతయా= విషయభావము నొందని సర్వసాక్షిరూపముగా, ప్రతిపాదయత్= బోధించుచు, వేద్యవేదితృవేదనాదిభేదమ్= వేద్యము, వేదిత, వేదన మను లోక సిద్ధ మగు మూఁడువిధము లగు భేదమును, అపనయతి= తొలఁగించుచున్నది. అనఁ త్రివిధభేదములఁ బోఁగొట్టి తదతీత మగు సాక్షిస్వరూపమును సూచించుచున్న దని యాశయము. ఇట్టియభిప్రాయమును వ్యక్తీకరించు శ్రుతులు "తథా చ శాస్త్ర-మ్మ"ని ప్రదర్శింపఁబడుచున్నవి.

1 యస్య= ఎవనికి, అమతమ్= బ్రహ్మ మవిషయమో, తస్య= వానికి, మతమ్= బ్రహ్మ తెలియఁబడినది. యస్య= ఎవ్వనికి, మతమ్= బ్రహ్మము విషయమో, సః= అట్టివాఁడు, న వేద= బ్రహ్మమును దెలిసికొనకున్నాఁడు. విజా నతామ్= బ్రహ్మమును దెలిసికొనుచున్నవారలకు, అవిజ్ఞాతమ్=బ్రహ్మ మవిషయ

" న దృష్టేర్ద్రష్టారం పశ్యేః " " న విజ్ఞాతేర్విజ్ఞాతారం విజానీయాః " ( బృహ. 3-4-2) ఇతి చైవమాది । అతోఽవిద్యాకల్పిత సంసారిత్వనివర్తనేన నిత్యముక్తాత్మస్వరూప సమర్పణాన్న మోక్షస్యానిత్యత్వదోషః యస్య తూత్పాద్యో మోక్షస్తస్య మానసం వాచికం కాయికం వా కార్యమపేక్షత ఇతి యుక్తమ్ । తథా వికార్యత్వే చ తయోః పక్షయోర్మోక్షస్య ధ్రువమనిత్యత్వమ్ । న హి దధ్యాది వికార్యమ్, ఉత్పాద్యం వా ఘటాది నిత్యం దృష్టం లోకే ।

---

ముగాఁ దెలియఁబడుచున్నది. అవిజానతామ్= అజ్ఞులకు, విజ్ఞాతమ్= బ్రహ్మము. విషయముగాఁ దెలియఁబడుచున్నది.

2 దృష్టేః= దృష్టియొక్క, ద్రష్టారమ్= ద్రష్టను, న పశ్యేః= చూడలేవు. విజ్ఞాతేః= విజ్ఞానమును, విజ్ఞాతారమ్= తెలిసికొనువానిని, న విజానీయాః= తెలిసికొనలేవు అనఁగా దృష్టియొక్క ద్రష్టకును, విజ్ఞానముయొక్క విజ్ఞాతకును విషయత్వము వారింపఁబడుచున్నది యని భావము.

ఇట్లు బ్రహ్మమునకు విషయత్వము వారింపఁబడి ప్రకృతము "అతః ... అనిత్యత్వదోష" యని నిర్వచింపఁబడుచున్నది. శాస్త్రమవిద్యచేఁ గల్పింపఁబడిన సంసారిత్వమును దొలఁగించి నిత్యముక్తాత్మస్వరూపమే మోక్షమని బోధించుచున్నది గావున మోక్షమునకనిత్యత్వదోష మెంతమాత్రము ఘటింపదని స్వమతము నిరూపింపఁబడుచున్నది. మోక్షస్వరూపము నిత్యముక్తాత్మస్వరూపమే గాక కర్మజన్యమే యని చెప్పినచో మోక్షమునకనిత్యత్వరూపమగు దోషము గలుగునను నాశయము తేటపడునట్లుగాఁ బరపక్షములయందలి దోషములు ' యస్య తూత్పాద్య ' యను వాక్యమాదిగాఁ గల గ్రంథముచే నిరూపింపఁబడుచున్నవి. కర్మసాధ్యమే మోక్ష మనినచో మోక్షము ఉత్పాద్యము, వికార్యము, ఆప్యము, సంస్కార్య మను నాల్గువిధములలో నెద్దియో యొకటి గావలయు ననియు నం దెద్దియైనను నిత్య మని చెప్పుటకు వీలులేకపోవుటచే మోక్ష మానాల్గువిధములకంటె భిన్న మగు నిత్యస్వరూపమే గావలయు ననియు నొకదాని వెనుక నొకటి క్రమముగ విమర్శింపఁబడుచున్నవి. అందు మొదట నుత్పాద్య వికార్యము లను రెండిటియందలి దోషములు " యస్య తూత్పాద్యః ... దృష్టం లోకే" యను భాష్యముచే నిరూపింపఁబడుచున్నవి. అనఁగా నెవ్వఁడు మోక్షము నుత్పాద్యమని తలంచునో యట్టివాఁడు మానసికమో, వాచికమో, కాయికమో యగు కర్మముచే మోక్షము గల్గునని చెప్పవలయును. అటులనే మోక్షము వికార్య మని తలంపఁబడినను గార్యముచేఁ గల్గునని చెప్పవలయును. అట్లు మోక్ష ముత్పాద్య మని గాని వికార్య మని గాని తలంపఁబడినచో నట్టిమోక్షము సర్వవిధముల ననిత్యమే యగును. ఏలయన- లోకములో నుత్పాద్యములగు

న చాప్యత్వేనాపి కార్యాపేక్షా, స్వాత్మస్వరూపత్వే సత్యనాప్యత్వాత్। స్వరూప-వ్యతిరిక్తత్వేఽపి బ్రహ్మణోఽనాప్యత్వం, సర్వగతత్వేన నిత్యాప్తస్వరూపత్వాత్స-ర్వేణ బ్రహ్మణః, ఆకాశస్యేవ। నాపి సంస్కార్యో మోక్షః, యేన వ్యాపార-మపేక్షేత సంస్కారో హి నామ సంస్కార్యస్య గుణాధానేన వా స్యాద్దోషాప-నయనేన వా।

---

ఘటాదులుగాని వికార్యము లగు దధ్యాదులుగాని నిత్యము లెంతమాత్రముగాక యనిత్యములే యగుచున్నవి. దానంజేసి నిత్య మగు మోక్ష ముత్పాద్య మని గాని, వికార్య మనిగాని తలంపఁబడఁగూడదు. ఉత్పాద్యము వికార్య మనినచో నాశప్రసంగము గలుగుఁగాని ఆప్య మనినచో నాశప్రసంగము గలుగక కార్య ము నపేక్షించుటకు సావకాశము గలుగుననునాశయముతో మోక్షము నాప్యముగ నేల గ్రహింపఁగూడ దని ప్రశ్నింప "న చాప్యత్వేనాపి కార్యాపేక్షా" యని నిషేధింపఁబడుచున్నది. అనఁగా– మోక్ష మగు బ్రహ్మ మాప్యము. కావున నద్దానిఁ బొందుటకుఁ గార్యాపేక్ష గలుగుచున్న దని యనినచో నట్లు గాదని యర్థము. ఇచట హేతువు "స్వాత్మస్వరూపత్వే సత్యనాప్యత్వాత్"ని నిరూ పింపఁబడుచున్నది. అనఁగా మోక్ష మగు బ్రహ్మము తనయొక్క యాత్మ స్వరూపమే యగుటంజేసి స్వభిన్న మగు నాప్యము గాదు గావునఁ గార్యముతో సంబంధ మెంతమాత్రము లేదని స్వమతానుసారముగా సమాధానము చెప్పఁబడు చున్నది.

ఇఁక మోక్ష మగు బ్రహ్మము స్వస్వరూప మగుచో నాప్యత్వము సిద్ధిం పదు గాని స్వభిన్న మగుచో నాప్యత్వము సిద్ధించుచుఁ గార్యాపేక్ష గలుగుచుండునే యనినచో నపుడు గూడ బ్రహ్మమున కాప్యత్వము సిద్ధింపనేర దని "స్వరూప-వ్యతిరిక్తత్వేఽపి బ్రహ్మణోఽనాప్యత్వమ"ని చెప్పఁబడుచున్నది. అందులకు హేతువు "సర్వగతత్వేన నిత్యాప్తస్వరూపత్వాత్సర్వేణ బ్రహ్మణః, ఆకాశస్యేవ" యని చెప్పఁబడుచున్నది. అనఁగా నాకాశమువలె బ్రహ్మము సర్వగత మగుటచే సర్వ ప్రపంచముతోఁ గూడ నెల్లపుడు పొందఁబడియున్న స్వరూపము గలదియే యగుటంజేసి యాప్య మెన్నటికిని గానేర దని భావము.

మోక్షముత్పాద్యవికార్యాప్యములలో నెద్దియుఁ గాకపోయినను సంస్కార్య మగుచు సంస్కారరూప మగు కర్మ నపేక్షింపఁగూడదా యనిన నయ్యదియుఁ గూడఁ గాదని "నాపి సంస్కార్యో మోక్షః, యేన వ్యాపారమపేక్షేత" యని సంగ్రహముగఁ బ్రతిజ్ఞ చేయఁబడుచున్నది. ప్రతిజ్ఞావాక్యము "సంస్కారో హి నామ ... తస్మాన్న సంస్కార్యో హి మోక్షః" యను భాష్యముచే వివరింపఁబడు చున్నది. మోక్షమునకు సంస్కారముతో నెట్టిసంబంధమును లేదని చెప్పుటకు

న తావద్గుణాధానేన సంభవతి, అనాధేయాతిశయబ్రహ్మస్వరూపత్వాన్మోక్షస్య। నాపి దోషాపనయనేన, నిత్యశుద్ధబ్రహ్మస్వరూపత్వాన్మోక్షస్య। స్వాత్మధర్మ ఏవ సంస్తిరోభూతో మోక్షః క్రియయాత్మని సంస్క్రియమాణేఽభివ్యజ్యతే, యథా ఽఽదర్శే నిఘర్షణక్రియయా సంస్క్రియమాణే భాస్వరత్వం ధర్మ ఇతి చేత్, న। క్రియాశ్రయత్వానుపపత్తేరాత్మనః।

సంస్కారస్వరూపము తొలుత వివరింపఁబడుచుఁ దరువాత సంబంధము వారింపఁ బడుచున్నది. ఎట్లన, సంస్కార మన సంస్కార్యమునకు నొకగుణము నెక్కించుట గాని, లేదా యొకదోషమును బోఁగొట్టుట గాని యని రెండువిధములని "సంస్కారో హి నామ" యను భాష్యముచే నిర్వచింపఁబడుచున్నది. మోక్షమునకుఁ గుణాధానరూప మగు సంస్కారము ఘటింప దని "న తావద్గుణాధానేన సంభవతి" యని చెప్పఁబడుచున్నది అందులకు హేతువు "అనాధేయాతిశయబ్రహ్మస్వరూపత్వాన్మోక్షస్య" యని చెప్పఁబడుచున్నది. అనఁగా నొకానొకవస్తువునం దొకానొక గుణమును జొప్పింపవలయు నన నాగుణమునందుఁ జొప్పించుటకుఁ దగు యోగ్యత్వ యుండవలయును. అట్టియోగ్యతయే యాధేయాతిశయ మనఁబడును. ప్రకృతమున మోక్ష మనెడి బ్రహ్మస్వరూప మన్ననో యట్టియాధేయాతిశయము గాదు. కావున నద్దానిని వేఱొకదానియం దుంచుటకు నెంతమాత్రము వీలులేదు. కావున గుణాధానరూపసంస్కారముచే మోక్షము గలుగు నని చెప్పుటకు వీలులేదు.

ఇఁక దోషమును దొలఁగించుటచేఁ గూడ మోక్షము లభింప దని "నాపి దోషాపనయనేన" యని చెప్పఁబడుచున్నది. అందులకు హేతువు "నిత్యశుద్ధబ్రహ్మస్వరూపత్వాన్మోక్షస్య" యని చెప్పఁబడుచున్నది. అనఁగా మోక్షరూపమగు బ్రహ్మము నిత్యశుద్ధము గావున నందుఁ దొలగింపఁబడవలయు దోషమే లేకపోవుటవలన దోషాపనయనము గూడ సంభవింపనేరదు. మోక్షము దోషాపనయనముచే ఘటింప దన దర్పణము స్వతస్సిద్ధముగ శుద్ధమైనను మాలిన్యముచే నావరింపఁబడి తిరుగ నిఘర్షణక్రియచే నామాలిన్యము దొలఁగింపఁబడినచో శుద్ధమగు స్వరూపమును బొందునట్లు మోక్షము స్వాత్మధర్మమే యైనను నట్టిస్వాత్మధర్మ మవిద్యచేఁ దిరోహిత మగుటంజేసి సంస్కారముచే నా యవిద్య దొలఁగింపఁబడి స్వస్వరూప మభివ్యక్తికి వచ్చుఁ గావున నట్టియవిద్యానివృత్తికిఁ దగు సంస్కార మావశ్యక మని "స్వాత్మధర్మః ... భాస్వరత్వం ధర్మ" యని శంకింప, నయ్యది యుక్తము గాదని "ఇతి చేత్, న" యని వారింపఁబడుచున్నది. అందులకు హేతువు "క్రియాశ్రయత్వానుపపత్తేరాత్మన" యని చెప్పఁబడుచున్నది. అనఁగా నాత్మ క్రియ కెంతమాత్ర మాధారము గాదని యభిప్రాయము. ఆత్మ క్రియ

యదాశ్రయా క్రియా తమవికుర్వతీ నైవాత్మానం లభతే। యద్యాత్మా క్రియయా వి క్రియేతానిత్యత్వమాత్మనః ప్రసజ్యేత। "అవికార్యోఽయముచ్యతే" ఇతి చైవమాదీని వాక్యాని బాధ్యేరన్। తచ్చానిష్టమ్। తస్మాన్న స్వాశ్రయా క్రియాఽఽత్మనః సంభవతి। అన్యాశ్రయాయాస్తు క్రియాయా అవిషయత్వాన్న తయాఽఽత్మా సంస్క్రియతే। నను దేహాశ్రయయా స్నానాచమనయజ్ఞోపవీతాదికయా క్రియయా దేహీ సంస్క్రియమాణో దృష్టః। న। దేహాదిసంహతస్యైవావిద్యాగృహీతస్యాత్మనః సంస్క్రియమాణత్వాత్। ప్రత్యక్షం హి స్నానాచమనాదేర్దేహసమవాయిత్వమ్।

---

కాధారం మగు నని యనినచోఁ గల్గు దోషము "యదాశ్రయా క్రియా... ప్రసజ్యేత" యని చెప్పఁబడుచున్నది. ఏక్రియ దేని నాశ్రయించునో యాక్రియ యాశ్రయమున కెట్టివికారము గలిగింపకుండ స్వస్వరూపమును బొందనేరదు. అనఁగా నాశ్రయమునకు వికారమును గల్పింపకపోయినచోఁ, దాను క్రియ కానేర దని భావము. ఆకారణముచే నాత్మయందుఁ గ్రియ గలిగె నన్నచో నాత్మ వికారమును బొందె నని యనవలయును. ఆత్మయే వికారమును బొందినచో నాత్మకు నాశప్రసంగము గలుగును. కావున నాత్మయందుఁ గ్రియ గలుగు నని చెప్పుటకు వీలులేదు. ఆత్మ యందుఁ గ్రియ గలుగు నన్నచో నాత్మ యవికార్య మని చెప్పెడి శ్రుతిస్మృతి వ్యాకోపము గలుగు నని "అవికార్యోఽయముచ్యతే" ఇతి చైవమాదీని వాక్యాని బాధ్యేరన్న"ను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. అట్టిశ్రుతిస్మృతివ్యాకోపము గలుగుట యుక్తము గాదని "తచ్చానిష్టమ్మ"ని చెప్పఁబడుచున్నది అనిష్టశబ్దాభిప్రాయము "తస్మాన్న స్వాశ్రయా క్రియాఽఽత్మనః సంభవతి" యని చెప్పఁబడుచున్నది. అనఁగా నాత్మయందు స్వాశ్రయ మగుక్రియ యెంతమాత్రము సంభవింప నేర దని భావము.

అట్లు కానిచో నొకవేళ వేఱొకవస్తువు నాశ్రయించిన క్రియచే నాత్మకు సంస్కారము గల్గునా యని శంకింప నద్దానితో నాత్మకు సంబంధము లేకపోవుటచే దానివలన నాత్మకు నెట్టిసంస్కారమును గలుగ దని "అన్యాశ్రయాయాస్తు ...సంస్క్రియతే" యని చెప్పఁబడుచున్నది. ఆత్మకు దేహముతో సంబంధించిన క్రియచే సంస్కారము గలుగుచున్నట్లు దెలియవచ్చుచున్న దని "నను దేహాశ్రయయా...దృష్ట" యని మధ్యస్థుఁడు ప్రశ్నించుచున్నాఁడు. అయ్యది యుక్తము గాదని "న" యని పరిహరింపఁబడుచున్నది. పరిహారమునకు హేతువు "దేహాదిసంహతస్యైవ సంస్క్రియమాణత్వాత్"ని చెప్పఁబడుచున్నది. అనఁగా దేహముతో సంబంధించిన సంస్కారము దేహముతోఁగూడినట్టియు నజ్ఞానముతోఁ గూడినట్టియు నాత్మకే దెలియవచ్చుచున్న దని యభిప్రాయము. సంగ్రహవాక్య ముత్తర గ్రంథముచే వివరింపఁబడుచున్నది. ఎట్లన— స్నానము, ఆచమనము, యజ్ఞోపవీతాది

తయా దేహాశ్రియయా తత్సంహత ఏవ కశ్చిదవిద్యయాత్మత్వేన పరిగృహీతః సంస్క్రియత ఇతి యుక్తమ్ । యథా దేహాశ్రయచికిత్సానిమిత్తేన ధాతుసామ్యేన తత్సంహతస్య తదభిమానిన ఆరోగ్యఫలం అహమరోగ ఇతి యత్ర బుద్ధిరుత్పద్యతే। ఏవం స్నానాచమనయజ్ఞోపవీతాదినా, అహం శుద్ధః సంస్కృత ఇతి యత్ర బుద్ధిరుత్పద్యతే స సంస్క్రియతే । స చ దేహేన సంహత ఏవ । తేనైవ హ్యహంకర్త్రాఽహంప్రత్యయవిషయేణ ప్రత్యయినా సర్వాః క్రియా నిర్వర్త్యన్తే। తత్ఫలం చ స ఏవాశ్నాతి "తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి" (ముం. 3-1-1) ఇతి మంత్రవర్ణాత్ । "ఆత్మేంద్రియమనోయుక్తం

ధారణము మున్నగు నియ్యవి దేహముతో సంబంధించినవే యని ప్రత్యక్షముగఁ దెలియవచ్చుచున్నవి గదా! అట్టి క్రియలచే దేహమునం దజ్ఞానవశమునఁ దాదాత్మ్యాభిమానముఁ జెందినవాఁడే సంస్కరింపఁబడినట్లు దలంచుచున్నాడు. ఇంతియ కాదు. దేహముతో సంబంధించిన చికిత్సవలనఁ గల్గెడి ధాతుసామ్యముచే నాదేహముతోఁ గూడి యా దేహము నాత్మగాఁ దలఁచిన పురుషుఁడే యా దేహముయొక్క యారోగ్యఫలమును దాఁ బొందినట్లు దలంచుచున్నాఁడో యాతీరుననే స్నానాచమనాదులచే దేహమునకుఁ గల్గిన సంస్కారము వలనఁ దాను సంస్కారముచే శుద్ధుఁడనైతి నని దలంచుచున్నాఁడు. అట్లు దలంచువాఁడు "దేహేన సంహత ఏవ = దేహముతోఁ గూడినవాఁడే. అట్లు దేహాభిమానముఁ జెందినవాఁడు అహమ్మను నభిమానమునుజెందిన కర్తయు నహంప్రత్యయమునకు విషయమునైన భోక్తచేత లౌకికవైదికరూపము లగు సకలక్రియలు నిర్వర్తింపఁబడుచున్నవని "తేనైవ హ్యహంకర్త్రాహంప్రత్యయవిషయేణ ప్రత్యయినా సర్వాః క్రియా నిర్వర్త్యంతే" యని చెప్పఁబడ యట్టిభోక్తయే యా కర్మఫలము ననుభవించుచున్నాఁ డనియు "తత్ఫలం చ స ఏవాశ్నాతి"యని చెప్పఁబడు చున్నది. అనఁగా నజ్ఞానవశమున దేహముతోఁదాదాత్మ్యాభిమానముఁ జెందినవాఁడే తద్గతము లగు క్రియలను దనయం దారోపించుకొని తత్ఫలముల ననుభవించుచున్నా నని తలంచుచున్నాఁడు గాని కేవల మగు నాత్మ యనఁగా దేహాభిమానరహితుఁ డట్లు తలంపఁ డని యాశయము. ఏతద్విషయమున "తయోరన్యః ... ఇతి చ" యని చెప్పఁబడిన శ్రుతులు ప్రమాణములుగాఁ జూపఁబడుచున్నవి. తయోః - జీవాత్మపరమాత్మలలో, అన్యః = జీవాత్మ, పిప్పలం = కర్మఫలమును, స్వాదు = మనోహరముగా, అత్తి = అనుభవించుచున్నాఁడు. అన్యః = పరమాత్మ, అనశ్నన్ = భుజింపక, అభిచాకశీతి = ప్రకాశించుచున్నాఁడు,

ఆత్మేంద్రియమనోయుక్తం = దేహేంద్రియమనస్సులతోఁ గూడిన,

భోక్తేత్యాహుర్మనీషిణః" (కఠ. 1-3-4) ఇతి చ। తథా చ "ఏకో దేవః సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా। కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ" ('శ్వేతా. 6-11) ఇతి। "సపర్యగాచ్ఛుక్రమకాయమవ్రణమస్నావిరం శుద్ధమపాపవిద్ధమ్" (ఈశ. 8) ఇతి చ ఏతౌ మన్త్రౌ వనాధేయాతిశయతాం నిత్యశుద్ధతాం చ బ్రహ్మణో దర్శయతః। బ్రహ్మభావశ్చ మోక్షః। తస్మాన్న సంస్కార్యోఽపి మోక్షః అతోఽన్యన్మోక్షం ప్రతి క్రియానుప్రవేశద్వారం న శక్యం కేనచిద్దర్శయితుమ్. తస్మాత్ జ్ఞానమేకం ముక్త్వా క్రియాయా గంధమాత్రస్యాప్యనుప్రవేశ ఇహ నోపపద్యతే।

---

అనఁగా సంహతమైన (ఆత్మానం = ఆత్మను) భోక్తా ఇతి = భోక్త యని, మనీషిణః = విద్వాంసులు, ఆహుః = చెప్పుచున్నారు.

ఇట్లు సంహతస్వభావమును జీవభావముగఁ జెప్పి పరమాత్మకు ననఁగా బ్రహ్మమునకు ననాధేయాతిశయభావమును నిత్యశుద్ధత్వమును బ్రదర్శించు శ్రుతులను "తథా చ ఏకో దేవః ... బ్రహ్మణో దర్శయత" యను భాష్యముచేఁ జెప్పుచున్నారు. కర్మాధ్యక్షః= సర్వకర్మలకుఁ బ్రభువు. అనఁగా సర్వకర్మఫలముల నిచ్చువాఁ డని భావము. సర్వభూతాధివాసః= సమస్తభూతములకు నధిష్ఠానరూపమగునట్టివాఁడు.

సః= పరమాత్మ, పర్యగాత్ = అంతటను నిండియున్నవాఁడు. శుక్రం= జ్యోతిస్స్వభావముగలవాఁడు. అవ్రణః= దుఃఖరహితుఁడు, అస్నావిరం= ప్రచ్యుతి యనఁగా నాశము లేనివాఁడు. అకాయం= శరీరము లేనివాఁడు.

బ్రహ్మస్వరూపము నిర్వచింపఁబడుటవలనఁ గల్గు ప్రయోజనము "బ్రహ్మభావశ్చ మోక్షః" బ్రహ్మభావమే మోక్షము గాని వేఱొకటి గాదని చెప్పఁబడుచున్నది. ప్రకృతము "తస్మాన్న సంస్కార్యోపి మోక్ష" యని యుపసంహరింపఁబడుచున్నది. అనఁగా మోక్షము బ్రహ్మభావమే యగుటంజేసి సంస్కార్య మెంతమాత్రము గాదని భావము. బ్రహ్మభావ మగు మోక్షము ఉత్పాద్యము, వికార్యము, ఆప్యము, సంస్కార్య మను నాల్గువిధము లగు కర్మఫలములలో నెద్దియుఁ గాకపోవుటంజేసి కర్మతో నెట్టిసంబంధము నేరిచేత నెవ్విధముగ నైనఁ బ్రతిపాదించుటకు శక్యము గాదని "అతోఽన్యన్మోక్షం ప్రతి క్రియానుప్రవేశద్వారం న శక్యం కేనచిద్దర్శయితుమ్మ"ను భాష్యముచే ఘంటాపథముగఁ జెప్పఁబడుచున్నది. ఉపసంహారవ్యాజమున స్వాభిప్రాయము "తస్మాత్ జ్ఞానం ... నోపపద్యతే" యని చెప్పఁబడుచున్నది. అనఁగాఁ గేవలజ్ఞానముచేఁ దక్క వేఱొకవిధమునఁ గ్రియచే నెంతమాత్రము మోక్ష మలవడ దని పరమతాత్పర్యము. జ్ఞానమే మోక్షసాధనమని చెప్ప జ్ఞానమన మానసికమగు క్రియగదా! అట్టివిషయ

నను జ్ఞానం నామ మానసీ క్రియా । న । వైలక్షణ్యాత్ । క్రియా హి నామ సా, యత్ర వస్తుస్వరూపనిరపేక్షైవ చోద్యతే, పురుషచిత్తవ్యాపారాధీనా చ । యథా "యస్యై దేవతాయై హవిర్గృహీతం స్యాత్తాం మనసా ధ్యాయేద్వషట్కరిష్యన్" ఇతి । "సంధ్యాం మనసా ధ్యాయేత్" (ఐ.బ్రా 3 8-1.) ఇతి చైవమాదిషు । ధ్యానం చింతనం యద్యపి మానసం, తథాపి పురుషేణకర్తుమకర్తుమన్యథా వా కర్తుం శక్యమ్, పురుషతంత్రత్వాత్ । జ్ఞానం తు ప్రమాణజన్యమ్ । ప్రమాణం చ యథాభూతవస్తువిషయమతో జ్ఞానం కర్తుమకర్తుమన్యథా వా కర్తుమశక్యం, కేవలం వస్తుతంత్రమేవ తత్ । న చోదనాతంత్రమ్ । నాపి పురుషతంత్రమ్ ।

---

ముఁ క్రియచే మోక్షము గలుగ దనుట యెట్లు? అను గూఢాభిసంధిపురస్సరముగ మధ్యస్థుఁడు "నను జ్ఞానం నామమానసీక్రియా" యని ప్రశ్నించుచున్నాఁడు. జ్ఞానము, క్రియ కాదని 'న' యను పరిహరింపఁబడుచున్నది. పరిహారమునందు హేతువు "వైలక్షణ్యాత్త"ని చెప్పఁబడుచున్నది. జ్ఞానము మానసికక్రియారూపమట్లు దోఁచినను విధిచోదిత మగు క్రియకంటె విలక్షణస్వభావ ముండుటచే విధిచోదితక్రియ యెంత మాత్రము గాదని యాశయము. సంగ్రహవాక్యము "క్రియా హి నామ... సర్వ-ప్రమాణవిషయవస్తుషు వేదితవ్యమ్మ"ను భాష్యముచే వివరింపఁబడుచున్నది. అందుఁ గ్రియా స్వరూపము "క్రియాహి నామ... పురుషతంత్రత్వాత్త"ను భాష్యముచే వివరింపఁబడుచున్నది. ఎట్లన— నేదేవతకొఱకు యాగకాలమున హవిస్సు గ్రహింపఁబడుచున్నదో యాదేవతను హోత వషట్కారముచేయునపుడు మనసుచే ధ్యానింపవలయు ననియు, సంధ్యాదేవతను మనసుచే ధ్యానింపవలయు ననియు నీమొదలుగాఁ గలిగిన యే ధ్యానవిశేష మచటఁ బ్రత్యక్షసిద్ధ మగు వస్తువు లేకుండఁగనే మనసుచే భావింపఁబడవలయు నని పురుషచిత్తవ్యాపారాధీనముగా విధింపఁబడుచున్నదో యట్టిధ్యానము పురుషునియొక్క మానసికక్రియారూపము. ఇట్టి ధ్యానము విహిత మగు మానసికక్రియారూప మయ్యుఁ బురుషునిచేఁ జేయఁబడుటకును మానివేయఁబడుటకు నింకొకరీతిగఁ జేయఁబడుటకును శక్య మగుటచేఁ బురుషునియొక్క యధీనమై పురుషునిచే నిర్వర్తింపఁబడునట్టి స్వరూపము గలదియై యున్నది. జ్ఞానమన్ననో యట్లు గాక ప్రమాణమువలనఁ బుట్టిన దని "జ్ఞానం తు ప్రమాణజన్యమ్మ"ని వైలక్షణ్యము చూపఁబడుచున్నది. ప్రమాణ మన్ననో వస్తుస్వరూప మెట్లుండునో యట్లే గోచరింపఁజేయునది. కావున జ్ఞానము చేయఁబడుటకును, మానివేయఁబడుటకును, వేఱొకవిధమునఁ జేయఁబడుటకును శక్య మెంతమాత్రము గాదు. ఏల యన— జ్ఞాన మనునది కేవల వస్తుతంత్రమే కాని చోదనాతంత్రము గాని పురుషతంత్రము గాని యెంత మాత్రము గాదని "న చోదనాతంత్రం నాపి పురుషతంత్రమ్మ"ను భాష్య

తస్మాన్మానసత్వేఽపి జ్ఞానస్య మహద్వైలక్షణ్యమ్ । యథా చ “పురుషో వావ గౌతమాగ్నిః” “యోషా వావ గౌతమాగ్నిః” (ఛాందో. 5-7-8, 1) ఇత్యత్ర యోషిత్పురుషయోరగ్నిబుద్ధిర్మానసీ భవతి । కేవలచోదనాజన్యత్వాత్తు క్రియైవ సా పురుషతంత్రా చ । యా తు ప్రసిద్ధేఽగ్నావగ్నిబుద్ధిర్న సా చోదనాతంత్రా । నాపి పురుషతంత్రా । కింతర్హి ప్రత్యక్షవిషయవస్తుతంత్రైవేతి జ్ఞానమేవైతన్న క్రియా । ఏవం సర్వప్రమాణవిషయవస్తుషు వేదితవ్యమ్ । తత్రైవంసతి యథాభూతబ్రహ్మాత్మవిషయమపి జ్ఞానం న చోదనాతంత్రమ్ । తద్విషయే లిఙాదయః శ్రూయమాణా అప్యనియోజ్యవిషయత్వాత్కుంఠీభవంత్యుపలాదిషు ప్రయుక్తక్షురతైక్ష్ణ్యాదివత్, అహేయానుపాదేయవస్తువిషయత్వాత్ ।

---

ముచేఁ జెప్పఁబడుచున్నది. ప్రకృతము “తస్మాన్మానసత్వేఽపి జ్ఞానస్య మహద్వైలక్షణ్యమ్మ”ని యుపసంహరింపఁబడుచున్నది. అట్టివైలక్షణ్యము సుస్పష్టము గాఁగ దృష్టాంతపురస్సరముగ “యథా చ ... జ్ఞానమేవైతన్నక్రియా” యని ప్రదర్శింపఁబడుచున్నది. పంచాగ్నివిద్యయందుఁ బురుషుఁడే యగ్ని యనియు, స్త్రీయే యగ్ని యనియు భావనచేయఁబడవలయునను నుపదేశములచే స్త్రీపురుషులయందలి మానసిక మగు నగ్నిబుద్ధి కేవలము చోదనాజన్య మగుట చేతను బురుషబుద్ధ్యధీన మగుటచేతను క్రియయే యగుచున్నది. ప్రసిద్ధమగు నగ్నియందలి యగ్నిబుద్ధి గూడ మానసికమే యైనను జోదనాతంత్రమును బురుషతంత్రమును గాకపోవుటం జేసి క్రియ యెంతమాత్రము గాక ప్రత్యక్షమునకు విషయ మగు వస్తువగు నగ్న్యధీనమగుటం జేసి వస్తుతంత్రము గావున నయ్యది జ్ఞానముగాని క్రియ యెంతమాత్రము గాదు.

ఇట్లు క్రియకును జ్ఞానమునకును భేదము చెప్పి సార్వలౌకికనియమ మొకటి “ఏవం సర్వప్రమాణవిషయవస్తుషు వేదితవ్యమ్మ”ని చెప్పఁబడుచున్నది. అనఁగాఁ బ్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శాబ్ద మను ప్రమాణములకు విషయములను గ్రహించుటయందుఁ గల యంతఃకరణవృత్తియొక్క పరిణామము వస్త్వధీన మగుటంజేసి జ్ఞానమే గాని క్రియ యెంతమాత్రము గాదు. ఇట్టిన్యాయ ముచే యోజించినపుడు సిద్ధవస్తు వగు బ్రహ్మ మనెడి యాత్మతో సంబంధించిన జ్ఞానము గూడ బ్రహ్మాత్మవిషయమే యగుటంజేసి వస్తుతంత్రమే గాని చోదనాతంత్ర మెంతమాత్రము గాదని “తత్రైవం సతి ... న చోదనాతంత్రమ్మ”ని ప్రతిజ్ఞ చేయఁ బడుచున్నది. యథాభూతాత్మవిషయక మగు జ్ఞానము చోదనాతంత్రమే గాక పోయినచో నట్టియాత్మను గూర్చి వినఁబడు లిఙాదులతోఁ గూడిన విధివాక్యములు నిష్ప్రయోజనములు గావలయునే యని శంకింప నిష్ప్రయోజనములే యని “తద్విషయే ... అహేయానుపాదేయవస్తువిషయత్వాత్త”ని ప్రతిజ్ఞచేయఁబడు

కిమర్థాని తర్హి “ఆత్మా వా౽రే ద్రష్టవ్యః శ్రోతవ్య” ఇత్యాదీని విధిచ్ఛాయానివచనాని। స్వాభావికప్రవృత్తివిషయవిముఖీకరణార్థానీతి బ్రూమః। యో హి బహిర్ముఖః ప్రవర్తతే పురుషః ‘ఇష్టం మే భూయాదనిష్టం మే మా భూది’తి। న చ తత్రాత్యన్తికం పురుషార్థం లభతే, తమాత్యన్తికపురుషార్థవాంఛినం స్వాభావికకార్యకరణసంఘాతప్రవృత్తిగోచరాద్విముఖీకృత్య ప్రత్యగాత్మస్రోతస్తయా ప్రవర్తయన్తి “ఆత్మా వా అరే ద్రష్టవ్యః” ఇత్యాదీని।

---

చున్నది. తద్విషయే = బ్రహ్మాత్మవిషయమున, అనియోజ్యవిషయత్వాత్ = కేవలము ప్రమాణవస్తుపరతంత్ర మగు జ్ఞానమందే పరిసమాప్తి నొందుటచే దమచే నియమింపఁబడు విషయము లేకపోవుటవలన విధిత్వమునుండి తొలఁగి యాత్మజ్ఞానస్తావకము లగు నర్థవాదములవలెఁ బఱఁగుచుండుటచేఁ గుంఠీభావము నొందుచున్నవి కుంఠీభావము నొందుటయందలి దృష్టాన్తము, “ఉపలాదిషు ప్రయుక్తక్షురతైక్ష్ణ్యాదివ త్త”ని. అనియోజ్యవిషయత్వమునందు హేతువు “అహేయానుపాదేయవస్తువిషయత్వా త్త”ని. అనఁగా హేయము గాని యుపాదేయము గాని గానట్టి సిద్ధవస్తుబోధక మగుటవలన నని భావము. లిఙాదులచే హేయోపాదేయ మగు క్రియ విధింపఁబడినపు డద్దానియందుఁ బురుషుఁడు నియమింపఁబడుటచే విధిత్వము సిద్ధించుచుండును. సిద్ధవస్తుజ్ఞాన మన్ననో వస్త్వధీన మగుటం జేసి విధిచే నెన్నివిధములఁ బ్రేరణచేయంబడుచున్నట్లు దోఁచుచున్నను నా ప్రేరణవలన నించుకేనియుఁ బ్రయోజనము ఘటింపనేర దని తాత్పర్యము. సిద్ధవస్తువును బోధించుటలో విధులకు బ్రయోజనమే సమకూరకపోయినచో “ఆత్మా వా౽రే ద్రష్టవ్యః శ్రోతవ్య” యను వాక్యములు మొదలుగాఁ గల విధిచ్ఛాయలు ప్రయోజనము లేక నిరర్థకములు గావలయునే. అట్టివిషయమున శ్రుతిచే నెందుల కుపదేశింపఁబడవలయు నని “కిమర్థాని తర్హి ... వచనాని” యని మధ్యస్థుఁ డడుగ “స్వాభావికప్రవృత్తివిషయవిముఖీకరణార్థానీతి బ్రూమ” యని సమాధానము చెప్పఁబడుచున్నది. అనఁగా స్వభావసిద్ధ మగు ప్రవృత్తికిఁ గారణభూతము లగు విషయములనుండి పురుషునియొక్క బుద్ధిని మఱలించుటయే యీ విధిచ్ఛాయలకుఁ బ్రయోజనము. ఈ సంగ్రహవాక్యము “యో హి...ఇత్యాదీని” యను భాష్యముచే వివరింపఁబడుచున్నది. సాధారణముగా లోకమున ‘నా కిష్టము గలుగవలయును, అనిష్టము గలుగఁగూడద”ను నభిలాషతో బాహ్యవిషయములందుఁ బ్రవర్తించుటయు నట్టిబాహ్యవిషయములయందుఁ బుష్కల మగు పురుషార్థమును బొందకుండుటయుఁ గలుగుచుండును. బాహ్యమునఁ బురుషార్థము లభింపమి పురుషార్థ మెచ్చో లభించు నని తీవ్రముగ నిచ్ఛయించువానిని స్వాభావిక మగు శరీరేంద్రియసంఘాతముయొక్క

తస్యాత్మాన్వేషణాయ ప్రవృత్తస్యాహేయమనుపాదేయం చాత్మతత్త్వముపదిశ్యతే। "ఇదం సర్వం యదయమాత్మా" (బృహ. 2-4-6) "యత్ర త్వస్య సర్వ-మాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్ కేన కంవిజానీయాత్, విజ్ఞాతారమరే కేన విజానీయాత్" (బృ 4-5-15) "అయమాత్మా బ్రహ్మ" (బృ. 2-5-19) ఇత్యాదిభిః।

---

ప్రవృత్తికి విషయ మగు శబ్దాదులనుండి మఱలించి యీ లిఙాదు లాంతర మగు ప్రత్యగాత్మచింతనమును గూర్చి ప్రవర్తింపఁజేయును అనఁగా నాంతర మగు నాత్మ నన్వేషణముచేయ నిచ్ఛను గలిగించును. అట్టియిచ్ఛచే నా పురుషుఁడాత్మాన్వేషణమును గూర్చి యత్నించును. ఇట్లు స్వాభావికముగఁ గల్గు ప్రవృత్తి నీలిఙాదు లనువదించుచున్నవి. దానంజేసి లిఙాదులకు విధిత్వము కుంఠీభావము నొందుచున్న దని యభిప్రాయము. ఇట్టి కుఁఠీభావము నుద్దేశించియే

ఘలు లిఙ్గు నుపేక్షించి 'బ్రహ్మజిజ్ఞాసా' యను సమస్తపదమును ప్రథమసూత్రమునఁ జేర్చుటయు నుపేక్షింపఁబడిన లిఙ్గును 'కర్తవ్యా' నముచే భాష్యకారులు సూచించి, యట్టి 'కర్తవ్యా' యను పదము ము నొందుచున్న దను నాశయముచే నట వ్యాఖ్యానముచేయఁబడ ముకు గలిగె నని నిశ్చయింపనొప్పును. ఇట్లు "ఆత్మా వాఽరే ద్రష్టవ్యః ' యను మున్నగు వాక్యములు కుంఠీభావము నొందుచున్నవని పుష్క లయాపింపఁబడియుండ "నను విధిపరత్వే వేదాంతానాం తన్నిష్ఠతయా రూపస్యాసిద్ధ్యాదిదోషప్రసంగాన్నాస్తి శ్రవణాదివిధానమితి భాష్యకారై-మ్। సత్యం, జ్ఞానవిధిస్తత్ర నిరాకృతః, న శ్రవణవిధిః; తత్రోక్తదోష-ావా" త్తను ని జ్ఞానమందు విధి లేదనియు శ్రవణమందు విధి యున్న రణకారవాక్యము లర్ధజరతీయమును గల్పించుచుండుటచే సర్వథా యంబులే యగుచున్నవి. ఇంతియ కాదు. విధిత్వము నిరాకరింపఁ త్మా వాఽరే ద్రష్టవ్యః శ్రోతవ్యః" యను వాక్యమును జేకొని యియ్యది యా యపూర్వవిధియా పరిసంఖ్యావిధియా యని విచారణమునకుఁ ్యఖ్యాతల నేమనవలయును? కనుక నట్టివిచారవైశద్య మంతయుఁ ననతుల్య మగుటంజేసి నిరర్ధకము గావున నుపేక్షణీయంబ.

ఆత్మాన్వేషణమును గూర్చి ప్రవర్తించు జిజ్ఞాసువులఁ గూర్చి బ్రహ్మ శ్రుతివాక్యపురస్సరంబుగ హేయోపాదేయరహిత మగు నాత్మతత్త్వ పఁబడు నను గూఢాభిసంధిపురస్సరముగ "తస్యాత్మాన్వేషణాయ... " యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది ఇట్టిశ్రుతులచే నుపదేశింపఁబడు పధాన మగు నాత్మజ్ఞానము హేయోపాదేయరహిత మగుటంజేసి

యదప్యకర్తృవ్య్రప్రధానమాత్మజ్ఞానం హానోపాదానాయ వా న భవతీతి, తత్తథైవేత్యభ్యుపగమ్యతే । అలంకారో హ్యయమస్మాకం యద్బ్రహ్మాత్మావగతౌ సత్యాం సర్వకర్తవ్యతాహానిః కృతకృత్యతా చేతి । తథా చ శ్రుతిః— "ఆత్మానం చేద్విజానీయాదయమస్మీతి పూరుషః। కిమిచ్ఛన్ కస్య కామాయ శరీరమను సంజ్వరేత్।" (బృ.4-4-12) ఇతి। "ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్కృతకృత్యశ్చ భారత" (భ.గీ. 15-20) ఇతి స్మృతిః । తస్మాన్న ప్రతిపత్తివిధివిషయతయా బ్రహ్మణః సమర్పణమ్।

---

ప్రయోజనకారి కాదను నాశయముచే "యదప్యకర్తృవ్యప్రధానం...న భవతీతి" యని యడుగ నీయాత్మజ్ఞానము హేయముగాని యుపాదేయముగాని కాదనియే యంగీకరింపఁబడుచున్న దని "తత్తథైవాభ్యుపగమ్యతే" యని సమాధానము చెప్పఁబడుచున్నది. అట్లైనచో హేయోపాదేయము కాకపోవుటచేఁ బ్రయోజనకారి గాదే యని యడుగఁ బ్రయోజనము "అలంకారో హి ... కృతకృత్యతా చేతి" యని చెప్పఁబడుచున్నది. బ్రహ్మాత్మావగతౌ సత్యాం = బ్రహ్మమే యాత్మ యను జ్ఞానము గలుగ, సర్వకర్తవ్యతాహానిః = సర్వకర్మసంన్యాసము; బ్రహ్మాత్మావగతియందు సర్వకర్మసంన్యాసము, కృతకృత్యతయుఁ గల్గు ననుట స్వకపోలకల్పితముగాక శ్రుతిస్మృతిప్రమాణసిద్ధ మని "తథా చ శ్రుతిః ... స్మృతి" యని శ్రుతిస్మృతులు చూపఁబడుచున్నవి.

అయం = ఈపరమాత్మ, అస్మి ఇతి = నే నయితి నని, పురుషః = పురుషుఁడు, ఆత్మానం = స్వస్వరూపమును, విజానీయాత్ చేత్ = తెలిసికొనినచో, కిం = ఏమిఫలమును, ఇచ్ఛన్ = కోరుచు, కస్య = ఎవనియొక్క, కామాయ = ప్రీతికొఱకు, శరీరం అను = ఈశరీరముతోఁ దాదాత్మ్యము నొంది, సంజ్వరేత్ = తపించును? అనఁగా శరీరముతోఁ దాదాత్మ్యము నొంది కాయక్లేశరూప మగు కర్మలఁ గూర్చి తపింపఁ డని భావము.

ఏతత్ = ఈబ్రహ్మమును, బుద్ధ్వా = తెలిసికొని, బుద్ధిమాన్ = తెలిసికొనినవాఁడును, కృతకృత్యశ్చ = పొందఁబడవలయువానిని బొందినవాఁడును, స్యాత్ = అగును.

ఇట్లు ప్రమాణప్రదర్శనముఁ గావించి ప్రకృతము "తస్మాత్ ... సమర్పణమ్మ"ని యుపసంహారము చేయఁబడుచున్నది. అనఁగా బ్రహ్మమున కుపాసనా విధితో నెంతమాత్రము సంబంధము లేదని భావము.

హానోపాదానశూన్య మగు బ్రహ్మమును శాస్త్ర ముపదేశించుటచే స్వమతసిద్ధి గలుగుచున్న దని నిరూపించి యిప్పుడు బ్రహ్మమునే శాస్త్రము సర్వవిధముల నుపదేశించుచున్నదని సర్వ్దేంప సింహావలోకనన్యాయమున మీమాంసకైక

యదపి కేచిదాహుః — "ప్రవృత్తినివృత్తివిధితచ్ఛేషవ్యతిరేకేణ కేవలవస్తువాదీ వేదభాగో నాస్తీ"తి ; తన్న । ఔపనిషదస్య పురుషస్యానన్యశేషత్వాత్ । యోఽసావుపనిషత్స్వేవాధిగతః పురుషోఽసంసారీ బ్రహ్మ ఉత్పాద్యాదిచతుర్విధద్రవ్యవిలక్షణః స్వప్రకరణస్థోఽనన్యశేషః, నాసౌ నాస్తి నాధిగమ్యత ఇతి వా శక్యం వదితుమ్, "స ఏష నేతి నేత్యాత్మా" (బృ. 3 9-26) ఇత్యాత్మశబ్దాత్,

---

దేశి యొక్క మతమును "యదపి కేచిదాహుః .. నాస్తీతి" యని యనువదించి 'తన్న' యని నిరాకరించుచున్నారు. అనఁగా వేద మంతయు "సత్యం వద, ధర్మం చర, యావజ్జీవమగ్నిహోత్రం జుహుయాత్"ను వాక్యములు మొదలుగాఁగల ప్రవృత్తివిధులును "నానృతం వదేత్, న పరదారాన్ గచ్ఛేత్, న కలంజం భక్షయేత్"ను నివృత్తివిధులును నా విధుల కంగముగా నుండు విషయములును దక్క సిద్ధవస్తు బోధక మగు వేదభాగమే లేదనుట యెంతమాత్రము సమంజసము గాదని యందులకు హేతువు "ఔపనిషదస్య పురుషస్యానన్యశేషత్వాత్"ని చెప్పఁబడుచున్నది. అనఁగా నుపనిషత్తులయం దుపదేశింపఁబడిన పురుషుఁ డన్యశేష మనఁగాఁ గర్మాంగ మెంతమాత్రము గాక స్వతంత్రముగనే యుపదేశింపఁబడుచున్నాఁ డని సంగ్రహవాక్యాభిప్రాయము. ఈసంగ్రహవాక్యము "యోఽసావుపనిషత్స్వేవ... సాహసమాత్రమ్మ"ను భాష్యముచే వివరింపఁబడుచున్నది. స్వాభిమత మగు బ్రహ్మ యుపనిషదేకసమధిగమ్యమేయని "ఉపనిషత్స్వేవాధిగత"యని ప్రమాణము ప్రదర్శింపఁబడుచున్నది. ఉపనిషత్తులయందుఁ దెలియవచ్చెడి పురుషుని యొక్క స్వరూప మన్ననో అసంసారి, యనగాఁ బ్రమాతృత్వాదిరహితము, బ్రహ్మ=నిత్యశుద్ధబుద్ధముక్త స్వభావము. కర్మజన్యము గాక సిద్ధవస్తు వగుటచే, ఉత్పాద్యాదిచతుర్విధద్రవ్య విలక్షణః= ఉత్పాద్యము, వికార్యము, ఆప్యము, సంస్కార్య మనెడి నాల్గుకార్యములకంటె విలక్షణ మని చెప్పఁబడుచున్నది. ఇట్టిపురుషుఁడు వేదాంతములయందుఁ గాక యితరస్థలములయందు లభింపఁ డని, 'స్వప్రకరణస్థః, అనన్యశేష' యని చెప్పఁబడుచున్నది. ఉపనిషత్తులయందుఁ జెప్పఁబడినను జెప్పఁబడవచ్చునుగాని చెప్పఁబడినంతనే ప్రసిద్ధమగునా ? ఇట్టిపురుషుఁ డెచ్చటను దెలియఁబడుట లేదను నాశంక గలుగ, నట్టిపురుషుఁడు లేఁడని గాని దెలియఁబడ లేదని గాని చెప్పుట కెంతమాత్రము వీలు లేదని "నాసౌ, నాస్తి, నాధిగమ్యత ఇతి వా వదితుం శక్యమ్మ"ని ప్రతిజ్ఞ చేయఁబడుచున్నది ప్రతిజ్ఞాతార్థము "స ఏష నేతి నేత్యాత్మా ఇత్యాత్మశబ్దాత్"ని చెప్పఁబడుచున్నది. ఉపనిషత్తులయందుఁ జెప్పఁబడుచున్న, సః= ఆపురుషుఁడు, ఏషః= అపరోక్షముగఁ దెలియవచ్చెడి యీ, ఆత్మా= ఆత్మయే, యని; ఇతి= ఇది యని ప్రదర్శింపఁబడు దృశ్య మగు విషయము, న= ఎంతమాత్రముగాదని వీప్సచేఁ దెలియవచ్చెడి సర్వనిషేధమునకును సాక్షి యగు నాత్మయే యని, ఆత్మశబ్దాత్ =

ఆత్మనశ్చ ప్రత్యాఖ్యాతుమశక్యత్వాత్, య ఏవ నిరాకర్తా తస్యైవాత్మత్వాత్। నన్వాత్మాఽహంప్రత్యయవిషయత్వాదుపనిషత్స్వేవ విజ్ఞాయత ఇత్యనుపపన్నమ్। న। తత్సాక్షిత్వేన ప్రత్యుక్తత్వాత్। న హ్యహంప్రత్యయవిషయకర్తృవ్యతిరేకేణ తత్సాక్షీ సర్వభూతస్థః సమ ఏకః కూటస్థనిత్యః పురుషో విధికాండే తర్కసమయే వా కేనచిదధిగతః సర్వస్యాత్మా,

---

శ్రుతియందలి యాత్మశబ్దముచేఁ దెలియవచ్చుటవలన నట్టియాత్మ' లేదని గాని తెలియవచ్చుట లేదని గాని చెప్పుటకు వీలులేదని యభిప్రాయము. సర్వనిషేధమందు నాత్మగూడ నిషేధింపఁబడఁగూడదా యనిన నాత్మనుమాత్రము నిషేధించుటకెంతమాత్రము శక్యముగాదని "'ఆత్మనశ్చ ప్రత్యాఖ్యాతుమశక్యత్వాత్త్'ని చెప్పఁబడుచున్నది. ఆత్మను నిషేధించుట యశక్యమనుటకు హేతువు "'య ఏవ నిరాకర్తా తస్యైవాత్మత్వాత్త్'ని చెప్పఁబడుచున్నది. అనఁగా సర్వమును నిషేధించు నిరాకర్తయే యాత్మ యగుటంజేసి సర్వనిషేధావధిభూతముగఁ దా నలరారుచుండుటవలనను దన్ను దాను నిషేధించుకొనుట యప్రసిద్ధ మగుటవలనను నాత్మ యెంతమాత్రము నిషేధింపఁబడక స్వయంప్రకాశమానముగ నిలిచియుండు నని భావము. అట్లైనచో నాత్మ యహంప్రత్యయమునకు విషయ మగు వ్యక్తి యగుటంజేసి యెల్లరకును "అహమస్మి"ని యపరోక్షముగఁ దెలియబడుటవలన నుపనిషత్తులవలననే దెలియఁబడుచున్నదను విషయ మయుక్త మని "'నను... ఇత్యనుపపన్నమ్మ్"ని మధ్యస్థుఁడు ప్రశ్నింప నట్లెంతమాత్రము గాదని 'న' యని నిరాకరింపఁబడుచున్నది. అందులకు హేతువు "'తత్సాక్షిత్వేన ప్రత్యుక్తత్వాత్త్'ని చెప్పఁబడుచున్నది అనఁగా నహంప్రత్యయమునకు విషయ మగు కర్త దేహేంద్రియ సంఘాతముతోఁ గూడుకొనిన జీవాత్మ యైయున్నాఁడు. ఆత్మయన్ననో యట్టి జీవాత్మకు సాక్షిరూపమున నలరారుచుండుటంజేసి యట్టియాత్మకు నహంప్రత్యయవిషయత్వము నిరాకరింపఁబడుచున్నది. అనఁగా నహంప్రత్యయవిషయ మగు కర్త వాస్తవ మగు నాత్మగాదు. అట్టివాస్తవ మగు నాత్మ యుపనిషత్తులవలననే దెలిసికొనవలయు నని యభిప్రాయము. ఈసంగ్రహవాక్యము "న హ్యహంప్రత్యయ-విషయ ... ఉపపద్యతే" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది. ఉపనిషత్తులవలనఁ దెలియవచ్చెడి పురుషుఁ డహంప్రత్యయమునకు విషయుఁ డగు కర్త గాని కర్మకాండమందుఁ దెలియవచ్చువాఁడు గాని వేఱొక నైయాయికాదియుక్తిదర్శనములయందుఁ దెలియవచ్చు స్వరూపముతో నొప్పియుండువాఁడు గాని కాఁడని సుస్పష్టము గాఁగా "సర్వభూతస్థః సమః ఏకః కూటస్థనిత్యః సర్వస్యాత్మా" యను విశేషములచేఁ బ్రదర్శింపఁబడుచున్నాఁడు. ఈపురుషుఁడు సకలజగత్తునకు నాత్మయన స్వరూపమే యగుటచే నెవ్వరికి గూడ నిషేధింపఁబడుటకుఁ గాని లేదా

అతః స న కేనచిత్ ప్రత్యాఖ్యాతుం శక్యో విధిశేషత్వం వా నేతుమ్ । ఆత్మత్వాదేవ చ సర్వేషాం న హేయో నాప్యుపాదేయః । సర్వం హి వినశ్యద్వికారజాతం పురుషాన్తం వినశ్యతి, పురుషో హి వినాశహేత్వభావాదవినాశీ విక్రియాహేత్వభావాచ్చ కూటస్థనిత్యః, అత ఏవ నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావః । తస్మాత్ "పురుషాన్న పరం కించిత్సా కాష్ఠా సా పరా గతిః" (కాఠ. 1-3-11) "తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి" (బృ 3-9-26) ఇతి చౌపనిషదత్వవిశేషణం పురుషస్యోపనిషత్సు ప్రాధాన్యేన ప్రకాశ్యమానత్వ ఉపపద్యతే ।

---

వేదోక్తవిధికి నంగముగా నిరూపింపఁబడుటకుఁ గాని శక్యమెంతమాత్రము గాదని "అతః స న కేనచిత్ .. నేతుమ్మ"ని చెప్పఁబడుచున్నది. ఇంతియ కాదు. సకల ప్రాణులకు నాత్మ యగుటంజేసియే హేయము నుపాదేయమును గాదని "ఆత్మత్వాదేవ ... నాప్యుపాదేయ" యని చెప్పఁబడుచున్నది. సర్వేషాం = సమస్త ప్రాణులకును, అనఁగాఁ దనకంటె భిన్న మగు వస్తు వెద్దియేని యుండినచో నయ్యది హేయముగాని యుపాదేయముగాని యగుచుండును. తనకుఁ దాను హేయముగాని యుపాదేయముగాని కాదుగదా! కావున నాత్మ దానే యగుటవలన హేయము నుపాదేయము నెంతమాత్రము గానేరదు.

ఉపనిషత్తులయందుఁ జెప్పఁబడిన యాత్మయొక్క స్వరూపము సయుక్తికము గూడ నని ప్రదర్శింపఁ బ్రథమమున "సర్వం హి వినశ్యద్వికారజాతం... అవినాశీ" యను భాష్యముచే నవినాశిత్వము ప్రదర్శింపఁబడుచున్నది. లోకము నందలి వికారసమూహ మంతయుఁ బురుషునిపర్యంతము నశించును. పురుషుఁ డన్ననో నశించుటకుఁ దగు హేతువులు లేకుండుటచే నవినాశి యగుచున్నాఁ డని యభిప్రాయము. ఏలయన, వికారజాతి మగు నామరూపాత్మక మగు సకలజగంబు నదృష్టదృష్టప్రణష్టరూప మగుటంజేసి రజ్జుసర్పాదులవలె మిథ్యాభూత మగుచున్నది. పురుషుఁ డన్ననో జగత్తుయొక్క సృష్టిస్థితిలయములకు సాక్షిభూతుఁడు నధిష్ఠానము నగుటంజేసి యవినాశి యని యభిప్రాయము. పురుషుఁడు నిత్యమే యైనను పరిణామినిత్యముః గావచ్చు నను నాశంక గలుగ, నట్టిపరిణామినిత్యత్వము పురుషునియందు ఘటింప దని "విక్రియాహేత్వభావాచ్చ కూటస్థనిత్య" యని చెప్పఁబడుచున్నది. అనఁగాఁ బురుషునియందు విపరిణామహేతువు లగు సావయవత్వాదులు తెలియఁబడకపోవుటవలనఁ బురుషుఁడు పరిణామినిత్యుఁడు గాదని తెలియవచ్చుచున్న దని భావము. ఆత్మ యవినాశియుఁ గూటస్థము నగుటంజేసి "అత ఏవ నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావ" యని చెప్పఁబడుచున్నది. "ఔపనిషదస్య పురుషస్య అనన్యశేషత్వాత్త"నుచోఁ బురుషునకుఁ జెప్పఁబడిన 'ఔపనిషదస్య' యను విశేషణము [illegible] గాక శ్రుతిసిద్ధమే యని "తస్మాత్ ...

అతో భూతవస్తుపరో వేదభాగో నాస్తీతి వచనం సాహసమాత్రమ్। యదపి శాస్త్రతాత్పర్యవిదామనుక్రమణమ్— "దృష్టో హి తస్యార్థః కర్మావబోధనమ్" ఇత్యేవమాది, తద్ధర్మజిజ్ఞాసావిషయత్వాద్విధిప్రతిషేధశాస్త్రాభిప్రాయం ద్రష్టవ్యమ్। ఉపపద్యతే' యను భాష్యముచే ప్రదర్శింపఁబడుచున్నది.

పురుషాత్ = పురుషునికంటె, పరం = శ్రేష్ఠమైనది, కించిత్ = ఏద్దియును, న=లేదు, సా = ఆపురుషుఁడే, కాష్ఠా = పరమావధి, సా = ఆపురుషుఁడే, పరా = ఉత్కృష్టమగు, గతిః = స్థానము, త్వా = నిన్ను, ఔపనిషదం = ఉపనిషత్తులయందుఁ దెలియనప్పడి, తం = అసుప్రసిద్ధమగు, పురుషం = పురుషునిఁ గూర్చి, పృచ్ఛామి = ప్రశ్నించుచున్నాను అను యాజ్ఞవల్క్యునిచే శాకల్యుని నుద్దేశించి యడుగఁబడిన ప్రశ్నమువలన నీపురుషునిఁ గూర్చి యుపనిషత్తులయందుపదేశింపఁబడిన విశేషము మాత్రమే పురుషార్థసాధనముగ నభిలషింపఁబడుచున్నట్లు దెలియవచ్చుచున్నది శ్రుతులచేఁ దెలియుచప్పడి తాత్పర్యమే "ఔపనిషదత్వవిశేషణం... ఉపపద్యతే' యను భాష్యముచే వివరింపఁబడుచున్నది. ఇట్లు పురుషుఁ డుపనిషదేకసమధిగమ్యుఁడని వివరించి ప్రకృతము "అతో... సాహసమాత్రమ్మ"ని యుపసంహరింపఁబడుచున్నది. అనఁగా భూతవస్తుపర మగు వేదభాగమన బ్రహ్మమును బోధించు వేదభాగము లేదనుట కడుసాహసము. ఉపనిషత్తులచేఁ గూటస్థనిత్య మగు బ్రహ్మ ముపదేశింపఁబడుచున్న దని పరమతాత్పర్యము.

ఇట్లు వేదాంతములు కర్మతో నించుకేనియు సంబంధములేని భూతవస్తు వగు బ్రహ్మము నుపదేశించుచున్న వని నిరూపించుటచే సిద్ధవస్తుబోధక మగు వేదభాగము గూడఁ గలదని సిద్ధముగాఁగ నిదివఱలో మీమాంసకైకదేశిచే శాస్త్రతాత్పర్యవిదులయభిప్రాయబలముచే వేద మంతయుఁ గ్రియాపర మని నిర్వచింపఁబడినవిషయమునకుఁ బ్రకృతార్థముతో విరోధము లేదని ప్రతిపాదింప నామీమాంసకైకదేశియొక్క "యదపి... ఇత్యేవమాది" యను మతము ధర్మజిజ్ఞాసావిషయ మగుటంజేసి విధిప్రతిషేధశాస్త్రముతోఁ గూడిన కర్మకాండవిషయమనియు నానియమము వేదాంతములకు వర్తింప దనియు "తద్ధర్మజిజ్ఞాసా... ద్రష్టవ్యమ్మ"ని పూర్వోదాహృతము లగు నభియుక్తవచనములకు సావకాశము ప్రదర్శింపఁబడుచున్నది. అభియుక్తవచనములకు నిట్లు సావకాశమును గ్రహింపక వేద మంతయుఁ గ్రియాపర మగుటంజేసి క్రియాపరములు గాని వాక్యము లనర్థకములే యని నిశ్చయముగ నంగీకరించు మీమాంసకులకుఁ గర్మకాండతో సంబంధించిన భూతవస్తుప్రతిపాదకవాక్యము లనర్థకములే గావలయును. ఎట్లన—"సోమేన యజేత, దధ్నా జుహోతి, వ్రీహిభిర్వా యవైర్వా జుహుయాత్, ఆజ్యమవేక్షతే, పయసా జుహుయాత్" మున్నగు వాక్యములచే

“ఆమ్నాయస్య క్రియార్థత్వాదానర్థక్యమతదర్థానామ్” ఇత్యేతదేకాన్తేనాభ్యుపగచ్ఛతాం భూతోపదేశానర్థక్యప్రసఙ్గః। ప్రవృత్తినివృత్తివిధితచ్ఛేషవ్యతిరేకేణ భూతం చేద్వస్తూపదిశతి భవ్యార్థత్వేన, కూటస్థనిత్యం భూతం నోపదిశతీతి కో హేతుః। న హి భూతముపదిశ్యమానం క్రియా భవతి। అక్రియాత్వేఽపి భూతస్య క్రియాసాధనత్వాత్ క్రియార్థ ఏవ భూతోపదేశ ఇతి చేత్ నైష దోషః। క్రియార్థత్వేఽపి క్రియానిర్వర్తనశక్తిమద్వస్తూపదిష్టమేవ। క్రియార్థత్వం తు ప్రయోజనం తస్య। న చైతావతా వస్త్వనుపదిష్టం భవతి।

---

నుపదేశింపఁబడు దధిసోమవ్రీహియవాజ్యపయోరూప భూతవస్తుబోధకపదములు నిరర్థకము గావలయును. కావున వేదమందు భూతవస్తుపర మగు భాగము లేదని వచింపఁగూడ దన, మీమాంసకైకదేశి, యట్లు గాదు. ప్రవృత్తినివృత్తి విధితదంగములకంటె భిన్నముగా భూతవస్తువు లుపదేశింపఁబడినను సంస్కారవి భవ్యార్థములుగనే యనఁ గ్రియ కంగముగనే యుపదేశింప బడుచున్నవి గాని క్రియతో సంబంధము లేకుండ నుపదేశింపఁబడలేదని “ప్రవృత్తి నివృత్తి... వస్తూపదిశతి భవ్యార్థత్వేన” యని చెప్పినట్టి మీమాంసకైకదేశికిఁ • బ్రతిబంధిగ భవ్యార్థముగ భూతవస్తువుల నుపదేశించిన వేదము కూటస్థనిత్యమగు భూతార్థము నుపదేశింపలేదని చెప్పుటయందుఁ గల విశేష మేమి? యని చెప్పఁబడుచున్నది. అనఁగాఁ గూటస్థనిత్యమగు భూతవస్తువు గూడ నుపదేశించుటకుఁ దగు సావకాశము గల దని భావము. భవ్యార్థముగ నుపదేశింపఁబడినను భూతము క్రియ గాదుగదా! కనుక వేదము క్రియనే బోధింపక క్రియకంటె వేఱగు భూతవస్తువులనుగూడ బోధించుచున్నదని తప్పక యంగీకరింపవలయు నన, మీమాంసకైకదేశి, భూతవస్తువు క్రియ గాకపోయినను గ్రియకు సాధన మగుటచే భూతోపదేశము క్రియార్థమే యగుచున్నది కావునఁ గ్రియతో సంబంధము లేని బ్రహ్మోపదేశ మయుక్తమే యన, నది యొక దోషము గాదని “నైష దోష” యని వారింపఁబడుచున్నది. భూతవస్తు వగు బ్రహ్మముయొక్క యుపదేశము యుక్తమే యను గూఢాభిసంధిపురస్సరముగ దోషమేమి ‘క్రియార్థత్వేపి...భవతి’ యను భాష్యముచే నిర్వచింపఁబడుచున్నది. భూతవస్తువులు క్రియలకొఱ కుపదేశింపఁబడినను గ్రియను నిర్వర్తింపఁగల శక్తితోఁ గూడిన వస్తువు లుపదేశింపఁబడిన వని తప్పక చెప్పవలసియే యున్నది. తస్య = అట్లుపదేశింపఁబడినవస్తువునకు ప్రయోజనము, క్రియార్థత్వం తు = క్రియను నిర్వహించుట యని గ్రహింపఁబడుచున్నది. కాని క్రియ యుపదేశింపఁబడి యద్దానికొఱకు వస్తువుపదేశింపఁబడిన దని చెప్పుటయుక్తమని ‘తు’ శబ్దముచే సూచింపఁబడుచున్నది. ఏతావతా = వస్తువునకుఁ గ్రియతోఁ బ్రయోజనము సంబంధము దెలియవచ్చినంతమాత్రముననే, వస్తు =

యది నామోపదిష్టం కిం తవ తేన స్యాదితి ఉచ్యతే— అనవగతాత్మవస్తూప-దేశశ్చ తథైవ భవితుమర్హతి। తదవగత్యా మిథ్యాజ్ఞానస్య సంసారహేతోర్నివృత్తిః ప్రయోజనం క్రియత ఇత్యవిశిష్టమర్థవత్త్వం క్రియాసాధనవస్తూపదేశేన। అపిచ "బ్రాహ్మణో న హంతవ్యః" ఇతి చైవమాద్యా నివృత్తిరుపదిశ్యతే।

---

క్రియతో సంబంధము లేకుండ వస్తువు, ఉపదిష్టం = ఉపదేశము చేయఁబడినది, కానేరదు, అనఁగా క్రియతో సంబంధమున్నను లేకపోయినను వస్తువుపదేశింపఁ బడుటకుఁ బ్రతిబంధ మెంతమాత్రము లేదని భావము. ఇట్లనినంత నే మీమాంసకైకదేశి, యది నామ ఉపదిష్టం = కర్మతో సంబంధము లేకుండఁగ నుపదేశింపఁబడుఁగాక!, కిం తవ తేన స్యాత్ = అద్దానితో నీకేమి ప్రయోజన మని యడుగఁ, బ్రయోజనము, ఉచ్యతే = చెప్పఁబడుచున్న దని "అనవగతాత్మవస్తూపదేశశ్చ తథైవ భవితుమర్హతి" యని చెప్పఁబడుచున్నది. తథైవ= క్రియలయందుఁ బ్రయోజనమును బడయునట్టి భూతవస్తువుల నుపదేశించినవిధముననే, అనవగతాత్మవస్తూపదేశశ్చ= పొందఁబడని యాత్మరూప మగు భూతవస్తూపదేశము గూడ, భవితుం = అగుటకు, అర్హతి= తగును. అట్టి యాత్మవస్తూపదేశమువలని ప్రయోజనము "తదవగత్యా ... క్రియతే" యని చెప్పఁబడుచున్నది. అనఁగా సద్బ్రహ్మజ్ఞానముచే సంసారహేతు వగు మిథ్యాజ్ఞానము నశించి మోక్షమనెడి పరమపురుషార్థము సిద్ధించుచున్న దని భావము. ఇట్టి యాత్మవస్తూపదేశప్రయోజనమును నిరూపించి క్రియాసాధనవస్తూపదేశము వలన నెట్లు ప్రయోజనము ఘటించుచున్నదో యట్లే క్రియాసంబంధము లేని యాత్మవస్తూపదేశమువలనఁ గూడ మోక్ష మనెడి ప్రయోజనము లభించుచున్నది గాన వేదమందుఁ జెప్పఁబడిన వస్తూపదేశము సప్రయోజనమే గాని నిష్ప్రయోజన మెంతమాత్రము గాదను నాశయముతో "ఇత్యవిశిష్టమర్థవత్త్వం క్రియాసాధనవస్తూప-దేశేన" యను భాష్యము బరఁగుచున్నది.

మీమాంసకుఁడు "ఆమ్నాయస్య క్రియార్థత్వాత్"ను జైమినివచనము నాధారముగాఁ జేసికొని వేదము క్రియాపరమే గాని సిద్ధవస్తుబోధక మెంత మాత్రము గాదను నభిప్రాయమును వెలిఁబుచ్చ వేదైకదేశము లగు వేదాంతములు సిద్ధవస్తుబోధకము లని నిరూపించి, యాతీరుననే వేదాంతములు ప్రవృత్తిబోధ కములుగాక సర్వక్రియానివృత్తిబోధకము లని నిరూపింపఁ గర్మకాండమందలి వాక్యములచేఁ గూడ నివృత్తి యుపదేశింపఁబడుచున్న దని "అపి చ ... ఉప-దిశ్యతే" యని చెప్పఁబడుచున్నది. అనఁగా "బ్రాహ్మణో న హంతవ్య" యను వాక్యములచేఁ గేవలము నివృత్తియే యుపదేశింపఁబడుచున్న దని యర్థము. ఈ "బ్రాహ్మణో న హంతవ్య" యను వాక్యముచే నిరూపింపఁబడు నివృత్తి, క్రియయుఁ

అభావబుద్ధిశ్చౌదాసీన్యకారణమ్। సా చ దగ్ధేన్ధనాగ్నివత్స్వయమేవోపశామ్యతి। తస్మాత్ప్రసక్తక్రియానివృత్త్యౌదాసీన్యమేవ "బ్రాహ్మణో న హన్తవ్యః" ఇత్యాదిషు ప్రతిషేధార్థం మన్యామహే, అన్యత్ర ప్రజాపతివ్రతాదిభ్యః।

విచుట లోకమునఁ జూడఁబడలేదు. కావున "బ్రాహ్మణో న హన్తవ్య"యనుచోఁ గర్తవ్యాభావ మగు నుపరమమే సంభవించును గాని వేఱొకక్రియయందుఁ బ్రవృత్తి యెంతమాత్రము సంభవింప దని "అభావబుద్ధిశ్చౌదాసీన్యకారణమ్మ"ని చెప్పఁబడు చున్నది. ఔదాసీన్యమునకుఁ గారణము నగు నభావబుద్ధి కర్తను గర్తవ్యతనుండి మఱలించి యేమగుచున్నదన "సా చ... స్వయమేవోపశామ్యతి"యని చెప్పఁబడుచున్నది. అనఁగా నా యభావబుద్ధి గూడఁ దదనంతరము దానే వెంటనే యుపశమించు నని యర్థము. స్వయముగా నుపశమించుటయందు దృష్టాన్తము—"దగ్ధేంధనాదివ త్త"ని. అనఁగాఁ గట్టెలు కాలుచు నంతమునఁ దమంతటఁ దా మెట్లుపశమము నొందునో యట్లే యని భావము. అభావబుద్ధి యౌదాసీన్యమును గల్గించి తనంతటఁ దానే యుపశమించిన ట్లీరువ వేదాంతములవలనఁ గలిగెడి బ్రహ్మాత్మజ్ఞానము సంసారహేతు వగు మిథ్యాజ్ఞానమును నశింపఁజేసి తాఁ గూడ స్వయముగ నుపశమించు నని యభిప్రాయము.

ఇట్లు చెప్పఁబడి, ప్రకృతము "తస్మాత్...మన్యామహే" యని యుపసంహరింపఁబడుచున్నది. అనఁగా "బ్రాహ్మణో న హన్తవ్యః" మున్నగు ప్రదేశములయందు నఞ్పదమునకుఁ బ్రసజ్యప్రతిషేధార్థమే గ్రహింపఁబడి యచటఁ బ్రసక్త మగు క్రియనుండి నివృత్తిరూప మగు నౌదాసీన్యమే యభిప్రేత మగుచున్న దని భావము.

అట్లైన చో నఞ్పదమున కీప్రసక్తక్రియానివృత్తిరూప మగు నౌదాసీన్యమే యన్నిచోటులయందు నర్థమా యనినచోఁ బ్రజాపతివ్రతములయందుఁ దెలియవచ్చెడి ప్రతిషేధవాక్యములందలి నఞ్పదమునకు మాత్రము ప్రసజ్యప్రతిషేధార్థమును గ్రహింపక పర్యుదాసార్థము గ్రహింపవలయు నని "అన్యత్ర ప్రజాపతివ్రతేభ్య" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. ప్రజాపతివ్రతము లన "తస్య వటోర్వ్రతమ్మ"ని ప్రారంభించి "నేక్షేతోద్యన్తమాదిత్యమ్మ"నునంతవఱకుఁ గల గ్రంథముచే నుపదేశింపఁబడిన బ్రహ్మచారివ్రతము లని యర్థము. ఇచట 'నేక్షేత' యనుచో నఞ్పదమును "ఈక్షేత" యను పదమందలి యేకదేశ మగు నీక్షణముతోఁ గూర్చి "అనీక్షణం కర్తవ్యమ్మ"ను విధిని గల్పించుటచేఁ గర్తవ్యముగాఁ దలంపఁబడెడి యనీక్షణమునకు వ్రతోపదేశబలముచేఁ బ్రాప్త మగు నీక్షణక్రియకంటె వేఱగు నుపాసనాదిక్రియ యర్థముగా గ్రహింపఁబడి "సంధ్యోపాసనం కర్తవ్యమ్మ"ను నర్థము గ్రహింపఁబడుచున్నది. ఇచట

తస్మాత్పురుషార్థానుపయోగ్యుపాఖ్యానాదిభూతార్థవాదవిషయమానర్థక్యాభిధానం ద్రష్టవ్యమ్ । యదప్యుక్తమ్ — కర్తవ్యవిధ్యనుప్రవేశమన్తరేణ వస్తుమాత్రముచ్యమానమనర్థకం స్యాత్ "సప్తద్వీపా వసుమతీ" ఇత్యాదివదితి,

---

వ్రతోపదేశబలముచేతనే నఞ్ పదమునకు బర్యుదాసార్థము గ్రహింపఁబడుచున్నది గాని, లేకపోయినచో నెంతమాత్ర మిచటఁ బర్యుదాసార్థము గ్రహింపఁబడక ప్రసజ్యప్రతిషేధార్థమే గ్రహింపఁబడనగు ననని భావము

కావున నివృత్తిరూపమగు నౌదాసీన్యార్థము గూడ వేదమున గ్రహింపఁ బడుటంజేసి యక్రియార్థముల కానర్థక్య మన్ననో " తస్మాత్ పురుషార్థానుపయోగి .. ద్రష్టవ్యమ్మ"ను భాష్యముచే నిట్టి స్థలములయం దని వ్యవస్థ చేయఁబడు చున్నది. అనఁగా వేదమునందు విధుల కంగముగాఁ జెప్పఁబడిన యర్థవాదములు, గుణవాదములు, ననువాదములు, భూతార్థవాదము లని మూఁడువిధములుగఁ బరగుచున్నవి.

గుణవాదము లన 'ఆదిత్యో యూపః, మనో బ్రహ్మ' మొదలుగాఁ గలిగిన విరుద్ధార్థబోధకము లగు వాక్యములు. ఇట్టివాక్యము లుపాసనావిధిని బోధించుచుండుటను గానఁ బ్రయోజనముతో నొప్పారుచున్నవే. అనువాదము లనిన "అగ్నిర్హిమస్య భేషజమ్" మొదలుగాఁ గల దృష్టార్థమును బోధించు వాక్యములు. ఇట్టివాక్యములచే నొకింత దృష్టప్రయోజనము గలుగుచున్నది. భూతార్థవాదము లనఁ బురుషార్థమున కుపయోగింపనట్టి యుపాఖ్యానరూపము లగు "సోఽరోదీత్" మన్నగు వాక్యములు. ఇట్టివాక్యములవలన నెట్టి ప్రయోజనమును లేకపోవుటచే నావాక్యముల కానర్థక్యము నప్రామాణ్యమును గలుగుచున్నది గాన నట్టివాక్యములకుఁ బ్రామాణ్యమును గల్పింప "స్తుత్యర్థేన విధీనాం స్యు" యని విధిస్తావకత్వముచే విధులతోఁ బొందిక చేయఁబడుచున్నవి.

కావున "ఆమ్నాయస్య క్రియార్థత్వాదానర్థక్యమతదర్థానాం" "విధినా త్వేకవాక్యత్వాత్ స్తుత్యర్థేన విధీనాం స్యు" యను రెండుజైమినిసూత్రములు నిట్టి భూతార్థవాదములకు బ్రామాణ్యమును గల్పింపఁ బ్రవర్తించుచున్నవే గావున నాసూత్రములకు విధివాక్యములట్లు స్వతః ప్రమాణము లగు వేదాంతవాక్యములయందుఁ బ్రవృత్తి గలుగ దని భావము. విధితో సంబంధము లేని యర్థవాదములకుఁ బ్రామాణ్యము సిద్ధింపనివిధమున వస్తుమాత్రబోధకము లగు వేదాంతములకుఁ బ్రామాణ్యమును బ్రయోజనమును లేదను మీమాంసకునియొక్క యాశయమును "యదప్యుక్తం ... ఇత్యాదివదితి" యనియనువదించి గూఢాభిసంధిపురస్సరముగఁ బూర్వోక్త మగు పరిహారమునే

తత్పరిహృతమ్। 'రజ్జురియం నాయం సర్ప' ఇతి వస్తుమాత్రకథనేఽపి ప్రయోజనస్య దృష్టత్వాత్। నను శ్రుతబ్రహ్మణోఽపి యథాపూర్వం సంసారిత్వదర్శనాన్న రజ్జుస్వరూపకథనవదర్థవత్త్వమిత్యుక్తమ్। అత్రోచ్యతే — నావగతబ్రహ్మాత్మభావస్య యథాపూర్వం సంసారిత్వం శక్యం దర్శయితుమ్, వేదప్రమాణజనితబ్రహ్మాత్మభావవిరోధాత్। న హి శరీరాద్యాత్మాభిమానినో దుఃఖభయాదిమత్త్వం దృష్టమితి తస్యైవ వేదప్రమాణజనితబ్రహ్మాత్మావగమే తదభిమాననివృత్తౌ తదేవ మిథ్యాజ్ఞాననిమిత్తం దుఃఖభయాదిమత్త్వం భవతీతి శక్యం కల్పయితుమ్। న హి ధనినో గృహస్థస్య ధనాభిమానినో ధనాపహారనిమిత్తం దుఃఖం దృష్టమితి తస్యైవ ప్రవ్రజితస్య ధనాభిమానరహితస్య తదేవ ధనాపహారనిమిత్తం దుఃఖం భవతి। న చ కుండలినః కుండలిత్వాభిమాననిమిత్తం సుఖం దృష్టమితి తస్యైవ కుండలవియుక్తస్య కుండలిత్వాభిమానరహితస్య తదేవ కుండలిత్వాభిమాననిమిత్తం సుఖం భవతి।

---

"తత్పరిహృతం, రజ్జురియం ... దృష్టత్వాత్త"ను భాష్యముచేఁ జెప్పచున్నారు. పూర్వోక్తపరిహారమును స్మరింప మధ్యస్థుఁడు వేదాంతవాక్యములు "రజ్జురియంనాయం సర్ప" యను వాక్యములవంటివి గావని "నను శ్రుతబ్రహ్మణోపి ... అర్థవత్త్వమిత్యుక్తమ్మ"ని ప్రశ్నించి గూఢాభిసంధిని వెలిపుచ్చ, నీవిషయమునందు సమాధానము చెప్పఁబడుచున్న దని "అత్రోచ్యతే ... శక్యం దర్శయితుమ్మ"ని సమాధానము చెప్పఁబడుచున్నది అనఁగా బ్రహ్మాత్మభావమును దెలిసికొనినవానికి నింతకుఁ బూర్వమువలెనే సంసారిత్వమును జూపుటకు శక్యము గాదని ప్రతిజ్ఞచేయఁబడుచున్నది ప్రతిజ్ఞకుఁ దగు హేతువు "వేదప్రమాణజనితబ్రహ్మాత్మభావవిరోధాత్త"ని చూపఁబడుచున్నది. అనఁగా వేదప్రమాణమువలనఁ గలిగిన బ్రహ్మాత్మభావమునకును సంసారిత్వమునకును విరోధ ముండుటవలన బ్రహ్మాత్మభావావగత్యనంతరము సంసారిత్వ ముండుట గన్పట్ట దని ప్రతిజ్ఞాసిద్ధి గలుగుచున్న దని భావము. ప్రతిజ్ఞావాక్యము "న హి శరీరాద్యాత్మాభిమానినః ... కల్పయితుమ్మ"ను భాష్యముచే వివరింపఁబడుచున్నది.

లోకమునఁ బ్రతిప్రాణికిని దేహేంద్రియసంఘాతమునం దాత్మబుద్ధి గలుగుటచే దేహేంద్రియసంఘాతమునందుఁ గల్గు వికారములతోఁ దాదాత్మ్యము గలుగ దుఃఖభయాదులు గలుగుచుండును. అట్టివానికి వేదప్రమాణముచే నపరోక్షబ్రహ్మాత్మజ్ఞానము గలుగ దేహాదులాత్మ యను మిథ్యాజ్ఞానము నశించును. కావున నామిథ్యాజ్ఞానమువలనఁ గలుగు దుఃఖభయాదులు గూడ నశించుచునే యుండ నయ్యవి పూర్వమువలెనే గలుగు నని చెప్పుట కెంతమాత్రము వీలులేదు. అట్లు సుఖదుఃఖాదులు గలుగ వనుటకు "న హి ... సుఖం భవతి"

తదుక్తం శ్రుత్యా— "అశరీరం వావ సంతం న ప్రియాప్రియే స్పృశతః" (ఛాం. 8-12-1) ఇతి। శరీరే పతితేఽశరీరత్వం స్యాత్, న జీవత ఇతి చేన్న, సశరీరత్వస్య మిథ్యాజ్ఞాననిమిత్తత్వాత్ । న హ్యాత్మనః శరీరాత్మాభిమాన లక్షణం మిథ్యాజ్ఞానం ముక్త్వాఽన్యతః సశరీరత్వం శక్యం కల్పయితుమ్ । నిత్యమశరీరత్వమకర్మనిమిత్తత్వాదిత్యవోచామ । తత్కృతధర్మాధర్మనిమిత్తం సశరీరత్వమితి చేన్న । శరీరసంబంధస్యాసిద్ధత్వాద్ధర్మాధర్మయోరాత్మకృతత్వాసిద్ధేః ।

---

యని రెండుదృష్టాంతములు ప్రదర్శింపఁబడుచున్నవి. ప్రవ్రజితస్య = సంన్యసించినవానికి, ప్రతిజ్ఞాతార్థమునందు శ్రుతిప్రమాణ్యము గూడ, అశరీరం = శరీరము లేని, సంతం = సత్పదార్థమగు నాత్మను, ప్రియాప్రియే=సుఖదుఃఖములు, న స్పృశతః = ఎంతమాత్రము స్పృశింపనేరవను నర్థము గల శ్రుతి 'అశరీరం...స్పృశత' యని చూపఁబడుచున్నది.

శ్రుత్యర్థము ప్రతిజ్ఞాతార్థము నెంతమాత్రము పోషింపనేరదు. ఏలయన, శరీర పాతానంతర మశరీరత్వము సిద్ధించును గాని జీవించియుండఁగా సిద్ధింపనేరదని "శరీరే పతితే ... న జీవత" యని మధ్యస్థుఁ డడుగ, నట్లు గాదని 'న' యని వారింపఁబడుచున్నది. వారించుటకుఁ దగు హేతువు "సశరీరస్య మిథ్యాజ్ఞాననిమిత్తత్వా"త్తని చెప్పఁబడుచున్నది. సశరీరత్వము మిథ్యారూపమగు నజ్ఞానము హేతువుగాఁ గలది. అనఁగా నేను దేహముతోఁ గూడియున్నానని యనుకొనుటయే యజ్ఞానమూలక మని భావము. అనఁగా రజ్జుసర్పమట్లు వాస్తవముగా దేహము లేదనియు, దేహ మనునది భ్రాంతిమూలక మనియు సంగ్రహాభిప్రాయము "న హ్యాత్మనః ... వ్యాఖ్యాతమ్మ"ను భాష్యముచే వివరింపఁబడుచున్నది. సశరీరము మిథ్యాజ్ఞాననిమిత్త మనుటకుఁ గారణము "నిత్యం . . అవోచామ" యని చెప్పఁబడుచున్నది. అనఁగా నశరీరత్వము కర్మజన్యము గాక స్వాభావికమే యని యిదివఱలోఁ జెప్పఁబడియె నని భావము. సశరీరత్వము మిథ్యాజ్ఞాననిమిత్తము గాక యాత్మకృతము లగు ధర్మాధర్మములవలనఁ గల్గుచుండుటచే ధర్మాధర్మములు నశింపకుండఁగ నశరీరత్వము సిద్ధింపదు గావున శరీరపాతానంతరమే యశరీరత్వరూపమగు మోక్షముగాని శరీరముతోనుండఁగాఁ లభింపదని "తత్కృతధర్మాధర్మనిమిత్తం సశరీరత్వమ్మ"ని శంకింప నట్లు గాదని "ఇతి చేత్, న" యని పరిహరింపఁబడుచున్నది. పరిహారమునకు హేతువు "శరీరసంబంధస్య ... ఆత్మకృతత్వాసిద్ధే" యని చెప్పఁబడుచున్నది. అనఁగా నాత్మకు శరీరసంబంధము లేకుండ ధర్మాధర్మములు పుట్టుట ఘటింపదు. కావున నట్టిధర్మాధర్మములవలన శరీరము పుట్టినదనుట యసమంజసము. పోనీ! శరీరసంబంధము లేకుండ ధర్మాధర్మములు పుట్టుటయు ధర్మాధర్మములు లేకుండ శరీరసంబంధము గలుగుటయును ఘటింపదు

శరీరసంబంధస్య ధర్మాధర్మయోస్తత్కృతత్వస్య చేతరేతరాశ్రయత్వప్రసంగా-దంధపరంపరైషాఽనాదిత్వకల్పనా క్రియాసమవాయాభావాచ్చాత్మనః కర్తృ-త్వానుపపత్తేః। సన్నిధానమాత్రేణ రాజప్రభృతీనాం దృష్టం కర్తృత్వమితిచేన్న, ధనదానాద్యుపార్జితభృత్యసంబంధిత్వాత్తేషాం కర్తృత్వోపపత్తేః। న త్వాత్మనో ధనదానాదివచ్ఛరీరాదిభిః స్వస్వామిసంబంధనిమిత్తం కించిచ్ఛక్యం కల్పయితుమ్। మిథ్యాభిమానస్తు ప్రత్యక్షస్సంబంధహేతుః।

---

గావున నియ్యది పరస్పరాశ్రయదోషగ్రస్త మగుటవలన ననాది యని తప్పక యంగీకరింపవలయునే యని యనిన నో నట్టిపరస్పరాశ్రయదోషమును వారించుటకు ననాదిత్వమును గల్పించుటయు నిర్యుక్తిక మగుటంజేసి హేయమే యగుచున్నదని "శరీరసంబంధస్య ... అంధపరంపరైషాఽనాదిత్వకల్పనా" యని నిరాకరింపఁబడు చున్నది అంధపరంపర యనుటలో హేతువు "క్రియాసమవాయాభావాచ్చాత్మనః కర్తృత్వానుపపత్తే" యని చెప్పఁబడుచున్నది. అనఁగా నాత్మ నిష్క్రియ మగు టంజేసి క్రియతో నెన్నఁడును సంబంధము ఘటింపదు గావునఁ గర్తృత్వము గలుగు టయు నట్టానిచే ధర్మాధర్మముల నాచరించుటయు నట్టిధర్మాధర్మములచే నశరీర త్వము గలుగుటయు నెంతమాత్రము సమంజసము గాదని తాత్పర్యము. నిష్క్రియ మగు నాత్మకుఁ గర్తృత్వరూప మగు క్రియ ప్రకారాంతరముచేఁ గల్గునని 'సన్ని-ధానమాత్రే...కర్తృత్వ'మ్మని శంకింపఁబడుచున్నది. అనఁగా లోకమున భృత్యునిచేఁ జేయఁబడు క్రియయందలి కర్తృత్వము సన్నిధిగతుఁడగు రాజునందుఁ జూడఁబడు చున్నట్లు శరీరాదులచేఁ జేయఁబడు క్రియయందలి కర్తృత్వము సన్నిధానమాత్ర ముచే నాత్మయందుఁ దెలియఁబడ నొప్పునే యనినట్లు గాదని "ఇతి చేత్, న" యని పరిహరింపఁబడుచున్నది. పరిహారమందలి హేతువు "ధనదానాది ... కల్ప యితుమ్"ని చెప్పఁబడుచున్నది. అనఁగా లోకమున రాజప్రభృతులకును భృత్యాదు లకును దెలియవచ్చెడి స్వస్వామిభావమునకు నిమిత్తభూత మగు ధనదానాదిసంబం ధముతోఁ దుల్య మగు సంబంధము ప్రకృతమున నాత్మకును శరీరాదులకు నెంత మాత్రమును దెలియకపోవుటచే నట్టి సంబంధమును గల్పించుటకు వీలు లేదని భావము.

ఇట్లెన్నివిధములఁ బోజించినను నాత్మకును దేహాదులకు నట్టిసంబంధ మును దెలియకపోవుటచేఁ బ్రత్యక్షముగాఁ దెలియవచ్చెడి మిథ్యాభిమానమే సంబంధకారణ మని "మిథ్యాభిమానస్తు ప్రత్యక్షస్సంబంధహేతు" యని సిద్ధాంతము నిర్వహింపఁబడుచున్నది. ఆత్మకు దేహేంద్రియాదులతోఁ గల సంబంధ మెట్లు మిథ్యా భిమానకల్పితమో యట్లే యాగములయందలి కర్తృత్వనిమిత్త మగు యజమా

ఏతేన యజమానత్వమాత్మనో వ్యాఖ్యాతమ్ అత్రాహ:— దేహాదివ్యతిరిక్తస్యాత్మన ఆత్మీయే దేహాదావహంప్రత్యయో గౌణో న మిథ్యేతి చేన్న। ప్రసిద్ధవస్తుభేదస్య గౌణత్వముఖ్యత్వప్రసిద్ధేః। యస్య హి ప్రసిద్ధో వస్తుభేదః, యథా కేసరాదిమానాకృతివిశేషోఽన్వయవ్యతిరేకాభ్యాం సింహశబ్దప్రత్యయభాఙ్ముఖ్యోఽన్యః ప్రసిద్ధః, తతశ్చాన్యః పురుషః ప్రాయికైః క్రౌర్యశౌర్యాదిభిః సింహగుణైః సమ్పన్నః సిద్ధః, తస్య పురుషే సింహశబ్దప్రత్యయౌ గౌణౌ భవతః। నాప్రసిద్ధవస్తుభేదస్య। తస్య త్వన్యత్రాన్యశబ్దప్రత్యయౌ భ్రాన్తినిమిత్తావేవ భవతో న గౌణౌ। యథా మన్దాన్ధకారే 'స్థాణురయ' మిత్యగృహ్యమాణవిశేషే పురుషశబ్దప్రత్యయౌ స్థాణువిషయౌ, యథా వా శుక్తికాయామకస్మాద్రజతమితి నిశ్చితౌ శబ్దప్రత్యయౌ, తద్వద్దేహాదిసంఘాతేఽహమితి నిరుపచారేణ శబ్దప్రత్యయావాత్మానాత్మవివేకేనోత్పద్యమానౌ కథం గౌణౌ శక్యౌ వదితుమ్। ఆత్మానాత్మవివేకినామపి పణ్డితానామజావిపాలానామివావివిక్తౌ శబ్దప్రత్యయౌ భవతః। తస్మాద్దేహాదివ్యతిరిక్తాత్మాస్తిత్వవాదినాం దేహాదావహంప్రత్యయో మిథ్యైవ న గౌణః।

---

నత్వము గూడ మిథ్యాభిమానకల్పితమే యని "ఏతేన యజమానత్వమాత్మనో వ్యాఖ్యాతమ్"ను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది.

ఇట్లు దేహాదులయందలి యాత్మబుద్ధి మిథ్య యని నిరూపింప, నయ్యది గౌణము గాని మిథ్య గాదని మీమాంసకులు వచియింప, నట్లు గౌణమెంతమాత్రము గాదని "ఇతి చేత్, న" యని పరిహరింపఁబడుచున్నది అందులకు హేతువు "ప్రసిద్ధవస్తుభేదస్య గౌణత్వముఖ్యత్వప్రసిద్ధే" యని చెప్పఁబడుచున్నది. వస్తుభేదమును ప్రసిద్ధముగ గ్రహించినప్పుడే గౌణత్వముఖ్యత్వ వ్యవహారము లోకమున దృష్టమగుచున్నది గాని సుప్రసిద్ధ మగు వస్తుభేదము లేనిచో నట్టి వ్యవహారము ఘటింపదని భావము. సంగ్రహవాక్యము 'యస్య హి . మిథ్యైవ న గౌణ' యను భాష్యముచే వివరింపఁబడుచున్నది. అనఁగా లోకములో సింహమును, మాణవకుని భిన్నములుగా నెవ్వరిచే గ్రహింపఁబడుచుండిరో యట్టివానికి మాణవకునియందు సింహశబ్దప్రత్యయములు గౌణముగా గ్రహింపఁబడుచున్నవి. కాని వస్తుభేదము తెలియఁబడకుండ మారాత్తుగా మందాంధకారమున నొకస్థాణువును జూచి పురుషుఁడను ప్రత్యయమును బడయుట గాని శుక్తియందు నాకస్మికమగు రజతమను బుద్ధిని బడయుట గాని గౌణము లని చెప్పఁబడవుగదా? అటులనే శుక్త్యాదులయందు రజతాదులబుద్ధిని బడసిన విధమున దేహాదులయం దెట్టి యోజన లేక యాత్మబుద్ధిని బడయుట ప్రత్యక్షసిద్ధమే యగుచున్నది. ఇంతియే కాదు. ఆత్మానాత్మవివేకమును బడసిన పండితులకుఁ గూడఁ బ్రాకృతజనులట్లు

తస్మాన్మిథ్యాప్రత్యయనిమిత్తత్వాత్సశరీరత్వస్య సిద్ధం జీవతోఽపి విదుషోఽశరీరత్వమ్। తథా చ బ్రహ్మవిద్విషయా శ్రుతిః — 'తద్యథాఽహినిర్ల్వయనీ వల్మీకే మృతా ప్రత్యస్తా శయీతైవమేవేదం శరీరం శేతే। అథాయమశరీరోఽమృతః ప్రాణో బ్రహ్మైవ తేజ ఏవ' (బృ 4-4-7) ఇతి। సచక్షురచక్షురివ సకర్ణోఽకర్ణ ఇవ సవాగవాగివ సమనా అమనా ఇవ సప్రాణోఽప్రాణ ఇవ' ఇతి చ।

---

దేహాదులయం దాత్మబుద్ధి నిరుపచారముగఁ గల్గుచుండ నట్టి గౌణమని చెప్పు టెట్లు? కావున దేహాత్మవాది యగు చార్వాకుఁడు దక్క దేహాదులకంటె విలక్షణ మగు నాత్మ గలదని సామాన్యముగఁ దలంచువారలందఱకు దేహాదులయందు "అహ"మ్మనెడిజ్ఞానము గౌణ మెంతమాత్రము గాక మిథ్యయే యగుచున్నదని భావము.

ఇట్లు దేహమందలి యాత్మాభిమానము మిథ్య యని నిర్వచించి ప్రకృతము "తస్మాత్ ... అశరీరత్వమ్"ని యుపసంహరింపఁబడుచున్నది. అనఁగా శరీరము రజ్జుసర్పమట్లు మిథ్య యగుటంజేసి విద్వాంసునకు జీవించియుండఁగనే యశరీరత్వము సిద్ధించిన దని పరమతాత్పర్యము.

ఇట్లు ప్రదర్శింపఁబడిన జీవన్ముక్తి స్వానుభవైకవేద్య మగు యుక్తిసిద్ధమే గాక శ్రుతిసిద్ధము గూడ నని "తథా చ ... ఇతి చ" యని ప్రదర్శింపఁబడుచున్నది.

1. తత్ = ఆజీవన్ముక్తియందు, యథా = ఏరీతిగా, అహినిర్ల్వయనీ = పాముయొక్క కుబుసము, వల్మీకే = పుట్టయందు, మృతా = జీవము లేనిదై, ప్రత్యస్తా = విడువఁబడి, శయీత = పడియుండునో, ఏవమేవ = ఈరీతిగా, ఇదం = ఈ పరిదృశ్యమాన మగు శరీరము, శేతే = పడియుండును. అథ = ఆ రీతిగా, అయం = ఈ జీవన్ముక్తుఁడు, అశరీరః = శరీరరహితుఁడు, అమృతః = మరణము లేనివాఁడు, ప్రాణః = చేతనస్వరూపుఁడు, బ్రహ్మైవ = బ్రహ్మమే, తేజ ఏవ = స్వయంప్రకాశస్వరూపుఁడే యగుచున్నాఁడు.
2. అచక్షుః = వాస్తవము చే నేత్రములు లేనివాఁడయ్యు, సచక్షురివ = నేత్రము లున్నవానివలెను, అకర్ణః=కర్ణములు లేనివాఁడైనను, సకర్ణ ఇవ=కర్ణములతోఁ గూడినవానివలె, అవాక్ = వాగింద్రియరహితుఁడైనను, సవాగివ = వాగింద్రియముతోఁ గూడినవానివలె, అమనాః=అంతఃకరణము లేనివాఁడయ్యు, సమనా ఇవ=అంతఃకరణముతోఁ గూడినవానివలెను, అప్రాణః=ప్రాణముతోఁ గూడిన వాఁడు కానప్పటికి, సప్రాణ ఇవ = ప్రాణముతోఁ గూడినవానివలె నున్నాఁడు. అనఁగా దేహేంద్రియాదిరహిత మగు నాత్మస్వరూపము నొందినప్పటికి దేహేం

స్మృతిరపి చ — "స్థితప్రజ్ఞస్య కా భాషా" (భ. గీ. 2-54) ఇత్యాద్యా స్థితప్రజ్ఞలక్షణాన్యాచక్షాణా విదుషః సర్వప్రవృత్త్యసంబంధం దర్శయతి । తస్మాన్నావగతబ్రహ్మాత్మభావస్య యథాపూర్వం సంసారిత్వమ్ । యస్య తు యథాపూర్వం సంసారిత్వం నాసావవగతబ్రహ్మాత్మభావ ఇత్యనవద్యమ్ । యత్పునరుక్తమ్ — శ్రవణాత్పరాచీనయోర్మనననిదిధ్యాసనయోర్దర్శనాద్విధిశేషత్వం బ్రహ్మణో న స్వరూపపర్యవసాయిత్వమితి। న। అవగత్యర్థత్వాన్మనననిదిధ్యాసనయోః। యది హ్యవగతం బ్రహ్మాన్యత్ర వినియుజ్యేత, భవేత్తదా విధిశేషత్వమ్। న తు తదస్తి, మనననిదిధ్యాసనయోరపి శ్రవణవదవగత్యర్థత్వాత్ ।

---

ద్వేషాదులతో గూడినవానివలె లోకమునకు గన్పట్టుచున్నాడని భావము. ఇచట చిశబ్దము పూర్వపదముతోడ నన్వయింపవలయును. ఇట్లు శ్రుతియే గాదు, స్మృతిగూడ సర్వక్రియానివృత్తిరూప మగు జీవన్ముక్తిని బోధించుచున్న దని "స్మృతిరపి — 'స్థితప్రజ్ఞస్య...' దర్శయతి"యను భాష్యముచేఁ జెప్పఁబడు చున్నది. ఇట్లు శ్రీకృష్ణభగవానులచే నుపదేశింపఁబడిన స్థితప్రజ్ఞలక్షణములు జీవన్ముక్తిని విస్తరముగా బోధించుచున్న వని చెప్పి ప్రకృతమును "తస్మాత్ ... సంసారిత్వమ్మ"ని యుపసంహరించుచున్నారు. అనఁగా - బ్రహ్మాత్మభావము నొందినవానికిఁ బూర్వమందువలెనే సంసారిత్వ మెంతమాత్రము గలుగ దని భావము. ఒకవేళ వేదాంతశ్రవణము చేసినవానికిఁ గూడఁ బూర్వమందువలెనే సంసారిత్వము దెలియఁబడుచున్నదే యన నట్టివానికి బ్రహ్మాత్మసాక్షాత్కారము గలుగలే దని "యస్య తు ... ఇత్యనవద్యమ్మని" పూర్వాభిప్రాయమే ప్రకారాంతరముచే దృఢపఱుపఁబడుచున్నది.

"శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్య" యని శ్రవణోత్తరకాలమున మనననిదిధ్యాసలు వినవచ్చుటంజేసి బ్రహ్మమునకు విధిశేషత్వమే దెలియఁబడు చున్న దను మీమాంసకాభిప్రాయము "యత్పునరుక్తం ... స్వరూపపర్యవసాయిత్వమ్మ"ని యనువదింపఁబడి, శాస్త్రార్థపరితుష్టికొఱకు 'న' యని నిషేధింపఁ బడుచున్నది. నిషేధమందలి హేతువు "అవగత్యర్థత్వాన్మనననిదిధ్యాసనయోః" యని చెప్పఁబడుచున్నది. అనఁగా శ్రవణ మెట్లవగతికి హేతువో యాతీరుననే మనననిదిధ్యాసలుగూడ నవగతిహేతువులే గాని కర్మవిధాయకము లెంతమాత్రము గావని యర్థము. ఈయాశయమే "యది హ్యవగతం ... అవగత్యర్థత్వాత్త"ను భాష్యముచే వివరింపఁబడుచున్నది. అనఁగా శ్రవణమ్ముచేఁ దెలియఁబడిన బ్రహ్మము కర్మమునందుఁ గాని యుపాసనమందుఁగానివినియోగింపఁబడినచో నప్పుడాబ్రహ్మమునకు విధిశేషత్వము గలుగును. అట్లు దెలియ్యఁబడదు గావున మనననిదిధ్యాసములుగూడ నవగతిపరములే యని నిశ్చితాభిప్రాయము.

తస్మాన్న ప్రతిపత్తివిధివిషయతయా శాస్త్రప్రమాణకత్వం బ్రహ్మణః సంభవతీత్యతః స్వతంత్రమేవ బ్రహ్మ శాస్త్రప్రమాణకం వేదాంతవాక్యసమన్వయాదితి సిద్ధమ్। ఏవం చ సతి "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" ఇతి తద్విషయః పృథక్ శాస్త్రారంభ ఉపపద్యతే। ప్రతిపత్తివిధిపరత్వే హి "అథాతో ధర్మజిజ్ఞాసే" త్యేవారబ్ధత్వాన్న పృథక్ శాస్త్రమారభ్యేత। ఆరభ్యమాణం చైవమారభ్యేత— "అథాతః పరిశిష్టధర్మజిజ్ఞాసా" ఇతి, "అథాతః క్రత్వర్థపురుషార్థయోర్జిజ్ఞాసా", (జై. 4. 1. 1) ఇతివత్। బ్రహ్మాత్మైక్యావగతిస్త్వప్రతిజ్ఞాతేతి తదర్థో యుక్తః శాస్త్రారంభః "అథాతో బ్రహ్మజిజ్ఞాసే"తి।

---

ఇట్లు నిర్వచించి సమన్వయసూత్రార్థము "తస్మాత్ ... సిద్ధమ్మ"ని యుపసంహరింపఁబడుచున్నది. తస్మాత్ = వేదాంతములకు సిద్ధవస్తువగు బ్రహ్మమందు సమన్వయ మగుటవలన, స్వతంత్రముగా బ్రహ్మము శాస్త్రముచే బోధింపఁబడుచున్న దని పరమతాత్పర్యము

ఇట్లు వేదాంతములచే బ్రహ్మము విధ్యంగము గాక స్వతంత్రముగ బోధింపఁబడినపుడే "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యని సూత్రకారులచేఁ బ్రత్యేకముగా శాస్త్రారంభము చేయఁబడుట యుక్తముగఁ దోఁచును. అట్లు గాక బ్రహ్మము విధికి నంగమే యగుచో విధిశాస్త్రనిర్ణయమునకుఁ బ్రవర్తించిన జైమినీయతంత్రముచేతనే యియ్యది కూడ గతార్థమే యయియుండవలయును. అట్లు గతార్థము గాక ప్రత్యేకముగాఁ బ్రతిజ్ఞచేయఁబడవలసివచ్చినచో ధర్మజిజ్ఞాసాంతర్గతవిషయము లిదివఱలో "అథాతః క్రత్వర్థపురుషార్థయోర్జిజ్ఞాసా" యని ప్రతిజ్ఞచేయఁబడినట్లే యియ్యది కూడ "అథాతః పరిశిష్టధర్మజిజ్ఞాసా" యనియే ప్రతిజ్ఞచేయఁబడవలసియుండును. అట్లుగాక "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యని ప్రత్యేకముగా శ్రీకృష్ణద్వైపాయన వేదవ్యాసులచేఁ బ్రతిజ్ఞచేయఁబడుటచే నిదివఱకే తంత్రముచేతను బ్రతిజ్ఞచేయఁబడని బ్రహ్మాత్మైక్యావగతి ప్రతిజ్ఞచేయఁబడుచున్న దని తప్పక నిశ్చయింపవలయు నను నాశయ మీసూత్రగ్రంథముచేఁ బ్రతిజ్ఞచేయఁబడుచున్న దని "ఏవం చ సతి ... అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. మహనీయులయొక్క ప్రవృత్తి నిరర్థకము గాక యపూర్వప్రయోజనముతో నొప్పారుచుండు నను గూఢాభిసంధితో నీగ్రంథారంభముయొక్క యతిశయము వర్ణింపఁబడుచున్నది. గూఢాభిసంధి యేమన నీ శాస్త్రమునకు బ్రహ్మాత్మైక్యావగతియందే తాత్పర్యము గాక వేఱొకయర్థమునందే తాత్పర్య మగుచో నట్టివిషయము లన్నియు నిదివఱకే గతార్థములై యుండిన వానికొఱ కీశాస్త్రమును బ్రారంభించుట నిరర్థకమే యగును. మహనీయు లట్టి నిరర్థక మగు కార్యములకుఁ గడంగరు గావున నీశాస్త్రముచే నిదివఱకుఁ దెలియఁబడని విశేష మగు బ్రహ్మాత్మైక్యావగతి

తస్మాదహం బ్రహ్మాస్మీత్యేతదవసానా ఏవ సర్వే విధయః సర్వాణి చేతరాణి ప్రమాణాని। న హ్యహేయానుపాదేయాద్వైతాత్మావగతౌ నిర్విషయాణ్యప్రమాతృకాణి చ ప్రమాణాని భవితుమర్హంతీతి॥ అపి చాహుః:—

'గౌణమిథ్యాత్మనోఽసత్త్వే పుత్రదేహాదిబాధనాత్।
సద్బ్రహ్మాత్మాహమిత్యేవం బోధే కార్యం కథం భవేత్॥

---

నుపదేశింప నీశాస్త్రము బరఁగుచున్న దని "తస్మాదహం బ్రహ్మాస్మీత్యేతదవసానా ఏవ సర్వే విధయస్సర్వాణి చేతరాణి ప్రమాణాని" యని సకలశాస్త్రతాత్పర్యము సింహగర్జనముతోఁ బ్రతిజ్ఞ చేయఁబడుచున్నది. అనఁగా నేకారణమువలన శ్రీకృష్ణ ద్వైపాయన వేదవ్యాసభగవానులచే బ్రహ్మజిజ్ఞాస ప్రతిజ్ఞ చేయఁబడుచున్నదో, తస్మాత్ = ఆకారణమువలన, సర్వే విధయః = సకలము లగు విధులును, సర్వాణి చ ఇతరాణి ప్రమాణాని = ప్రత్యక్షాది సకలము లగు ప్రమాణములును, "అహం బ్రహ్మాస్మి" యను నర్థమే పరిసమాప్తిగాఁ గల్గియున్న వని సకలప్రమాణముల యొక్క ముఖ్య మగు తాత్పర్యము బోధింపఁబడు చున్నది.

ఇట్టి సకలవేదార్థసారసంగ్రహభూత మగు 'అహం బ్రహ్మాస్మి' యను వాక్యార్థశ్రవణముచే హేయోపాదేయ మగు సద్వైతబ్రహ్మాత్మజ్ఞానముగలుగ, నట్టి విద్వాంసునకు ప్రమాతృప్రముఖము లగు ప్రమాణప్రమేయజాలమంతయు నశింప సకలప్రమాణములును నిర్విషయములై తమతమ ప్రమాణభావమును గోలుపోవుచున్న వని "న హి...అర్హంతి" యని ప్రతిజ్ఞ చేయఁబడుచున్నది. ఇట్టి పరమపురుషార్థ హేతుభూత మగు నర్థము బ్రహ్మవిదులచేఁ గూడ స్మరింపబడిన దని యట్టి సూక్తులు "అపి చాహుః ... ఆత్మనిశ్చయాత్"ను భాష్యముచే నిర్వహింపఁ బడుచున్నది.

పుత్రదారాదులయందలి యాత్మాభిమానము గౌణము. ఏలయన,— పుత్రదారాదులయందలి భేద మనుభవసిద్ధముగుచు వారలయందలి సుఖదుఃఖముల వలనఁ దాను సుఖి ననియు దుఃఖి ననియుఁ దలఁచుటచే గౌణ మని చెప్పఁబడు చున్నది. దేహేంద్రియాదులయం దన్ననో యట్టిభేదము గన్పట్టకపోవుటవలన నభేదాభిమానముచే నాత్మాభిమానముఁ జేయుట మిథ్య యని చెప్పఁబడుచున్నది. కానంజేసి దారపుత్రాదులు గౌణాత్మ యనియు దేహేంద్రియాదులు మిథ్యాత్మ మనియుఁ జెప్పఁబడుచున్నది. లోకయాత్రయంతయు నీగౌణాత్మ మిథ్యాత్మ యను రెం డాత్మలతోఁ సంబంధము గలిగి పరఁగుచున్నది. ఛాందోగ్యోపనిషత్తునందు జగత్కారణము సచ్ఛబ్దముచే నుపదేశింపఁబడుచున్నది. తైత్తిరీయమునం దన్ననో బ్రహ్మశబ్దముచే నుపదేశింపఁబడుచున్నది. ఐతరేయమునం దన్ననో యాత్మశబ్దముచే నీజగత్కా-

అన్వేష్టవ్యాత్మవిజ్ఞానాత్ప్రాక్ప్రమాతృత్వమాత్మనః।
అన్విష్టః స్యాత్ప్రమాతైవ పాప్మదోషాదివర్జితః॥
దేహాత్మప్రత్యయో యద్వత్ప్రమాణత్వేన కల్పితః।
లౌకికం తద్వదేవేదం ప్రమాణం త్వాత్మనిశ్చయాత్' ఇతి॥

---

రణ ముపదేశింపఁబడుచున్నది. ఈమూఁడుశబ్దములు నేకార్థబోధకములే యనియుఁ బర్యాయపదములే యనియు సూచింప స్వస్వరూపోపలక్షక మగు నహంశబ్దముతో నీమూఁడుశబ్దములును బర్యాయపదములుగ వాడియున్నారు. దానిచే జగత్కారణభూత మగు బ్రహ్మమే దాననునభేదసాక్షాత్కారము గలుగ గౌణాత్మ యగు దారపుత్రాదు లసత్తు లగుచు బాధింపఁబడుదురు ఆతీరుననే మిథ్యాత్మ యగు దేహేంద్రియాదుల సత్యము లగుచు బాధింపఁబడును. కాఁగాఁ గార్య మన, గౌణమిథ్యాత్మలతోఁ గూడిన లోకయాత్ర, కథం భవేత్ = ఎట్లు గలుగును ? అనఁగా నద్వైతాత్మజ్ఞానముగలుగ లోకయాత్ర యెంతమాత్రము గలుగక లుప్త మగు నని భావము.

కార్యము సిద్ధింపఁ గలుగకుండుటకుఁ దగు కారణాంతరము ద్వితీయ శ్లోకముచేఁ జెప్పఁబడుచున్నది. ఎల్లరకు నన్వేషణము చేయఁబడవలసిన దద్వితీయాత్మవిజ్ఞానము. అట్టి యాత్మవిజ్ఞానము గలుగుటకుఁ బూర్వము, ఆత్మనః = ఆత్మకు, ప్రమాతృత్వం = ప్రమాతృభావమును, దదుపలక్షితము లగు ప్రమాణప్రమేయవ్యవహారములును గలుగుచున్నవి. అన్విష్టః = అద్వితీయాత్మ వెదకఁబడినది, స్యాత్ = కాఁగా, ప్రమాణప్రమేయసాధనములచే వెదకు ప్రమాతయే, పాప్మదోషాదివర్జితః = సకలధర్మాధర్మాదిదోషశూన్య మగు నాత్మయె యగుటంజేసి, ప్రమాతృత్వాదిసకలవ్యవహారము లుపశమింపఁ గార్య మెంతమాత్రము గలుగ దని భావము.

పారమార్థికము గాని ప్రమాణప్రమేయవ్యవహారముచేఁ బరమార్థక మగు నద్వితీయాత్మజ్ఞానము గలుగుట యసమంజస మగు నన నద్వితీయాత్మజ్ఞానము గలుగువఱకు నీప్రమాణప్రమేయవ్యవహారమున వ్యావహారికప్రామాణ్య ముండుటవలన నట్టి వ్యావహారికప్రామాణ్యమువలనఁ బారమార్థికప్రామాణ్యజ్ఞానము గలుగు నని మూఁడవశ్లోకము ప్రవర్తించుచున్నది.

ఆ ఆత్మనిశ్చయాత్ = అద్వితీయాత్మసాక్షాత్కారము గలుగువఱకు, దేహాత్మప్రత్యయః = దేహేంద్రియాదులయందలి యాత్మబుద్ధి, యద్వత్ = రీతిగ, ప్రమాణత్వేన = ప్రమాణభావముచే, కల్పితః = కల్పింపఁబడుచున్నదో, ద్వత్ ఏవ = ఆతీరుననే, లౌకికం = లోకవ్యవహారము, ఇదం = ఈశాస్త్రమును

— * ఇతి చతుస్సూత్రీ సమాప్తా * —

**సూత్ర.** ప్రమాణం = ప్రమాణమే యగును. ఆత్మనిశ్చయానంతరము ప్రమాణభావము నశించిపోవు నని "తు" శబ్దముచే సూచింపఁబడుచున్నది. అనఁగా నద్వైతాత్మజ్ఞానము గలుగువఱకు లోకవ్యవహారము లుప్తముగాదు గావున నంతవఱకు లౌకికవైదికవ్యవహారముల కన్నిటికిఁ బ్రామాణ్యాభావము సిద్ధించుచుఁ బరమపురుషార్థ మగు నద్వితీయాత్మజ్ఞానము గలుగఁ బ్రమాణములయొక్క ప్రయోజనము పరిసమాప్తి యగుటంజేసి ప్రమాణములయందలి ప్రమాణభావముతోఁ బ్రయోజనము లేదని తాత్పర్యము. ఇది చతుస్సూత్రి.

 

# ఈక్షతేర్నాశబ్దమ్

ప్రకృతపువేదాంతదర్శనము "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యను సూత్రముతోఁ బ్రారంభమై "అనావృత్తిః శబ్దాదనావృత్తి శ్శబ్దాత్"ను సూత్రముతో ముగియుచున్నది. అందు మొదటియధ్యాయము "ఏతేన సర్వే వ్యాఖ్యాతా వ్యాఖ్యాతా" యను సూత్రముతో ముగియుచున్నది. రెండవయధ్యాయము "స్మృత్యనవకాశదోషప్రసంగ ఇతి చేన్నాన్యస్మృత్యనవకాశదోషప్రసంగాత్"ను సూత్రముతోఁ బ్రారంభమై "వైశేష్యాత్తు తద్వాద స్తద్వాద"యను సూత్రముతో ముగియుచున్నది. మూఁడవయధ్యాయము "తదంతరప్రతిపత్తౌ రంహతిసంపరిష్వక్తః ప్రశ్ననిరూపణాభ్యామ్"ను సూత్రముతోఁ బ్రారంభమై "ఏవంముక్తిఫలానియమ స్తదవస్థావధృతే స్తదవస్థావధృతే" యను సూత్రముతో ముగియుచున్నది. నాలవయధ్యాయ మన్ననో "ఆవృత్తిరసకృదుపదేశాత్"ను సూత్రముతోఁ బ్రారంభమగుచున్నది. మొదటియధ్యాయమున నలువదియధికరణములు. రెండవయధ్యాయమున నలువదియేడధికరణములు. మూఁడవయధ్యాయమున నలువదియేడధికరణములు. నాలవయధ్యాయమున ముప్పదియెనిమిదధికరణములు. మొత్తము నూటతొంబదిరెండధికరణములుగా నియ్యది దెలియవచ్చెడిని.

అందు మొదటియధ్యాయమున నలువదియధికరణములలో మొదటిపాదమునఁ బన్నెండును, రెండవపాదమున నేడును, మూఁడవపాదమునఁ బదుమూఁడును, నాలవపాదమున నెనిమిదియు నధికరణములు దెలియవచ్చెడిని. మొదటిపాదమందలి సూత్రములు ముప్పదియొక్కటి. అందు మొదటినాలుసూత్రములు కేవలము ప్రతిజ్ఞాసూత్రములే యగుటచే నొక్కొక్కసూత్రముచేతనే యొక్కొక్కయధికరణము సిద్ధించుచున్నది. మిగిలిన యిరువదియేడుసూత్రములయందు నేడుసూత్రములుమాత్రమే ప్రతిజ్ఞాసూత్రములు. ఒక్కొక్కచో నొకేప్రతిజ్ఞాసూత్రము తంత్రోచ్చరితమై భిన్నాధికరణముల కాకర మగును. మొదటియధ్యాయమున వేదాంతములసమన్వయము ప్రతిపాదింపఁబడుటచే నద్దానికి సమన్వయాధ్యాయమను నామము గలిగెను. అందు మొదటిపాదమున స్పష్టబ్రహ్మలింగశ్రుతులు, రెండుమూఁడుపాదములం దస్పష్టబ్రహ్మలింగశ్రుతులు, నాలవపాదమునఁ బదమాత్రమును సమన్వయము చేయఁబడుచున్నవి. ఇందు మొదటినాల్గుప్రతిజ్ఞాసూత్రములును సకలవేదాంతతాత్పర్యము నుపదేశించుచు నుత్తరగ్రంథమునకు శిరముగ నలరారుటంజేసి యీనాల్గిసూత్రములును 'చతుస్సూత్రి' యను పవిత్రనామముచే గౌరవింపఁబడుచున్నవి. సకలోపనిషత్తాత్పర్యప్రతిపాదకం బగు నీచతుస్సూత్రియం దగ్రగణ్యము "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యను సూత్రము. రెండవది

“జన్మాద్యస్య యతః” యనునది. మూఁడవది “శాస్త్రయోనిత్వాత్”నునది. నాలవది “తత్తు సమన్వయాత్”నునది. ఈనాల్గుసూత్రములచే వేదవ్యాసమహర్షి సకలోపనిషత్తులందున నకలవేదతాత్పర్యమును నుపదేశించినటుల ననాద్యవిచ్ఛిన్నపారంపర్యముగ వచ్చుచున్న శాంకరసంప్రదాయము గర్జించుచున్నది.

ఇందు మొదటినాలుగుసూత్రములచే జిజ్ఞాసువులయొక్క నిఃశ్రేయసమునకై యుపదేశింపఁబడవలయు తత్త్వము నుపదేశింపఁబడినది. అట్టియర్థమే సకలవేదాంతములచే నుపదేశింపఁబడిన తత్త్వమనియుఁ దద్విరుద్ధార్థము వేదాంతవిరుద్ధమనియు నాలవసూత్రముచేఁ బ్రతిజ్ఞ చేయఁబడుచున్నది. ఎన్నిరీతులఁ బరిశీలించినను మొదటినాలుగుసూత్రములను తైత్తిరీయశ్రుతియందలి భృగువల్లిని బృహదారణ్యకమునందలి మైత్రేయీబ్రాహ్మణమును నాలవాలముగాఁ గల్గి స్మరింపఁబడుచున్నట్లు సువ్యక్తమగుచున్నది. వేదాంతము లన్నియు శాఖాభేదముచేఁ బలువిధముల నలరారుచున్నవి. అవ్వానియందుఁ బైమూఁడుసూత్రములచే స్మరింపఁబడినవిషయముకంటె విరుద్ధము లగు నర్థము లున్నట్లు సాంఖ్యాదులచే నిరూపింపఁబడియుండ సకలవేదాంతములును బైసూత్రత్రయముచే వ్యక్తీకరింపఁబడు నర్థమునే వ్యక్తీకరించుచున్న వని సమన్వయము చేయుట దుర్ఘటమే యను శంక సర్వసామాన్యముగఁ గలుగును. అట్టిశంకను వారించి వేదాంతములయొక్క పరమతాత్పర్యమును బరపక్షనిరసనపూర్వకముగ నప్రతిహతముగ సమన్వయము చేసి జిజ్ఞాసువులఁ గృతార్థులఁ జేయ “ఈక్షతేర్నాశబ్దమ్” అను నైదవసూత్రము మొదలు, “ఏతేన సర్వే వ్యాఖ్యాతా వ్యాఖ్యాతా” యను సూత్రమువఱకును గల గ్రంథము నుపదేశించుచున్నారు. ఇయ్యదియె మొదటియధ్యాయము. ఇందు వేదాంతసమన్వయము విషయ మగుటం జేసి దీనికి ‘సమన్వయాధ్యాయ’ మన నామము సార్థక మగుచున్న దని పూర్వమునఁ జెప్పఁబడియె.

ఇందు మొదటిపాదము “ఈక్షతేర్నాశబ్దమ్”ను సూత్రము మొదల “జీవముఖ్యప్రాణలింగాన్నేతి చేన్నోపాసాత్రైవిధ్యాదాశ్రితత్వాదిహతద్యోగాత్”న సూత్రమువఱకుఁ గల యిరువదియేడుసూత్రములతో నొప్పుచున్నది. ఈయిరువదియేడుసూత్రములును బ్రతిజ్ఞాసూత్రములు, గుణసూత్రము లను ద్వైవిధ్యమున బొందుచున్నవి. ఇందు “ఈక్షతేర్నాశబ్దమ్” “ఆనందమయోఽభ్యాసాత్” “అంతస్తద్ధర్మోపదేశాత్” “ఆకాశస్తల్లింగాత్” “అత ఏవ ప్రాణః” “జ్యోతిశ్చరణాభిధానాత్” “ప్రాణస్తథానుగమాత్”ను నేడుసూత్రములును బ్రతిజ్ఞాసూత్రములు మిగిలిన యిరువదిసూత్రములు నంగసూత్రములు. ప్రతిజ్ఞాసూత్రములసంఖ్య ననసరించి యధికరణసంఖ్య పరఁగుచుండును గావున నీయిరువదియేడు సూత్రముల నేడధికరణములుగా విభజింపఁబడుచున్నవి. ఈ యేడధికరణములచే వేదాంతములఁ

## ఈక్షత్యధికరణమ్

ఏవం తావద్వేదాన్తవాక్యానాం బ్రహ్మాత్మావగతిప్రయోజనానాం బ్రహ్మాత్మని తాత్పర్యేణ సమన్వితానామన్తరేణాపి కార్యానుప్రవేశం బ్రహ్మణి పర్యవసానముక్తమ్। బ్రహ్మ చ సర్వజ్ఞం సర్వశక్తి జగదుత్పత్తిస్థితినాశకారణమిత్యుక్తమ్

---

బోధించియే యుండును కాన నో మహానుభావా! నీవే నా యాదేశము ననుగ్రహింపు మని సవినయముగఁ దండ్రిని బ్రార్థించెను. అపుడు దండ్రి పుత్రుని యోగ్యతకు సంతసించి "సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయమ్" అను వాక్యము మొదలుగాఁ గల గ్రంథముఁ జెప్పుటకు నుపక్రమించెను. ఈ గ్రంథము "తద్ధాస్య విజజ్ఞావితి విజజ్ఞావితి" యను వాక్యముతో ముగియుచున్నది. ఇయ్యది పదునైదు ఖండములుగ నలరారుచున్నది. ఉపోద్ఘాత మొక ఖండము. మొత్తము ఛాందోగ్యము షష్ఠప్రపాఠక మంతయుఁ బదునారు ఖండములు. ఈ పదునారు ఖండములతో నొప్పు 'శ్వేతకేతూద్దాలకసంవాద' మను ప్రకరణము ప్రకృతపు టీక్షత్యధికరణమునకు విషయము. ఇందు గమనింపవలయు విషయము. ఈ ప్రకరణమునందలి "సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయమ్" అను వాక్యమునందుఁ గల 'సత్' శబ్దముచేఁ దెలియవచ్చెడి జగత్కారణము పూర్వోక్తమగు బ్రహ్మమా లేక వేఱొకవస్తువా యని. ఇచటఁ గాపిలులగు సాంఖ్యులీసచ్ఛబ్దముచే దమతంత్రమునఁ బ్రదర్శింపఁబడిన జగత్కారణమగు ప్రధానము వర్ణింపఁబడుచున్నదని పలుక, నయ్యది యెంతమాత్రము సమంజసము గాదనియుఁ బూర్వోక్తమగు బ్రహ్మమే సచ్ఛబ్దముచే నుపదేశింపఁబడుచున్నదనియు సహేతుకముగ నిరూపింప వేదవ్యాసభగవానులీయేడుసూత్రములతో నొప్పు నధికరణమును బ్రదర్శించుచున్నారు. కావున భాష్యకారులీయధికరణవ్యాఖ్యానమున కుపోద్ఘాతముగను వృత్తానుకథన పూర్వకముగను సాంఖ్యవాదమును "ఏవం తావద్వేదాంతవాక్యానాం ... బ్రహ్మణ ఇతి" యను భాష్యముచే బ్రదర్శింపు చున్నారు.

వృత్తానుకథనమందు "ఏవం తావత్ ... పర్యవసానముక్తమ్" అను భాష్యముచే నాల్గవది యగు సమన్వయసూత్రతాత్పర్యము సంగ్రహముగఁ బ్రదర్శింపఁబడుచున్నది. అనఁగాఁ గ్రియతో నెంతమాత్రము సంబంధములేని బ్రహ్మాత్మావగతియే పరమపురుషార్థసాధనమని సకలవేదాంతములకుఁ బరమతాత్పర్యమని యభిప్రాయము. వేదాంతములచే నుపదేశింపఁబడు బ్రహ్మముయొక్క స్వరూపము "బ్రహ్మ ... కారణమిత్యుక్తమ్" అను భాష్యముచే జెప్పఁబడు చున్నది. ఇట్లు వేదాంతములయొక్క పరమతాత్పర్యము నాల్గుసూత్రములచే సంగ్రహముగను ససందేహముగను నుపదేశింపఁబడినను నద్దానిని సహింపని

సాంఖ్యాదయస్తు పరినిష్ఠితం వస్తు ప్రమాణాన్తరగమ్యమేవేతి మన్యమానాః ప్రధానాదీని కారణాన్తరాణ్యనుమిమానాస్తత్పరతయైవ వేదాంతవాక్యాని యోజయన్తి సర్వేష్వేవ వేదాంతవాక్యేషు సృష్టివిషయేష్వనుమానేనైవ కార్యేణ కార్ణం విలక్షయిషితమ్ । ప్రధానపురుషసంయోగా నిత్యానుమేయా ఇతి సాంఖ్యా మన్యన్తే కాణాదాస్త్వేతేభ్య ఏవ వాక్యేభ్య ఈశ్వరం నిమిత్తకారణమనుమిమతే, అణూంశ్చ సమవాయికారణమ్ । ఏవమన్యైరపి తార్కికా వాక్యాభాసయుక్త్యాభాసావష్టంభాః

---

సాంఖ్యాదితంత్రముల నాశ్రయించినవారు సిద్ధవస్తువగు జగత్కారణము శబ్దేతరములగు ననుమానాదిప్రమాణములచేఁ దెలియఁబడు నని నిర్వచించుచు స్వశేముష్యనుసారముగఁ బ్రధానాదికారణముల ననుమేయుంచుచుఁ దమతమమనోరథముల కభీష్టము లగు ప్రధానాదులనే జగత్కారణములుగ శాస్త్రము బోధించుచున్న దనియు నిర్వచించుటయే కాక స్పష్టిపరము లగు వేదాంతవాక్యము లన్నియుఁ గార్యలింగకానుమానప్రమాణముచె జగత్కారణమునే ప్రదర్శించుచున్నవి, కావున ననుమానముచె సిద్ధ మగు జగత్కారణపరముగనే వేదాంతములసమన్వయము చేయఁబడవలయుననియుఁ బ్రతిపాదించుచున్నా రని "సాంఖ్యాదయస్తు...విలక్షయిషితమ్" అను భాష్యముచేఁ జెప్పి పరమతములవలనఁ గలిగెడి ప్రతిబంధమును వారించుటకై యుత్తరగ్రంధసందర్భము చెప్పఁబడుచున్నదని యభిప్రాయము. ప్రమాణాంతరగమ్యం = వేదాంతములకంటె భిన్న మగు ననుమానాదిప్రమాణములచే గమ్య మగు అనుమానేనైవ = అనుమానప్రమాణముచేతనే, కార్యేణ = జగద్రూపకార్య మగు, లింగముచేతను, కారణం = జగత్కారణమును, స్వాభిప్రాయమునకుఁ బ్రతిపక్షులు పెక్కు రున్నను నందుఁ బ్రధానమల్లనిబర్హణన్యాయమున సాంఖ్యులను గాణాదులను బేర్కొని వారలచే నుద్దేశింపఁబడు జగత్కారణనిర్ణయమును దృష్టాన్తసిద్ధికై "ప్రధానపురుషసంయోగా నిత్యానుమేయాః .. ఇహాతిష్ఠన్తే" యని చెప్పుచున్నారు. సత్త్వరజస్తమోగుణములయొక్క సామ్యావస్థారూపమును, జడమును, బరిణామియు స్వతంత్రము నగు ప్రధానము జగత్కారణ మనియు; నసంగచిద్రూపులును సర్వవ్యాపులునునగు పురుషులు పెక్కుమంది యనియు, నట్టిపురుషప్రధానములకు నన్యోన్యోపకార్యోపకారకభావరూపమగు సంబంధములు నిత్యము లనియు నవ్వానిచే లోకమున భోగాపవర్గవ్యవహారము ఘటించుచున్న దనియు సాంఖ్యులపరమరాద్ధాన్తము.

కాణాదులును నైయాయికులు నన్ననో పృథివ్యప్తేజోవాయురూపము లగు నాల్గువిధముల పరమాణువులును జగత్తునకుపాదానకారణ మనియు నీశ్వరుఁడు నిమిత్తకారణ మనియు ననుమానప్రమాణముచే నూహించుచున్నారు. ఇట్లో పలువురు జైనబౌద్ధచార్వాకాదులు గూడ నెద్దియో యొక్కతీరునఁ గుయుక్తులను

పూర్వపక్షవాదిన ఇహోత్తిష్ఠన్తే । తత్ర పదవాక్యప్రమాణజ్ఞేనాచార్యేణ వేదాంత వాక్యానాం బ్రహ్మావగతిపరత్వదర్శనాయ వాక్యాభాసయుక్త్యాభాసవిప్రతిపత్తయః పూర్వపక్షీకృత్య నిరాక్రియన్తే । తత్ర సాంఖ్యాః ప్రధానం త్రిగుణ మచేతనం జగతః కారణమితి మన్యమానా ఆహుః యాని

---

నాభాసవాక్యములను బ్రదర్శించుచు నెద్దియో యొక జగత్కారణమును బ్రదర్శించుచుఁ బరమపవిత్ర మగు వేదాంతార్థము నపహసించుచున్నా రని తాత్పర్యము. ఇట్టి కువాదములు బరఁగుచుండ నట్టివాదములవలన జిజ్ఞాసువులకు వేదాంతార్థ నిశ్చయమున సంశయవిపర్యయాసంభావనారూపదోషములు గలుగకుండ శ్రీకృష్ణ ద్వైపాయన వేదవ్యాసభగవానులచేఁ దన్మతనిరసనముతోఁ గూడ వేదాంతముల యొక్క తాత్పర్య ముత్తరగ్రంథముచే ననఁగా "ఈక్షతే ర్నాశబ్ద మ్మ"ను సూత్రము మొదలు "ఏతేన సర్వే వ్యాఖ్యాతా వ్యాఖ్యాతా" యను సూత్రమంతమందుఁ గల సమన్వయాధ్యాయముచేఁ బ్రదర్శింపఁ బడుచున్నదని "తత్ర...నిరాక్రియంతే" యను భాష్యముచే జెప్పఁబడుచున్నది. తత్ర = భిన్నప్రస్థానము లిట్లు బయలు వెడలుచుండ, పదవాక్యప్రమాణజ్ఞేన = పద మన వ్యాకరణము, వాక్య మన మీమాంసాన్యాయములును, వేదార్థనిర్ణయమునందుఁ బరమప్రమాణము లగు నీరెండును బుష్కలముగాఁ దెలిసికొనినట్టి, ఆచార్యేణ = శ్రీకృష్ణద్వైపాయన వేద వ్యాసభగవానులచే.

ఇట్లుత్తర గ్రంథసందర్భమును సంక్షేపముగ నిర్వచించి ప్రకృతమున నీక్షత్యధికరణమునచేఁ బ్రధానమల్లనిబర్హణన్యాయముచే మున్ముందు నిరాకరింపఁ బడుచున్నది సాంఖ్యమతస్వరూపము. సాంఖ్యులచే వేదాంతములయందుఁ గల్పింప బడు నపార్థము ప్రకృతోపయోగముగ "తత్ర సాంఖ్యాః...బ్రహ్మణ ఇతి" యను భాష్యముచే సాంఖ్యమత ముపదేశింపఁబడుచున్నది. అందు సాంఖ్యాభినివేశము "తత్ర సాంఖ్యాయోజయితుం శక్యన్తే" యను గ్రంథముచే నిరూపింపఁ బడు చున్నది. సాంఖ్యులు దమచేఁ ద్రిగుణము, నచేతనము నగు ప్రధానము జగ త్కారణమని సర్వవిధముల నిర్వచింపఁబడి యయ్యది సర్వజ్ఞ మనియు సర్వశక్తి యని తమచే నిర్వచింపఁబడకపోయినను వేదాంతములందుఁ జెప్పఁబడిన జగత్కార ణము సర్వజ్ఞము, సర్వశక్తియునని నిర్వచింపఁ దమప్రధానమునందుఁ గూడ సర్వ జ్ఞత్వసర్వశక్తిత్వములు గూడ నున్నవని నిరూపించుటకుఁ దగు నవకాశ మున్న దని విజృంభించుచుఁ బ్రధానమందు "సర్వశక్తిత్వం... ఉపపద్యతే" యని సర్వ శక్తిత్వమును బ్రతిపాదించుచున్నారు. ఎట్లన-ప్రధానము, మహత్తత్త్వము, అహం కారము, ఏకాదశేంద్రియములు, పంచతన్మాత్రలు, పంచమహాభూతములు నను పదు నాఱువికారములుగాఁ బరిణమించుచున్నది కావున నిట్టివికారములుగఁ బరిణమించు

వేదాన్తవాక్యాని సర్వజ్ఞస్య సర్వశక్తేర్బ్రహ్మణో జగత్కారణత్వం దర్శయన్తీత్య వోచస్తాని ప్రధానకారణపక్షేపి యోజయితుం శక్యన్తే। సర్వశక్తిత్వం తావత్ప్రధానస్యాపి స్వవికారవిషయ ముపపద్యతే। ఏవం సర్వజ్ఞత్వమప్యుపపద్యతే। కథమ్ యత్తు జ్ఞానం మన్యసే స సత్త్వధర్మః॥ సత్త్వాత్సంజాయతే జ్ఞానమ్॥

టకుఁ దగు శక్తిగల దగుటచే నియ్యది తనయొక్క వికారములకు విషయమగు సర్వశక్తియగుచున్నదను నభిప్రాయముతోఁ బరఁగుచున్నది. అనఁగాఁ బ్రధానమే సర్వశక్తి గాకపోయినచో నిన్నివికారములుగఁ బరిణమించుటకుఁ దగు యోగ్యతను గలిగియుండదు. కావున నియ్యది సర్వశక్తియని యభిప్రాయము. సర్వశక్తిత్వముతోఁ పాటు సర్వజ్ఞత్వముగూడఁ బొందికచేయఁబడ నగు నని "ఏవం సర్వజ్ఞత్వమప్యుపపద్యతే" యని పలుక నయ్యది యెట్లు పొసఁగు నని 'కథంమ్మ'ని మధ్యస్థుఁ డడుగ నుత్తరంగ్రథంముచే సర్వజ్ఞత్వము .పొందికచేయఁబడుచున్నది. ఎట్లన — త్రిగుణాత్మక మగు ప్రధానమున సత్త్వ మను గుణ మున్నదిగదా ! సర్వజ్ఞ మనుటలో నభిప్రేత మగు జ్ఞానము సత్త్వధర్మ మని "యత్తు జ్ఞానం ... స్మృతే" యని చెప్పఁబడుచున్నది. ఇంతియ కాదు; సత్త్వధర్మమగు జ్ఞానమును గలిగియుండుట చేతనే దేహేంద్రియసంఘాతముతోఁ గూడిన పురుషు లగు యోగులు సర్వజ్ఞు లని లోకమునఁ బ్రసిద్ధిని బడయుచున్నారు. కావున సర్వజ్ఞత్వమునకు సత్త్వము మూలము; అనఁగా సత్త్వము గలిగియుండుటచేతనే సర్వజ్ఞు లనువ్యవహారమును గనుచున్నా రను నాశయముతో " తేన చ ... ప్రసిద్ధమ్మ"ను భాష్యము బరఁగుచున్నది. కావునఁ బ్రధానమందు సత్త్వము నిరతిశయముగ నుండుటచేఁ బ్రధానము సర్వజ్ఞ మని సుస్పష్టముగ గ్రహింపవచ్చు నని భావము. ప్రధానము సర్వజ్ఞ మనుటకుఁ దగు యుక్తులను బ్రదర్శించి కేవలము చిన్మాత్ర మగు బ్రహ్మము సర్వజ్ఞ మని చెప్పుటకు శక్య మెంతమాత్రము గాదని " న కేవలస్య ... కల్పయితుం శక్యమ్మ"ని చెప్పఁబడుచున్నది. అనఁగాఁ బురుషుఁడు దేహేంద్రియ సంఘాతశూన్యుఁడై యుపలబ్ధిమాత్ర మగుటచే నాతనియందు సత్త్వగుణముండుట కవకాశము లేకపోవుటవలనఁ దత్కార్య మగు జ్ఞాన ముండు ననుటకు వీలులేదు. జ్ఞానమే యుండుటకు వీలులేనపుడు సర్వజ్ఞత్వము గాని కించిజ్జ్ఞత్వము గాని కల్పించుటకు వీలులేదని భావము. ఇచట అకార్యకరణస్య యను విశేషణము సాభిప్రాయ మగుచున్నది. ఎట్లన–దేహేంద్రియములతోఁ గూడిన పురుషులకే సత్త్వధర్మ మగు జ్ఞానముచే సర్వజ్ఞత్వముగలుగుచున్నదని ప్రసిద్ధిలోకమునఁగలదు. దానంజేసి దేహేంద్రియసంఘాతము లేనివానికి సత్త్వముగాని తద్ధర్మమగు జ్ఞానముగాని యుండునని తలఁచుట యసమంజస మని యభిప్రాయము. ప్రధాన మన్ననో త్రిగుణాత్మకము గావునఁ బ్రధానావస్థయందుఁ గూడ సర్వజ్ఞానకారణభూత మగు సత్త్వ ముండు

(గీ. 14. 17) ఇతి స్మృతేః । తేన చ సత్త్వధర్మేణ జ్ఞానేన కార్యకరణవంతః పురుషాః సర్వజ్ఞా యోగినః ప్రసిద్ధాః । సత్త్వస్య హి నిరతిశయోత్కర్షే సర్వజ్ఞత్వం ప్రసిద్ధమ్ । న కేవలస్యాకార్యకరణస్య పురుషస్యోపలబ్ధిమాత్రస్య సర్వజ్ఞత్వం కించిజ్జ్ఞత్వం వా కల్పయితుం శక్యమ్ । త్రిగుణత్వాత్తు ప్రధానస్య సర్వజ్ఞానకారణభూతం సత్త్వం ప్రధానావస్థాయామపి విద్యత ఇతి ప్రధానస్యాచేతనస్యైవ సతః సర్వజ్ఞత్వముపచర్యతే । వేదాన్తవాక్యేష్వవశ్యం చ త్వయాపి సర్వజ్ఞం బ్రహ్మాభ్యుపగచ్ఛతా సర్వజ్ఞానశక్తిమత్త్వేనైవ సర్వజ్ఞత్వమభ్యుపగన్తవ్యమ్।

-టుచే గౌణముగ నీప్రధానము సర్వజ్ఞ మనఁబడుచున్న దని "త్రిగుణత్వాత్తు ... ఉపచర్యతే" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. ఇందుఁ బ్రధానమునకు 'సత' యను విశేషణము వాడఁబడుచున్నది. ఈవిశేషణము ఛాందోగ్యమునందలి షష్ఠప్రపాఠకమున వినఁబడెడి సత్తను జగత్కారణము స్వాభిమతమగు ప్రధానమే యని వ్యక్తీకరించు నాశయమునఁ బ్రయోగింపఁబడియున్నది.

ఇట్లు స్వాభిమతమును నచేతనము నగు ప్రధానమునకు గౌణసర్వజ్ఞత్వమును బ్రతిపాదించి వేదాంతములవలనఁ దెలియవచ్చెడి బ్రహ్మముయొక్క సర్వజ్ఞత్వము గూడఁ బ్రధానమునకు వలెనే యౌపచారికముగ గ్రహింపఁబడవలయును గాని వేఱొకవిధమున నిరూపించుట యశక్య మని "వేదాంతవాక్యేషు ... అభ్యుపగన్తవ్యమ్మ"ను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. అనఁగా బ్రహ్మము సర్వజ్ఞ మని చెప్పుటకు బ్రహ్మమునందుఁ గూడ సర్వజ్ఞానశక్తి యొకటి యుండుటచేతనే సర్వజ్ఞత్వము బ్రహ్మమున కంగీకరింపవలయును. కాని సర్వజ్ఞత్వ మనునది నిత్యమగు బ్రహ్మస్వభావము గాదని యాశయము. సర్వజ్ఞత్వస్వభావము నిత్యమే యగు ననినచోఁ గల్గు దోషము "నహి సర్వవిషయం ... సర్వజ్ఞత్వమాపతేత్" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. సర్వజ్ఞ మన సర్వవిషయ మగు జ్ఞానము నెల్లపుడును గలిగియుండుటగదా ! అట్లు సర్వవిషయముల నెల్లపుడు బ్రహ్మము గనిపెట్టుచున్నదని చెప్పుటకు వీలులేదు. ఏలయన—నట్లు కనిపెట్టుటయే నిత్యమగుచో జ్ఞానక్రియనుగూర్చి బ్రహ్మమునకు స్వాతంత్ర్యము లేకపోవలయును. లేదా యొకానొకవేళ సర్వవిషయకజ్ఞాన మనిత్యమగుచో జ్ఞానక్రియ యగు తెలివినుండి బ్రహ్మ ముపరమముఁ జెందవలయును. ఒకప్పుడు క్రియను బ్రసరింపఁజేయుటయు నొకప్పుడు క్రియనుండి యుపరమముఁ జెందుటయుఁ గల్గు నన్నచో నట్టి వ్యవహారమునకుఁ దగు శక్తివిశేష మొకటి బ్రహ్మమునం దున్న దని యంగీకరించితీరవలయును.

కావున బ్రహ్మమునందు సర్వజ్ఞానమున కనుకూల మగు శక్తి యుండుట-వలన సర్వజ్ఞము బ్రహ్మ మని చెప్పవలయును గాని స్వభావముచే బ్రహ్మము

న హి సర్వవిషయం జ్ఞానం కుర్వదేవ బ్రహ్మ వర్తతే। తథాహి జ్ఞానస్య నిత్యత్వే జ్ఞానక్రియాం ప్రతి స్వాతంత్ర్యం బ్రహ్మణో హీయేత। అథానిత్యం తదితి జ్ఞానక్రియాయా ఉపరమేతాపి బ్రహ్మ, తదా సర్వజ్ఞానశక్తిమత్త్వేనైవ సర్వజ్ఞత్వమాపతతి, అపి చ ప్రాగుత్పత్తేః సర్వకారకశూన్యం బ్రహ్మేష్యతే త్వయా। న చ జ్ఞానసాధనానాం శరీరేంద్రియాదీనామభావే జ్ఞానోత్పత్తిః కస్యచిదుపపన్నా, అపి చ ప్రధానస్యానేకాత్మకస్య పరిణామసంభవాత్కారణత్వోపపత్తిర్మృదాదివత్, నాసంహతస్యైకాత్మకస్య బ్రహ్మణ ఇత్యేవం ప్రాప్త ఇదం సూత్ర మారభ్యతే.

---

సర్వజ్ఞ మని చెప్పుటకు వీలులేదు. కనుక బ్రహ్మ మనఁ బ్రధానముకంటె వేఱెంత మాత్రము గాదని యాశయము. ఇంతియ కాదు, సృష్టికిఁ బూర్వము తెలియ వచ్చెడి బ్రహ్మస్వభావముచేఁ గూడ బ్రహ్మము జ్ఞానశక్తితోఁ గూడికొని యున్న దనియే చెప్పవలయుఁ గాని సర్వజ్ఞ మని చెప్పుట కెంతమాత్ర మవకాశము లేదని "అపి చ ... కస్యచిదుపపన్నా" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. అనఁగా సృష్టికిఁ బూర్వము బ్రహ్మ సర్వకారకశూన్యమని యంగీకరింపఁబడుచున్నదిగదా! కారకశూన్య మనఁ గర్మనిర్వహణమునకుఁ దగు సాధనసామగ్రిని గోలుపోవుట. అట్టి కారకశూన్యమగు బ్రహ్మమునకు జ్ఞానసాధనము లగు శరీరేంద్రియాదులు లేకపోవుటచే జ్ఞానము పుట్టు ననుట యుక్త మెంతమాత్రము గాదు. కావున జ్ఞానము బ్రహ్మమునందుండుట కవకాశము లేదు. కాఁగా బ్రహ్మము సర్వజ్ఞ మనుటకు వీలులేదు. అట్టి బ్రహ్మము చింతించి యీజగద్రూపముగఁ బరిణమించె ననుటకును వీలులేదు. కావున బ్రహ్మము జగత్కారణ మనుటకు వీలులేదు. ప్రధాన మన్ననో త్రిగుణాత్మక మయి సావయవ మగుటంజేసి పరిణామము నొందుటకుఁ దగుయోగ్యత గలిగియున్నది. కావున మృదాదులవలెఁ గారణ భావము నొందుటకుఁ దగియున్న దని చెప్ప నొప్పు; కాని యసంహత మనఁగా నిరవయవము నేకాత్మకము నగు బ్రహ్మమునకుఁ బరిణామము సంభవింపదు. అందుచే నది జగత్కారణ మగుటకు వీలులేదు. కాఁగా నీ ఛాందోగ్యషష్ఠప్రపాఠకమున వినఁబడెడిసచ్ఛబ్దము ప్రధానమే గాని బ్రహ్మ మెంతమాత్రము గాదని "అపి చ ప్రధానస్య...బ్రహ్మణ ఇతి" యను గ్రంథముచే సాంఖ్యాభిప్రాయము చెప్పఁబడుచున్నది. ఏవం ప్రాప్తే = ఈరీతిగాఁగలుగ నందులకు సమాధానముగ సూత్రకారులచే నీదిగువ జెప్పఁబడిన "ఈక్షతేర్నాశబ్దం" మ్మను సూత్ర మారంభింపఁబడుచున్నదని "ఇదం సూత్రమారభ్యతే" యని సూత్రకారులయొక్క సూత్రారంభమునందలి యాశయము వర్ణింపఁబడుచున్నది.

# ఈక్షతేర్నాశబ్దమ్

న సాంఖ్యపరికల్పిత మచేతనం ప్రధానం జగతః కారణం శక్యం వేదాన్తేష్వాశ్రయితుమ్ । అశబ్దం హి తత్ । కథ మశబ్దత్వమ్ ఈక్షతేః—ఈక్షితృత్వశ్రవణాత్కారణస్య । కథమ్ । ఏవం హి శ్రూయతే—“సదేవ సోమ్యేద మగ్ర ఆసీదేక మేవాద్వితీయమ్” (ఛాం. 6. 2. 1) ఇత్యుపక్రమ్య “తదైక్షత బహు

---

## “ఈక్షతేర్నాశబ్దమ్”

సూత్రమందలి నఞ్ పదముచే నభిప్రేత మగు నర్థము “న... వేదాంతేష్వాశ్రయితుమ్మ”ని వ్యక్తీకరింపఁబడుచున్నది. అనఁగా సాంఖ్యులచే జగత్తునకుఁ గారణ మని కల్పింపఁబడిన జడ మగు ప్రధానము వేదాంతములయందుఁ దెలియవచ్చుచున్నదని యెంతమాత్రము చెప్పుటకు శక్యముగాదు. ఏలయన—నీప్రధానము శబ్ద మగు వేదముచే నెంతమాత్రము ప్రతిపాదింపఁబడ లేదని సూత్రమందలి అశబ్దమ్మను పదముచేఁ బ్రతిపాదింపఁబడుచున్నదని “అశబ్దం హి తత్త”ని చెప్పఁబడుచున్నది. ఇచటఁ ‘తత్త’నఁగా సాంఖ్యపరికల్పిత మగు జడ మగు ప్రధానము. ప్రధాన మశబ్ద మన నాక్రోశముతో సాంఖ్యుఁడు ప్రధానము శబ్దముచే నెందుచేఁ జెప్పఁబడలే దని “కథం అశబ్దత్వమ్మ”ని ప్రశ్నింపఁ బ్రధానము శబ్దముచే నుపదేశింపఁబడలే దనుటకు హేతువు “ఈక్షతే” యను సూత్రమందలి పదముచేఁ జెప్పఁబడుచున్న దని “ఈక్షతే” యని చెప్పఁబడుచున్నది. “ఈక్షతే” యను హేతుపదమునకు “ఈక్షితృత్వశ్రవణాత్కారణస్య” యను నర్థము భాష్యకారులచే సంగ్రహముగాఁ జెప్పఁబడుచున్నది. అనఁగా జగత్కారణమునకు నీక్షితృత్వము వినఁబడుటవలన నని యర్థము. ఈక్షితృత్వ మనఁగాఁ గామనాపూర్వక మగు సంకల్పము. వేదాంతములయందు జగత్కారణమున కీక్షితృత్వము వినవచ్చుచున్న దన నయ్యది యెట్లని ‘కథమ్మ’ని సాంఖ్యుఁ డడుగ సమాధానము “ఏవం హి శ్రూయతే”—“ఉదాహర్తవ్యాని” యని చెప్పఁ బడుచున్నది. అందుఁ బ్రథమమున వివాదాధ్యాసిత మగు ఛాందోగ్యషష్ఠప్రపాఠకశ్రుతి “సదేవ... అసృజత ఇతి” యని యుదాహరింపఁబడుచున్నది.

సోమ్య = ప్రియదర్శనా, ఇదం = నామరూపములచే వికారము నొందు నీజగత్తు, అగ్రే = ఉత్పత్తికిఁ బూర్వము, ఏకం = స్వగతభేదరహితమును ఏవ = సజాతీయభేదరహితమును, అద్వితీయం=విజాతీయభేదరహితమును, అగు, సత్, ఏవ = సత్పదార్థమే యయి, ఆసీత్ = ఉండెను.

స్యాం ప్రజాయేయేతి తత్తేజోఽసృజత" (ఛాం. 6. 2. 3) ఇతి । తత్రేదం శబ్ద వాచ్యం నామరూపవ్యాకృతం జగత్ ప్రాగుత్పత్తేః సదాత్మనాఽవధార్య తస్యైవ ప్రకృతస్య సచ్ఛబ్దవాచ్యస్యేక్షణపూర్వకం తేజఃప్రభృతేః స్రష్టృత్వం దర్శయతి తథాఽన్యత్ర—"ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్ । నాన్యత్కించన మిషత్। స ఈక్షత లోకాన్ను సృజా ఇతి। స ఇమాఁల్లోకానసృజత।" (ఐత. 1-1-1) ఇతీక్షాపూర్వికామేవ సృష్టిమాచష్టే। క్వచిచ్చ షోడశకలం పురుషం ప్రస్తుత్యాహ– "స ఈక్షాంచక్రే। స ప్రాణమసృజత। "(ప్రశ్న. 6-3) ఇతి । ఈక్షతేరితి చ

తత్ = ఆసత్పదార్థము, బహు = అనేకముగా, స్యాం = అయ్యెదను, ప్రజాయేయ = అందులకుఁ దగునట్లు జనింతును. ఇతి = ఈరీతిగా, ఐక్షత = సంకల్పించెను. తత్ = ఆ సత్పదార్థము, తేజః = తేజస్సును, అసృజత = సృజించెను.

ఇట్లు శ్రుతిని ప్రదర్శించి శ్రుతియందలి ప్రధానములగు పదములకు "తత్రేదం ... దర్శయతి" యని ప్రకృతోపయుక్త మగు నర్థము ప్రదర్శింపఁ బడుచున్నది.

ఇట్లు ఛాందోగ్యశ్రుతియందు జగత్కారణము నకీక్షితృత్వమును బ్రద ర్శించి శ్రుత్యంతరములందుఁ గూడ జగత్కారణమున కీక్షితృత్వ మప్రతిహతముగ వినవచ్చుచున్న దని స్థాలీపులాకన్యాయమునఁ గొన్నిశ్రుతులు "తథాఽన్యత్ర" యను భాష్యముచేఁ బ్రదర్శింపఁబడుచున్నవి.

ఇదం=ఈ నామరూపవ్యాకృత మగు జగత్తు, అగ్రే=సృష్టికిఁబూర్వమున, ఏకః=స్వగతభేదరహితము, ఏవ= సజాతీయభేదరహితమును, వై=విజాతీయ భేద రహితమును అగు ఆత్మా=ఆత్మగనే, ఆసీత్ =ఉండెను. అన్యత్=తద్భిన్న మగు, మిషత్=చలించునది, కించన=ఏదియును, న=లేదు. సః = ఆ యాత్మ, లోకాన్= లోకములను, ఉత్సృజై = సృజించెదను, అని, ఈక్షత = సంకల్పించెను. సః= ఆ యాత్మ, ఇమాన్=ఈ, లోకాన్ = లోకములను, అసృజత = సృజించెను.

షోడశకలం, పురుషం = బ్రహ్మమును, ప్రస్తుత్య = ప్రస్తుతించి, ఇచట షోడశకళ లన— ప్రాణము, శ్రద్ధ, ఆకాశము. వాయువు, అగ్ని, ఉదకములు, పృథివి, ఇంద్రియము, మనస్సు, అన్నము, వీర్యము, తపస్సు మంత్రములు, కర్మ, లోకములు, నామ మను పదునాఱును.

సూత్రమున 'ఈక్షతే' యని ప్రయోగింపబడి యున్నది. 'ఈక్షతే' యనునది 'ఇక్ శ్తిపౌ ధాతునిర్దేశే' యను పాణిన్యనుశాసనమువలన ధాతు మాత్రనిర్దేశమునందే శ్తిప్పుతోఁ బ్రయోగము లోకమునఁ గన్పట్టుచున్నది. కాని యిచటమాత్ర మటు 'ఈక్షతే' యను శ్తిప్పుతో నిర్దేశము కేవలధాతు

ధాత్వర్థనిర్దేశోఽభిప్రేతః యజతేరితివత్। న ధాతునిర్దేశః। తేన "యస్సర్వజ్ఞస్సర్వవిద్యస్య జ్ఞానమయం తపః తస్మాదేతద్బ్రహ్మ నామరూపమన్నం చ జాయతే" (ముండ. 1–1–9) ఇత్యేవమాదీన్యపి సర్వజ్ఞేశ్వరకారణపరాణి వాక్యాన్యుదా

---

స్వరూపమేయనునర్థ మభిప్రేతముగాఁ గల్గియుండక ధాత్వర్థమునే గ్రహించుచున్నట్లు గ్రహింపవలయు నని "ఈక్షతేరితి ధాత్వర్థనిర్దేశోఽభిప్రేత" యని చెప్పఁబడుచున్నది. అనఁగా నిచట 'ఈక్షతే' యను పదముచే నీక్షధాత్వర్థ మగు నీక్షణరూప మగు క్రియ గ్రహింపఁబడవలయు నని యర్థము. అందు దృష్టాన్తము "యజతేరితివత్త" ని చెప్పఁబడుచున్నది. అనఁగాఁ బూర్వ మిమాంస యందు "యజతి" యని నిర్దేశింపఁబడినపుడు కేవల ధాతుస్వరూపమును గ్రహింపక యజధాత్వర్థ మగు యాగరూపక్రియ నెట్లు గ్రహించుచున్నారో యట్లే ప్రకృతమునఁ గూడ నీక్షధాత్వర్థ మగు నీక్షణమును గ్రహింపవలయు నని భావము. వ్యాకరణమునందువలె ధాతునిర్దేశము గాదని "నధాతునిర్దేశ" యని చెప్పఁబడుచున్నది. ఇచట పూర్వ మీమాంసాన్యాయానుసారముగఁ బాణిన్యనుశాసన ముపేక్షింపఁబడినది.

ఇట్లు జగత్కారణమున కీక్షితృత్వ మున్నట్లు నిరూపించుటచే జగత్కారణము సర్వజ్ఞమును సర్వశక్తియు నగు బ్రహ్మమే కాని సాంఖ్యకల్పిత మగు ప్రధాన మెంతమాత్రము గాదని నిర్వచించి యిట్టియభిప్రాయమును వ్యక్తీకరించుటకు శ్రుత్యంతరములు గూడఁ దోడ్పడుచున్న వని ప్రదర్శింప ముండకోపనిషద్వాక్యము దృష్టాంతముగ "తేన...ఉదాహర్తవ్యాని" యని చెప్పఁబడుచున్నది. తేన = పైఁ బ్రదర్శింపఁబడిన శ్రుతులయొక్క ప్రమాణబలముచే, సర్వజ్ఞః = సామాన్యముగా సర్వమును దెలిసికొన్నవాఁడు, సర్వవిత్ = విశేషముగా సర్వమును దెలిసినవాఁడు, జ్ఞానమయం తపః = జ్ఞానస్వరూప మగు తపస్సు అనఁగా నాయాసరూప మగునది గాదని భావము. తస్మాత్ = ఆసర్వజ్ఞుఁ డగు నీశ్వరుని వలన, ఏతత్ = ఈపుట్టుచుండెడి, బ్రహ్మ = హిరణ్యగర్భుఁ డను సూత్రాత్మ, సమూహసూక్ష్మశరీరాభిమాని, నామ = వేదము, రూపం = జగత్తు, అన్నం = వ్రీహ్యాదులు, సర్వజ్ఞేశ్వరకారణపరాణి = సర్వజ్ఞుఁ డగు నీశ్వరుఁడే జగత్కారణ మని ప్రతిపాదించునట్టి.

ఇట్లు పలువిధము లగు శ్రుతులచే జగత్కారణమునకు నీక్షణము వినవచ్చుచున్నది. జడ మగు ప్రధానమున కన్ననో యీక్షణము సంభవింపక పోవుటచే నయ్యది శ్రుతిప్రతిపాద్య మెంతమాత్రముగాదు కావున నశబ్ద మని నిరూపించి సాంఖ్యమతనిరాకరణ ముత్తరగ్రంథముచేఁ జేయఁబడుచున్నది. అందు

హర్తవ్యాని। యత్తూక్తం సత్త్వధర్మేణ జ్ఞానేన సర్వజ్ఞం ప్రధానం భవిష్యతీతి, తన్నోపపద్యతే। న హి ప్రధానావస్థాయాం గుణసామ్యాత్సత్త్వధర్మో జ్ఞానం సంభవతి। నన్వూక్తం సర్వజ్ఞానశక్తిమత్త్వేన సర్వజ్ఞం భవిష్యతీతి। తదపి నోపపద్యతే। యది గుణసామ్యే సతి సత్త్వవ్యపాశ్రయాం జ్ఞానశక్తిమాశ్రిత్య సర్వజ్ఞం ప్రధానముచ్యేత కామం రజస్తమోవ్యపాశ్రయామపి జ్ఞానప్రతిబంధకశక్తిమాశ్రిత్య కించిజ్జ్ఞముచ్యేత, అపి చ నాసాక్షికా సత్త్వవృత్తిర్జానాతి

---

"యత్తూక్తం ... భవిష్యతీతి" యను భాష్యముచేఁ బ్రధాన మౌపచారిక మగు సర్వజ్ఞ మను విషయము ననువదించి యయ్యది యెంతమాత్రమును సమంజసము గాదని "తన్నోపపద్యతే" యని నిరాకరించుచున్నారు. అనుపపత్తికిఁ గారణము "నహి ... సంభవతి" యని చెప్పఁబడుచున్నది. అనఁగాఁ బ్రధానావస్థయందు రజస్తమస్సులతోఁ గూడ సత్త్వము సామ్యముఁ జెందియుండుటచేఁ దద్ధర్మమగు జ్ఞానము సంభవింపనేరదని యర్థము. గుణసామ్య మన నియ్యది యీగుణ మని నిరూపించుటకు వీలులేని యనభివ్యక్తస్థితి. ఇట్లధిక్షేపింప సర్వజ్ఞానశక్తిని గలిగి యుండుటచేతనే సర్వజ్ఞము కాఁగలదని చెప్పఁబడెనే యని మధ్యస్థుఁడు "నను... భవిష్యతీతి" యని యడుగ నట్లుగూడ యుక్తముగాదని 'తదపి నోపపద్యతే' యని నిరాకరింపఁబడుచున్నది. అందలి యనుపపత్తి "యది ... ప్రధానస్య సర్వజ్ఞత్వమ్మ"ను భాష్యముచే నిరూపింపఁబడుచున్నది. గుణసామ్యే సతి = మూఁడుగుణములును సామ్యావస్థను జెందియుండ నందు సత్త్వగుణము నాశ్రయించిన జ్ఞానశక్తి ననుసరించి ప్రధానము సర్వజ్ఞ మని చెప్పినచో, కామం = యథేచ్ఛగా, రజస్తమోగుణముల నాశ్రయించియుండు జ్ఞానప్రతిబంధకశక్తుల నాశ్రయించి ప్రధానము కించిజ్జ్ఞ మని గూడఁ జెప్పనొప్పును. అట్లు చెప్పినచోఁ బ్రధానమున కుండు సర్వజ్ఞత్వము బాధింపఁబడుచున్నది. అంతియకాదు. ఒకవేళ ప్రధానమునకు సామ్యావస్థయందు సర్వజ్ఞత్వము సంభవింపకపోయినను సత్త్వోద్రేకము కలిగినపుడు పుష్కలమగు జ్ఞానము గలుగఁ బ్రధానమునకు సర్వజ్ఞత్వము లభించునే యన నయ్యదియు సంభవింపనేరదని "అపి చ ... అభిధీయతే" యని చెప్పఁబడుచున్నది.

అసాక్షికా = సాక్షిరహిత మగు, అనఁగా సాక్షితో సంబంధములేని సత్త్వవృత్తిః = సత్త్వసంబంధ మగు వికారము, జానాతినా = జ్ఞానక్రియతో సంబంధించిన దని, న అభిధీయతే = ఎంతమాత్రము చెప్పఁబడదు. అనఁగా సాక్షియుఁ జేతనుఁడు నగు పురుషునితో సంబంధము గల్గినపుడే సత్త్వవృత్తి తెలిసికొనుటకు సాధన మగుచుఁ దెలిసికొనుచున్నదను వ్యవహారమును గనుచున్నది. అట్టిపురుషునితో సంబంధము లేనిచోఁ దెలిసికొనుటకు సాధనము కాక

నాఽభిధీయతే। న చాచేతనస్య ప్రధానస్య సాక్షిత్వమస్తి తస్మాదనుపపన్నం ప్రధానస్య సర్వజ్ఞత్వమ్, యోగినాం తు చేతనత్వాత్సత్త్వోత్కర్షనిమిత్తం సర్వజ్ఞత్వముపపన్నమిత్యనుదాహరణమ్। అథ పునః సాక్షినిమిత్తమీక్షితృత్వం ప్రధానస్య కల్ప్యేత, యథాఽగ్నినిమిత్తమయఃపిండాదేర్దగ్ధృత్వమ్, తథా సతి యన్నిమిత్తమీక్షితృత్వం ప్రధానస్య తదేవ సర్వజ్ఞం ముఖ్యం బ్రహ్మ జగతః కారణమితి

పోవుటచేఁ దెలిసికొనుచున్న దను వ్యవహారమునకు నాస్పదము గాదని భావము.

ప్రధానము సాక్షి గావున నద్దానితో సంబంధించిన సత్త్వవృత్తికి జ్ఞానముతో సంబంధము గలుగు నని చెప్పినచో నయ్యదియుఁ గల్లయే. ఏలయన— ప్రధానము జడ మగుటంజేసి యద్దానికి సాక్షిత్వ మసమంజస మని "నాచేతనస్య ప్రధానస్య సాక్షిత్వమస్తి" యని చెప్పఁబడుచున్నది. ప్రధానమున కెంతమాత్రము సర్వజ్ఞత్వము సంభవింప దని "తస్మాదనుపపన్నం ప్రధానస్య సర్వజ్ఞత్వమ్మ"ని చెప్పఁబడుచున్నది. సత్త్వోత్కర్షచేఁ బ్రధానము సర్వజ్ఞ మనుటకు సత్త్వోత్కర్షచే యోగులు సర్వజ్ఞు లగుచున్నారను దృష్టాన్త మచేతనమగు ప్రధానమువిషయమై వర్తింప దని "యోగినాంతు...అనుదాహరణమ్మ"ని చెప్పఁబడుచున్నది. ఇందుఁ బ్రధాన హేతువు "చేతనత్వాత్త"ని అనఁగా యోగులు చేతనులగుటచే సత్త్వోత్కర్షచే సర్వజ్ఞత్వము సంభవించుచున్నది. ప్రధానము జడము గావున నట్లు సంభవింపదని భావము.

ప్రధానము చేతనము గాకపోవుటచే స్వభావసిద్ధ మగు నీక్షితృత్వము సంభవింపకపోయినను వేఱొకసాక్షినిమిత్తముచేఁ బరతంత్ర మగు నీక్షితృత్వమగ్నినిమిత్త మగు దహనశక్తి యయఃపిండాదులయందు సంక్రమించినట్లు సంభవింప నొప్పునే యను హైరణ్యగర్భవాదమును "అథ పునః...దగ్ధృత్వమ్మ"ని యనువదించి యట్టివాదముకంటెఁ గూడ స్వాభిమతమున నతిశయము గలదను గూఢాభిసంధి "తథా సతి...యుక్తమ్మ"ని చెప్పఁబడుచున్నది. అనఁగా సాక్షినిమిత్తముగ నీక్షితృత్వము ప్రధానమునకుఁ గల్గు నని చెప్పిన నేసాక్షిసంబంధముచేఁ బ్రధానమున కీక్షితృత్వము గల్పింపఁబడుచున్నదో యాసాక్షియు సర్వజ్ఞమును ముఖ్యము నగు బ్రహ్మమే జగత్కారణ మనినచో యుక్తముగా నుండును. అనఁగా సాక్షి యగు బ్రహ్మముయొక్క సంబంధముచే జడ మగు ప్రధానమున కీక్షితృత్వమును గల్పించి యట్టిప్రధాన మీక్షణపూర్వకముగ జగత్తును సృజించినది గావున నయ్యదియే జగత్కారణ మనుటకంటె సాక్షియు సర్వజ్ఞము నగు బ్రహ్మమే యీక్షణపూర్వకముగ నీజగత్తును సృజించె ననిన నయ్యది యుక్తియుక్త మగుటయేగాక శ్రుతిసమ్మతము గూడ నగుచున్న దని భావము.

**యు**క్తమ్। **యత్పునరుక్తం** బ్రహ్మణోఽపి న ముఖ్యం సర్వజ్ఞత్వముపపద్యతే, నిత్యజ్ఞానక్రియత్వే జ్ఞానక్రియాం ప్రతి స్వాతన్త్ర్యాసంభవాదితి। అత్రోచ్యతే—ఇదం తావద్భవాన్ ప్రష్టవ్యః, కథం నిత్యజ్ఞానక్రియత్వే సర్వజ్ఞత్వహానిరితి। యస్య హి సర్వవిషయావభాసనక్షమం జ్ఞానం నిత్యమస్తి సోఽసర్వజ్ఞ ఇతి విప్రతిషిద్ధమ్ అనిత్యత్వే హి జ్ఞానస్య కదాచిజ్జానాతి కదాచిన్న జానాతీత్యసర్వజ్ఞత్వమపి స్యాత్ । నాసౌ జ్ఞాననిత్యత్వే దోషోఽస్తి, జ్ఞాననిత్యత్వే, జ్ఞానవిషయః స్వాతన్త్ర్యవ్యపదేశో నోపపద్యత ఇతి చేన్న, ప్రతతౌష్ణ్యప్రకాశేఽపి సవితరి

ఇట్లు ప్రధానమునకు ముఖ్యముగాఁ గాని గౌణముగాఁ గాని సర్వజ్ఞత్వము సిద్ధింప దని నిర్వచించి 'బ్రహ్మమునకుఁ గూడ ముఖ్య మగు సర్వజ్ఞత్వము సిద్ధింపదు. బ్రహ్మమునందు నిత్య మగు జ్ఞానక్రియ నంగీకరించినచో జ్ఞానక్రియఁ గూర్చి బ్రహ్మమునకు స్వాతంత్ర్యము గలుగనేర' దను నాక్షేపమును "యత్పున రుక్తం...స్వాతంత్ర్యాసంభవాత్త్"ని యనువదించి యద్దానిపరిహారము చెప్పఁబడుచున్న దని "అత్రోచ్యతే"యని చెప్పి "ఇదం తావత్ ...నిత్యజ్ఞానం భవతీతి"యను భాష్యముచే బ్రహ్మము సర్వజ్ఞ మను విషయమును నిరూపించుచున్నారు. పూర్వపక్ష్యుక్తియందలి యనుపపత్తిని ప్రదర్శింప నిత్యజ్ఞానక్రియ నంగీకరించుటయందు సర్వజ్ఞత్వమునకు హాని యెట్లు గలుగునో యయ్యది వివరింపఁబడవలయు నని "ఇదం తావత్.. సర్వజ్ఞత్వహాని"యని పూర్వపక్షిని ప్రశ్నించి యాతఁ డూరకుండ నిత్యజ్ఞానక్రియచేతనే సర్వజ్ఞత్వసిద్ధి గలుగునని "యస్య హి...విప్రతిషిద్ధమ్మ"ను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. అనఁగా నెవ్వనికి సర్వవిషయములను ప్రకాశింపఁజేయు జ్ఞానము నిత్యముగా నుండునో వాఁడు సర్వజ్ఞుఁడు గాఁడనుట విరుద్ధమన నసమంజస మని యర్థము. ఇఁక జ్ఞానక్రియ యనిత్య మగుచో నసర్వజ్ఞత్వమే సిద్ధించుఁగాని సర్వజ్ఞత్వ మెన్నటికి సిద్ధింపనేర దని "అనిత్యత్వే హి...అపి స్యాత్"అని చెప్పఁబడుచున్నది. జ్ఞానము నిత్యము గాకపోయినచో నొకానొకప్పుడు తెలిసికొనును; ఒకానొకప్పుడు తెలిసికొనఁజాలఁడు. గాన నసర్వజ్ఞత్వము, ఘటించును. కావున జ్ఞానము నిత్య మనుటయందు నీ యసర్వజ్ఞత్వరూపదోష మెంతమాత్రము ఘటింపనేరదని "నాసౌ జ్ఞాననిత్యత్వే దోషోఽస్తి"యని నిర్వచింప మధ్యస్థుఁడు జ్ఞానము నిత్య మన జ్ఞానమునుగూర్చిన స్వాతంత్ర్యము సిద్ధింపదుగదా యని "జ్ఞాననిత్యత్వే...నోపపద్యతే" యని యడుగ నట్లు గాదని 'న' యని నిరసింపఁబడుచున్నది. నిరసన మందు హేతువు దృష్టాన్తపూర్వకముగ "ప్రతతౌష్ణ్యప్రకాశేఽపి...దర్శనాత్త్"ను భాష్యముచేఁ బ్రదర్శింపఁబడుచున్నది. అనఁగా నెక్కుడు వేడిమితోడను గాంతితోడను గూడిన సూర్యునియందు "దహించుచున్నాఁడు, ప్రకాశింపఁజేయు

దహతి ప్రకాశయతీతి స్వాతంత్ర్యవ్యపదేశదర్శనాత్ । నను సవితుర్దాహ్యప్రకాశ్య సంయోగే సతి దహతి ప్రకాశయతీతి వ్యపదేశః స్యాత్, న తు బ్రహ్మణః ప్రాగుత్పత్తేర్జ్ఞానకర్మసంయోగోఽస్తీతి విషమో దృష్టాన్తః । న । అసత్యపి కర్మణి సవితా ప్రకాశత ఇతి కర్తృత్వవ్యపదేశదర్శనాత్ । ఏవమసత్యపి జ్ఞానకర్మణి బ్రహ్మణః "తదైక్షత" ఇతి కర్తృత్వవ్యపదేశోపపత్తేర్న వైషమ్యమ్ । కర్మాపేక్షాయాం తు బ్రహ్మణీక్షితృత్వశ్రుతయః సుతరా ముపపన్నాః ।

చున్నాఁడ"ను స్వాతంత్ర్యము పేర్కొనఁబడుచున్నట్లు నిత్యజ్ఞానస్వరూప మగు బ్రహ్మమునకుఁ దెలిసికొనుచున్నాఁ డను స్వాతంత్ర్యవ్యవహారము విరుద్ధ మెంత మాత్రము గాదని భావము. ఇట్లు పలుక మధ్యస్థుఁ డిట్యాది విషమ మగు దృష్టాన్తము గాని సరియగు దృష్టాన్తము గాదని "నను సవితుః...విషమో దృష్టాన" యని మఱల చెప్పుచున్నాఁడు. అనఁగా సూర్యునకు దాహ్యముగాని ప్రకాశ్యముగాని యగు విషయముతో సంబంధము గలిగినపుడు "దహించు చున్నాఁడు, ప్రకాశింపఁజేయుచున్నాఁడ"ను వ్యవహారము లోకమునఁ గలుగును. బ్రహ్మమున కన్ననో సృష్టికిఁ బూర్వము జ్ఞానముతో సంబంధించిన కర్మమే లేకపోవుటచేఁ దెలిసికొనుచున్న దను వ్యవహారము ఘటింపనేర దని ప్రశ్నింప నట్లు గాదని 'న' యని యాక్షేపము నిరసింపఁబడుచున్నది. ఆక్షేప నిరసమునకు హేతు వగు దృష్టాన్తముయొక్క వైషమ్యము లేకుండుట "అసత్యపి న వైషమ్యమ్మ" ని ప్రదర్శింపఁబడుచున్నది. అసత్యపి కర్మణి = ప్రకాశ్యము లేకపోయినప్పటికిని, అనఁగాఁ ప్రకాశ్యము లేనప్పటికిని సూర్యునికిఁ గర్తృత్వము గలుగుచున్నట్లు జ్ఞానమునకుఁ దగు కర్మ లేకపోయినను బ్రహ్మమునకు వినఁబడెడి కర్తృత్వము లోకవ్యవహారవిరుద్ధ మెంతమాత్రము గాదు. కావున దృష్టాన్త వైషమ్యము లేదని భావము. ఒకానొకప్పుడు "సవితా ప్రకాశతే" యనుచోఁ గాశృధాతు వకర్మకము గాన కర్మాపేక్ష లేనప్పటికి దహత్యాదులవలె 'తదైక్షత' యనుచో నీక్షతికిఁ గర్మాపేక్ష యావశ్యము గలుగుచున్న దేమున నిచటఁ గర్మము లేకపోయినను సమంజసమే యగు నను నాశయముతో నిట్లు జూపఁబడినది గాని యథార్థముగా శ్రుతులచేఁ బ్రకృతము కర్మమువినఁబడుచునే యున్న దని "కర్మాపేక్షాయాం తు బ్రహ్మణీక్షితృత్వశ్రుతయ స్సుతరా ముప పన్నా" యని చెప్పఁబడుచున్నది. అనఁగా బ్రహ్మము సర్వజ్ఞ మనుటకు విషయ మగు కర్మ మవశ్య ముండవలయు ననినచో నట్టికర్మమును బ్రతిపాదించుటకు నీక్షితృత్వమును బోధించు శ్రుతు లుపయోగించుచున్నవి. అనఁగా నట్టికర్మను నీక్షితృత్వ శ్రుతులు సర్వవిధముల బోధించుచున్న వని భావము. ఇచట 'తు' శబ్దముచే దృష్టాన్తముకంటె దార్ష్టాన్తికమున కొకవిశేషము సూచింపఁబడు

పన్నాః । కింపునస్తత్కర్మ, యత్ప్రాగుత్పత్తేరీశ్వరజ్ఞానస్య విషయో భవతీతి, తత్త్వాన్యత్వాభ్యామనిర్వచనీయే నామరూపే 'అవ్యాకృతే వ్యాచికీర్షితే ఇతి బ్రూమః । యత్ప్రసాదాద్ధి యోగినామప్యతీతానాగతవిషయం ప్రత్యక్షం జ్ఞానమిచ్ఛన్తి యోగశాస్త్రవిదః, కిము వక్తవ్యం తస్య నిత్యసిద్ధస్యేశ్వరస్య సృష్టిస్థితిసంహృతివిషయం నిత్యజ్ఞానం భవతీతి । యదప్యుక్తం ప్రాగుత్పత్తేర్బ్రహ్మణః శరీరాదిసంబంధమన్తరేణేక్షితృత్వ మనుపపన్నమితి, న తచ్చోద్య మవతరతి, సవితృప్రకాశవద్బ్రహ్మణో జ్ఞానస్వరూపనిత్యత్వే జ్ఞానసాధనాపేక్షానుపపత్తేః । అపి

---

చున్నది. ఇదెద్దియన దృష్టాన్తమునందుఁ గర్మము లేనప్పటికి దార్ష్టాన్తికమునఁ గర్తృత్వవ్యపదేశసద్భావముఁ మగు కర్మముగల దను నదియే. అట్టికర్మవిశేష మెద్దియన "కిం పునః...భవతీతి" యని మధ్యస్థుఁ డడుగ "తత్త్వాన్యత్వాభ్యాం ... ఇతి బ్రూమ"యని సమాధానము చెప్పఁబడుచున్నది తత్త్వ మన బ్రహ్మభావము. అనఁగా సత్త్వము. అన్యత్వ మన నబ్రహ్మభావము. అనఁగా నసత్త్వము. ఈ సత్త్వాసత్త్వములచే నిర్వచించుటకు వీలు లేనిది గావున ననిర్వచనీయము, అనఁగా మిథ్యారూపము. నామ మనఁగా వేద మాదిగాఁ గల శబ్దజాల మంతయును. రూప మనఁగా నీ పరిదృశ్యమాన మగు జగత్తు. అవ్యాకృతే = సృష్టికిఁ బూర్వమున ననభివ్యక్తములుగా నన సూక్ష్మములుగా నున్నట్టియు, వ్యాచికీర్షితే= అభివ్యక్తి యన స్థూలభావము నొందింపఁబడఁదలఁచినట్టివియును, నామరూపములు సూక్ష్మభావమున నిత్యజ్ఞానమగు బ్రహ్మమునకు విషయ మగుచుండ నవ్వానిని స్థూలభావము నొందింపఁదలంచుచున్న దని 'తదైక్షత' మున్నగు శ్రుతులకుఁ దాత్పర్యము. దానంజేసి యీజ్ఞానమందు నామరూపములు కర్మమని భావము. ఇట్లు శ్రుతివాక్యములచే బ్రహ్మముయొక్క సర్వజ్ఞత్వమును సాధించి స్మృత్యంతరముచేఁ గూడ బ్రహ్మమునకు సర్వజ్ఞత్వము సిద్ధ మగుచున్న దని "యత్ప్రసాదాద్ధి ...నిత్యజ్ఞానం భవతీతి" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. ఏ బ్రహ్మము యొక్క యనుగ్రహముచే నతీతానాగతవిషయ మగు ననఁగా భూతభవిష్యద్విషయ మగు జ్ఞానము ప్రత్యక్ష మగు నని యోగశాస్త్రవేత్తలు చెప్పుచున్నారో యట్టి యీశ్వరునిజ్ఞానము నిత్యమని వేఱె చెప్పనక్కఱలేదని భావము. ఇట్లు బ్రహ్మమునకు సర్వజ్ఞత్వమును సాధించి సృష్టికిఁ బూర్వము బ్రహ్మమునకు శరీరాదిసంబంధము లేకపోవుటచే నీక్షితృత్వము గలుగ దను పూర్వపక్షము ననువదించి, యయ్యది "న తచ్చోద్య మవతరతి" యని నిరసింపఁబడుచున్నది. చోద్య మన ప్రశ్న మని యర్థము. అందులకు హేతువు దృష్టాన్తపురస్సరముగ "సవితృప్రకాశవత్ ... అనుపపత్తేః" యని చెప్పఁబడుచున్నది. నిత్యప్రకాశస్వరూపుఁ డగు సూర్యునకు వలె నిత్యజ్ఞానస్వరూప మగు బ్రహ్మమునకు జ్ఞానసాధనాపేక్ష గలుగదని భావము.

చావిద్యాదిమతః సంసారిణః శరీరాద్యపేక్షా జ్ఞానోత్పత్తిః స్యాన్నజ్ఞానప్రతిబంధ కారణరహితస్యేశ్వరస్య । మన్త్రౌ చేమావీశ్వరస్య శరీరాద్యనపేక్షతా మనావరణ జ్ఞానతాం చ దర్శయతః—"న తస్య కార్యం కరణం చ విద్యతే, న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే. పరాఽస్య శక్తిర్వివిధైవ శ్రూయతే, స్వాభావికీ జ్ఞానబలక్రియా చ" (శ్వేతా. 6-8) ఇతి, "అపాణిపాదో జవనో గ్రహీతా పశ్యత్యచక్షుః స శృణోత్యకర్ణః । స వేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా తమాహురగ్ర్యం

అట్లైనచో జీవులుగూడ నిత్యజ్ఞానస్వరూపులే యగుచున్నారు. అట్టివారలకు జ్ఞానోత్పత్తికి శరీరాదిసంబంధ మావశ్యక మగుచుండ నీశ్వరునకు మాత్ర మెందుల కవసరము లేదనిన, జీవులు నిత్యజ్ఞానస్వరూపు లయ్యు నవిద్యాకామకర్మప్రతిబంధము వారల కుండుటచే శరీరాదులయావశ్యకత జ్ఞానమునుగూర్చి కలుగుచున్నదనియు నీశ్వరుని కట్టి ప్రతిబంధము లేకపోవుటచే శరీరాదులయావశ్యకత గలుగ లేదనియు "అపి చ... ఈశ్వరస్య" యని జీవేశ్వరులకుగల వైలక్షణ్యము చెప్పఁబడుచున్నది. అవిద్యాదిమతః = అవిద్యాకామకర్మాదులతోఁ గూడిన, సంసారిణః=జీవునకు; ఈశ్వరునకు నవిద్యాదిప్రతిబంధము లేదనియు శరీరాద్యపేక్ష లేదనియు శ్రుతిప్రమాణపురస్సరముగ "మంత్రౌ చేమా ... ఇతి చ" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. అనావరణజ్ఞానతాం-ఆవరణమనఁ బ్రతిబంధక మగు నవిద్య, అనావరణ మనఁ బ్రతిబంధక మగు నవిద్యారహిత మగునట్టి జ్ఞానతాం జ్ఞానమును గలిగియుండుట,

తస్య = ఈశ్వరునకు, కార్యం= ఆవరణరూప మగు నజ్ఞానము, కరణం= ఇంద్రియాదికమును, న విద్యతే = లేదు. అస్య = ఈ యీశ్వరునియొక్క స్వాభావికే = స్వతస్సిద్ధ మగు జ్ఞానబలక్రియా చ = జ్ఞానేచ్ఛాక్రియారూప మగు పరా శక్తిః = ఉత్కృష్ట మగు శక్తి, వివిధా = నానావిధములుగా, శ్రూయతే= వినఁబడుచున్నది.

అపాణిపాదః=కాలుసేతులు లేనివాఁడు, (అయినప్పటికి) జవనః=పరుగెత్తువాఁడు, గ్రహీతా = వస్తువులను గ్రహించువాఁడు, అచక్షుః = చూచుటకుఁ దగు చక్షురింద్రియముచే రహితుఁడైనను, పశ్యతి = చూచుచున్నాఁడు. అకర్ణః= వినుటకు సాధనము లగు చెవులు లేనివాఁడైనను. సః = ఆ యీశ్వరుఁడు, శృణోతి = వినుచున్నాఁడు. సః = ఆ యీశ్వరుఁడు వేద్యం = తెలియఁదగిన యీ సర్వమును, వేత్తి = తెలిసికొనుచున్నాఁడు. తస్య = ఆయీసర్వమును దెలిసికొనుచున్న యీశ్వరుని వేత్తా = వేఱొక తెలిసికొనువాఁడు, న అస్తి = లేఁడు. తం = ఆయీయీశ్వరుని, అగ్ర్యం = మొదటివాఁ డగునట్టియు, మహాన్తం = సర్వవిధముల గొప్పవాఁడగు, పురుషం = పురుషునిగా, ఆహుః =

పురుషం మహాన్తమ్" (శ్వేతా. 3-19.) ఇతి చ। నను నాస్తి తావన్జ్ఞానప్రతిబంధ కారణవానీశ్వరాదన్యః సంసారీ, 'నాన్యోఽతోఽస్తి ద్రష్టా నాన్యోఽతోఽస్తి విజ్ఞాతా' (బృ. 3-7-23) ఇతి శ్రుతేః। తత్ర కిమిదముచ్యతే సంసారిణః శరీరాద్యపేక్షా జ్ఞానోత్పత్తిర్నేశ్వరస్యేతి। అత్రోచ్యతే—సత్యమ్, నేశ్వరాదన్యః సంసారీ। తథాపి దేహాదిసంఘాతోపాధిసంబంధ ఇష్యత ఏవ, ఘటకరకగిరిగుహాద్యుపాధిసంబంధ ఇవ వ్యోమ్నః। తత్కృతశ్చ శబ్దప్రత్యయవ్యవహారో లోకస్య దృష్టో ఘటచ్ఛిద్రం కరకాదిచ్ఛిద్రమిత్యాదిరాకాశావ్యతిరేకేఽపి, తత్కృతా చాకాశే ఘటాకాశాదిభేదమిథ్యాబుద్ధిర్దృష్టా। తథేహాపి దేహాదిసంఘాతోపాధిసంబంధా...

---

చెప్పుచున్నారు. ఈమంత్రములవలన నీశ్వరునకు దేహేంద్రియాదిసంబంధము లేదనియు సర్వశక్తియుతుఁడగుటచే సర్వవ్యవహారసామర్థ్యము గలదనియు సువ్యక్తమగుచున్నది.

ఇట్లు జీవునికంటె నీశ్వరునియందలి యతిశయమును బ్రదర్శింప మధ్యస్థుఁడీశ్వరునికంటె భిన్నుఁడగు జీవుఁడు శ్రుతివలనఁ దెలియఁబడుటలేదు. అట్టివిషయమున జీవునికి శరీరాద్యపేక్ష గలదనియు నీశ్వరుని కట్లు లేదనియు నెట్లు చెప్పఁబడుచున్న దని "నను నాస్తి... నేశ్వరస్యేతి" యని మధ్యస్థుఁడు ప్రశ్నించుచున్నాఁడు. అతః = ఈశ్వరునికంటె, అన్యః = వేఱగు, ద్రష్టా = చూచువాఁడు, నాస్తి = లేఁడు, అతః = ఈశ్వరునికంటె, అన్యః = భిన్నమగు, విజ్ఞాతా = తెలిసికొనువాఁడు, నాస్తి = లేఁడు. అత్ర = ఈప్రశ్నమువిషయమున, ఉచ్యతే = సమాధానము చెప్పఁబడుచున్నది. ఈసమాధానభాష్యము 'సత్యం... ఉపపన్నం సంసారిణః' యని చెప్పఁబడుచున్నది. ఇందు "నేశ్వరాదన్యః సంసారీ" యనునది శ్రుతిసమ్మతమగు పారమార్థికసిద్ధాన్తము. "తథాపి దేహాది సంఘాతోపాధిసంబంధ ఇష్యత ఏవ" యనునది వ్యావహారికము. "ఘటకరకగిరి గుహాద్యుపాధిసంబంధ ఇవ వ్యోమ్న" యనునది దృష్టాన్తము. "తత్కృతశ్చ... బుద్ధిర్దృష్టా" యనునది దృష్టాన్తవివరణము. "తథా ఇహాపి... మిథ్యాబుద్ధిః" యనునది దార్ష్టాన్తికసమన్వయము. "దృశ్యతే చ... పూర్వేణ" యనునది ప్రత్యక్షసిద్ధమగు సార్వజనీనానుభవము. అభినివేశః = మిథ్యాభిమానము, మిథ్యాబుద్ధిమాత్రేణ = భ్రాంతిమాత్రముచే, ఇచట 'పూర్వేణ' యను శబ్దముచే నజ్ఞానముయొక్క స్వభావసిద్ధమగు ననాదిత్వము ప్రదర్శింపఁబడుచున్నది. అనఁగా ననాదిసిద్ధమగు నజ్ఞానవశమున నిత్యజ్ఞానస్వరూపమగు సదాత్మభావ మావరింపఁబడఁగా జీవభావము గల్గుచున్నదికాని వాస్తవముగ జీవభావము లేదనియే పరమ తాత్పర్యము. ఇట్టిజీవభావము గలుగ జీవునకు శరీరాదుల యొక్క యావశ్యకత గలుగుచున్నదని "సతి చైవం ... సంసారిణ" యని

[illegible]కృతేశ్వరసంసారిభేదమిథ్యాబుద్ధిః। దృశ్యతే చాత్మన ఏవ సతో దేహాది
సంఘాతే ఽనాత్మన్యాత్మత్వాభినివేశో మిథ్యాబుద్ధిమాత్రేణ పూర్వేణ। సతి చైవం
సంసారిత్వే దేహాద్యపేక్ష మీక్షితృత్వముపపన్నం సంసారిణః। యదప్యుక్తం
ప్రధానస్యానేకాత్మకత్వాన్మృదాదివత్కారణత్వోపపత్తిర్నాసంహతస్య బ్రహ్మణ
ఇతి తత్ప్రధానస్యాశబ్దత్వేనైవ ప్రత్యుక్తమ్। యథా తు తర్కేణాపి బ్రహ్మణ ఏవ
కారణత్వం నిర్వోఢుం శక్యతే, న ప్రధానాదీనాం తథా ప్రపంచయిష్యతి "న
విలక్షణత్వాదస్య—" (బ్ర. సూ. 2-1-4) ఇత్యేవమాదినా॥ ॥౯॥

---

సూచింపఁబడుచున్నది. కావున నీశ్వరుని కవిద్య లేకపోవుటవలన నీశ్వరజ్ఞానో
త్పత్తిరూపమగు నీక్షితృత్వమునకు శరీరాదిసంబంధ మెంతమాత్రము లేదు.

ఇట్లు నిత్యజ్ఞానస్వరూపమగు బ్రహ్మమునకు సాక్షితృత్వమును బ్రదర్శిం
చుటచే జగత్కారణత్వ ముచితమే యని ప్రసాధించు. యనేకాత్మకమగు
ప్రధానము జగత్కారణము గావలయుఁగాని యసంహతమగు బ్రహ్మము గాదను
పూర్వపక్షియాక్షేపమును "యదప్యుక్తం ... బ్రహ్మణ ఇతి" యని యనువదించి
యద్దానిని "తత్ప్రధానస్యాశబ్దత్వేనైవ ప్రత్యుక్తమ్" ని నిరసించుచున్నారు.
ప్రధానస్య=ప్రధానము అశబ్దత్వేనైవ = శబ్దముచే నెంతమాత్రము ప్రతిపాదింపఁ
బడలేదని చెప్పఁబడుటచేతనే, తత్=అ పూర్వపక్షము, ప్రత్యుక్తం=త్రోసివేయఁ
బడుచున్నది. అనఁగా శ్రుతిచేఁ బ్రతిపాదింపఁబడిన యర్థము శ్రుతిచే
బ్రతిపాదింపఁబడిన విధముననే గ్రహింపవలయునుగాని వేఱొక విధమున
నద్దానిని గ్రహింప యత్నింపఁగూడదని తాత్పర్యము. అట్లయినచో యుక్తి
యుక్తము గాకపోయినను శ్రుత్యుక్తత్వవ్యాజమున బ్రహ్మమునే జగత్కారణ
ముగ గ్రహింపవలయునా యన బ్రహ్మము జగత్కారణమే యనుట
శ్రుత్యుక్తమే గాక యుక్తియుక్తముగూడ ననియు నట్టి యుక్త్యతిశయము
ముందుఁ బ్రదర్శింపఁబడుచున్న దనియు "యథాతు... ఇత్యేవమాదినా" యను
భాష్యముచే బ్రతిజ్ఞ చేయఁబడుచున్నది. 'న విలక్షణత్వాదస్యతథాత్వంచశబ్దాత్' ను
సూత్ర మాదిగా గలిగిన యెనిమిది సూత్రములు గలిగిన విలక్షణత్వాధికరణ
మున బ్రహ్మమే జగత్కారణమనియుఁ బ్రధానాదు లెంతమాత్రము జగత్కారణ
ములు గానేరవనియు యుక్తిచే నిరూపింపఁబడుచున్నదని తాత్పర్యము. ॥౯॥

ఛాందోగ్యషష్ఠప్రపాఠకమున వినవచ్చెడి సచ్ఛబ్దవాచ్యమున కీక్షితృ
త్వము వినవచ్చుటవలన నయ్యది చేతనమగు బ్రహ్మముగాని యచేతనమగు
ప్రధాన మెంతమాత్రము గానేరదని నిర్వచింప నా యీక్షితృత్వ మచేతనమగు
ప్రధానమునకుఁగూడ ఘటింపఁజేయవచ్చుననియు నంతమాత్రమునజగత్కారణము
చేతనమని చెప్పుటసమంజసము గానేరదనియుఁ దలంచి సాంఖ్యుఁ డిట్లు పలుకు

అత్రాహ—యదుక్తం నాచేతనం ప్రధానం జగత్కారణమీక్షితృత్వ శ్రవణాదితి, తదన్యథాప్యుపపద్యతే, అచేతనేఽపి చేతనవదుపచారదర్శనాత్। యథా ప్రత్యాసన్నపతనతాం నద్యాః కూలస్యాలక్ష్య 'కూలం పిపతిషతీ'.. త్య చేతనేఽపి కూలే చేతనవదుపచారో దృష్టః। తద్వదచేతనేఽపి ప్రధానే ప్రత్యాసన్నసర్గే చేతనవదుపచారో భవిష్యతి "తదైక్షత" ఇతి। యథా లోకే కశ్చిచ్చేతనః స్నాత్వా భుక్త్వా చాపరాహ్ణే గ్రామం రథేన గమిష్యామీతీక్షిత్వానంతరం తథైవ నియమేన ప్రవర్తతే, తథా ప్రధానమపి మహదాద్యాకారేణ నియమేన ప్రవర్తతే। తస్మాచ్చేతనవదుపచర్యతే। కస్మాత్పునః కారణాద్విహాయ ముఖ్యమీక్ష

---

చున్నాఁడని సాంఖ్యవచనము "అత్రాహ" మున్నగు వాక్యముతో నుపక్రమింపబడుచున్నది. "యదుక్తం ... ఈక్షితృత్వశ్రవణాత్త"ని వేదాంతియొక్క మతమును సాంఖ్యుఁ డనువదించి "తదన్యథా ఽప్యుపపద్యతే" ఈయాక్షేపము మఱియొకవిధమునఁగూడ సమర్థింపఁబడుచున్నదని చెప్పుచున్నాఁడు. అద్దానికి సమాధానము "అచేతనే ఽపి చేతనవదుపచారదర్శనాత్త"ని సంగ్రహముగఁ జెప్పఁబడుచున్నది. అనఁగా, జేతనమందువలెనే యచేతనమందుఁగూడ నీక్షితృత్వమునకు 'ఉపచారదర్శనాత్, = గౌణవ్యవహారము చూడఁబడుటవలన, బ్రధానమునకుఁ జేతనమునకువలె ముఖ్యేక్షితృత్వము సంభవింపకపోయినను గౌణేక్షితృత్వము సంభవించుననియు దానంజేసి ఛాందోగ్యషష్ఠప్రపాఠకమునందలి సచ్ఛబ్దవాచ్యము ప్రధానముగాని బ్రహ్మము గానేరదని భావము. సంగ్రహ వాక్యము "యథా ప్రత్యాసన్నపతనతాం ... ఉపచర్యతే" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది. ఇందు "యథా ... ఉపచారో దృష్ట" యనునది దృష్టాన్తము. నద్యాః = నదిసంబంధమగు, కూలస్య=గట్టుయొక్క, ప్రత్యాసన్నపతనతాం = కొంచెముకాలములోఁ గూలిపోవుటకుఁదగు నవస్థను, ఆలక్ష్య = చూచి, కూలం = తీరము, (గట్టు) పిపతిషతీతి = పడనిచ్ఛయించుచున్నదని, కూలే = గట్టు, అచేతనే ఽపి = జడమైనను, చేతనవత్ = చేతనమందువలె, ఉపచారః= గౌణమగు వ్యవహారము, దృష్టః= తెలియఁబడుచున్నదో, యాతీరుననే దార్ష్టాన్తికమందుఁగూడ నని "తద్వత్ ... తదైక్షత ఇతి" యని చెప్పఁబడుచున్నది. ప్రత్యాసన్నసర్గే = సృష్ట్యున్ముఖమగు ప్రధానమందు గౌణేక్షణవ్యవహారము సమంజసమని భావము. ప్రధానమందలి గౌణేక్షణము వేఱొకదృష్టాన్తపురస్సరముగ "యథా లోకే ... నియమేన ప్రవర్తతే" యని చూపఁబడుచున్నది. మహదాద్యాకారేణ, ఆదిశబ్దముచే, అహంకారము, ఏకాదశేంద్రియములు, పంచతన్మాత్రలు, పంచమహాభూతములు, ఈ యఖిలమగు జగత్తును గ్రహింపఁబడుచున్నవి.

తృత్వమౌపచారికం కల్ప్యతే, "తత్తేజ ఐక్షత" 'తా ఆప ఐక్షన్త' (ఛాం. 6.2.3.4) ఇతి చాచేతనయోరప్యప్తేజసోశ్చేతనవదుపచారదర్శనాత్ । తస్మాత్సత్కర్తృక మపీక్షణమౌపచారికమితి గమ్యతే, "ఉపచారప్రాయే వచనాది"తి । ఏవం ప్రాప్తే ఇదం సూత్రమారభ్యతే—

---

పైవిధముగఁ బ్రధానమందు నీక్షితృత్వము గౌణమని ఫలితము "తస్మాచ్చేతనవదుపచర్యతే" యని నిర్వచింపఁబడుచున్నది.

ఇట్లు ప్రధానమందు "తదైక్షత" యనుచో వినఁబడు నీక్షణము గౌణమని పలుక మధ్యస్థుఁడు "తదైక్షత" యనునపుడు వినఁబడెడి యీక్షితృత్వము గౌణమని కల్పించుటకుఁ గారణమేమని "కస్మాత్ ... కల్ప్యతే" యని ప్రశ్నింప నందులకు సమాధానమును సాంఖ్యుఁడు "తత్తేజ ఐక్షత ... ఉపచార దర్శనాత్త్"ని చెప్పుచున్నాఁడు. అనగా నుత్తరగ్రంథమున "ఆ తేజము ఈక్షణ మును జేసెను, ఆ యుదకము లీక్షణము జేసినవి" యని యచేతనములగు తేజఉదకములయందుఁ జేతనమునకువలెనే యీక్షణము వినఁబడుటవలన నయ్యది యెట్లౌపచారికమగుచున్నదో యాతీరుననే 'తదైక్షత' యనుచో విన బడెడి సదీక్షణముగూడ నౌపచారికమనియే గ్రహింపవలయునని తాత్పర్యమని "తస్మాత్ ... గమ్యతే" యని చెప్పఁబడుచున్నది. సత్కర్తృకం ఈక్షణం = సత్తుచేఁ జేయఁబడిన యీక్షణము అనఁగా "తదైక్షత" యనుచో నీక్షణము "తత్తేజ ఐక్షత, తా ఆప ఐక్షన్త" యనుచో వినఁబడెడి యీక్షణ మచేతనము లగు నప్తేజస్సులతో సంబంధించినదగుటచే నౌపచారికమని చెప్పుట యుక్త మగునే కాని 'తదైక్షత' యనుచో సదీక్షణము ముఖ్యముగాక యౌపచారిక మగుటకుఁ గల కారణ మేమన—"ఉపచారప్రాయే వచనాత్త్"ని చెప్పఁబడు చున్నది. అనఁగా నచ్చో "తత్తేజ ఐక్షత, తా ఆప ఐక్షన్త" యని బహుళముగా వినవచ్చెడి యౌపచారికేక్షణములయందు 'తదైక్షత' యను నీక్షణముగూడ విన వచ్చుటవలన నియ్యదియుఁగూడ గౌణేక్షణమే యని తలంపఁబడవచ్చునని యభిప్రాయము. ఇట్లు సాంఖ్యాశయము సిద్ధముగాఁగ నందులకు · సమాధాన ముగా, ఇదం సూత్రం = ఈదిగువఁ జెప్పఁబోవు "గౌణశ్చేన్నాత్మశబ్దాత్త్"ను, సూత్రము, ఆరభ్యతే = ఆరంభింపఁబడుచున్నది—

సూత్రమునందు 'ఈక్షతిః' అను పద మధ్యాహారముచేసి యర్థమును యోజింపవలయును. 'ఈక్షతిః, గౌణః చేత్త'ను సూత్రావయవముచే సాంఖ్య పూర్వపక్ష మనువదింపఁబడుచున్నది. అద్దాని యర్థమే "యదుక్తం... ఈక్షతి" యని చెప్పఁబడుచున్నది. పూర్వపక్షము సూత్రమందలి నఞ్ పదముచే నిరాక రింపఁబడుచుది. నఞ్ పదముయొక్క యర్థము "తద్ధనత్త'ని చెప్పఁబడు చున్నది.

# గౌణశ్చేన్నాత్మశబ్దాత్

యదుక్తం ప్రధానమచేతనం సచ్ఛబ్దవాచ్యం తస్మిన్నౌపచారిక, ఈక్షతిః, అప్తేజసోరివేతి, తదసత్ । కస్మాత్ । ఆత్మశబ్దాత్ । "సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్" ఇత్యుపక్రమ్య "తదైక్షత తత్తేజోఽసృజత" (ఛాం. 6-2-1-3) ఇతి చ, తేజోఽబన్నానాం సృష్టిముక్త్వా తదేవ ప్రకృతం సదీక్షితృ, తాని చ తేజోఽబన్నాని దేవతాశబ్దేన పరామృశ్యాహ—"సేయం దేవతైక్షత హంతా హమిమాస్తిస్రో దేవతా అనేన జీవేనాత్మనా ఽనుప్రవిశ్య నామరూపే వ్యాకర

---

తత్ = పూర్వపక్షము, అసత్ = అత్యంతము తుచ్ఛము. తుచ్ఛ మెందు వలన నని 'కస్మాత్త'ని పూర్వపక్షి యడుగ హేతువు 'ఆత్మశబ్దాత్త'ని చెప్పఁ బడుచున్నది. సచ్ఛబ్దవాచ్యమగు జగత్కారణ మాత్మశబ్దముచేఁ బరామర్శింపఁ బడుటవలన నీక్షణము ముఖ్యమేగాని గౌణ మెంతమాత్రము గాదని యభిప్రా యము. హేతుపద ముత్తరగ్రంథముచే వివరింపఁబడుచున్నది. ఉత్తరగ్రంథ ముచే ఛాందోగ్యషష్ఠప్రపాఠకముయొక్క రెండవఖండమందలి 1, 3వ వాక్యము లకును, మూఁడవఖండమందలి రెండవవాక్యమునకును గల యర్థసందర్భమును దిలకించినచో సచ్ఛబ్దవాచ్యము చేతనమే యనియు సచ్ఛబ్దవాచ్యమునకు వినఁ బడెడి యీక్షతి ముఖ్యమేగాని గౌణ మెంతమాత్రము గాదనియుఁ దెలియ వచ్చుటంజేసి సచ్ఛబ్దవాచ్యము బ్రహ్మమేకాని ప్రధాన మెంతమాత్రము గాదని "సదేవ సోమ్యేదమగ్రే...ఆత్మశబ్దప్రయోగ ఉపపద్యేత" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. ఎట్లన—రెండవఖండికయొక్క మొదటివాక్యము "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్త"ని ప్రారంభింపఁబడియెను. పిమ్మట మూఁడవవాక్యమునందు "తదైక్షత తత్తేజోఽసృజత" యను వాక్యమునందలి తచ్ఛబ్దముచే నా సచ్ఛబ్దా ర్థము పరామర్శింపఁబడియెను. ఇందలి తచ్ఛబ్దముచే నిర్దిష్టమగు సచ్ఛబ్దవాచ్యము క్రమముగఁ దేజస్సు, ఉదకములు, అన్న మను మూఁడుభూతములను సృజించినట్లు శ్రుతి చెప్పి పిమ్మట మూఁడవఖండికయొక్క రెండవవాక్యమునందు "హంత = ఆహా, అహం = నేను, ఇమాః = ఈ పరిదృశ్యమానములగు, తిస్రః= మూఁడగు, దేవతాః = దేవతలనే, అనేన = ఈ, జీవేన = జీవరూపమగు, ఆత్మనా= స్వరూ పముచే, అనుప్రవిశ్య = వెనువెంటఁ బ్రవేశించి, నామరూపే = నామరూపము లను, వ్యాకరవాణి = విశేషించి చేయుదునని, సా = ఆ, ఇయం = ఈ, దేవతా = దేవత, యన సత్తు, ఐక్షత = సంకల్పించెనని వినవచ్చుటచే, నా శ్రుతి, ప్రకృతమునఁ దెలియవచ్చెడి యీక్షిత యగు సత్తును అద్దానిచే సృజింపఁ బడిన తేజోఽబన్నములను, దేవతాశబ్దముచేతఁ బరామర్శించి యా తేజోఽబన్న

వాణి" (ఛాం. 6-3-2) ఇతి । తత్ర యది ప్రధానమచేతనం గుణవృత్త్యేక్షితృ కల్ప్యేత, తదేవ ప్రకృతత్వాత్సేయం దేవతేతిపరామృశ్యేత । న తదా దేవతా జీవమాత్మశబ్దేనాభిదధ్యాత్ । జీవో హి నామ చేతనః శరీరాధ్యక్షః ప్రాణానాం ధారయితా తత్ప్రసిద్ధేర్నిర్వచనాచ్చ । స కథమచేతనస్య ప్రధానస్యాత్మా భవేత్ । ఆత్మా హి నామ స్వరూపమ్ । నాచేతనస్య ప్రధానస్య చేతనో జీవః స్వరూపం భవితుమర్హతి । అథ తు చేతనం బ్రహ్మ ముఖ్యమీక్షితృ పరిగృహ్యేత తస్య జీవవిషయ ఆత్మశబ్దప్రయోగ ఉపపద్యతే । తథా "స య

ములయందు జీవునియొక్క రూపముతోఁ దాఁ బ్రవేశించి నామరూపములఁ జేసెద నని సచ్ఛబ్దవాచ్యము సంకల్పించినట్లు చెప్పుచున్నదని ప్రకరణసందర్భమగు వర్థము నిర్వచింపఁబడినది. ఇట్టి యర్థవిశేషమువలన లభించెడి యభిప్రాయము "తత్ర యది...భవితుమర్హతి" యను భాష్యముచే వివరిం(ప)ఁబడుచున్నది. అనఁగా నీప్రకరణమున సచ్ఛబ్దవాచ్యము గుణవృత్తిచే నచేతనమగు ప్రధానమును గల్పించినచో నా ప్రధానమే ప్రకృతమగుటచే "సా ఇయం దేవతా = ఆ యీ దేవత" యని పరామర్శింపఁబడవలయునుగదా ? అట్లయినచోఁ బ్రధానమనెడి దేవత జీవు నాత్మశబ్దముచే "జీవేనాత్మనా" యని చెప్పకపోవలయును. ఏలయన నందులకు హేతువు "జీవో హి నామ... నిర్వచనాచ్చ" యను గ్రంథముచే జీవస్వరూపనిర్వచనము చెప్పఁబడుచున్నది. జీవుఁడనఁ జేతనుఁడును శరీరమునకుఁ బ్రభువును, ప్రాణములను ధరించినవాఁడునని యర్థము. జీవస్వరూప మిట్టిదనుటకు హేతువు "తత్ప్రసిద్ధేర్నిర్వచనాచ్చ "యని చెప్పఁబడుచున్నది. అనఁగా లోకమున జీవుఁడు చేతనుఁడను ప్రసిద్ధి యుండుట వలనను "జీవ ప్రాణధారణే" యని జీవశబ్దార్థనిర్వచనమువలనను నని భావము. ఇట్టి జీవస్వరూపమును నిరూపించి యట్టి జీవస్వరూప మచేతనమగు ప్రధానమునకు స్వరూప మెంతమాత్రము గాదని "స కథమచేతనస్య ప్రధానస్యాత్మా భవేత్త"ని యధిక్షేపింపఁబడుచున్నది. ఇచట నాత్మశబ్దము స్వరూపపరమని "ఆత్మా హి నామ స్వరూపమ్మ"ని చెప్పఁబడుచున్నది. అధిక్షేపవాక్యము "నాచేతనస్య... అర్హతి" యని వివరింపఁబడుచున్నది. అనఁగా నచేతనమగు ప్రధానమునకుఁ జేతనుఁడగు జీవుఁడు స్వరూప మెంతమాత్రము గానేరఁడని భావము.

ఇట్లు సచ్ఛబ్దవాచ్యము ప్రధానము గాదని నిరసించి సచ్ఛబ్దవాచ్యము చేతనమగు బ్రహ్మమే యనియు ముఖ్యమగు నీక్షిత యనియు గ్రహించినచో "జీవేనాత్మనా" యను జీవవిషయకమగు నాత్మశబ్దప్రయోగము సమంజసమగునని "అథ తు ... ఉపపద్యతే" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. అనఁగా చ్ఛబ్దవాచ్యము చేతనమగు బ్రహ్మమనియు నచట వినవచ్చెడి యీక్షణము

ఏషోఽణిమైతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో" (ఛాం. 6-14-3) ఇత్యత్ర "స ఆత్మా" ఇతి ప్రకృతం సదణిమానమాత్మానమాత్మ శబ్దేనోపదిశ్య "తత్త్వమసి శ్వేతకేతో" ఇతి చేతనస్య శ్వేతకేతోరాత్మత్వేనోపది శతి, అప్తేజసోస్తు విషయత్వా దచేతనత్వం నామరూపవ్యాకరణాదౌ చ ప్రయోజ్యత్వేనైవ నిర్దేశాత్ । న చాత్మశబ్దవత్కించిన్ముఖ్యత్వే కారణమస్తీతి

ముఖ్యముగాని గౌణ మెంతమాత్రము గాదనియు భావము. ఇంతియ కాదు; ఉపసంహారమునందు నెనిమిదవఖండము మొదలు పదునాఱవఖండమువఱకుఁ గల తొమ్మిదిఖండములచేఁగూడఁ దొమ్మిదిపర్యాయములు బహుదృష్టాన్తపురస్సరముగ "యః = ఏ జగత్కారణముగా వినవచ్చెడి సచ్ఛబ్దవాచ్యము గలదో, సః = అదియే. ఏషః = ఈ యపరోక్షమునఁ దెలియవచ్చెడి, అణిమా = సూక్ష్మమగు నాత్మయే. ఇదం సర్వం= ఈ పరిదృశ్యమానమగు జగమంతయు, ఐతదాత్మ్యం= ఈ సదాఖ్యమగుదానిస్వరూపమే. తత్ = ఆ సదాఖ్యమే, సత్యం = త్రికాలా బాధ్యము. సః = అదియే, ఆత్మా = జగత్సాక్షియగు ప్రత్యక్స్వరూపము. శ్వేతకేతో! తత్ = ఆ సచ్ఛబ్దవాచ్యమే, త్వం= నీవు, అసి = అగుచున్నావ"ను శ్రుతియందు "సః ఆత్మా" యను ప్రకృతం= ప్రకరణసందర్భమున వినవచ్చు నట్టియు, అణిమానం = సూక్ష్మమగునట్టియు, ఆత్మానం = ఆత్మయగు, సత్ = సత్తనుదానిని, ఆత్మశబ్దేన "ఆత్మా" యను శబ్దముచే, ఉపదిశ్య = ఉపదేశించి, చేతనుఁడగు శ్వేతకేతువునకు, ఆత్మత్వేన = స్వరూపముగా "తత్త్వమసి శ్వేత కేతో" యని యుపదేశింపఁబడుచున్నది. కావున చేతనుఁడగు శ్వేతకేతువునకు స్వరూపమునగా వినవచ్చెడి సచ్ఛబ్దవాచ్యము సర్వవిధములఁ జేతనమే యైతీర వలయునని "తథా...ఉపదిశతి" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది.

ఇంతవఱకు "తదైక్షత" యనుచో ముఖ్యేక్షితృత్వమును బ్రదర్శించి "తత్తేజఐక్షత" "తాఆపఐక్షన్త" యనుచో నీక్షణము గౌణమే యని ప్రదర్శింప "అప్తేజసోస్తు విషయత్వాదచేతనత్వమ్మ"ని చెప్పఁబడుచున్నది. ఇచట 'తు' శబ్ద ముచేఁ బూర్వవైలక్షణ్యము చూపఁబడుచున్నది, అప్తేజస్సులు విషయము లగుటంజేసి యవి యచేతనము లగుటయే యిట వైలక్షణ్యము. అప్తేజస్సులు విషయము లనుటకు హేతువు "నామరూపవ్యాకరణాదౌ = నామరూపవిభాగ ముచేయుటయందుఁ, గర్తయగు సత్తుచే ప్రయోజ్యత్వేనైవ = విషయభావము చేతనే, నిర్దేశాత్ = నిర్దేశింపఁబడుటవలన; ఇయ్యవి విషయములుగావున నచేత నములని భావము. ఇట్లు విషయములగు నప్తేజస్సులయందు వినవచ్చెడి యీక్షణము 'తదైక్షత' యనుచో వినవచ్చెడి యీక్షణము ముఖ్యమగు ననుటకుఁ గారణముగ నాత్మశబ్దము వినవచ్చునట్లు, 'తత్తేజ ఐక్షత' 'తా ఆప ఐక్షన్త'

యుక్తం కూలవద్గౌణత్వమీక్షితృత్వస్య । తయోరపి చ సదధిష్ఠితత్వాపేక్షమే వేక్షితృత్వమ్ । సత స్త్వాత్మశబ్దాన్న గౌణమీక్షితృత్వ మిత్యుక్తమ్ ౬॥

అథోచ్యేతాచేతనేఽపి ప్రధానే భవత్యాత్మశబ్దః, ఆత్మనః సర్వార్థకారిత్వాత్, యథా రాజ్ఞః సర్వార్థకారిణి భృత్యే భవత్యాత్మశబ్దో మమాత్మా భద్రసేన ఇతి। ప్రధానం హి పురుషస్యాత్మనో భోగాపవర్గౌ కుర్వదుపకరోతి రాజ్ఞ

---

యనుచో వినఁబడకపోవుటచే నీ యప్తేజస్సులయొక్క యీక్షణము గౌణేక్షణమే గాని ముఖ్యేక్షణ మెంతమాత్రము గాదని "న చ... ఈక్షితృత్వస్య" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. ఆత్మశబ్దవత్ = ఆత్మశబ్దమట్లు, ముఖ్యేక్షణబోధకమగు కారణము, కూలవత్ = "కూలం పిపతిషతి" అనుచో గౌణేక్షణమువలె.

ఇట్లు ప్రకరణసందర్భముచేతను శబ్దార్థస్వారస్యముచేతను నిచట గౌణముఖ్యేక్షణవిభాగముచేసి యప్తేజస్సులయందు వినఁబడెడి యీక్షణమునందలి రహస్యము "తయోరపి... ఈక్షితృత్వమ్మ"ని వివరింపఁబడుచున్నది. అనఁగా నప్తేజస్సు లచేతనము లగుటచే నవ్వానికి ముఖ్యమగు నీక్షణము సంభవింపకపోయినను నయ్యవి సదధిష్ఠితములగుటంజేసి సత్కర్తృకమగు నీక్షణము వానియందారోపింపఁబడి "అయో దహతి" = ఇనుము కాల్చుచున్నది, యనునట్లు శ్రుతియందుఁ జెప్పఁబడియెఁగావున గౌణేక్షణమని భావము. సదధిష్ఠితత్వాపేక్షం = సత్తుచే నధిష్ఠింపఁబడుట నపేక్షించినట్టి సూత్రార్థము "సతః... ఇత్యుక్తం" అని యుపసంహరింపఁబడుచున్నది. ౬॥

పూర్వసూత్రముచే సచ్ఛబ్దవాచ్యము చేతనబోధకమగు నాత్మశబ్దముచేఁ బరామర్శచేయఁబడుటవలన సచ్ఛబ్దవాచ్యము చేతనమే యగుటంజేసి "తదైక్షత" యనుచో నీక్షణము ముఖ్యమే యని నిరూపింప సాంఖ్యుఁ డాత్మశబ్దము కేవలచేతనవాచియే యని చెప్పుట కవకాశము లేదనియు నచేతనమగు ప్రధానమందుఁగూడ వినియోగముఁ జెందుటకు సావకాశము కలదనియు "అథోచ్యేతాచేతనేఽపి ... ఆత్మశబ్ద" యని పలుకుచున్నాఁడు. అందులకు హేతువు "ఆత్మనః సర్వార్థకారిత్వాత్త" ని చెప్పఁబడుచున్నది. ఈ హేతువాక్యము తంత్రముచే నుచ్చరింపఁబడుటవలన రెండర్థములను గలిగియున్నది. అందు మొదటియర్థము—ప్రధాన మాత్మకు భోగాపవర్గరూపములగు సకలకార్యములను జేయుటచేఁ బ్రధానమును నాత్మ యనఁ బురుషుఁడు దన యాత్మగాఁ దలంచుటంజేసి ప్రధానమం దాత్మశబ్దము గౌణముగఁ బరఁగుచున్నదని "యథా రాజ్ఞః ... సంధివిగ్రహాదిషు వర్తమాన" యని దృష్టాన్తపురస్సరముగఁ జెప్పఁబడుచున్నది సర్వార్థకారిణి = సమస్తములగు కార్యములను నెఱవేర్చునట్టి యని.

ఇవ భృత్యః సంధివిగ్రహాదిషు వర్తమానః । అథ వైక ఏవాత్మశబ్దశ్చేతనాచేతన విషయో భవిష్యతి, భూతాత్మేంద్రియాత్మేతి చ ప్రయోగదర్శనాత్ । యథైక ఏవ జ్యోతిఃశబ్దః క్రతుజ్వలనవిషయః । తత్ర కుత ఏతదాత్మశబ్దాదీక్షతేరగౌణత్వ మిత్యత ఉత్తరం పఠతి—

## తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్

న ప్రధానమచేతనమాత్మశబ్దాలంబనం భవితుమర్హతి 'స ఆత్మా' ఇతి ప్రకృతం

ఇంక రెండవయర్థము — ఆత్మశబ్దమునకు సకలార్థకారిత్వాత్ = నానార్థములను బోధించెడి శక్తి యుండుటవలన గౌణముగనేగాక ముఖ్యముగాఁ గూడఁ బ్రధానమం దీక్షితృత్వము సంభవింప నొప్పునని "అథవా...క్రతుజ్వలన విషయ" యని దృష్టాన్తపురస్సరముగఁ జెప్పఁబడుచున్నది. అనఁగా నొకేజ్యోతి శ్శబ్దము జ్యోతిష్టోమాదిక్రతువును, నగ్నినిఁగూడ నెట్లు బోధించుచున్నదో యట్లే యొకయాత్మశబ్దమే చేతనమును నచేతనమునుగూడ బోధించుచున్నదని భావము. కావునఁ బ్రధానమందలి యీక్షణ మాత్మశబ్దమునకుఁ బ్రయోగ మున్నంత మాత్రమున ముఖ్యమని చెప్పుటకు వీలులేదు. కావున గౌణమే యని సాంఖ్యుఁడు పలుక నందులకు సమాధానము సూత్రకారులచేఁ జెప్పఁబడుచున్నదని సమాధాన రూపమగు సూత్రము "తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్త"ని యుపదర్శింపఁబడు చున్నది— పూర్వసూత్రమునుండి యీసూత్రమునందు నఞ్ పదము ననువృత్తి చేయుటచేఁ బూర్వపక్షము 'న' యని నిషేధింపఁబడుచున్నది. అట్టిపూర్వపక్ష నిరాసము "న ప్రధానం ... అర్హతి" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. అనఁగా నచేతనమగు ప్రధానము నాత్మశబ్దముచేఁ జెప్పుట యుక్తము గాదని భావము. హేతురూపమగు సూత్రము "స ఆత్మా ... ఇతి మోక్షోపదేశాత్త"ని వ్యాఖ్యానముచేయఁబడుచున్నది. ఇచట తన్నిష్ఠస్య = ఆత్మశబ్దముచేఁ బరామర్శింపఁబడిన సత్పదార్థమునందు నిష్ఠగలవానికి, మోక్షోపదేశాత్ = మోక్షము గలుగునని శ్రుతి యుపదేశించుటవలన నని సూత్రార్థము.

ఛాందోగ్యమందుఁ దొమ్మిదిసారు లభ్యాసము గావింపఁబడిన "స య ఏషో ఽణిమా ఐతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేత కేతో" యను వాక్యమున 'స' ఆత్మా' యను పదములచే నణిమాన మ్మన సూక్ష్మ మగు సత్పదార్థమును గ్రహించి మోక్షమునొందింపఁదగిన శ్వేతకేతువు నకు "తత్త్వమసి శ్వేతకేతో" యని యాత్మ యగు సత్పదార్థముయొక్క నిష్ఠ నుపదేశించి పిమ్మట(బదునాల్గవఖండమందలి రెండవవాక్యమగు "ఆచార్యవాన్... సంపత్స్యే" యను వాక్యముచే మోక్ష ముపదేశించుటవలన సత్పదార్థము

సదణిమానమాదాయ 'తత్త్వమసి శ్వేతకేతో' ఇతి చేతనస్య శ్వేతకేతోర్మోక్షయితవ్యస్య తన్నిష్ఠాముపదిశ్య 'ఆచార్యవాన్ పురుషో వేద' "తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యే । అథ సంపత్స్యే'' (ఛాం. 6. 14-2) ఇతి మోక్షోపదేశాత్ । యది హ్యచేతనం ప్రధానం సచ్ఛబ్దవాచ్యం తదసీతి గ్రాహయేన్ముముక్షుం చేతనం సన్తమచేతనోఽసీతి తదా విపరీతవాది శాస్త్రం పురుషస్యానర్థాయేత్యప్రమాణం స్యాత్ । న తు నిర్దోషం శాస్త్రమప్రమాణం కల్పయితుం యుక్తమ్ । యది చాజ్ఞస్య సతో ముముక్షోరచేతనమనాత్మానమాత్మేత్యుపదిశే త్ప్రమాణభూతం శాస్త్రం స శ్రద్దధానతయాఽన్ధగోలాంగూలన్యాయేన

---

ప్రధాన మెంతమాత్రము గాదని యభిప్రాయము. ఆచార్యవాన్ = ఆచార్యుఁడు గలిగిన యనఁగా నాచార్యోపదేశమును బడసినట్టి, పురుషః = పురుషుఁడు, వేద = తెలిసికొనుచున్నాఁడు. తస్య = ఆచార్యోపదేశమును బడసినవానికి, యావత్ = ఎంతకాలము, న విమోక్ష్యే = శరీరమునుండి వేఱుకాఁడో తావత్ ఏవ = అంతకాలమే, చిరం = విక్షేపము, అనఁగాఁ బ్రారబ్ధానుభవము, అథ = శరీరపాతానంతరము, సంపత్స్యే = సత్పదార్థమును బొందఁ గలఁడు. సచ్ఛబ్దవాచ్యమును సాంఖ్యాభిమతమగు ప్రధానముగా గ్రహించినచో గల్గు ననర్థము "యది హ్యచేతనం... అనర్థం చ బుచ్ఛేత్తను భాష్యముచే నిరూపింపఁబడుచున్నది. మోక్షేచ్ఛగలిగినట్టి చేతనునకు నచేతనమగు ప్రధానము "తత్ = అయ్యది, అసి = నీ వయితివి. అనఁగా అచేతనః = అచేతనుఁడవు, అసి = అయితివని, గ్రాహయేద్యది = జ్ఞానమును గలిగింపఁజేసినచో, శాస్త్రము విపరీతమును బోధించుటవలనఁ బురుషున కనర్థహేతువుగఁ బరిణమించుటచేఁ అప్రమాణం = పురుషులకుఁ బ్రమాణముకానిదైయగును. అట్లు శాస్త్రము నప్రమాణముగఁ జేయుట యుక్తముకాదుగదా! అనఁగా శాస్త్రమున కపార్థకల్పనము జేయుట యుక్తముకాదని యభిప్రాయము. సాంఖ్యాభిమతమగు నర్థము పురుషున కనర్థ మెట్లగునను విషయము "యది చాజ్ఞస్య... న ప్రతిపద్యేత" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది. అజ్ఞుఁడైన ముముక్షువునకు ననాత్మయు నచేతనమును నగుదాని నాత్మయని శాస్త్ర ముపదేశించినచో ముముక్షువు శ్రద్ధచే నంధగోలాంగూలన్యాయమున "తదాత్మదృష్టిం" తత్ = ఆ యచేతనమునందు, ఆత్మదృష్టిం= ఆత్మ యను బుద్ధిని, విడువఁడు. అద్దానికంటె భిన్నమగు నాత్మను బొందనేరఁడు. కావునఁ బురుషార్థము నుండి భ్రంశమునొందును. అనర్థములపాలగునని యర్థము. అంధగోలాంగూలన్యాయ మన నిచట నొక కథ గలదు. అదెద్దియన నొకానొక సమయమున నొకగ్రుడ్డివాఁడు మార్గముదప్పి త్రోవ తెలియక చిక్కుపడుచుండ నొకదుష్టుఁడు వానిఁ జూచి జాలిగలవానివలె నభినయించి యొకయాఁబోతు

తదాత్మదృష్టిం న పరిత్యజేత్, తద్వ్యతిరిక్తం చాత్మానం న ప్రతిపద్యేత, తథా సతి పురుషార్థాద్విహన్యేతానర్థం చ ఋచ్ఛేత్, తస్మాద్యథా స్వర్గాద్యర్థినో ఽగ్నిహోత్రాదిసాధనం యథాభూత ముపదిశతి తథా ముముక్షోరపి 'స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో' ఇతి యథాభూతమేవాత్మానముపదిశతీతి యుక్తమ్। ఏవం చ సతి తప్తపరశుగ్రహణమోక్షదృష్టాన్తేన సత్యాభిసంధస్య మోక్షోపదేశ

---

యొక్క తోఁక నా గ్రుడ్డివానిచేతి కిచ్చి యియ్యది నిన్ను నీయింటికిఁ జేర్పఁగలదని చెప్పెను. పాప మా యంధుఁడు వంచకుఁడగు నాపురుషునిమాటలు విని యా తోఁకను గట్టిగఁ బట్టుకొని విడువకుండెను. దానంజేసి యాఁబోతు గంతులు వేయుటయు గ్రుడ్డివాఁడు తోఁకను విడువకుండుటయును గలుగ గ్రుడ్డివాఁ డనర్థమును బొందెను. ఆతీరుననే యచేతనమగు ప్రధానమును దా నని తలఁచువాఁడు భంగముఁ జెందును. కావునఁ జేతనుఁడగు ముముక్షువునకుఁ జేతనమగు సత్పదార్థముతో నభేదమునే శాస్త్రము "తత్త్వమసి" యను వాక్యముచే బోధించుచున్నదని దెలియవలయునని "తస్మాత్ ... యుక్తమ్మ"ను భాష్యముచే నుపసంహారము చేయఁబడుచున్నది. అనఁగా స్వర్గాదుల నభిలషించువానికి నగ్నిహోత్రాదిసాధనము నెట్లు శాస్త్రము యథోచితముగ నుపదేశించుచున్నదో యాతీరుననే మోక్షాభిలాషికిఁగూడ యథోచితమగు నాత్మనే శాస్త్ర ముపదేశించుచున్నదని యనుట సమంజసమని భావము. ఇట్టియర్థమును గ్రహించుటచే ఛాందోగ్యషష్ఠప్రపాఠకమునఁ బదునాఱవఖండమునందలి సత్యాభిసంధునకు మోక్షమలవడుటకుఁగాను ప్రదర్శింపఁబడిన "తప్తపరశుగ్రహణము, రాజభటుల నుండి మోక్షమ"ను దృష్టాన్తము సమంజసమగునని "ఏవం చ సతి ... ఉపపద్యతే" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది.

ఒకానొకచౌర్యమున రాజభటు లిద్దఱను జౌర్యముచే నధిక్షేపించిరి. ఉభయులును జౌర్యమును గావింపలేదని నిరసించిరి. అంతట నాచోరులను దప్తపరశుగ్రహణముచే యథార్థమును రుజువుచేయవలయునని శాసింప నుభయులును దప్తపరశువును గ్రహించిరి. అందు దొంగతనముఁ గావింపనివాఁడు సత్యముచేఁ గాపాడఁబడి రాజభటులచే విడువఁబడెను. రెండవవాఁ డన్ననో యనృతముచేఁ దప్తపరశుగ్రహణముచేసి దగ్ధహస్తుఁ డగుటయేగాక కారాగృహవాసి యయ్యెను. కావునఁ బైఁజెప్పినతీరునఁగాక యచేతనమగు ప్రధానమే నీవని యుపదేశించినచో నయ్యది ముఖ్యమగు సదాత్మతత్త్వోపదేశముగాక యముఖ్యమగు సదాత్మతత్త్వోపదేశమగుచు సంపదుపాస్తిమాత్రమై యనిత్యఫలమును గలుగఁజేయును. దానంజేసి యిచట మోక్షోపదేశమే చేయఁబడలేదనవలసివచ్చునని ప్రధానము

ఉపపద్యతే। అన్యథా హ్యముఖ్యే సదాత్మతత్త్వోపదేశే "అహముక్థమస్మీతి విద్యాత్" (ఐ. ఆర. 2.1.2.6) ఇతివత్ సంపన్మాత్రమిదమనిత్యఫలం స్యాత్। తత్ర మోక్షోపదేశో నోపపద్యేత। తస్మాన్న సదణిమన్యాత్మశబ్దస్య గౌణత్వమ్। భృత్యే తు స్వామిభృత్యభేదస్య ప్రత్యక్షత్వాదుపపన్నో గౌణ ఆత్మశబ్దో మమాత్మా భద్రసేన ఇతి। అపి చ క్వచిద్గౌణః శబ్దో దృష్ట ఇతి నైతావతా శబ్దప్రమాణకేఽర్థే గౌణీ కల్పనా న్యాయ్యా। సర్వత్రానాశ్వాసప్రసంగాత్। యత్తూక్తం చేతనాచేతనయోః సాధారణ ఆత్మశబ్దః క్రతుజ్వలనయోరివ జ్యోతిః శబ్ద ఇతి, తన్న, అనేకార్థత్వస్యాన్యాయ్యత్వాత్। తస్మాచ్చేతనవిషయ ఏవ ముఖ్య ఆత్మశబ్దశ్చేత

---

సచ్ఛబ్దవాచ్యముగా గ్రహించినచోఁగల్గు దోషమునిరూపింపఁబడెనని "అన్యథా ...నోపపద్యేత" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది, గావున సూక్ష్మమగు సత్పదార్థమునం దాత్మశబ్దమునకు ముఖ్యవ్యవహారమేగాని గౌణవ్యవహార మెంత మాత్రము గాదని "తస్మాత్ ...గౌణత్వమ్" ని యుపసంహరింపఁ బడుచున్నది. స్వామిభృత్యదృష్టాన్తమున నాత్మశబ్దమునకు గౌణవ్యవహారము సిద్ధమేకాని యయ్యది ప్రకృతమునకు వర్తింప దని "భృత్యే తు ... భద్రసేన ఇతి" యను భాష్యముచేఁ జెప్పఁబడు చున్నది. ఇంతియ కాదు. లోకములో శబ్దమునకు గౌణవ్యవహార మున్నదను వ్యాజమున శబ్దమే ప్రమాణముగాఁ గల విషయములందు ముఖ్యార్థమును విడిచి గౌణార్థకల్పనము చేయుట యుక్తము కాదని "అపి చ క్వచిద్గౌణః— న్యాయ్యా" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. అట్లు వ్యవస్థలేకుండ గౌణార్థ కల్పనముచేయుట విశ్వాసహేతు వెంతమాత్రము గాదని "సర్వత్రానాశ్వాసప్రసంగాత్త"ను దోషము వ్యక్తీకరింపఁబడుచున్నది.

ఇంతవఱకు ప్రధానమునం దాత్మశబ్దము గౌణముగ వర్తింపదని ప్రదర్శించి యాత్మశబ్దమునకు నానార్థము లుండుటంజేసి యాత్మశబ్దము ప్రధానమునుగూడ ముఖ్యవృత్తిచే బోధించునను పక్షమును నిరసింపఁ దత్పక్షమును "యత్తూక్తం ... జ్యోతిఃశబ్ద ఇతి" యని యనువదించి యా పూర్వపక్షమును "తన్న" యని నిషేధించుచున్నారు. అందులకు హేతువు "అనేకార్థస్యాన్యాయ్యత్వాత్" అని ప్రదర్శింపబడుచున్నది. ఒకశబ్దమున కనేకార్థములను బ్రతిపాదించుట యన్యాయ్యమని యర్థము ఆత్మశబ్దమునకు ముఖ్యగౌణార్థవ్యవస్థ "తస్మాత్... ఇంద్రియాత్మేతి చ" యని వ్యవస్థచేయఁబడుచున్నది. అనఁగా నాత్మశబ్దమునకుఁ జేతనమందు ముఖ్యవ్యవహార మనియు భూతాదులయందుఁ జేతనసంబంధ ముండుట వలన నౌపచారికమనియు విభాగము. దానఁజేసి భూతాత్మ యింద్రియాత్మ యను వ్యవహారము గౌణవ్యవహారము. ఆత్మశబ్ద మొకానొకవేళ చేతనాచేతన సాధారణమని యంగీకరించినను, ననఁగా ననేకార్థముల కాస్పదమైనను నర్థగ్రహ

నతోఽప్యుపచారాద్భూతాదిషు ప్రయుజ్యతే భూతాత్మేంద్రియాత్మేతి చ। సాధారణత్వేఽప్యాత్మశబ్దస్య న ప్రకరణముపపదం వా కించిన్నిశ్చాయకమన్తరేణాన్యతరవృత్తితా నిర్ధారయితుం శక్యతే। న చాత్రాచేతనస్య నిశ్చాయకం కించిత్కారణమస్తి। ప్రకృతం తు సదీక్షితృ సన్నిహితశ్చేతనః శ్వేతకేతుః। న హి చేతనస్య శ్వేతకేతోరచేతన ఆత్మా సంభవతీత్యవోచామ। తస్మాచ్చేతనవిషయ ఇహాత్మశబ్ద ఇతి నిశ్చీయతే। జ్యోతిశ్శబ్దోఽపి లౌకికేన ప్రయోగేణ జ్వలన ఏవ రూఢోఽర్థవాదకల్పితేన తు

---

కానవసరమునఁ బ్రకరణసందర్భమునుబట్టిగాని యచ్చో నుండు నుపపదములఁబట్టిగాని యర్థనిర్ణయమును జేయవలయునుగాని యథేచ్ఛగ నర్థకల్పనము గావించుట యనుచితమని "సాధారణత్వే ఽపి...నిర్ధారయితుం శక్యతే" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. అన్యతరవృత్తితా = చేతనమా యచేతనమా యనుటలో నొక్క యని

ఇఁకఁ బూర్వపక్షిచే సాధారణమని పలుకఁబడిన యాత్మశబ్దమునకుఁ బ్రకరణసందర్భమునుబట్టి యచేతనమను నర్థము నిర్వచింప వీలులేదని "న చాత్ర ...కారణమస్తి" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. ప్రకరణసందర్భమును బట్టి యాత్మశబ్దము చేతనపరమే యని "ప్రకృతం తు ..నిశ్చీయతే" యని నిర్వచింపఁబడుచున్నది. ప్రకరణసందర్భమేమన—నీక్షణకర్త సత్తు ఉపదేశమునకు సన్నిహితుఁడు చేతనుఁడగు శ్వేతకేతువు. చేతనుఁడగు శ్వేతకేతువునకు నచేతనమాత్మ యన స్వరూప మెట్లగును? అనఁగా నచేతన మెంతమాత్రము స్వరూపముగాదు. కావున నిచట నాత్మయనఁ జేతనమునే గ్రహింపవలయును. ఆత్మశబ్దము చేతనాచేతనసాధారణ మనుటకు నియఁబడిన జ్యోతిఃశబ్దదృష్టాన్తము సమంజసము గాదని "జ్యోతిఃశబ్దోఽపి...అదృష్టాన్త" యని నిరసింపఁబడుచున్నది. అనఁగా జ్యోతిఃశబ్దము లోకమునందలి వ్యవహారముచే నగ్నిరూపమగు నర్థమునందే రూఢ మగుచున్నది. వేదమునం దన్ననో యర్థవాదసందర్భమునుబట్టి జ్వలనసాదృశ్యముచే స్వర్గమును బ్రకాశింపఁజేయు జ్యోతిష్టోమ మను క్రతువునందు గౌణవ్యవహారమును గనుచున్నది. అంతియ కాని క్రతువునందు రూఢము గాలేదు. కావున నియ్యది ప్రకృతమున దృష్టాన్త మెంతమాత్రము గానేరదు. జ్వలనసాదృశ్య మనఁగా, జ్యోతి యన నగ్ని యెట్లు వస్తువులను బ్రకాశింపఁజేయుచున్నదో యాతీరుననే స్తోమములతోఁ గూడిన క్రతువు స్వర్గమును బ్రకాశింపఁజేయుచు నగ్నిసాదృశ్యమును బొందుట. కావునఁ గ్రతువు గౌణముగ జ్యోతిశ్శబ్ద వ్యవహారమును "వసన్తేవసన్తే జ్యోతిషా యజేత" యనువాక్యమునఁ గనుచున్నది.

ఇట్లాత్మశబ్దమునకు, గౌణవ్యవహారమును పూర్వపక్షివాదమును ......చుటకు "తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్త" ను సూత్రమును వ్యాఖ్యానము

జ్వలన సాదృశ్యేన క్రతౌ ప్రవృత్త ఇత్యదృష్టాన్తః । అథవా పూర్వసూత్ర ఏవాత్మశబ్దం నిరస్తసమస్తగౌణత్వసాధారణత్వశంకతయా వ్యాఖ్యాయ తతః స్వతంత్ర ఏవ ప్రధానకారణనిరాకరణహేతుర్వ్యాఖ్యేయః " తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్ " ఇతి తస్మాన్నాచేతనం ప్రధానం సచ్ఛబ్దవాచ్యమ్॥

కుతశ్చ న ప్రధానం సచ్ఛబ్దవాచ్యమ్ ॥౭॥

## హేయత్వావచనాచ్చ

యద్యనాత్మైవ ప్రధానం సచ్ఛబ్దవాచ్యం "స ఆత్మా తత్త్వమసి" ఇతీహోపదిష్టం స్యాత్సతదుపదేశశ్రవణాదనాత్మజ్ఞతయా తన్నిష్ఠో మాభూదితి ముఖ్యాత్మన

---

గావించి ప్రకారాంతరముచేఁగూడ నీసూత్రమునకు వ్యాఖ్యానమును " అథవా... ఇతి " యను భాష్యముచేఁ గావించుచున్నారు. అనఁగా "గౌణశ్చేన్నాత్మశబ్దాత్త" ను పూర్వసూత్రమునందు స్మరింపఁబడిన యాత్మశబ్దము ముఖ్యమా గౌణమా సాధారణమా యను సందియములచే విచారించి యయ్యది ముఖ్యమే యగుచుఁ జేతనపరమే యగునని నిరూపించి, పిమ్మట నట్టి సదాత్మనిష్ఠునకే యిచట మోక్ష ముపదేశింపఁబడుటవలన సచ్ఛబ్దవాచ్యము ప్రధాన మెంత మాత్రము గాదని నిరాకరించుటకు హేతువుగా నీసూత్రమును వ్యాఖ్యానము గావింపవచ్చునని భావము.

ఇట్లచేతనమగు ప్రధానము సచ్ఛబ్దవాచ్యము గాదని "తస్మాత్ ... సచ్ఛబ్దవాచ్యమ్మ్" ను భాష్యముచే నుపసంహారము చేయఁబడుచున్నది. ॥౭॥

ప్రధానము సచ్ఛబ్దవాచ్యము గాదనుటకు హేత్వంతరముగా స్మరింపఁబడిన వేఱొకసూత్రమునకుఁ బ్రతీకముగా "కుతశ్చ న ప్రధానం సచ్ఛబ్దవాచ్యమ్మ్"న భాష్యము చెప్పఁబడుచున్నది. సూత్ర మేమన—

## హేయత్వావచనాచ్చ

హేయత్వస్య=హేయత్వమును బోధించు పదముయొక్క అవచనాత్= చెప్పకపోవుటవలన గూడ నాత్మశబ్దము చేతనపరమే యని యర్థము, గూఢాసంధిపురస్సరముగ సాంఖ్యపూర్వపక్షము నుద్దేశించి యీసూత్రము చెప్పఁబడుచున్నది. ఇచట నుద్దేశింపఁబడిన సాంఖ్యపూర్వపక్ష మెద్ది యన నచేతనమగు ప్రధానమే సచ్ఛబ్దవాచ్యమనియు నయ్యదియే నీ వయితి వనియును శ్రుతి చెపచున్నదని "యద్యనాత్మైవ... ఉపదిష్టం స్యాత్" నియనువదించియట్లు దలఁచిన చో నియ్యది సత్యము గాదుగావున ముఖ్యము నుపదేశించు శాస్త్ర మట్టి యుపదేశవ యొక్క హేయత్వమునుగూడ బోధింపవలయునని " సతదుపదేశశ్రవణాత్

ముపదిదిక్షుస్తస్య హేయత్వం బ్రూయాత్ । యథా ఽరుంధతీం దిదర్శయిషుస్తత్సమీపస్థాం స్థూలాం తారామముఖ్యాం ప్రథమమరుంధతీతి గ్రాహయిత్వా తాం ప్రత్యాఖ్యాయ పశ్చాదరుంధతీమేవ గ్రాహయతి తద్వన్నాయమాత్మేతి బ్రూయాత్ । న చైవమవోచత్ । సన్మాత్రాత్మావగతినిష్ఠైవ హి షష్ఠప్రపాఠకపరిసమాప్తిర్దృశ్యతే। చశబ్దః ప్రతిజ్ఞావిరోధాభ్యుచ్చయప్రదర్శనార్థః । సత్యపి హేయత్వవచనే ప్రతిజ్ఞావిరోధః ప్రసజ్యేత । కారణవిజ్ఞానాద్ధి సర్వం విజ్ఞాతమితి ప్రతిజ్ఞాతమ్ "ఉత తమాదేశమప్రాక్ష్యో యేనాశ్రుతం శ్రుతం భవత్యమతం మతమవిజ్ఞాతం విజ్ఞా

---

హేయత్వం బ్రూయాత్”ను భాష్యముచే జెప్పఁబడుచున్నది. అట్టి హేయత్వ వచనావసర మరుంధతీదర్శనన్యాయము ప్రదర్శనములో నుండు "యథా...తద్వత్”ను భాష్యముచేఁ బ్రదర్శింపఁబడుచున్నది. లోకములో సూక్ష్మమగు నరుంధతీనక్షత్రమును జూపునపుడు ప్రథమమున నానక్షత్రసమీపమందుండు స్థూలమగు నక్షత్రమును జూపి యనంతర మయ్యది కాదని నిషేధించి వాస్తవమగు నరుంధతీనక్షత్రము నెట్లు జూపుదురో యాతీరున బ్రకృతమున నచేతనమగు ప్రధానమే నీవని చెప్పి శ్రుతి పిమ్మట నట్టిసత్తు నీవుగావని యద్దాని నాక్షేపించి వేఱొకదాని నుపదేశింపవలయును. అట్లు శ్రుతియం దెంతమాత్రము చెప్పఁబడలేదని "న చైవమవోచత్”ని నిర్వచింపఁబడుచున్నది. శ్రుతియందు జెప్పఁబడలేదనుటకు, షష్ఠప్రపాఠకమంతయు సత్పదార్థమునే యాత్మగా బోధించుటయందుఁ బర్యవసానము నొందుచున్నదని "సన్మాత్రాత్మావగతినిష్ఠైవ...దృశ్యతే” యని హేతువు చెప్పఁబడుచున్నది.

ఇట్లు సూత్రమునందలి హేతువచనమును వ్యాఖ్యానముచేసి 'చ' శబ్దముచే నభిప్రేతమగు నర్థము "చశబ్దః...ప్రదర్శనార్థః” అని సంగ్రహముగఁ బ్రదర్శింపఁబడుచున్నది. సంగ్రహవాక్యమున కర్థము "సత్యపి హేయత్వవచనే ప్రతిజ్ఞావిరోధః ప్రసజ్యేత” యని చెప్పఁబడుచున్నది. ప్రతిజ్ఞావిరోధము "కారణవిజ్ఞానాద్ధి భోక్తృవర్గస్య” యను భాష్యముచేఁ వివరింపఁబడుచున్నది. ఇందుఁ బ్రతిజ్ఞ "కారణవిజ్ఞానాద్ధి ... ప్రతిజ్ఞాత”మ్మను భాష్యముచే నిరూపింపఁబడుచున్నది ప్రతిజ్ఞను బోధించు శ్రుతి "ఉత తం...వాక్యోపక్రమే శ్రవణాత్”ని చూపఁబడుచున్నది. ఉద్దాలకుఁడు శ్వేతకేతువు నుద్దేశించి "నీవు, యేన = ఏ యొక్క వస్తువిజ్ఞానముచేత, అశ్రుతం=వినఁబడనిది, శ్రుతం భవతి= వినఁబడునది యగుచున్నదో, అమతం=చింతింపఁబడనిది మతం=చింతింపఁబడినది యగుచున్నదో, అవిజ్ఞాతం= తెలియఁబడనిది, విజ్ఞాతం= తెలియఁబడినది యగుచున్నదో, తం=అట్టి, ఆదేశం=ఉపదేశమును, అప్రాక్ష్యః=మీగురువుల నడిగితివా? యని యడుగగా శ్వేతకేతువు "భగవః=మహానుభావ ! సః = అట్టి, ఆదేశః =

తమితి, కథం ను భగవః స ఆదేశో భవతీతి, యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృన్మయం విజ్ఞాతం స్యాద్వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్‌ః "ఏవం సోమ్య స ఆదేశో భవతీతి" (ఛాం 6-1-1,3) ఇతి వాక్యోపక్రమే శ్రవణాత్ । న చ సచ్ఛబ్దవాచ్యే ప్రధానే భోగ్యవర్గకారణే హేయత్వేనాహేయత్వేన వా విజ్ఞాతే భోక్తృవర్గో విజ్ఞాతో భవతి, అప్రధాన వికారత్వాద్భోక్తృవర్గస్య । తస్మాన్న ప్రధానం సచ్ఛబ్దవాచ్యమ్॥ ౮॥

కుతశ్చ న ప్రధానం సచ్ఛబ్దవాచ్యమ్-

---

ఉపదేశము, కథం ను భవతీతి = ఎట్లు కాఁగల దని ప్రశ్నింప నుద్దాలకుఁడు, సోమ్య = ప్రియదర్శనుఁడా, ఏకేన = ఒకటి యగు, మృత్పిండేన = మట్టి ముద్దచే, సర్వం = సమస్తమగు మృణ్మయం = మృద్వికారమగు ఘటశరావాదిక మంతయు, యథా = ఏతీరున విజ్ఞాతం స్యాత్ = తెలియఁబడుచున్నదో, ఎట్లు వికారః = కార్యరూపము వాచారంభణం = వాక్కుచే బయలువెడలిన, నామ ధేయం = నామమాత్రమే యగుటంజేసి మృత్తికేత్యేవ = మట్టియనునదియే, సత్యం = నిత్యమగుచున్నదో, ఏవం = ఆతీరుననే, సోమ్య = ప్రియదర్శనుఁడా! స ఆదేశః = ఆ యుపదేశము, భవతి = అగుచున్నది.ఇట్లు కారణమగు సత్పదార్థమును దెలిసికొనినచో సర్వమును దెలియునని భావము. సచ్ఛబ్దవాచ్యమే ప్రధాన మగుచో నీప్రతిజ్ఞకు భంగము గల్గు నని "న చ సచ్ఛబ్దవాచ్యేవిజ్ఞాతో భవతి" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది అనఁగాఁ బ్రధానము భోగ్యవర్గమునకుఁ గారణముగా నిరూపింపఁబడుటంజేసి హేయముగనో యహేయముగనో ప్రధానము తెలియఁబడినచోఁ దత్కార్యమగు భోగ్యవర్గముమాత్రము తెలియఁబడును. కాని భోక్తృవర్గ మెంతమాత్రము దెలియఁబడదు. దానంజేసి సర్వవిజ్ఞానము గలుగుట కవకాశము లేదని తాత్పర్యము. ప్రధానము తెలియఁ బడినచో భోక్తృవర్గ మెందులకుఁ దెలియఁబడ దనిన నందులకు హేతువు "అప్రధానవికారత్వాద్భోక్తృవర్గస్య" యని తెలియఁబడుచున్నది. భోక్తృ వర్గస్య = భోక్తృవర్గము, అప్రధానవికారత్వాత్ = ప్రధానవికారము గాక పోవుటవలన. భోక్తృవర్గము ప్రధానవికారము గాకపోవుటవలనఁ బ్రధానజ్ఞానము చే భోక్తృవర్గజ్ఞానము కలుగనేరదని భావము. కావున "తస్మాత్ ... సచ్ఛబ్ద వాచ్య"మ్మని యుపసంహరింపఁ బడుచున్నది. ॥౮॥

ప్రధానము సచ్ఛబ్దవాచ్యము గాదనుటకు హేత్వంతరముగా నిరూపింపఁబడి సూత్రమునకుఁ బ్రతీకము "కుతశ్చ న ప్రధానం సచ్ఛబ్దవాచ్యమ్మ" ని చెప్పఁ బడుచున్నది. సూత్రము-

# స్వాప్యయాత్

తదేవ సచ్ఛబ్దవాచ్యం కారణం ప్రకృత్య శ్రూయతే- "యత్రైతత్పురుషః స్వపితినామ సతా సోమ్య తదా సంపన్నో భవతి స్వమపీతో భవతి తస్మాదేనం స్వపితీత్యాచక్షతే స్వం హ్యపీతో భవతి" ॥ (ఛాం 6-8-1) ఇతి ఏషా శ్రుతిః స్వపితీత్యేతత్పురుషస్య లోకప్రసిద్ధం నామ నిర్వక్తి । స్వశబ్దేనేహాత్మోచ్యతే । యః ప్రకృతస్సచ్ఛబ్దవాచ్యస్తమపీతో భవత్యపి గతో భవతీత్యర్థః । అపి పూర్వస్యైతే

---

# స్వాప్యయాత్

అని. స్వస్మిన్=స్వస్వరూపమునందే, అప్యయాత్=లయము వినఁబడుట వలన నని యర్థము. సుషుప్తియందు జీవుఁడు స్వస్వరూపమగు నాత్మయందే లయముఁ జెందుననియు నట్లు లయముఁజెందినట్లు సుషుప్తికాలమం దగు జీవుని యొక్క 'స్వపితి' యను నిర్వచనముచేఁ దెలియవచ్చుచున్నదనియు నట్టిస్థితి యందు సత్పదార్థముతో జీవుఁడు గూడియుండునని శ్రుతిచేఁ జెప్పఁబడుటంజేసి సచ్ఛబ్దవాచ్యము, జీవునిస్వరూపమగు నాత్మయే కావలయునుగాని, యచేతనమగు ప్రధాన మెంత్రమాత్రము గానేరదనియు నెనిమిదవ ఖండము యొక్క పర్యాలోచనము వలన దెలియవచ్చుచున్నదని నిర్వచింప నా శ్రుతియొక్క యర్థము దృష్టాన్త పురస్సరముగా భాష్యముచే వివరింపఁబడుచున్నది.

ఈసూత్రముచే సూచితమగు శ్రుతి "తదేవ...భవతీతి" యను భాష్యమునఁ జెప్పఁబడుచున్నది. యత్ర = ఏ సుషుప్త్యవస్థయందు, పురుషః = జీవుఁడు, స్వపితి = "స్వపితి" అను, ఏతత్ = ఈప్రసిద్ధమగు, నామ = పేరుగలవాఁడగుచున్నాఁడో, సోమ్య! తదా = అప్పుడు, సతా = సత్పదార్థముతో, సంపన్నః= కూడుకొనినవాఁడై, భవతి = అగుచున్నాఁడు. స్వమ్ = స్వస్వరూపమగు నాత్మనుగూర్చి, అపీతః = లయమును బొందినవాఁడు, భవతి = అగుచున్నాఁడు. తస్మాత్ = ఆకారణముచే, ననఁగా నేకారణముచే స్వస్వరూపమునందు లయము బొందుచున్నాఁడో, యాకారణముచే నని భావము. ఏనం = ఈ నిద్రించు పురుషుని, స్వపితి ఇతి = 'స్వపితి' యని, ఆచక్షతే = బుధులు చెప్పుచున్నారు. హి = ఆకారణముచే, స్వం = స్వస్వరూపమునుగూర్చి, అపీతః = లయమును బొందినవాఁడై భవతి = అగుచున్నాఁడు. ఈ శ్రుతియొక్క తాత్పర్యము "ఏషా శ్రుతిః...అపిగతో భవతీత్యర్థ" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. అపీతశబ్దమునకు లయమే యర్థమని దృష్టాన్తపురస్సరముగ "అపిపూర్వస్య... ప్రయోగదర్శనాత్త"ని నిర్వచింపఁబడుచున్నది. సుషుప్తియందలి విశేషమును

ర్థయార్థత్వం ప్రసిద్ధం, ప్రభవాప్యయావిత్యుత్పత్తిప్రలయయోః ప్రయోగదర్శ నాత్ । మనఃప్రచారోపాధివిశేషసంబంధాదింద్రియార్థాన్ గృహ్ణంస్తద్విశేషాపన్నో జీవో జాగర్తి । తద్వాసనావిశిష్టః స్వప్నాన్ పశ్యన్ మనశ్శబ్దవాచ్యో భవతి । స ఉపాధిద్వయోపరమే సుషుప్తావస్థాయాముపాధికృతవిశేషాభావాత్స్వాత్మని ప్రలీన ఇవేతి॥ స్వం హ్యపీతో భవతీత్యుచ్యతే । యథా హృదయశబ్దనిర్వచనం శ్రుత్యా దర్శితమ్- "స వా ఏష ఆత్మా హృది తస్యైతదేవ నిరుక్తం

---

దెల్పియఁజెప్ప జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థావిశేషములు క్రమముగా "మనఃప్రచారోపాధివిశేష...ఇత్యుచ్యతే" యని చెప్పఁబడుచున్నవి. మనఃప్రచారమన నంతఃకరణవృత్తిపరిణామము. అట్టిపరిణామరూపమగు నుపాధికిని విశేషమన శ్రోత్రాదీంద్రియములు, అవ్వానికిని, సంబంధాత్ = సంబంధముకలన అనఁగా నంతఃకరణవృత్తు లింద్రియములద్వారా బహిర్నిర్గతము లగుటవలన, ఇంద్రియార్థాన్ = ఇంద్రియవిషయము లగు శబ్దాదులను, దదాశ్రయము లగు కరచరణాద్యవయవములను, గృహ్ణన్ = గ్రహించుచు, తద్విశేషాపన్నః =శబ్దాద్యాకారభావరూపమగు స్థూలదేహముతోఁ దాదాత్మ్యమును బొందిన, జీవః = జీవుఁడు, జాగర్తి = మేలుకొనియున్నాఁ డను వ్యవహారమును బొందుచున్నాఁడు. అనఁగా జీవుఁడు కరచరణాద్యవయవవిశిష్టమగు స్థూలశరీరముతోఁ దాదాత్మ్యాభిమానమును జెందునపుడు మేలుకొనియున్నాఁడను వ్యవహారమును బొందుచున్నాఁడు. తద్వాసనావిశిష్టః = జాగ్రత్కాలసంబంధమగు ననుభవసంస్కారములతోఁ గూడినవాఁడై, యంతఃకరణపరిణామ మను నుపాధిమాత్రముచే, స్వప్నాన్ = వాసనామాత్రములగు నాకారములు గలిగిన విషయములను, పశ్యన్=చూచుచున్నవాఁడై జీవుఁడు, మనఃశబ్దవాచ్యోభవతి=సూక్ష్మమగు నంతఃకరణమే రూపముగాఁ గలవాఁడగుచున్నాఁడు. అనఁగా స్వప్నావస్థయందు జీవుఁ డంతఃకరణమే శరీరముగాఁ గలిగి వ్యవహరించుచున్నాఁ డని భావము. ఇఁక సుషుప్త్యవస్థయం దన్ననో, స్థూలసూక్ష్మము లనెడి రెండుపాధులు నస్తమింప నుపాధికృతవిశేషములు లేకపోవుటవలన, స్వాత్మని = స్వస్వరూపమునందే, ప్రలీన ఇవ = లయము జెందినవానివలె నుండుననునభిప్రాయము "స్వం హ్యపీతో భవతి" యను శ్రుతిచేఁ జెప్పఁబడుచున్నది.

ఇట్లు 'స్వపితి' యను శబ్దనిర్వచనముచే సుషుప్తికాలమందలి స్థితిని బ్రదర్శించుట శబ్దప్రమాణసిద్ధమే యనుటకు దృష్టాన్తములు "యథాహృదయశబ్దనిర్వచనం ... ఇతి చ" యని నిర్వచింపబడుచున్నది. సః, ఏషః, ఆత్మా = ఆయీ యాత్మ, హృదివై = హృదయమందున్నది. కావుననే తస్య = ఆహృదయమునకు, హృది అయం ఇతి = హృదయమునం దాత్మయున్నది. అని, నిరుక్తిః=

హృద్యయమితి తస్మాద్ధృదయమితి॥ (ఛాం.8-3-3) ఇతి। యథా వా ఽశనాయోదన్యాశబ్దప్రవృత్తిమూలం దర్శయతి శ్రుతిః- "ఆప ఏవ తదశితం నయన్తే, తేజ ఏవ తత్పీతం నయన్తే" (ఛాం 6-8-3-5) ఇతి చ। ఏవం స్వమాత్మానం సచ్ఛబ్దవాచ్యమపీతో భవతీతీమ మర్థం స్వపితినామ నిర్వచనేన దర్శయతి। న చ చేతన ఆత్మా ఽచేతనం ప్రధానం స్వరూపత్వేన ప్రతిపద్యేత॥ యది పునః

---

విశేషనిర్వచనము. తస్మాత్ = ఆకారణమువలననే, హృదయమితి = హృదయమని హృదయమునకుఁ బేరుకలిగెను.

ఇంతియ కాదు. "అశనాయా, ఉదన్యా" యను శబ్దములయొక్క ప్రవృత్తికి, మూలం = కారణముగూడ, శ్రుతిచేఁ జెప్పఁబడుచున్నదని "యథావా...శ్రుతి' యని చెప్పుచున్నారు. ఆశ్రుతు లెవ్వియన- "ఆపఏవ తదశితం నయన్తే" యనియు, "తేజఏవతత్పీతం నయన్తే" యనియును. ఇందు మొదటిశ్రుతిచే నశనాయాశబ్దముయొక్క నిర్వచనము చేయఁబడుచున్నది. ఆపః= ఉదకములే, తదశితం = ఆ తినఁబడిన యన్నమును, నయన్తే = రసాదిరూపము నొందించుచున్నది. అనఁగాఁ బురుషునిచేఁ దినఁబడెడి యన్నము నుదకములు రసాదిరూపముగా నొందించుటచే నాఁకలి జనించు గావున నుదకములకు నాఁకలి యను నర్థము నిచ్చు "అశనాయా" యను శబ్దముచే వ్యవహారము గల్గుచున్నది. ఆతీరుననే 'ఉదన్యా' శబ్దముయొక్క యర్థము "తేజ ఏవ తత్పీతం నయన్తే" యను వాక్యముచే నిర్వచింపఁబడుచున్నది. తేజ ఏవ = తేజస్సే, తత్పీతం = ఆ పానముచేయఁబడిన యుదకములను, నయం తే=లోహితాదిరూపము నొందించును. అనఁగాఁ బురుషునిచేఁ ద్రావఁబడిన యుదకములను దేజము లోహితాదిరూపము నొందించును గావునఁ దేజమునకు నుదకములను నడిపించునదియను నర్థమును గలుగఁజేయునట్టియు దప్పిక యను నర్థమును గలుగఁజేయునట్టియు 'ఉదన్యా' యను శబ్దముచే వ్యవహారము గలుగుచున్నదని భావము.

ఇట్లు శబ్దనిర్వచనముచేఁ దత్త్వము సువ్యక్త మగుననుటకు దృష్టాన్తములఁ బ్రదర్శించి స్వపితిశబ్దనిర్వచనముచే జీవుఁడు తన యాత్మ యగు సచ్ఛబ్దవాచ్యమునుగూర్చి సుషుప్తియందు లయము నొందుచున్నాఁడని "ఏవం స్వమాత్మానం...దర్శయతి" యను భాష్యముచేఁ బ్రదర్శించుచున్నారు. చేతనుఁడగు జీవునకు స్వరూప మెంతమాత్ర మచేతనము గానేరదు. కావున సచ్ఛబ్దవాచ్యమచేతనమగు ప్రధాన మెంతమాత్రము గానేరదని "న చ చేతనః...ప్రతిపద్యేత" యని చెప్పఁబడుచున్నది. ఒకానొకవేళ "స్వం హ్యపీతో భవతి" యను శ్రుతియందలి 'స్వం' శబ్దమునకు స్వస్వరూప మనుటకు మారుగ దనసంబంధమయిన దాని నని ప్రధానపరముగా నర్థముచేసినచోఁ జేతన మచేతనమందు లయముఁ

ప్రధానమేవాత్మీయత్వాత్స్వశబ్దేనోచ్యేత, ఏవమపి చేతనో ఽ చేతనమప్యేతీతి విరుద్ధమాపద్యేత॥ శ్రుత్యంతరం చ "ప్రాజ్ఞేనాత్మనాసంపరిష్వక్తో న బాహ్యం కించన వేద నాంతరమ్" (బృహ 4-3-21) ఇతి। సుషుప్తావస్థాయాం చేతనే ఽ ప్యయం దర్శయతి॥ అతో యస్మిన్నప్యయః సర్వేషాం చేతనానాం తచ్చేతనం సచ్ఛబ్దవాచ్యం జగతః కారణం న ప్రధానమ్॥ ౯॥ కుతశ్చ న ప్రధానం జగతః కారణమ్-

---

జైందు నను విరుద్ధార్థము గలుగునని "యది పునః. . ఆపద్యేత" యను భాష్యము చే దోషము ప్రతిపాదింపఁబడుటవలన సచ్ఛబ్దవాచ్యము ప్రధాన మెంతమాత్రము గాదని యాశయము ఆత్మీయత్వాత్ = తనతో సంబంధించినదగుటవలన, స్వపితినామనిర్వచనముచేఁ బ్రతిపాదింపఁబడిన విశేషణము శ్రుత్యంతరముచేఁగూడ బోధింపఁబడుచున్నదని బృహదారణ్యకశ్రుతి "శ్రుత్యంతరం చ.. దర్శయతి" యను భాష్యముచేఁ బ్రదర్శింపఁబడుచున్నది ప్రాజ్ఞేన = పుష్కలజ్ఞానరూపమగు, ఆత్మనా = స్వరూపముచే, సంపరిష్వక్తః = కూడుకొనినవాఁడై బాహ్యం = బహిఃప్రదేశమందలి, కించన = ఏవస్తువును, న వేద = తెలిసికొనజాలకున్నాఁడు ఆన్తరం = లోపలివస్తువునైన, న వేద = తెలిసికొనఁజాలకున్నాఁడు ఫలితము "అతో యస్మిన్. న ప్రధానమ్మ"ను భాష్యముచే జెప్పఁబడుచున్నది సర్వేషాం = సకలచేతనములగు జీవులక్కు, యస్మిన్ = దేనియందు, అప్యయం = లయమో, తత్ = ఆ, సచ్ఛబ్దవాచ్యం=సచ్ఛబ్దముచే బ్రతిపాదింపఁబడు, జగతః కారణం = జగదుత్పత్తిస్థితిలయకారణము, చేతనం = చేతనమగు బ్రహ్మమేగాని, న ప్రధానం = సాంఖ్యపరికల్పితమును జడమునునగు ప్రధాన మెంతమాత్రము గాదు ॥౯॥

ఇట్లు పైయయిదు సూత్రములచేతను ఛాందోగ్యషష్ఠప్రపాఠకము జగత్కారణముగా వినఁబడెడి సచ్ఛబ్దవాచ్యము చేతనమగు బ్రహ్మమే గాని సాంఖ్యపరికల్పితమగు ప్రధాన మెంతమాత్రము గాదని పుష్కలముగ నిరూపించి ప్రకరణాంతరపర్యాలోచనముచేఁ గూడ సాంఖ్యపరికల్పితమగు ప్రధానము జగత్కారణ మెంతమాత్రము గాదనియును నిరూపింప స్మరింపఁబడిన సూత్రమునకు "కుతశ్చ న ప్రధానం జగతః కారణ"మ్మని ప్రతీకము నిరూపింపఁబడుచున్నది సూత్ర మెద్ది యన—

## గతిసామాన్యాత్.

యది తార్కికసమయా ఇవ వేదాంతేష్వపి భిన్నా కారణావగతిరభవిష్యత్క్వచిచ్చేతనం బ్రహ్మ జగతః కారణం క్వచిదచేతనం ప్రధానం క్వచిదన్యదేవేతి, తతః కదాచిత్ప్రధానకారణవాదానురోధేనాపీక్షత్యాదిశ్రవణమకల్పయిష్యత్। న త్వేతదస్తి। సమానైవ హి సర్వేషు వేదాన్తేషు చేతనకారణావగతిః। "యథా అగ్నేర్జ్వలతస్సర్వా దిశో విస్ఫులింగా విప్రతిష్ఠేరన్నేవమేవైతస్మాదాత్మనః సర్వే ప్రాణా యథాయతనం విప్రతిష్ఠన్తే, ప్రాణేభ్యో దేవా దేవేభ్యో లోకాః।" ( కౌ. 3. 3 ) ఇతి। "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః" ( తై 2 1 ) ఇతి, "ఆత్మత ఏవేదం సర్వం" ( ఛాం 7-26-1 ) ఇతి, "ఆత్మన ఏష ప్రాణో జాయతే"

---

## గతిసామాన్యాత్

అని గతేః = అర్థావగతియొక్క, సామాన్యాత్ = సమానభావము దెలియఁబడుటవలన ననఁగా సకలవేదాంతములయందుఁగూడ జగత్కారణము చేతనమే యను నర్థము సామాన్యముగఁ దెలియవచ్చుటచే జడమగు ప్రధానము జగత్కారణ మెంతమాత్రము గాదని తాత్పర్యము

పురుషప్రణీతములగు తంత్రములందుఁ బలువిధములగు జగత్కారణములు దెలియవచ్చుచున్నవి ఎట్లన కొన్నితంత్రములయందుఁ జేతనమగు బ్రహ్మము జగత్కారణమనియు మఱికొన్నిటియందు నచేతనమగు ప్రధానమనియు మఱికొన్నిటియందుఁ బరమాణువులనియు శూన్యమనియు స్వభావమనియుఁ దెలియవచ్చుచున్నది, ఆతీరున నే వేదాంతములయందుఁగూడ భిన్నస్థలములయందు భిన్నములగు జగత్కారణములు వర్ణింపఁబడినచో నిచట వినఁబడు నీక్షిత్యాది విశేషములుగూడ నెదియోయొకతీరునఁ బ్రధానకారణవాదమున కనుగుణముగ సమన్వయము చేసినఁ జేయవచ్చును కాని యట్లిచట నట్టివి గానము వినఁబడ లేదు ఇంతియ కాదు సకలవేదాంతములయందును జేతనకార్యావగతియే సమానముగఁ దెలియవచ్చుచున్నదని సూత్రార్థము "యది చేతనకారణావగతి" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది భిన్నప్రకరణమందుఁ దెలియవచ్చెడి శ్రుతులుగూడఁ జేతనమగు నాత్మయే జగత్కారణమని ప్రతిపాదించుచున్నవని యథా . దర్శయంతి సర్వే వేదాంతా" యను భాష్యముచేఁ గొన్నిశ్రుతులు ప్రదర్శింపఁబడుచున్నవి ఈశ్రుతులయందు వినఁబడెడి పంచమ్యంతమగు నాత్మశబ్దమువలన జగదుపాదానకారణ మాత్మయే యని తెలియవచ్చుచున్నది ఆత్మశబ్దం మన్ననో చేతనవాచకమని "తన్నిష్ఠస్య చ మోక్షోపదేశాత్తు" ను

(ప్ర 3-3) ఇతి చాత్మనః కారణత్వం దర్శయన్తి సర్వే వేదాన్తాః। ఆత్మశబ్దశ్చ చేతనవచన ఇత్యవోచామ। మహచ్చ ప్రామాణ్యకారణ మేతద్య ద్వేదాంత వాక్యానాం చేతనకారణత్వే సమానగతిత్వం చక్షురాదీనామివ రూపాదిషు। అతో గతి సామాన్యాత్సర్వజ్ఞం బ్రహ్మ జగతః కారణమ్॥ ౧౦ ॥

కుతశ్చ సర్వజ్ఞం బ్రహ్మ జగతః కారణమ్

## శ్రుతత్వాచ్చ

"స్వశబ్దేనైవ చ సర్వజ్ఞ ఈశ్వరో జగతః కారణమితి శ్రూయతే శ్వేతాశ్వతరాణాం మంత్రోపనిషది సర్వజ్ఞమీశ్వరం ప్రకృత్య "సకారణం కరణాధిపాధిపో న చాస్య

---

సూత్రముయొక్క భాష్యావసరమున వివరింపఁబడెనని "ఆత్మశబ్దశ్చ ..అవో చామ" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. ॥౧౦॥

ఇట్లు సకలశ్రుతులును జగత్కారణము చేతనమని బోధించుటయే జగత్కారణము చేతనమేకాని వేఱొకటి కాదనుటకుఁ బరమప్రమాణమని "మహచ్చ ... రూపాదిషు" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది ఇచట "చక్షురాదీనామివ రూపాదిషు" యను వాక్యము దృష్టాంతముగాఁ బరగుచున్నది ఏప్రకారము సకలప్రాణులయొక్క చక్షుస్సులును రూపమునే గ్రహించుచు రసాదులను గ్రహింపవో యాతీరుననే సమస్తవేదాన్తములును జేతనమగు నాత్మయే జగత్కారణమని బోధించుచున్నవని పరమతాత్పర్యము సూత్రార్థము "అతః కారణమ్మ" ను భాష్యముచే వ్యక్తీకరింపఁబడుచున్నది

ఇట్లు సకలవేదాంతములును జేతనమగు జగత్కారణమునే బోధించుచున్నవిగాని ప్రధానము నెంతమాత్రము బోధింపలేదని నిరసించి సర్వజ్ఞమగు బ్రహ్మమే జగత్కారణమని ప్రత్యక్షముగ శ్రుతులు బోధించుచున్నవని స్మరింపఁబడిన సూత్రమునకు "కుతశ్చ సర్వజ్ఞం బ్రహ్మ జగతఃకారణమ్మ" ను ప్రతీకము నిర్వహింపఁబడుచున్నది సూత్రమెద్ది యన—

## శ్రుతత్వాచ్చ

అని 'వినఁబడుటవలన' ననుసూత్రార్థము "స్వశబ్దేనైవ మంత్రోపనిషది" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది అభీష్టశ్రుతి "సకారణం న చాధిప" యని నిరూపింపఁబడుచున్నది సః = ఆ సర్వజ్ఞుఁడగు నీశ్వరుఁడే, కారణం = జగత్కారణము, ఆతఁడే కరణాధిపాధిపః, కరణాధిప=జీవునికి, అధిపః=ప్రభువును, అస్య = ఈయీశ్వరునకు, జనితా = కారణము, కశ్చిత్ = ఒకానొకటియు, న = తెలియఁబడదు అధిపః చ = ప్రభువునుగూడ, న = లేఁడు, అధికరీణ

శ్చి జ్జనితా న చాధిపః” (శ్వే 6-9) ఇతి। తస్మాత్సర్వజ్ఞం బ్రహ్మ జగతః కారణం నాచేతనం ప్రధాన మన్యద్వేతి సిద్ధమ్॥ ౧౧.

---

తాత్పర్యము ‘‘తస్మాత్ ... సిద్ధమ్మ”ని యుపసంహరింపఁబడుచున్నది అన్యద్వా= ప్రమాణువులు, శూన్యము, స్వభావము మొదలుగాఁగల తంత్రాంతరములందు చెనవచ్చెడి జగత్కారణమని యాశయము ప్రకృతమున నీ సప్తసూత్రోపేతమగు అధికరణముచే సాంఖ్యతంత్రమందుఁ జెప్పఁబడిన ప్రధానమే గాక తంత్రాంతరములందుఁ జెప్పఁబడిన జగత్కారణములు గూడ నిరసింపఁబడుచున్నవి

ఛాందోగ్యషష్ఠప్రపాఠకమున జగత్కారణముగఁ బ్రదర్శింపఁబడిన సచ్ఛబ్దవాచ్యమున కీక్షణము వినఁబడుటవలనను, నాత్మశబ్దముచేఁ బరామర్శ తెలియఁబడుటవలనను, నా సచ్ఛబ్దవాచ్యమగు నాత్మయందు నిష్ఠునికే మోక్షముపదేశింపఁబడుటవలనను, సకలజీవులకును స్వస్వరూపమగు సత్పదార్థమునందే లయము వినఁబడుటవలనను, సచ్ఛబ్దవాచ్యమగు జగత్కారణము చేతనమగు బ్రహ్మమే కాని వేఱొండు కాదని తెలియుచున్నది

ఈయధికరణమునందుఁ దెలియవచ్చెడి యేడుసూత్రములందును “ఈక్షతేర్నాశబ్దమ్” “గౌణశ్చేన్నాత్మశబ్దాత్” “తన్నిష్ఠస్య చ మోక్షోపదేశాత్” ‘స్వాప్యయాత్త్” ను నాల్గుసూత్రములును బ్రత్యక్షముగా ఛాందోగ్యషష్ఠప్రపాఠకమగు శ్వేతకేతూద్దాలకసంవాదముయొక్క యర్థనిర్ణయమునే సూచించుచున్నవి ‘హేయత్వావచనాచ్చ’ యను సూత్రము వ్యతిరేకముఖమునఁ బ్రధానాదుల నిరసించుటను సూచించుచున్నది “గతిసామాన్యాత్త్”ను సూత్రము ప్రకృతషష్ఠప్రపాఠకేతరసకలశ్రుతులయొక్క పరమతాత్పర్యమును బ్రకరణ సందర్భముచే బోధించుచున్నది. “శ్రుతత్వాచ్చ” యను సూత్ర ముదాహరింపఁబడిన శ్వేతాశ్వతరోపనిషద్వాక్యముతోఁ దుల్యమగు శ్రుతుల నన్నిటి సూచించుచున్నది. దానంజేసి యీయధికరణముచే ఛాందోగ్యషష్ఠప్రపాఠకమున నేమి, తద్భిన్నములగు ప్రకరణాంతరములం దన్న నేమి, “జన్మాద్యస్య యతః, శాస్త్రయోనిత్వాత్త్”ను సూత్రములచే సూచితములగు భృగువరుణసంవాదము, మైత్రేయీయాజ్ఞవల్క్యసంవాద మను రెండుప్రకరణములచే నుపదేశింపఁబడిన విజ్ఞానానందరూపమగు బ్రహ్మాత్మయే సకలవేదాంతములచే బోధింపఁబడినదని ప్రదర్శింపఁబడుచున్నది

ఇది, యీక్షత్యధికరణము

## ఆనందమయాధికరణమ్

" 'జన్మాద్యస్య యతః' ఇత్యారభ్య "శ్రుతత్వాచ్చ" ఇత్యేవమ సూత్రైర్యాన్యుదాహృతాని వేదాంతవాక్యాని తేషాం సర్వజ్ఞః సర్వశక్తిరీశ జగతో జన్మస్థితిలయకారణమిత్యేత స్యార్థస్య ప్రతిపాదకత్వం న్యాయపూర్వ ప్రతిపాదితమ్, గతిసామాన్యోపన్యాసేన చ సర్వే వేదాన్తాశ్చేతనకారణవా ఇతి వ్యాఖ్యాతమ్ । 'అతః పరస్య గ్రన్థస్య కిముత్థానమితి—ఉచ్యతే 'ద్విరూపం హి బ్రహ్మావగమ్యతే, నామరూపవికారభేదోపాధివిశిష్టం, తద్విప చ సర్వోపాధివివర్జితమ్ । "యత్ర హి ద్వైతమివ భవతి తదితర ఇ

---

"జన్మాద్యస్య యత" యను సూత్రము మొదలు "శ్రుతత్వాచ్చ యను సూత్రమువఱకుఁ గల గ్రంథముచే సకలోపనిషత్తాత్పర్యము సువ్యక్త వ చుండ నుత్తరగ్రంథమునకుఁ గల ప్రయోజన మెద్ది యను నాక్షేపము గఁ నిదివఱకు వివరింపఁబడిన విషయము" జన్మాద్యస్య యత - —ఇతి వ్యాఖ్యాతమ్మ భాష్యముచే సంగ్రహముగఁ జెప్పఁబడుచున్నది. అనఁగా నిదివఱకు వ్యాఖ్యాన చేయఁబడిన సూత్రములచే నుదాహరింపఁబడిన భృగువల్లి, మైత్రేయీబ్రహ్మణ శ్వేతకేతూద్దాలకసంవాదము ను బ్రధానముగాఁ గలిగిన వేదాంతవాక్యములవ సర్వజ్ఞుఁడును సర్వశక్తియు నగు నీశ్వరుఁడు జగత్తుయొక్క యుత్పత్తిస్థితిల కారణుఁడని నిరూపింపఁబడెను వేదాంతము లన్నియు గతిసామాన్యముచే న యర్థమును బోధించుటవలన జగత్తునకుఁ జేతనమే కారణమని నిరూపింపఁబడియె తాత్పర్యము కావున నుత్తరగ్రంథమునకుఁ బ్రయోజన మేమని "అతః పర గ్రంథస్య కిముత్థానమితి" యను భాష్యముచేఁ బ్రశ్నింపఁబడుచున్నది సమ ధానము "ఉచ్యతే" యను పదముచేఁ బ్రారంభింపఁబడుచున్నది. వేదాంత లందు సోపాధికము, నిరూపాధికమని బ్రహ్మము రెండురూపములతో నొప్పుచున్నట్లు వినవచ్చుటంజేసి యద్దానివిభాగమును సప్రయోజనము నిరూపించుటయే ప్రధానముగాఁ గల్గి యుత్తరగ్రంథము ప్రవర్తించుచున్నది "ద్విరూపం హి . సర్వోపాధివివర్జితమ్మ" ని సంగ్రహముగ బ్రదర్శింపఁబ చున్నది. ఇట్లుభయరూపములను బ్రహ్మమునకుఁ బ్రతిపాదించెడి శ్రుతుఁ "యత్ర హి . సంపూర్ణమన్యత్ర" ని ప్రదర్శింపఁబడుచున్నవి

యత్ర = ఏయవిద్యావస్థయందు, హి = నిశ్చయముగా, ద్వైతమివ ఆభాసరూపమగు జగత్తువలె, భవతి = తెలియవచ్చుచున్నదో, తత్ = ఆ య ద్యావస్థయందు, ఇతరః సన్ = భేదభావము నొందినవాఁడై, ఇతరం = రెండ దానిని, పశ్యతి = చూచుచున్నాఁడు ఇయ్యది సోపాధికవిషయము

పశ్యతి, యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కంపశ్యేత్ " (బృ 4-5-15) "యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా ఽథ యత్రాన్యత్పశ్యత్యన్యచ్ఛృణోత్యన్యద్విజానాతి తదల్పం యో వై భూమా తదమృత మథ యదల్పం తన్మర్త్యమ్॥ (ఛాం 7-24-1) "సర్వాణి రూపాణి విచిత్య ధీరో నామాని కృత్వా ఽభివదన్యదాస్తే" (తై ఆ 3-12-7) నిష్కలం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనమ్। అమృతస్య పరం సేతుం దగ్ధేన్ధనమివానలమ్" (శ్వే 6-19) "నేతి నేతి" (బృ 2-3-6) 'ఇతి, "అస్థూలమనణు"

---

యత్ర తు = ఏస్థితియందు, అస్య = ఈవిద్వాంసునికి, సర్వం = సకలప్రపంచము, ఆత్మైవ = స్వస్వరూపమే, అభూత్ = అయెనో, తత్ = ఆస్థితియందు, కేన = ఏ సాధనముచేత, కం = ఏవిషయమును, పశ్యేత్ = ఒకానొకకర్త చూచును? అనఁగాఁ కర్త్రాదికారకభావములన్నియు నుపరమించునని తాత్పర్యము ఇయ్యది నిరుపాధికవిషయము

యత్ర = ఏస్థితియందు, అన్యత్ = రెండవదానిని న పశ్యతి = చూడఁడో, అన్యత్ = రెండవవస్తువును, న శృణోతి = వినఁడో, అన్యత్ = రెండవ వస్తువును న విజానాతి= తెలిసికొనఁడో, సః = అట్టియాత్మయే, భూమా= భూమశబ్దవాచ్యమగు బ్రహ్మము ఇయ్యది నిరుపాధికము

అథ యత్ర = ఏస్థితియందు అన్యత్ = రెండవదానిని, పశ్యతి = చూచునో, అన్యత్ = రెండవదానిని, శృణోతి = వినునో, అన్యత్ = రెండవ దానిని, విజానాతి = తెలిసికొనునో, తత్ = అయ్యది, అల్పం = స్వల్పము. ఇయ్యది సోపాధికము

యః వై = ఏది, భూమా=భూమశబ్దవాచ్యమగు బ్రహ్మమో, తత్= అది, అమృతం = మరణరహితము అథ యత్ = ఏది, అల్పం = స్వల్పమో, తత్ = అది, మర్త్యమ్ = మరణమునొందునది సర్వాణి = సమస్తములగు, రూపాణి = రూపములను, విచిత్య = వేఱుచేసి, నామాని = పేరులను, కృత్వా= చేసి, ధీరః = ధీరుఁడగు సీశ్వరుఁడు, అభివదన్ = పలుకుచు, ఆస్తే=ఉన్నాఁడు

నిష్కలం = నిరవయవము, నిష్క్రియం = క్రియారహితము శాంతం = ఉపశమస్వభావము, నిరవద్యమ్ = అప్రతిహతము, నిరంజనం = ధర్మాధర్మసంబంధరహితము అమృతస్య = అమృతమగు మోక్షమునకు, పరం = ఉత్కృష్టమగు, సేతుం = వంతెన యగునట్టియు, దగ్ధేంధనమ్ = తగులఁబడిన కట్టెలు గలిగిన, అనలమివ = అగ్నిహోత్రమువలె, నుపశమస్వభావముగలది.

న ఇతి, న ఇతి = ఇది కాదు ఇది కాదని వేద్యములగు సకలవిషయములను నిషేధింప సర్వనిషేధములకు నవధిగా నొప్పునది

(బృ 3-8-8) "న్యూనమన్యత్ స్థానం సంపూర్ణమన్యత్" ఇతి చైవం సహస్రశో విద్యావిద్యావిషయభేదేన బ్రహ్మణో ద్విరూపతాం దర్శయన్తి వాక్యాని తత్రావిద్యావస్థాయాం బ్రహ్మణ ఉపాస్యోపాసకాదిలక్షణః సర్వో వ్యవహారః తత్ర కానిచిద్బ్రహ్మణ ఉపాసనాన్యభ్యుదయార్థాని, కానిచిత్క్రమముక్త్యర్థాని కానిచిత్కర్మసమృద్ధ్యర్థాని। తేషాం గుణవిశేషోపాధిభేదేన భేదః। ఏక ఏవ తు పరమాత్మేశ్వరస్తైస్తైర్గుణవిశేషైర్విశిష్ట ఉపాస్యో యద్యపి భవతి తథాపి యథాగుణోపాసనమేవ ఫలాని భిద్యన్తే। "తం యథా యథోపాసతే తదేవ భవతి"।

---

అస్థూలం = స్థూలభావము లేనిదియు, అనణు = అణుభావరహితము నగునట్టిదియును, అన్యత్ = ఆభాసరూపమగు, స్థానం = స్థానవిశేషము, న్యూనం = అల్పమగునదియు, అన్యత్ = సత్యమగు స్థానము సంపూర్ణం = పూర్ణమగునదియును

ఒకే బ్రహ్మమున కిట్లు రెండువిధములగు స్వరూప మెట్లు ప్రతిపాదింపబడుచున్నదన విషయభేదముచే నని "ఏవం సహస్రశో వాక్యాని" యని చెప్పఁబడుచున్నది. విషయభేదమన నవిద్యకు విషయముగా సోపాధికమును విద్యకు విషయముగా నిరుపాధికము నుపదేశింపఁబడుచున్నవని యభిప్రాయము అవిద్యకు విషయమగు సోపాధికబ్రహ్మము నుపదేశించుటకుఁ బ్రయోజనము "తత్ర కానిచిత్. వ్యవహార" యని నిర్వచింపఁబడుచున్నది. అనఁగా నవిద్యావస్థయందు బ్రహ్మమున కుపాస్యము, ఉపాసకుఁడు, ఉపాసనము మున్నగు సకల వ్యవహారము లభించుచున్నదని యర్థము ఉపాస్యోపాసకవ్యవహారము ననుసరించి యుపదేశింపఁబడిన యుపాసనావిశేషములకు ఫలభేదముచేఁ ద్రైవిధ్యము "తత్ర.. సమృద్ధ్యర్థాని" యని యుపదేశింపఁబడుచున్నది అభ్యుదయార్థముల నపూర్వఫలములను బొందించెడి ప్రతీకోపాసనములని యభిప్రాయము.

క్రమముక్త్యర్థములనఁగాఁ గార్యబ్రహ్మలోకమును బొందించు దహరాద్యుపాసనములు కర్మసమృద్ధ్యర్థములన యాగఫలములందు నతిశయమును గలిగించెడి యుద్గీథాద్యుపాసనములు ఉపాసన లన్నిటియందు నుపాస్య ముపాధివిశిష్టమగు బ్రహ్మమే యగుచుండ ఫలములందలి వైచిత్ర్యమునకుఁ గారణ మేమన, నయ్యది "తేషాం గుణవిశేషోపాధిభేదేన భేద" యను సంగ్రహవాక్యముచే జెప్పఁబడుచున్నది. అనఁగా నుపాసనలయం దధ్యస్తము చేయఁబడు గుణవిశేషములచే ఫలభేదము గల్గుచుండు నని భావము. సంగ్రహవాక్యము "ఏక ఏవ తు . ఉపాస్యతయా చోద్యతే" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది. "పరమాత్మా ఈశ్వరః ఏక ఏవ యద్యపి భవతి" యని యన్వయము. ఇచటఁ బరమాత్మకు, నీశ్వరునకును నభేదము చెప్పఁబడుచున్నది. తం = ఆయీశ్వరుని, యథా యథా,

శ్రుతేః । "యథా క్రతురస్మింల్లోకే పురుషో భవతి తథేతః ప్రేత్య భవతి" (ఛాం. 3-14-1) ఇతి చ । స్మృతేశ్చ "యం యం వాపి స్మరన్ భావం త్యజత్యన్తే కలేవరమ్ । తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః" (గీ 8-6) ఇతి । యద్యప్యేక ఆత్మా సర్వభూతేషు స్థావరజంగమేషు గూఢస్తథాపి చిత్తోపాధి విశేషతారతమ్యాదాత్మనఃకూటస్థనిత్యస్యైకరూపస్యాప్యుత్తరోత్తరమావిష్కృతస్య తారతమ్యమైశ్వర్యశక్తివిశేషైః శ్రూయతే— "తస్య య ఆత్మానమావిస్తరాం వేద" (ఐ ఆ 2-3-2-1) ఇత్యత్ర । స్మృతావపి— యద్యద్విభూతిమత్సత్త్వం

---

ఏయేగుణములతోఁ గూడినట్లు, ఉపాసతే = ఉపాసింతురో, తదేవ = ఆగుణముల తోఁ గూడినట్లు, భవతి = అగుచున్నది.

అస్మిన్ లోకే = ఈలోకమునందు, యథాక్రతుః = ఎట్టిసంకల్పము గలవాఁడు, పురుషః = ఉపాసకుఁడు, భవతి = అగుచున్నాఁడో

ఇతః = ఈలోకమునుండి, ప్రేత్య = పోయి, తథా = ఆ తనయొక్క సంకల్పమున కనుగుణముగనే, భవతి = అగుచున్నాఁడు

"యం యం = ఏయే, భావం అపి వా = భావమునైనను, స్మరన్ = స్మరించుచు, కలేవరం = శరీరమును, అంతే = ప్రాణవియోగకాలమునందు, త్యజతి = విడిచిపెట్టుచున్నాఁడో, సదా=ఎల్లప్పుడు, తద్భావభావితః= ఆయాయి భావములచే సంస్కరింపఁబడిన యంతఃకరణముగలవాఁడై కౌంతేయ=అర్జునా, తం తమేవ = ఆయాయిభావములనే, ఏతి = పొందుచున్నాఁడు

కూటస్థనిత్యముగు నాత్మ యొక్కటియే యయియుండ నద్దానియందుఁ దరతమభావములతోఁ గూడిన గుణవిశేషము లెట్లు సమంజసముగ నుండునని ప్రశ్నింప నందులకు సమాధానము, "యద్యప్యేకః ఆత్మా చోద్యతే" యను భాష్యముచే చెప్పఁబడుచున్నది ఇందలి హేతువు "చిత్తోపాధి విశేషతారతమ్యాత్"అని చెప్పఁబడుచున్నది అనఁగా నంతఃకరణ మనెడి యుపాధి యందలి విశేషము లనెడి సాత్త్వికరాజసతామసములయొక్క తారతమ్యముచే నాత్మ కూటస్థనిత్య మయ్యుఁ దరతమభావము నొందియున్నట్లు భాసించుచున్న దని తాత్పర్యము

తస్య = ఆయాత్మయొక్క, ఆత్మానం = స్వరూపమును, యః = ఎవ్వఁడు, ఆవిస్తరాం = పుష్కలముగ, వేద = తెలిసికొనుచున్నాఁడో

యత్ యత్ సత్త్వం=లోకమునం దేయేపదార్థము, విభూతిమత్ = ఐశ్వర్యముతోడను, శ్రీమత్ = కాంతితోడను, ఊర్జితం = ఉత్సాహముతో డను గూడియుండునో, తత్ తత్ ఏవ = ఆయాయివస్తువుల నన్నిటిని మమ=

శ్రీమదూర్జితమేవ వా । తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్ (గీ 10-41) ఇతి । యత్రయత్ర విభూత్యాద్యతిశయః స స ఈశ్వర ఇత్యుపాస తయా చోద్యతే । ఏవమిహాప్యాదిత్యమండలే హిరణ్మయః పురుషః సర్వపాప్ దయలింగాత్పర ఏవేతి వక్ష్యతి । ఏవం "ఆకాశస్తల్లింగాత్" (బ్ర 1-1-2 ఇత్యాదిషు ద్రష్టవ్యమ్।ఏవం సద్యోముక్తికారణమప్యాత్మజ్ఞానముపాధివిశేషద్వా ణోపదిశ్యమానమప్యవివక్షితోపాధిసంబంధవిశేషం పరాపరవిషయత్వేన సందిహ మానం వాక్యగతిపర్యాలోచనయా నిర్ణేతవ్యం భవతి । యథేహైవ తావత్ –

---

నాయొక్క, తేజోఽంశసంభవం = తేజస్సుయొక్క యేకదేశమువలనఁ బుట్టి వానిగా త్వం = నీవు, అవగచ్ఛ = తెలిసికొనుము

ఇట్లు శ్రుతిస్మృతులయొక్క పర్యాలోచనముచేఁ దెలియవచ్చెడి యర్థమ "యత్ర చోద్యతే" యను భాష్యముచేఁ బ్రదర్శింపఁబడుచున్నది అన నేయేయుపాధులయందు లౌకికదృష్టికి నబ్బురమగు విభూత్యాదులయొక్క య శయము తెలియవచ్చుచుండునో గూయాయివ్యక్తివిశేషము నీశ్వరునిగా భావిం యుపాసింపవలయును

ఇట్లు శ్రుతిస్మృతులయందు బ్రహ్మమునకు ద్వైరూప్యము సప్రయోజ ముగ వినఁబడుచున్నదని చెప్పి యిం దుత్తరగ్రంథమున "అంతస్తద్ధర్మో పదేశాత్" ను సూత్రముచే ఛాందోగ్యమున వినఁబడెడి యాదిత్యమండలాంతర్వ యగు హిరణ్మయపురుషుఁడు సర్వపాప్మోదయలింగముచేఁ బరమాత్మయే య నిరూపింపఁబడుచున్నాఁ డని "ఏవమిహాపి వక్ష్యతి" యను భాష్యము నిరూపించి యట్టిన్యాయమునే "ఆకాశస్తల్లింగాత్" మున్నగు సూత్రార్థవిచార యందుఁగూడ గ్రహింపవలయునని "ఏవం ద్రష్టవ్యమ్మ"ని నిరూపించు చున్నారు ఇట సర్వపాప్మోదయమన సకల పాపములనుండి యనఁగాఁ గర్మ నుండి యుత్తీర్ణుఁడైనవాఁడని యర్థము

ఇట్లు శ్రుతి స్మృతిసూత్రములయందు బ్రహ్మమునకుఁ దెలియవచ్చు ద్వైరూప్యమును వ్యవస్థచేసి యుత్తరగ్రంథసందర్భమును "ఏవం నిర్ణేతవ్య భవతి" యను భాష్యముచే నిరూపించుచున్నారు "అవివక్షితోపాధిసంబం విశేషమ్, ఆత్మజ్ఞానం, సద్యోముక్తికారణమపి, ఉపాధివిశేషద్వారేణాప్యుపదిశ మానం పరాపరవిషయత్వేన—" యని వాక్యమును యోజించునది అన నేయేవాక్యములయం దాత్మసోపాధికముగఁగాని నిరుపాధికముగఁగాని యుప శింపఁబడుచున్నదో యాయావాక్యము లుత్తరగ్రంథముచే వ్యవస్థచేయఁబడుచున్న వని తాత్పర్యము ఇట్లు సామాన్యముగఁ జెప్పి ప్రకృతము "యథేహైవ తావత్" ని నిర్దేశింపఁబడుచున్నది.

"ఆనందమయో ఽభ్యాసాది"తి । ఏవమేకమపి బ్రహ్మాపేక్షితోపాధిసంబంధం నిరస్తోపాధిసంబంధం చోపాస్యత్వేన జ్ఞేయత్వేన చ వేదాంతేష్వాదిశ్యత ఇతి ప్రదర్శయితుం పరో గ్రంథ ఆరభ్యతే । యచ్చ "గతిసామాన్యాత్" ఇత్యచేతన కారణనిరాకరణముక్తం తదపి వాక్యాన్తరాణి బ్రహ్మవిషయాణి వ్యాచక్షాణేన బ్రహ్మ విపరీతకారణనిషేధేన ప్రపంచ్యతే—

## ఆనందమయోఽభ్యాసాత్

తైత్తిరీయకే ఽన్నమయం ప్రాణమయం మనోమయం విజ్ఞానమయం,

---

ఇట్లు పూర్వాపరసందర్భమును బ్రదర్శించి యుత్తరగ్రంథతాత్పర్యము జిజ్ఞాసువులయొక్క ప్రరోచనమునకు "ఏవమేకమపి బ్రహ్మవిపరీతకారణనిషేధేన ప్రపంచ్యతే" యని నిరూపింపఁబడుచున్నది అనఁగా బ్రహ్మ మొక్కటి యయ్యు నుపాధివిశేషసంబంధముచే నుపాస్యమును, తద్విపరీతభావముచే జ్ఞేయము నని శాస్త్రముచే నుపదేశింపఁబడుచున్నదని చెప్పుటకును, గతిసామాన్యముచే వేదాంతము లన్నియుఁ జేతనమగు బ్రహ్మమే జగత్కారణ మని బోధించుటవలన బ్రహ్మముకంటె భిన్నములగు కారణములను నిషేధించుటకును సూత్రగ్రంథ మారంభింపఁబడుచున్నదని తాత్పర్యము.

ఇట్లు పూర్వాపర గ్రంథసందర్భమును బ్రదర్శించి – 'ఆనందమయో ఽభ్యాసాత్' ను సూత్ర మాదిగాఁ గల్గి "అస్మిన్నస్య చ తద్యోగం శాస్తి" యను నెనిమిదిసూత్రములతో నొప్పు నానందమయాధికరణమును వ్యాఖ్యానము చేయ నుద్దేశించి యాసూత్రములకిదివఱకు వృత్తికారులచేఁ జేయఁబడిన యర్థమును బూర్వపక్షముగా గ్రహించి స్వసిద్ధాన్తమును బ్రదర్శింప మున్ముందుసూత్రములకు వృత్తికారులచేఁ బ్రదర్శింపఁబడిన యర్థమునే నిర్వచించుచున్నారు అదెట్లనిన—

## "ఆనందమయోఽభ్యాసాత్"

"అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యను సూత్రమునుండి బ్రహ్మశబ్దము నిచటకు ననువృత్తిచేయవలయును కావున ఆనందమయః = ఆనందమయుఁడు బ్రహ్మ= జగత్కారణమగు బ్రహ్మమే ఏల యన — అభ్యాసాత్ = ఆనందశబ్దమున కభ్యాస ముండుటవలన నను నర్థము లభించును

ఈయధికరణమున "బ్రహ్మవిదాప్నోతి పరమ్" అను వాక్య మాదిగాఁ గలిగినట్టియు "ఉభే హ్యేవైష ఏతే ఆత్మానగ్ం స్పృణుతే య ఏవం వేద" యను వాక్యమంతమందుఁ గలిగినట్టియు బ్రహ్మవల్లి, యానందవల్లి యను సమాఖ్య గలిగినట్టియుఁ బ్రకరణము విషయముగా నలరారుచున్నదని "తైత్తిరీయకే...ఆనందమయ ఇతి" యను భాష్యముచే నిరూపింపఁబడుచున్నది. అనఁగాఁ దైత్తిరీయము

చానుక్రమ్యామ్నాయతే — "తస్మాద్వా ఏతస్మాద్విజ్ఞానమయాత్, అన్యో ఽన్తర ఆత్మానందమయః" (తై 2 5) ఇతి, తత్ర సంశయః— కిమిహానందమయ శబ్దేన పరమేవ బ్రహ్మోచ్యతే యత్ప్రకృతం "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" (తై 2-1) ఇతి, కిం వా ఽన్నమయాదివద్బ్రహ్మణో ఽర్థాన్తరమితి। కిం తావ త్ప్రాప్తమ్,బ్రహ్మణో ఽర్థాన్తరమముఖ్యఆత్మా ఽఽనందమయః స్యాత్ కస్మాత్ ।అన్న మయాద్యముఖ్యాత్మప్రవాహపతితత్వాత్, అథాపి స్యాత్సర్వాంతరత్వా దానంద మయో ముఖ్య ఏవాత్మేతి। నస్యాత్ప్రియాద్యవయవయోగాచ్ఛారీరత్వశ్రవణాచ్చ। ముఖ్యశ్చేదాత్మా ఽనందమయః స్యాన్న ప్రియాదిసంస్పర్శః స్యాత్ । ఇహ తు

---

నందు "స వా ఏష పురుషోఽన్నరసమయ" యను వాక్యము మొదలు, "తస్మాద్వా ఏతస్మాద్విజ్ఞానమయాత్, అన్యో ఽంతర ఆత్మా విజ్ఞానమయ" యను వాక్యమువఱకుఁ గల గ్రంథముచే నన్నమయము, ప్రాణమయము, మనో మయము, విజ్ఞానమ్మయమని నాలుగాత్మలు క్రమముగా నుపదేశింపఁబడి పిమ్మట నాయీవిజ్ఞానమయమగు నాత్మకంటె వేఱగునట్టియు నాన్తరమగునట్టియు నాత్మ యానందమయమని చెప్పఁబడుచున్నది ప్రస్తుత మీయానందమయుఁడు సంశయ ప్రయోజనములతో నొప్పుచున్నాఁడు కావున నధికరణమునందు విషయపదవి నధిష్ఠించుచున్నాఁడు "అత్ర సంశయః, .అర్థాంతరమితి" యని సంశయము నిరూపింపఁబడుచున్నది అనఁగా ప్రకృతమున నానందమయశబ్దముచే నిందుపక్ర మింపఁబడిన "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" యను బ్రహ్మమే యుద్దేశింపఁబడు చున్నదా లేక యన్నమయప్రాణమయమనోమయవిజ్ఞానమయములవలె బ్రహ్మము కంటె భిన్నమగు వేఱొకటి యుద్దేశింపఁబడుచున్నదా యని ఇందుఁ బూర్వపక్షము "కిం తావత్ప్రాప్తం. ఆనందమయః స్యాత్త"ని నిరూపింపఁబడుచున్నది అనఁగా బ్రహ్మముకంటె భిన్నము నన్నమయాదులవలె నముఖ్యమగు నాత్మయే యానంద మయుఁడని పూర్వపక్షము ఆనందమయుఁ డముఖ్యమగు నాత్మ యనుటకుఁ గల కారణ మెద్ది యని "కస్మాత్త"ని మధ్యస్థుఁడు ప్రశ్నింప "అన్నమయాద్యము ఖ్యాత్మప్రవాహపతితత్వాత్త"ని హేతువు ప్రదర్శింపఁబడుచున్నది అనఁగా నన్నమయుఁడు, ప్రాణమయుఁడు, మనోమయుఁడు, విజ్ఞానమయుఁడను నము ఖ్యాత్మప్రవాహములోఁ బడుటవలన నియ్యదియు నముఖ్యాత్మయే యని భావము ఆనందమయుఁడు సర్వాంతరుఁ డగుటంజేసి ముఖ్యమగు నాత్మయే గావలయునని మధ్యస్థుఁడు ప్రశ్నింప నట్లు గాదని "న స్యాత్త"ని పూర్వపక్షి చెప్పుచున్నాఁడు అందు హేతువులు "ప్రియాద్యవయవయోగాత్, శారీరత్వ శ్రవణాచ్చ" యని సంగ్రహముగఁ జెప్పఁబడుచున్నవి అందు మొదటి హేతు సంగ్రహవాక్యము "ముఖ్యశ్చేత్. శ్రూయతే" యను భాష్యముచే వివరింపఁ

"తస్య ప్రియమేవ శిరః" ఇత్యాది శ్రూయతే। శారీరత్వం చ శ్రూయతే "తస్యైష ఏవ శారీర ఆత్మా, యః పూర్వస్య" ఇతి। తస్య పూర్వస్య విజ్ఞానమయస్యైష ఏవ శారీర ఆత్మా య ఏష ఆనందమయ ఇత్యర్థః। న చసశరీరస్య సతః ప్రియాప్రియసంస్పర్శో వారయితుం శక్యః। తస్మాత్సంసార్యేవానందమయ ఆత్మేత్యేవం ప్రాప్త ఇదముచ్యతే—"ఆనందమయో ఽభ్యాసాత్" పర ఏవాత్మా ఽఽనందమయో భవితుమర్హతి। కుతః, అభ్యాసాత్, పరస్మిన్నేవ హ్యాత్మన్యానందశబ్దో

---

బడుచున్నది, అనఁగా నానందమయుఁడు ముఖ్యమగు నాత్మయే యగుచో నాతనికిఁ బ్రియమే శిరస్సు, మోదము దక్షిణపక్షము, ప్రమోద ముత్తరపక్షము, ఆనంద మాత్మ, బ్రహ్మ పుచ్ఛము నను ప్రియము మొదలుగాఁ గల యవయవములయొక్క సంబంధము లేకుండవలయును అట్లు ప్రియాద్యవయవసంబంధము వినవచ్చుచున్నది గావున నానందమయుఁడు ముఖ్యమగు నాత్మ యెంతమాత్రము గాఁడని భావము.

ఇఁక రెండవ హేతువాక్యము "శారీరత్వం—ఇత్యర్థ" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది ఇందు "తస్యైమః పూర్వస్య" యనునది శ్రుతి. "తస్య పూర్వస్య. ఇత్యర్థ" యనునది శ్రుత్యర్థము అనఁగా "తస్య = ఆ పూర్వస్య = పూర్వమగు, విజ్ఞానమయస్య = విజ్ఞానమయునకు, ఏషః = ఈ, ఆనందమయః = ఆనందమయుఁడే, శారీరః = శారీరుఁడగు, ఆత్మా = ఆత్మ," యనుటచే నానందమయుఁడు శారీరుఁడగు నాత్మ యని వినఁబడుచున్నది శారీరుఁ డన, శరీరసంబంధము కలవాఁడని యర్థము శారీరుఁడయ్యుఁ బరమాత్మ గాఁగూడదా యనఁ బరమాత్మ యానందైకరసస్వరూపుఁ డగుటం జేసి శారీరుఁ డెంతమాత్రము గాఁడను నాశయముతో "న చ శారీరస్య. స్పృశత" యని చెప్పబడుచున్నది. అనఁగా శరీరముతోఁ గూడిన సత్పదార్థమునకుఁ బ్రియాప్రియస్పర్శ గలుగ నేరదని చెప్పుట కవకాశము లేదని చెప్పి పూర్వపక్షము "తస్మాత్సంసార్యేవానందమయ ఆత్మా" యని యుపసంహరింపఁబడుచున్నది అనఁగా నానందమయుఁడు సంసారి యగు నాత్మయేగాని పరమాత్మ యెంతమాత్రము గాఁడని యభిప్రాయము ఇట్లు పూర్వపక్షము సంభవింప సమాధానము చెప్పఁబడుచున్నదని "ఏవం ప్రాప్తే ఇదముచ్యతే" యని చెప్పఁబడుచున్నదని సిద్ధాన్తపరముగా సూత్రము స్మరింపఁబడుచున్నది అనఁగా నానందమయుఁడే పరమాత్మ యని "పర ఏవాత్మా. .అర్హతి" యని చెప్పఁబడుచున్నది. పరమాత్మశబ్దము బ్రహ్మపరము 'కుతః = ఎట్ల' ని మధ్యస్థుఁడు ప్రశ్నింప, "అభ్యాసాత్త"ని హేతువు ప్రదర్శింపఁ బడుచున్నది హేతువాక్యార్థము "పరస్మిన్నేవ.. అభ్యస్యతే" యని వివరింపఁ బడుచున్నది అనఁగాఁ బరమాత్మయందు నన బ్రహ్మమునందు నానందశబ్దము

బహుకృత్వోఽభ్యస్యతే । ఆనందమయం ప్రస్తుత్య "రసో వై సః" ఇతి తస్యైవ రసత్వముక్త్వోచ్యతే—"రసగ్ం హ్యేవాయం లబ్ధ్వాఽఽనందీ భవతి" ఇతి। "కో హ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్ యదేష ఆకాశ ఆనందో న స్యాత్ ఏష హ్యేవానందయాతి" (తై 2-7) "సైషాఽఽనందస్య మీమాగ్ంసా భవతి" "ఏతమానందమయమాత్మానముపసంక్రామతి ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చన" (తై 2-8-9) ఇతి "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" (తై 3-6) ఇతి చ। శ్రుత్యంతరే చ "విజ్ఞానమానందం బ్రహ్మ" (బృ 3-9-28) ఇతి బ్రహ్మణ్యేవానందశబ్దో దృష్టః। ఏవమానందశబ్దస్య బహుకృత్వో బ్రహ్మణ్యభ్యాసాదానందమయ ఆత్మా బ్రహ్మేతి గమ్యతే। యత్తూక్తమన్నమయాద్యము ఖ్యాత్మప్రవాహపతితత్వాదానందమయస్యాప్యముఖ్యత్వమితి, నాసౌ దోషః। ఆనందమయస్య సర్వాంతర

---

పలుమారులు ప్రయోగింపఁబడియుండుటవలన నానందమయుఁడే బ్రహ్మమని యభిప్రాయము ఆనందశబ్దముయొక్క యభ్యాసమును ప్రదర్శింప "ఆనందమయం ప్రస్తుత్య. బ్రహ్మణ్యేవానందశబ్దో దృష్ట" యను భాష్యము బరఁగుచున్నది

సః = ఆయానందమయుఁడే, రసః = రసస్వరూపము అయం = ఈ రసం = రసమును, లబ్ధ్వా = పొంది, ఆనందీ = ఆనందముకలవాఁడు, భవతి హ్యేవ = నిశ్చయముగా నగుచున్నాఁడు.

ఏషః = ఈ, ఆకాశః = ఆత్మ, ఆనందః = ఆనందము, నస్యాద్యది = కాకపోయినచో, కః = ఎవ్వఁడు, అన్యాత్ = చలించేని, కః = ఎవ్వఁడు, ప్రాణ్యాత్ = జీవించును ఏషః = ఈ యాత్మయే, ఆనందయాతి=ఆనందింపఁ జేయుచున్నాఁడు ఇచట "ఆనందయాతి' యనుచో 'యా' యను దీర్ఘము ఛాందసము.

ఆనందస్య = ఆత్మయొక్క, సైషా మీమాంసా = ఆయీవిచారణ, భవతి= కలుగుచున్నది

ఏతం = ఈ, ఆనందమయం = ఆనందమయుఁడగు, ఆత్మానం = ఆత్మను, ఉపసంక్రామతి = పొందుచున్నాఁడు

బ్రహ్మణః = బ్రహ్మయొక్క, ఆనందం = ఆనందమును, విద్వాన్ = తెలిసికొనినవాఁడు, కుతశ్చన = ఎవరివలనను, న బిభేతి = భయమునొందఁడు

ఇట్లు బ్రహ్మమం దానందశబ్దప్రయోగమును జూపి సూత్రార్థము "ఏవమానందశబ్దస్య. బ్రహ్మేతి గమ్యతే" యని చెప్పఁబడుచున్నది

ఇట్లు స్వాభిమతార్థమును ప్రదర్శించి పూర్వపక్షమును నిరాకరింప "యత్తు అముఖ్యమితి" యను పూర్వపక్షబీజ మనువదింపఁబడుచున్నది ఆనందమయుఁ డముఖ్యాత్మప్రవాహపతితుఁడైనను దోషము లేదని "నాసౌ దోషః"

...త్ । ముఖ్యమేవ హ్యాత్మానముపదిదిక్షు శాస్త్రం లోకబుద్ధిమనుసరత్,
...మయం శరీరమనాత్మానమత్యంతమూఢానామాత్మత్వేన ప్రసిద్ధమనూద్య
...షానిషిక్తద్రుతతామ్రాదిప్రతిమావత్తతో ఽన్తరం తతో ఽన్తరమిత్యేవం
...ర్వేణ పూర్వేణ సమానముత్తరముత్తరమనాత్మానమాత్మేతి గ్రాహయత్,
...పత్తిసౌకర్యాపేక్షయా సర్వాంతరం ముఖ్యమానందమయమాత్మానముపది
...శతీతి శ్లిష్టతరమ్ । యథా ఽరుంధతీనిదర్శనే బహ్వీష్వపి తారాస్వముఖ్యాస్వ
...ధతీషు దర్శితాసు యాన్త్యా ప్రదర్శ్యతే సా ముఖ్యైవారుంధతీ భవతి, ఏవమిహా
...నందమయస్య సర్వాన్తరత్వాన్ముఖ్యమాత్మత్వమ్। యత్తు బ్రూషే-ప్రియాదీనాం
...స్త్వాదికల్పనా ఽనుపపన్నా ముఖ్యస్యాత్మన ఇతి, అతీతానంతరోపాధిజనితా

---

...ని చెప్పఁబడుచున్నది దోషము లేకుండుటకు హేతువు "ఆనందమయస్య ...వాన్తరత్వాత్" ని సంగ్రహముగ నిరూపింపఁబడుచున్నది హేతువాక్యము ...ముఖ్యమేవ ముఖ్యమాత్మత్వ"మ్మను భాష్యముచే దృష్టాన్తపురస్సరముగ వివ...పఁబడుచున్నది. అందు "ముఖ్యమేవ శ్లిష్టతర" మ్మను భాష్యముచే హేతు...క్యార్థము వివరింపఁబడుచున్నది

అనఁగా ముఖ్యమగు నాత్మ నుపదేశించుటకుగాను శాస్త్రము లోకబుద్ధి...నుసరించి ముందుగా ననాత్మయు నన్నమయమును నవివేకులచే నాత్మగాఁ దలంపఁ...బడుచున్నట్టియు స్థూలశరీరము నాత్మగా ననువదించి యద్దానికంటె నాంతరమగు ...ప్రాణమయమును, పిమ్మట నద్దానికంటె నాంతరమగు మనోమయమును, పిమ్మట ...ద్దానికంటె నాంతరమగు విజ్ఞానమయమును పూర్వపూర్వములగు ననాత్మలతో ...సమానమగు ననాత్మల నుత్తరోత్తర మాత్మ యని బోధించుచుఁ బ్రతిపత్తిసౌకర్య...ముచే నంతమునందు సర్వాంతరమును ముఖ్యమును నాత్మయునగు నానందమ...యము నుపదేశించినట్లు సుస్పష్ట మగుచున్నది ఇట్టియర్థమును బోధించుటకు ...దృష్టాన్తముగా స్థూలారుంధతీన్యాయము "యథా అరుంధతీ భవతి" యను ...భాష్యముచేఁ బ్రదర్శింపఁబడుచున్నది. పైనిఁ జెప్పఁబడిన "మూషానిషిక్తద్రుతతా...మ్రాదిప్రతిమావత్త"నునదిగూడ దృష్టాన్తాంతరము బాహ్యములగు స్థూలపదార్థ...ములఁ దొలఁగించి యాంతరములగు సూక్ష్మములను గ్రహించుటయే మూషానిషిక్త...ద్రుతతామ్రాదిప్రతిమాన్యాయమని చెప్పఁబడుచున్నది ఫలితము "ఏవమిహాపి ... ముఖ్యమాత్మత్వమ్మ"ని చెప్పఁబడుచున్నది

పూర్వపక్షమందలి ప్రశ్నాంతరము "యత్తు బ్రూషే ఆత్మన ఇతి" ...యను భాష్యముచే ననువదింపఁబడుచున్నది అనఁగా ముఖ్యమగు నాత్మకుఁ ...ప్రియము మొదలుగాఁగల యవయవముల వర్ణించుట యుక్తము గాదని యర్థము. ...ప్యది గడచినట్టియు పూర్వపూర్వములగు నుపాధిసంబంధముచే గడచినట్టియు,

నా న స్వాభావికీత్యదోషః । శారీరత్వమప్యానందమయస్యాన్నమయాదిశరీరపరంపరయా ప్రదర్శ్యమానత్వాత్, న పునః సాక్షాదేవ శారీరత్వం సంసారివత్ । తస్మాదానందమయః పర ఏవాత్మా ॥౧౨॥

## వికారశబ్దాన్నేతి చేన్న ప్రాచుర్యాత్

అత్రాహ — నానందమయః పర ఆత్మా భవితుమర్హతి । కస్మాత్ । వికారశబ్దాత్ । ప్రకృతివచనాదయమన్యః శబ్దో వికారవచనః సమధిగతః, ఆనందమయ ఇతి మయటో వికారార్థత్వాత్ । తస్మాదన్నమయాదిశబ్దవద్వికారవిషయ

---

వాసనచే జనించినట్టియు నవయవవర్ణనమే గావున నద్దానివలన దోష మెంత మాత్రము లేదు అంతియ గాదు శారీరత్వముగూడ నానందమయునికి నన్నమయాదిశరీరపరంపరచేఁ గల్గినదే కాని జీవునివలె ముఖ్యమగు సంసారిత్వ మెంత మాత్రము సంభవింపదనియును, "శారీరత్వమపి. సంసారివత్త"నుభాష్యముచేఁ జెప్పఁబడుచున్నది ఫలితము "తస్మాత్. పర ఏవాత్మా" యనియుపసంహరింపఁబడుచున్నది ॥౧౨॥

ఆనందమయుఁడు పరమాత్మ యని నిర్వచింప నా యానందమయశబ్దమును బ్రకృతివచనమగు నానందశబ్దముకంటె 'మయట్' అను వికారార్థమును బోధించు ప్రత్యయము దెలియవచ్చుటచే నానందవికారుఁ డను నర్థము లభించుచున్నది గావున నిర్వికారమగు బ్రహ్మమును బోధించుటకు నానందమయశబ్దము సమర్థము గాదను నాక్షేపమును బరిహరించి యందలి మయట్ప్రత్యయము ప్రాచుర్యార్థబోధక మగుటంజేసి బ్రహ్మమును బోధింపఁదగు నను నాశయముతో సూత్రకారులు.

## "వికారశబ్దాన్నేతి చేన్న ప్రాచుర్యాత్"

అను సూత్రమును స్మరించియున్నారు సూత్రమందలి "వికారశబ్దాత్ న" యను పూర్వపక్షవాక్యము "అత్రాహ .. ఇతిచేత్త"ను భాష్యముచే వివరింపఁబడుచున్నది అందు "న ఆనందమయః పర ఆత్మా భవితుమర్హతి" యను నది పూర్వపక్షము పూర్వసూత్రమునుండి యీసూత్రమునకు నానందమయ, బ్రహ్మ"శబ్దము లనువృత్తిచేయఁబడుచున్నవి శ్రుతియందలి యానందమయశబ్దవాచ్యుఁడు పరబ్రహ్మము గానేరదని యర్థము "కస్మాత్త"ని పూర్వపక్ష మడుగఁబడుచున్నది "వికారశబ్దాత్"అని సమాధానము చెప్పఁబడుచున్నది హేతువచనము "ప్రకృతివచనాత్ . ఆనందమయశబ్దః" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది, ప్రకృతివచనమన, ఆనందశబ్దము వికారవచనమన మయట్ప్రత్యయము కావున నన్నమయప్రాణమయమనోమయవిజ్ఞానమయశబ్దములవలె వికార

ఏవామానందమయశబ్ద ఇతి చేన్న । ప్రాచుర్యార్థేఽపి మయటః స్మరణాత్ । "తత్ప్రకృతవచనే మయట్" (పాణి. 5-4-21) ఇతి హి ప్రచురతాయామపి మయట్ స్మర్యతే । యథా 'అన్నమయో యజ్ఞః' ఇత్యన్నప్రచుర ఉచ్యతే । ఏవమానందప్రచురం బ్రహ్మానందమయ ఉచ్యతే । ఆనందప్రచురత్వం చ బ్రహ్మణో మనుష్యత్వాదారభ్యోత్తరస్మిన్నుత్తరస్మిన్ స్థానే శతగుణ ఆనంద ఇత్యుక్త్వా బ్రహ్మానందస్య నిరతిశయత్వావధారణాత్ । తస్మాత్ప్రాచుర్యార్థే మయట్ ॥ ॥౧౩॥

---

విషయమే యీ యానందమయుడని పూర్వపక్షము పూర్వపక్ష ఫలితము "తస్మాత్ ఇతి చేత్"ని గలుగ నట్లు గాగని సూత్రమందలి 'న' యను పదముచే నిషేధింపఁబడుచున్నది సూత్రమందలి 'ప్రాచుర్యాత్'ను హేతుపదము "ప్రాచుర్యార్థే మయటః స్మరణాత్"ని వివరింపఁబడుచున్నది మయట్ప్రత్యయము నకుఁ బ్రాచుర్యార్థమందుఁ బాణినీయస్మృతి "తత్ప్రకృతవచనే మయట్ స్మర్యతే" యని స్మరింపఁబడుచున్నది మయట్టునకుఁ బ్రాచుర్యార్థమందు వృత్తి ప్రసిద్ధమని యని "యథా ఉచ్యతే" యను భాష్యముచేఁ జెప్పఁబడు చున్నది "అన్నమయో యజ్ఞః" యనుచో నన్నమయ మని గాక యన్న ప్రచురమని యొక్కటియు చెప్పఁబడుచున్నదో యాతీరుననే యని యర్థము దార్ష్టాంతికము "ఏవం ఉచ్యతే" యని చెప్పఁబడుచున్నది అనఁగా నానంద ప్రచురముగుటం జేసి బ్రహ్మ మానందమయుఁడని చెప్పఁబడుచున్నది బ్రహ్మ మానందప్రచురమని చెప్పుటకు "సైషానందస్య మీమాంసా భవతి స ఏకో బ్రహ్మణ ఆనంద" యను నానందవల్లియొక్క ప్రకరణమందలి తాత్పర్యము సంక్షేపముగా "ఆనందప్రచురత్వం అవధారణాత్"ని చెప్పఁబడు చున్నది అనఁగా మనుష్యత్వమునుండి ప్రారంభించి మనుష్యగంధర్వుఁడు, దేవ గంధర్వుఁడు, పితరులు, ఆజానదేవతలు, కర్మదేవతలు, దేవతలు, ఇంద్రుఁడు, బృహస్పతి, ప్రజాపతి, బ్రహ్మవరకుఁ గల పదిస్థానములయం దుత్తరోత్తరముగ నూరు నూరు రెట్లు నానందము గల్గుచున్నదని చెప్పుటచే బ్రహ్మముయొక్క యానందము నిరతిశయమని దెలియవచ్చుచున్నదని తాత్పర్యము ఫలితము "తస్మాత్ప్రాచుర్యార్థే మయట్"ని చెప్పఁబడుచున్నది ॥౧౪॥

హేత్వంతరముచేఁ గూడ మయట్టునకుఁ బ్రాచుర్యార్థము గ్రహింపనగు నని యీ హేతుసూత్రమునకుఁ బ్రతీకముగ "ఇతశ్చ ప్రాచుర్యార్థే మయట్"ను వాక్యము చెప్పఁబడుచున్నది. హేతుసూత్ర మేమన—

## తద్ధేతువ్యపదేశాచ్చ

ఇతశ్చ ప్రాచుర్యార్థే మయట్ । యస్మాదానన్దహేతుత్వం బ్రహ్మణో వ్యపదిశతి శ్రుతిః— "ఏష హ్యేవానన్దయాతి" ఇతి । ఆనన్దయతీత్యర్థః । యో హ్యన్యానానన్దయతి స ప్రచురానన్ద ఇతి ప్రసిద్ధం భవతి ॥ యథా లోకే యో ఽన్యేషాం ధనికత్వమాపాదయతి స ప్రచురధన ఇతి గమ్యతే, తద్వత్ । తస్మాత్ప్రాచుర్యార్థే ఽపి మయటః సంభవాదానన్దమయః పర ఏవాత్మా॥ ॥౧౪॥

## మాన్త్రవర్ణికమేవ చ గీయతే

ఇతశ్చానన్దమయః పర ఏవాత్మా । యస్మాత్ "బ్రహ్మవిదాప్నోతి

---

## "తద్ధేతువ్యపదేశాచ్చ"

యని చెప్పఁబడుచున్నది తస్య = ఆ యానందమునకు, హేతువ్యపదేశాత్ = కారణముగ నిర్వచింపఁబడుటవలన, బ్రహ్మ మానందప్రచురమే యని బ్రహ్మానందప్రచురశబ్దము లధ్యాహారము చేయఁబడవలయును బ్రహ్మ మానంద హేతు వనే విషయము శ్రుతిచే బోధింపబడుచున్నదని "యస్మాత్. శ్రుతి" యని చెప్పఁబడుచున్నది శ్రుతియందలి 'ఆనందయాతి' యను పదము "ఆనందయతి" యని భావముచేయఁబడవలయునని "ఆనందయతీత్యర్థ" యని చెప్పఁబడుచున్నది. ఆనందహేతుత్వముచే నానందప్రాచుర్యము నూహించుటకు దృష్టాన్త దార్ష్టాంతికములు "యో హి తద్వత్" ను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నవి లోకములో నొకరికి ధనము నిచ్చువాఁ డెట్లు ప్రచురమగు ధనము గలవాఁ డని చెప్పఁబడుచున్నాఁడో యాతీరుననే యొకరి నానందింపఁజేయువాఁడు ప్రచురమగు నానందము గలవాఁడని చెప్పఁబడుచున్నాఁడని భావము ఫలితము "తస్మాత్ పర ఏవాత్మా" యని యుపసంహరింపఁబడుచున్నది ॥౧౪॥

ఇట్లు మయట్ప్రత్యయమునకుఁ బ్రాచుర్యార్థము గ్రహింపఁబడి యానందమయుఁడే పరమాత్మ యనుటకు హేత్వంతరమును బ్రతిపాదింపను సూత్రాంతరము నకు "ఇతశ్చానన్దమయః పర ఏవాత్మా" యని ప్రతీక మవతారికగా చెప్పఁబడుచున్నది. సూత్ర మేమన—

## "మాన్త్రవర్ణికమేవ చ గీయతే"

యని మాన్త్రవర్ణికమేవ = మంత్రవర్ణమునందు వర్ణింపఁబడిన బ్రహ్మమే, యానందమయుఁడని, గీయతే = వర్ణింపఁబడుచున్నది కావున, నానందమయుఁడే బ్రహ్మమని సూత్రార్థము. సూత్రమందలి మాన్త్రవర్ణిక శబ్దము,

శ్చైకార్థత్వం యుక్తం, అవిరోధాత్। 'అన్యథా హి ప్రకృతహానాప్రకృతప్రక్రి
స్యాతామ్ । న చాన్నమయాదిభ్య ఇవానందమయాదన్యో ఽన్తర ఆ
ఽభిధీయతే। ఏతన్నిష్ఠైవ చ "సైషా భార్గవీ వారుణీ విద్యా" (తై
తస్మాదానందమయః పర ఏవాత్మా॥ ॥౧౬॥

# నేతరోఽనుపపత్తేః

ఇతశ్చానందమయః పర ఏవాత్మా। నేతరః। ఇతర ఈశ్వరాదన్యః సం
'జీవ ఇత్యర్థః। నజీవ ఆనందమయశబ్దేనాభిధీయతే । కస్మాత్। అనుపపత్తేః। ఆన

---

తార్థమును గ్రహించిన దోషము వాటిల్లునని భావము ఇంతియ కాదు, ఆన
మయుఁడు సర్వాంతరుఁడుగ వినవచ్చుటంజేసి యానందమయునే బ్రహ్మము
గ్రహింపవలయునని "న చ. అభిధీయతే" యని చెప్పఁబడుచున్నది అన
నన్నమయప్రాణమయమనోమయవిజ్ఞానమయములకంటె నాంతరముగా నాన
మయము చెప్పఁబడిన ట్లానందమయున కాంతరముగా వేఱొకయాత్మ చెప్పఁ
లేదు గావున నానందమయుఁడే బ్రహ్మమని భావము ఇంతియ కాదు భృగు
యందు "సైషా భార్గవీ వారుణీ విద్యా" యని యుపదేశింపఁబడిన బ్రహ్మనిష్ఠ
గూడ నీయానందమయు నుద్దేశించియే యని "ఏతన్నిష్ఠైవ విద్యా" యని చె
బడుచున్నది. ఫలితము "తస్మాత్. పర ఏవాత్మా" యని చెప్పఁబడుచున్నది

ఆనందమయుఁడు బ్రహ్మమేగాని యద్దానికంటె వేఱుగు జీవుఁడై
మాత్రము గాఁడని నిరూపింప సూత్రకారులు—

'నేతరోఽనుపపత్తేః'

యను సూత్రమును స్మరించియున్నారు పూర్వసూత్రమునుండి యాన
మయశబ్దము ననువృత్తిచేసి యీసూత్రార్థమును యోజించునది ఇతరః
బ్రహ్మముకంటె భిన్నుఁడగు జీవుఁడు ఆనందమయః=ఆనందమయుఁడు, న=కా
ఏలయన, అనుపపత్తేః = ఇచట నానందమయునికి వినవచ్చెడి ధర్మములు జీవ
సంభవింపకపోవుటవలన నని సూత్రార్థము సూత్రతాత్పర్యము "ఇతశ్చ
ఆత్మా" యను భాష్యముచే వ్యక్తీకరింపఁబడుచున్నది 'నేతర' యను శ
ర్థము "ఇతరః అభిధీయతే" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. ఇ
నీశ్వరశబ్దము బ్రహ్మపరము కస్మాత్ =ఏలయని మధ్యస్థుఁ డడుగ, "అనుపప
యని సమాధానము చెప్పఁబడుచున్నది అనుపపత్తి శ్రుతిముఖమున "ఆన
మయం హి ప్రకృత్య .ఇతి" యని చూపఁబడుచున్నది శ్రుతియొక్క తా
ర్యము స్వాభిప్రాయపురస్సరముగ "తత్ర .ఉపపద్యతే" యను భాష్యముచే

మయం హి ప్రకృత్య శ్రూయతే । "సో ఽకామయత । బహు స్యాం ప్రజాయే యేతి। స తపో ఽతప్యత। స తపస్తప్త్వా। ఇదగ్ం సర్వమసృజత। యదిదం కించ" ( తై 2-6 ) ఇతి । తత్ర ప్రాక్ఛరీరాద్యుత్పత్తేరభిధ్యానం సృజ్యమానానాం చ, వికారాణాం స్రష్టు రవ్యతిరేకః, సర్వవికారసృష్టిశ్చ న పరస్మాదాత్మనో ఽన్యత్రోపపద్యతే॥ ॥౧౬॥

## భేదవ్యపదేశాచ్చ

ఇతశ్చ నానందమయః సంసారీ । యస్మాదానందమయాధికారే "రసో వై సః । రసగ్ం హ్యేవాయం లబ్ధ్వా ఽఽనందీ భవతి" ( తై 2-7 ) ఇతి జీవానందమయౌ భేదేన వ్యపదిశతి । న హి లబ్ధైవ లబ్ధవ్యో భవతి । కథం త్వర్హి

---

రింపఁబడుచున్నది సః = ఆ యానందమయుఁడు, ప్రజాయేయ = ఉత్పత్తి కొఱకు, బహు=నానారూపములుగ, స్యాం = అయ్యెదనని, అకామయత = సంకల్పించెను సః = ఆ యానందమయుఁడు, తపః = తపస్సును, అతప్యత= చేసెను. స = ఆనందమయుఁడు, తపః = తపస్సు, తప్త్వా = చేసి, ఇట్లు శరీరాది సృష్టికిఁ బూర్వ మభిధ్యానమును, యత్ = ఏ, ఇదం = ఈ, కించ = స్వల్ప మున్నదో, ఇదం సర్వం = ఆయీ సమస్తప్రపంచమును, అసృజత = సృజించెననెడి సర్వవికారముల సృష్టియును 'తత్సృష్ట్వా తదేవానుప్రావిశ'త్తని సృష్టికర్తకు సృజ్యమానవిషయముతో నభేదమును దెలియవచ్చుచున్నదిగదా! ఇయ్యవి పరమాత్మయగు బ్రహ్మముకంటె భిన్నమగు జీవుని కెంతమాత్రము గలుగనేరవు గావున నానందమయుఁడు జీవుఁ డెంతమాత్రము గాఁడని తాత్పర్యము ॥౧౬॥

ఆనందమయుఁడు జీవుఁడు గాఁడనుటకు హేత్వంతరమును బ్రతిపాదించు సూత్రాంతరమునకు "ఇతశ్చ నానందమయస్సంసారీ" యని ప్రతీకము చెప్పఁబడుచున్నది సూత్రమేమన—

## "భేదవ్యపదేశాచ్చ"

అని ఆనందమయునకు జీవునకును భేదము వివరింపఁబడియుండుటవలన నానందమయుఁడు సంసారియగు జీవుఁడు గాఁడని తాత్పర్యము సూత్రార్థము "యస్మాదానందమయాధికారే వ్యపదిశతి" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. సః = ఆనందమయుఁడు, రసః వై = ఆనందసారభూతుఁడే అయం = ఈ జీవుఁడు, రసం = ఆనందసారమగు బ్రహ్మమును, లబ్ధ్వా = పొంది, ఆనందీ = ఆనందముకలవాఁడు, భవతి=అగుచున్నాఁడను శ్రుతిచే జీవుఁడు పొందువాఁడుగను, ఆనందమయుఁడు పొందఁబడెడివాఁడుగను వివరింపఁబడియున్నది లబ్ధృలబ్ధవ్య

"ఆత్మా ఽన్వేష్టవ్యః" "ఆత్మలాభాన్న పరం విద్యతే" ఇతి శ్రుతిస్మృతీ, యావతా న లబ్ధైవ లబ్ధవ్యో భవతీత్యుక్తమ్। బాఢమ్। తథాప్యాత్మనో ఽప్రచ్యుతాత్మభావస్యైవ సతః తత్త్వానవబోధనిమిత్తో దేహాదిష్వనాత్మస్వాత్మత్వనిశ్చయో లౌకికో దృష్టః। తేన దేహాదిభూతస్యాత్మనో ఽప్యాత్మా ఽనన్విష్టో ఽన్వేష్టవ్యో ఽలబ్ధో లబ్ధవ్యో ఽశ్రుతః శ్రోతవ్యో ఽమతో మంతవ్యో ఽవిజ్ఞాతో విజ్ఞాతవ్య ఇత్యాది భేదవ్యపదేశ ఉపపద్యతే। ప్రతిషిధ్యత ఏవ తు పరమార్థతః సర్వజ్ఞాత్పరమేశ్వరాదన్యో ద్రష్టా శ్రోతా వా "నాన్యో ఽతో ఽస్తి ద్రష్టా" (బృ 3. 7 23) ఇత్యాదినా।

---

ములు రెండు నొకటయే యొకమాత్రము గానేరవు గావున, జీవుఁడు, నానందమయుఁడు నొకటి యెంతమాత్రము గాఁడను నాశయముతో "న హి లబ్ధైవ లబ్ధవ్యో భవతి" యని చెప్పఁబడుచున్నది ఆనందమయాధికారే = ఆనందమయప్రకరణమునందు లబ్ధ లబ్ధవ్య మెంతమాత్రము గాదని చెప్పుటచే లబ్ధయే లబ్ధవ్యమను నర్థమును బ్రదర్శించు "ఆత్మా ఽన్వేష్టవ్య" "ఆత్మలాభాన్న పరం విద్యతే" యను శ్రుతిస్మృతు లెట్లు సమంజసము లగునని మధ్యస్థుఁడు ప్రశ్నింప లబ్ధ లబ్ధవ్య మెంతమాత్రము గాకను నిశ్చయమే యని "బాఢమ్మ"ను పదముచేఁ జెప్పఁబడుచున్నది కాని యందొక విశేషము గలదని "తథాపి" యను శబ్దముచే సూచింపఁబడుచున్నది అట్టి విశేషము "ఆత్మనః ఉపపద్యతే" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది ఎట్టిన అప్రచ్యుతాత్మస్వభావమున నిర్వికార స్వరూపము గలిగిన సద్రూపమగు నాత్మకు నజ్ఞానముచే దేహేంద్రియాదులగు ననాత్మలయందు నాత్మనిశ్చయము స్వతస్సిద్ధముగ లోకమునఁ జూడఁబడుచున్నది అట్లు దేహాదిభావమును జెందిన యాత్మకు వాస్తవమగు నాత్మ వెదకఁబడని దగుటచే వెదకఁబడవలయునదియు, పొందఁబడని దగుటచేఁ బొందఁదగినదియు, వినఁబడని దగుటచే వినఁదగినదియుఁ, జింతింపఁబడని దగుటచేఁ జింతింపఁదగినదియుఁ, దెలియఁబడని దగుటచేఁ దెలియఁదగినదియు నను భేదవ్యపదేశము సమంజసమే యగునని తాత్పర్యము శ్రోతవ్యమనుమగు భేదవ్యపదేశ మొందులకు వాస్తవము గాదన నట్టిభేదము "నాన్యో ఽతో ఽస్తి ద్రష్టా" యను శ్రుతి మొదలుగాఁ గల శ్రుతులచే నిషేధింపఁబడుటంజేసి బ్రహ్మకంటె వేఱగు జీవుఁడు పారమార్థిక దృష్టిచే నెంతమాత్రము దెలియరాఁడని "ప్రతిషిధ్యత ఏవ ఇత్యాది" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది ఇచటఁ బరమేశ్వరపదము బ్రహ్మపరము వ్యావహారికదృష్టిచే జీవేశ్వరభేదము గల్గుచున్నది గాని వాస్తవ మెంతమాత్రము గాదనియు జీవభావ మవిద్యాకల్పిత మనియు "పరమేశ్వరస్తు . అన్య" యని చెప్పఁబడుచున్నది అనఁగా నవిద్యచేఁ గల్పింపఁబడిన శరీరమందలి మిథ్యాభిమానముచేఁ గర్తృభావమును, భోక్తృభావమును జెందిన విజ్ఞానస్వరూపము

పరమేశ్వర స్త్వవిద్యాకల్పితాచ్ఛారీరాత్కర్తుర్భోక్తుర్విజ్ఞానాత్మాఖ్యాదన్యః। యథా మాయావినశ్చర్మఖడ్గధరాత్సూత్రేణాకాశమధిరోహతః స ఏవ మాయావీ పరమార్థరూపో భూమిష్ఠో ఽన్యః। యథా వా ఘటాకాశాదుపాధిపరిచ్ఛిన్నాదనుపాధిః, అపరిచ్ఛిన్న ఆకాశో ఽన్యః। ఈదృశం చ విజ్ఞానాత్మపరమాత్మభేదమాశ్రిత్య "నేతరో ఽనుపపత్తేః" "భేదవ్యపదేశాచ్చ" ఇత్యుక్తమ్ ॥౧౭॥

## కామాచ్చ నానుమానాపేక్షా

ఆనందమయాధికారే చ "సో ఽకామయత బహు స్యాం ప్రజాయేయ"

---

జీవుఁడనియు నట్టికల్పిత మగు జీవభావమున కతీత మగు పరమాత్మభావ మీశ్వరుఁడనియు భావము. ఈశ్వరభావము సత్యమనియు జీవభావము కల్పితమనియు జీవేశ్వరవైలక్షణ్యము 'తు' శబ్దముచే సూచింపఁబడుచున్నది. పారమార్థికము గు నొకే వస్తువునకు నజ్ఞానవశమున నానాత్వము గలుగు నను టకు రెండు దృష్టాంతములు ప్రదర్శింపఁబడుచున్నవి. అందొకటి యగు మాయావిదృష్టాంతము "యథా ... అన్య" యను భాష్యముచే నిర్వచింపఁబడుచున్నది. ఎట్లన నైంద్రజాలికుఁడు డాలును గత్తిని జేఁబూని త్రాటితో నాకాశము నెక్కునట్లు చూపఱులకుఁ గన్పట్టుచుఁ దనతోఁ దుల్యుఁడగునట్టి వేఱొకఁడు భూమిపై నిలిచి వినోదమును జేయుచున్నట్లగపడును. అందాకాశము నెక్కుచున్నట్లగపడువానికంటె భూమియందు నిలిచియున్నవాఁడు వాస్తవరూపముతో నొప్పు మాయావియనియు నట్టివాఁడాకాశము నెక్కుచుండెడి కల్పితరూపునికంటె భిన్నుఁడనియుఁ దెలియుచున్నాఁడు.

ఇఁక రెండవది యగు నాకాశదృష్టాంతము "యథా వా ... అన్యః" యను భాష్యముచే నిర్వచింపఁబడుచున్నది. అట్లుగా ఘటాదులచే నావరింపఁబడిన యాకాశముకంటె ననుపాధిపరిచ్ఛిన్నమగు నాకాశము భిన్నముగాఁ దోఁచుచున్నదిగదా! ఇట్లుపాధిపరిచ్ఛిన్నమగు భేదము ననుసరించి భాసించెడి జీవాత్మపరమాత్మభేదము నాలంబనముగాఁ జేసి "నేతరో ఽనుపపత్తేః" "భేదవ్యపదేశాచ్చ" యను సూత్రములు స్మరింపఁబడినవని "ఈదృశం ... ఇత్యుక్తమ్" అను భాష్యముచే నిర్వచింపఁబడుచున్నది ॥౧౭॥

ఇట్లానందమయుని జీవునిగాఁ దలఁచుటకెంతమాత్ర మవకాశము లేదని చెప్పి సాంఖ్యపరికల్పితమగు ప్రధానముగూడ శంకించుట కవకాశ మెంతమాత్రము లేదని సూత్రకారులు,

## "కామాచ్చ నానుమానాపేక్షా"

యని స్మరించియున్నారు కామాత్ = ఆనందమయునికి సంకల్పము వినవచ్చుట

(తై 2 6) ఇతి కామయితృత్వనిర్దేశాన్నానుమానికమపి సాంఖ్యపరికల్పిత మచేతనం ప్రధాన మానందమయత్వేన కారణత్వేన వా ఽపేక్షితవ్యమ్ । "ఈక్షతేర్నాశబ్దమ్" (బ్ర॥ సూ 1-1-5) ఇతి నిరాకృతమపి ప్రధానం పూర్వసూత్రోదాహృతాం కామయితృత్వశ్రుతిమాశ్రిత్య ప్రసంగాత్పునర్నిరాక్రియతే గతి సామాన్యప్రపంచనాయ । ॥౧౮॥

## అస్మిన్నస్య చ తద్యోగం శాస్తి

ఇతశ్చ న ప్రధానే జీవే వాఽఽనందమయశబ్దః । యస్మాదస్మిన్నానందమయే ప్రకృత ఆత్మని ప్రతిబుద్ధస్యాస్య జీవస్య తద్యోగం శాస్తి । తదాత్మనా

---

వలన, అనుమానాపేక్షా చ = అనుమానముయొక్క యపేక్షగూడ, న = ఎంతే మాత్రము లేదను సూత్రార్థము "ఆనందమయాధికారే అపేక్షితవ్యమ్మ"ను భాష్యముచే వివరింపఁబడుచున్నది అనఁగా నానందమయప్రకరణమున "సో ఽకామయత బహు స్యాం ప్రజాయేయ" యను శ్రుతివలన సంకల్పము వినఁబడుటఁబట్టి, ఆనుమానికం = అనుమానప్రమాణముచే నూహింపఁబడినట్టియు, సాంఖ్యులచే లెస్సగఁ గల్పింపఁబడినట్టియు జడమగు ప్రధాన మానందమయుఁ డనిగాని జగత్కారణ మనిగాని యెంతమాత్రము చెప్పుటకు వఁలనుపడదు.

ఈక్షత్యధికరణమునఁ బ్రధానము సర్వవిధముల నిరసింపఁబడియుండఁ దిరుగ నిచటఁ దన్నిరసనమునుగూర్చి యత్నాంతరరూపగౌరవ మెందుల కనిన నయ్యది గతిసామాన్యమును స్పష్టముగా బోధించుటకే యని "ఈక్షతేర్నాశబ్దమ్ . గతిసామాన్యప్రపంచనాయ" యని సమాధానము చెప్పఁబడుచున్నది కామయితృత్వశ్రుతి యన "సో ఽ కామయత బహు స్యాం ప్రజాయేయ" యనునది ॥౧౮॥

అనందమయుఁడు ప్రధాన మనిగాని జీవుఁ డనిగాని శంకించుటకు వీలు లేని హేతువును సూత్రకారులు

"అస్మిన్నస్య చ తద్యోగం శాస్తి"

యని స్మరించుచున్నారు అస్మిన్ = ఈ యానందమయునియందు, అస్య = ఈజీవునకు, తద్యోగం = ఆనందస్వరూపముతోఁ గూడిక, అన నానందమయ స్వరూపభావమును బడయుట యనెడి ముక్తిని, శాస్తి = శాస్త్రము బోధించు చున్నది కావున నీ యానందమయుఁడు ప్రధానముగాని, జీవుఁడుగాని గానేరఁడని తాత్పర్యము సూత్రతాత్పర్యము "ఇతశ్చ న ప్రధానే జీవే వాఽఽనందమయ శబ్ద" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది, సూత్రార్థము సుస్పష్టముగ "యస్మాత్ .. శాస్తి శాస్త్రమ్మ"ను భాష్యముచే నిర్వచింపఁబడుచున్నది ప్రతి

యోగ స్తద్యోగః, తద్భావాపత్తి । ముక్తిరిత్యర్థః । తద్యోగం శాస్తి శాస్త్రమ్— "యదా హ్యేవైష ఏతస్మిన్నదృశ్యే ఽనాత్మ్యే ఽనిరుక్తే ఽనిలయనే ఽభయం ప్రతిష్ఠాం విందతే । అథ సో ఽభయంగతో భవతి । యదా హ్యేవైష ఏతస్మిన్నుదరమంతరం కురుతే, అథ తస్య భయం భవతి" (తై 2-7) ఇతి । ఏతదుక్తం భవతి— యదైతస్మిన్నానందమయే ఽల్పమప్యన్తరమతాదాత్మ్యరూపం పశ్యతి తదా సంసారభయాన్న నివర్తతే । యదా త్వేతస్మిన్నానందమయే నిరంతరం తాదాత్మ్యేన ప్రతితిష్ఠతి తదా సంసారభయాన్నివర్తత ఇతి । తచ్చ పరమాత్మపరిగ్రహే ఘటతే, న ప్రధానపరిగ్రహే జీవపరిగ్రహే వా । తస్మాదానందమయః పరమాత్మేతి స్థితమ్ ॥౧౯॥

---

బుద్ధస్య = శాస్త్రాచార్యోపదేశమువలన జ్ఞానమును బడసిన వృత్తికారులచేఁ గూడఁ దద్భావాపత్తిరూపమగు ముక్తియే శ్రుతి తాత్పర్యముగా వ్యక్తీకరింపఁ బడుచున్నది, ముక్తిప్రతిపాదకశాస్త్రము "యదా అథ తస్య భయం భవతి" యని ప్రదర్శింపఁబడుచున్నది ఉదాహరింపబడిన శ్రుత్యర్థము "ఏతదుక్తం భవతి ... నివర్తత ఇతి" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది యదా = ఎప్పుడు, ఏషః = ఈజీవుఁడు, ఏతస్మిన్ = ఈ, అదృశ్యే = ఇంద్రియాదులకు విషయము గానట్టియు, అనాత్మ్యే = దేహేంద్రియాదిసంబంధము గానట్టియు, అనిరుక్తే = అవాఙ్మనసగోచర మగు నట్టియు, అనిలయనే = ఆధారభావము నొందనట్టియు నానందమయునియందు, అభయం = నిర్భయముగు, ప్రతిష్ఠాం = స్థితిని, విందతే = పొందుచున్నాఁడో, అథ = అప్పుడు, సః = ఆవిద్వాంసుడు, అభయం = అభయమును, గతః = పొందినవాఁడు, భవతి = అగుచున్నాఁడు యదా = ఎప్పుడు, ఏషః = ఈజీవుఁడు, ఏతస్మిన్ = ఈ యానందమయునియందు, ఉత్, అరం = స్వల్పమైనను, అంతరం = భేదమును, కురుతే = చేయుచున్నాఁడో యనఁ దెలిసికొనుచున్నాఁడో, అథ = అప్పుడు, తస్య = ఆ యజ్ఞునకు, భయం = భయము, భవతి = అగుచున్నది. ఇట్టిఫల శ్రుతి యానందమయునిఁ బరమాత్మగ గ్రహించినచో యుక్త మగును గాని ప్రధానముగఁగాని జీవునిగఁగాని గ్రహించినచో సమంజసముగ నుండదని "తచ్చ ... జీవపరిగ్రహే వా" యని నిర్వచించి "తస్మాదానందమయః పరమాత్మేతి స్థితమ్మ"ని యధికరణతాత్పర్యము వృత్తికారాభిమతముగ నుపసంహరింపఁబడుచున్నది ॥౧౯॥

ఈ యధికరణమునఁ దెలియవచ్చెడి యెనిమిదిసూత్రములందును మొదటినాల్గుసూత్రములు నానందవల్లియందు వినవచ్చెడి యానందమయుఁడు బ్రహ్మ మని నిర్వచించుటకును, బిమ్మట రెండుసూత్రము లానందమయుఁడు జీవుఁడు గాఁడని నిర్వచించుటకును, బిమ్మట నొకసూత్ర మానందమయుఁడు

ప్రధానము గాఁడని నిర్వచించుటకును, నుత్తమసూత్ర మానందమయుఁడు ప్రధానమును జీవుఁడును గూడఁ గాఁడని నిర్వచించుటకును వృత్తికారాశయముతో వ్యాఖ్యానముగావింపఁబడినవి ఇచట జీవుఁడు, ప్రధాన మను నవ్వానిని నిరసించుటకుఁగల ప్రయోజన మెద్ది యనునది యొకింత విచారింపవల యును ప్రధానమనునది సాంఖ్యులచే జగత్కారణముగ ననుమేయింపఁబడిన దనియు, నయ్యది వేదాంతములచే నెంతమాత్రము ప్రతిపాదింపఁబడ లేదనియు నీక్షత్యధికరణమునఁ బుష్కలముగ నిర్వచింపఁబడియున్నది సాంఖ్యు లన్ననో శ్రుతులయందుఁ దమచేఁ గల్పింపఁబడిన ప్రధానము దెలియవచ్చుచున్న దని శ్రుతులఁ కపార్థమును గల్పింప నద్దాని వారించుటకై ప్రసంగవశమునఁ ప్రధాన నిరసనము గావింపఁబడియెను ఇఁక జీవుఁ డన్ననో యజ్ఞజనపరికల్పిత మగుచు వ్యవహారమునందు సత్యముగ భాషించుటంజేసి యీశ్వరునికంటె భిన్నమగు జీవుఁడు సత్యముగ నున్నాఁ డను భ్రాంతి గలుగుచున్నది అట్టిభ్రాంతిని వారింప నజ్ఞజనకల్పితమగు జీవుఁడు ప్రసంగవశమున నిరసింపఁబడుచున్నాఁడు. శ్రుతులచేఁ బ్రతిపాదింపఁబడు నద్వితీయబ్రహ్మజ్ఞానమునకు నజ్ఞులచేఁ గల్పింపఁబడిన జీవజ్ఞానము, ప్రాజ్ఞులచేఁ గల్పింపఁబడిన ప్రధానాదిజగత్కారణజ్ఞానమును బాధక మగుటంజేసి యట్టి బాధకజ్ఞానమును వారింపఁ బ్రకరణసందర్భమున జీవనిరాసము, ప్రధాననిరాసమును చేయఁబడినవి ఇచటనే గాక యుత్తరగ్రంథమునందుఁ గూడ జీవుఁడు ప్రధానమును నాశంకింపఁబడి నిరాకరింపఁబడును నిరసింపఁబడిన ప్రధానాదు లూహాపోహకల్పితము లగుటంజేసి వాస్తవము లెట్లు గావో యాతీరుననే యజ్ఞ జనకల్పితుఁ డగు జీవుఁడుగూడ వాస్తవము గాఁడను పరమతాత్పర్యముచే సూత్ర కారులు జీవప్రధానములఁ బ్రత్యేకముగాఁగాని రెండిటిని గలిపిగాని నిరసించుచు న్నారు అంతియే గాని యీరెండును బ్రత్యేకముగా నున్నవని సూత్రకారుల యాశయ మెంతమాత్రము గాదు

ఇఁక నీయెనిమిదిసూత్రములందును మొదటినాల్గుసూత్రములయొక్క వృత్తియును వివాదాధ్యస్తము ఏలయన - వృత్తికారులానందమయుని బ్రహ్మ మని నిర్వచించుచున్నారు అందులకుఁ బ్రతిబంధకముగాఁ దోఁచెడి మయట్ప్ర త్యయమునకుఁ బ్రాచుర్యార్థమును గల్పించుచున్నారు ఇయ్యదియే వృత్తికార వాదబలము ఇది దోషగ్రస్త మగుటంజేసి సమంజస మెంతమాత్రము గాదని భాష్యకారులచే నిరసింపఁబడుచున్నది అట్టిభాష్యకారనిరసనము "ఇదం త్విహ వక్తవ్యమ్" ను వాక్యముతోఁ బ్రారంభింపఁబడుచున్నది ఇహ= ఈ వృత్తికార వ్యాఖ్యానమున, ఇదం తు= ఈ వైలక్షణ్యము, వక్తవ్యమ్= చెప్పఁబడవలయు నని యర్థము

ఇదం త్విహ వక్తవ్యమ్ — "స వా ఏష పురుషో ఽన్నరసమయః" । "తస్మాద్వా ఏతస్మాదన్నరసమయాత్, అన్యో ఽన్తర ఆత్మా ప్రాణమయః" తస్మాత్ "అన్యో ఽన్తర ఆత్మా మనోమయః" । తస్మాత్ "అన్యో ఽన్తర ఆత్మా విజ్ఞానమయః" (తై 2- 1, 2, 3, 4) ఇతి వికారార్థే మయట్ప్రవాహే సత్యానందమయ ఏవాకస్మాదర్ధజరతీయన్యాయేన కథమివ మయటః ప్రాచుర్యార్థత్వం బ్రహ్మవిషయత్వం చాశ్రీయత ఇతి । మాన్త్రవర్ణికబ్రహ్మాధికారాదితి చేత్, న, అన్నమయాదీనామపి తద్బ్రహ్మత్వప్రసంగః । అత్రాహ యుక్తమన్నమయాదీనామబ్రహ్మత్వం, తస్మాత్తస్మాదాన్తరస్యాన్తరస్యాన్యస్యా

---

ఆందు మయట్ప్రత్యయమునకుఁ బ్రాచుర్యార్థమును గ్రహించుటే యసమంజసమని "స వై ఆశ్రీయత ఇతి" యను భాష్యముచే నిర్వచింపఁబడుచున్నది అనఁగా నానందవల్లియందు "స వా ఏష పురుషో ఽన్నరసమయ" యను వాక్యము మొదలు "అన్యో ఽన్తర ఆత్మా విజ్ఞానమయ" యను వాక్యము వఱకుఁ గల గ్రంథమునందు వినవచ్చెడి యన్నమయప్రాణమయమనోమయవిజ్ఞానమయశబ్దములందలి మయట్ప్రవాహ మంతయు వికారపరమే యగుచుండ నొక్క యానందమయశబ్దమునందు మాత్రమే హఠాత్తుగ నర్ధజరతీయన్యాయమున మయట్టు ప్రాచుర్యార్థమును గలిగి బ్రహ్మబోధక మెట్లగు నని భావము అర్ధజరతీయమన నొకపక్షిని రెండు ఖండములుగాఁ జేసి యందొకఖండమును బాకముకొరకును, వేఱొకఖండమును ప్రసవముకొరకు నుద్దేశించుట అట్లయినచో నెంత సరసముగనుండునో యట్లే యొకమయట్టునకే వికారార్థము, ప్రాచుర్యార్థమును జెప్పుట యుపహాసాస్పదమని భావము అనఁగా బ్రహ్మబోధక మెంతమాత్రము గాదనఁ బూర్వపక్షి "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" యను మంత్రవర్ణమునందలి బ్రహ్మముయొక్క ప్రకరణ మగుటంజేసి మయట్టునకుఁ బ్రాచుర్యార్థము గల్పింపవలయు నను "మాన్త్రవర్ణికబ్రహ్మాధికారాత్త"ని సమాధానము చెప్పఁగా "సిద్ధాన్తిచే "ఇతి చేత్, న=అట్లుగాద"ని నిరసింపఁబడుచున్నది. నిరాసమునకు "అన్నమయాదీనామపి తద్బ్రహ్మత్వప్రసంగ" యని ప్రతిబందిగా నుత్తరము చెప్పఁబడుచున్నది అనఁగా బ్రహ్మప్రకరణము గావున మయట్టునకుఁ బ్రాచుర్యార్థము చెప్పఁబడవలయు నన్నచో నొక్క యానందమయునే గాక యన్నమయాదులఁ గూడ బ్రహ్మమే యని చెప్పవొప్పు నన నందులకు సమాధానము పూర్వపక్షిచేఁ జెప్పఁబడుచున్నదని "అత్రాహ" యను వాక్య ముపక్రమింపఁబడుచున్నది. సమాధానము "యుక్తం ప్రసంగాదితి" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది ఒకదానికంటె వేఱొకటి యాంతరమనియు, నద్దానికంటె వేఱొకటి యాంతరమనియు నిట్లాత్మ చెప్పఁబడుటచేసి యన్నమయాదులు బ్రహ్మము కావనుట

స్యస్యాత్మన ఉచ్యమానత్వాత్ । ఆనందమయాత్తు న కశ్చిదన్య ఆన్తర ఆత్మో చ్యతే, తేనానందమయస్య బ్రహ్మత్వమ్ । అన్యథా ప్రకృత హానాప్రకృతప్ర క్రియాప్రసంగాదితి । అత్రోచ్యతే— యద్యప్యన్నమయాదిభ్య ఇవానంద మయాదన్యో ఽన్తర ఆత్మేతి న శ్రూయతే । తథాపి నానందమయస్య బ్రహ్మతమ్ । యత ఆనందమయం ప్రకృత్య శ్రూయతే—"తస్య ప్రియ మేవ శిరః । మోదో దక్షిణః పక్షః । ప్రమోద ఉత్తరః పక్షః । ఆనంద ఆత్మా । బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" (తై 2 5) ఇతి। తత్ర యద్బ్రహ్మ మంత్ర వర్ణే ప్రకృతం "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మే"తి తదిహ "బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" ఇత్యుచ్యతే । తద్విజిజ్ఞాపయిషయైవాన్నమయాదయ ఆనందమయ పర్యన్తాః పంచకోశాః కల్ప్యన్తే । తత్ర కుతః ప్రకృతహానాప్రకృతప్రక్రియా ప్రసంగః । నన్వానందమయస్యావయవత్వేన "బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" ఇత్యు చ్యతే, అన్నమయాదీనామివ "ఇదం పుచ్ఛం ప్రతిష్ఠా" ఇత్యాది । తత్ర కథం బ్రహ్మణ స్వప్రధానత్వం శక్యం విజ్ఞాతుమ్ । ప్రకృతత్వాదితి బ్రూమః । నన్వ

---

యుక్తమే యగును ఆనందమయునికంటె నన్నన్యో, వేఱొక యాంతరమగు నాత్మ చెప్పఁబడక పోవుటచే నానందమయునే బ్రహ్మముగా గ్రహింపవలయును. లేనిచోఁ బ్రకృతహానాప్రకృతప్రక్రియారూపదోషము వాటిల్లునన నందులకుఁ దగుసమాధా నము "అత్రోచ్యతే యద్యపి అప్రకృతప్రక్రియాప్రసంగ" యని చెప్పఁబడుచు న్నది అనఁగా నన్నమయాదులవలె నానందమయునికంటె భిన్న మగునట్టియు, నాంతరమగునట్టియు నాత్మ వినఁబడకపోయినను నానందమయుఁ డెంతమాత్రము బ్రహ్మము కానేరడు ఏలయన — ఆనందమయు నుద్దేశించి "తస్య ప్రతిష్ఠా" యను గ్రంథముచే శ్రుతి యానందమయస్వరూపమును జెప్పుచున్నదిగదా! "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" యనుమంత్రముగందు వినవచ్చెడి బ్రహ్మ మన్ననో పై "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" యనుచో బ్రహ్మశబ్దముచేఁ బరామర్శింపఁబడు చున్నది అట్టిబ్రహ్మమును బోధించుటకై యన్నమయ మాదిగాఁ గల్గి యానంద మయ మంతముగాఁ గల్గిన యైదుకోశములు గల్పింపఁబడుచున్నవని గ్రహించినచోఁ బ్రకృతహానాప్రకృతప్రక్రియాప్రసంగ మెట్లు గల్గును? అనఁగా గలుగనేరదు ఇట్టిసమాధానముపై మధ్యస్థుఁడు "నను విజ్ఞాతుమ్మ"ని ప్రశ్నించుచున్నాఁడు అనఁగా నన్నమయాదులయొక్క నిరూపణమునందు "ఇదం పుచ్ఛం ప్రతిష్ఠా" "పృథివీ పుచ్ఛం ప్రతిష్ఠా" "అథర్వాంగిరసః పుచ్ఛం ప్రతిష్ఠా" "మహః పుచ్ఛం ప్రతిష్ఠా" యనునట్లానందమయుని కవయవముగా "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా"యని చెప్పఁబడుచున్నది అట్టివిషయమున నిచట బ్రహ్మమునకు స్వప్రధానభావమున గ్రహించుట యెట్లని ప్రశ్నింప "ప్రకృతత్వాదితి బ్రూమ" యని సమాధానము

నందమయావయవత్వేనాపి బ్రహ్మణి విజ్ఞాయమానేన ప్రకృతత్వం హీయతే ఆనందమయస్య బ్రహ్మత్వాదితి । అత్రోచ్యతే, తథా సతి తదేవ బ్రహ్మానందమయ ఆత్మావయవీ, తదేవ చ బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠావయవ ఇత్యసామంజస్యం స్యాత్। అన్యతరపరిగ్రహే తు యుక్తం "బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" ఇత్యత్రైవ బ్రహ్మనిర్దేశ ఆశ్రయితుం, బ్రహ్మశబ్దసంయోగాత్ । నానందమయవాక్యే బ్రహ్మశబ్దసంయోగాభావాదితి । అపి చ "బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" ఇత్యుక్త్వేదముచ్యతే-

---

చెప్పఁబడుచున్నది అనఁగాఁ బ్రకరణసందర్భమునుబట్టి "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" యను వాక్యమునే గ్రహింపవలయు నని తాత్పర్యము ఇట్లు పలుక మఱల పూర్వపక్షి "నను బ్రహ్మత్వాత్త"ని ప్రశ్నించుచున్నాఁడు అనఁగా నానందమయుఁడు బ్రహ్మ మగుటచే నానందమయుని కవయవముగా బ్రహ్మమును దెలిసికొనుటవలనఁ బ్రకరణ సందర్భమునకు భంగము లేదుగదా యని భావము ఇట్లు ప్రశ్నింప "అత్రోచ్యతే" యని సమాధాన ముపక్రమింపఁబడుచున్నది సమాధానము "తథా సతి. సర్వలోకప్రసిద్ధత్వాత్త"ను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది అనఁగా నానందమయుని బ్రహ్మముగా గ్రహించినచో బ్రహ్మమగు నానందమయాత్మ యవయవి యనియు, నా బ్రహ్మమే, బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా యని బోధింపఁబడిన యవయవ మనియు విరుద్ధార్థము లభించు నని "తథా సతి అసామంజస్యం స్యాత్త"ను భాష్యముచే దోషోద్ఘాటనము చేయఁబడుచున్నది పక్షద్వయమును విచారింప రెండిటియందు నొకింత దోషము గన్పట్టుచున్నది. ఎట్లన—నానందమయుని బ్రహ్మ మనినచో నవయవావయవి విభాగము సిద్ధింపదు. 'బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా'యనునది బ్రహ్మమని గ్రహించినచో నంగమునకుఁ బ్రధానభావము గల్పించిన ట్లగును కావున రెండు పక్షములలో నెద్దానిని స్వీకరింపవలయు, నెద్దానిని బరిత్యజింపవలయు నను నాకాంక్ష గలుగ బ్రహ్మశబ్దసంయోగముచే 'బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా' యనుచో బ్రహ్మశబ్దమునే గ్రహించిన బాగుండునని "అన్యతరపరిగ్రహే . బ్రహ్మసంయోగాత్త"ని చెప్పఁబడుచున్నది అన్యతరపరిగ్రహే = పక్షద్వయమున నెయ్యది గ్రహించినచో అంతియ కాదు ఆనందమయవాక్యమునందు బ్రహ్మశబ్దసంయోగము లేకుండుటంజేసి యానందమయుని బ్రహ్మముగా గ్రహింపఁగూడదని తాత్పర్యము ఆనందమయవాక్యము "తస్మాద్వా ఏతస్మాద్విజ్ఞానమయాత్ అన్యోఽంతర ఆత్మా ఆనందమయః, తేనైష పూర్ణః, స వా ఏష పురుషవిధ ఏవ, తస్య పురుషవిధతాం అన్వయం పురుషవిధః, తస్య ప్రియమేవ శిరః, మోదో దక్షిణః పక్షః, ప్రమోద ఉత్తరః పక్షః, ఆనంద ఆత్మా" యనునది ఇంతియకాదు వాక్యశేషమును జూచినను బుచ్ఛవాక్యమందలి బ్రహ్మపదమే స్వప్రధానముగా నుపదేశింపఁబడి

“తదప్యేష శ్లోకో భవతి । అసన్నేవ స భవతి । అసద్బ్రహ్మేతి వేద చేత్ । అస్తి బ్రహ్మేతి చేద్వేద । సన్తమేనం తతో విదురితి” (తై 2 6) అస్మింశ్చ శ్లోకే ఽననుకృష్యానందమయం బ్రహ్మణ ఏవ భావాభావవేదనయోర్గుణదోషాభిధానాద్గమ్యతే “బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా” ఇత్యత్ర బ్రహ్మణ ఏవ స్వప్రధానత్వమితి । న చానందమయస్యాత్మనో భావాభావశంకా యుక్తా, ప్రియమోదాది విశేషస్యానందమయస్య సర్వలోకప్రసిద్ధత్వాత్ । కథం పునః స్వప్రధానం సద్బ్రహ్మ,

---

నట్లు తెలియవచ్చుచున్న దని “ అపి చ . స్వప్రధానత్వమితి” యను భాష్యమునఁ జెప్పఁబడుచున్నది ఆనందవల్లియందు “బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా” యని చెప్పఁబడిన పిమ్మట “తదప్యేష శ్లోకో భవతి” తత్ = ఆవిషయమందు, ఏషః = ఈముందుఁ జెప్పఁబోవు, శ్లోకోఽపి = మంత్రముగూడ, భవతి = ఉన్నదని బ్రహ్మము, అసత్ ఇతి = లేదని, వేద చేత్ = తెలిసికొనినట్లైన, సః = అట్టివాఁడు, అసన్ ఏవ = అసత్సముఁడే, భవతి = అగుచున్నాఁడు, బ్రహ్మము, అస్తి ఇతి = ఉన్నదని, వేద చేత్ = తెలిసికొనినట్లైన, తతః = అట్టి బ్రహ్మజ్ఞానమునొందుట వలన, ఏనం = ఈవిద్వాంసుని, సంతం = సత్పురుషునిగా, విదుః = చెప్పుచున్నారు, అను మంత్రము వినఁబడుచున్నది ఈమంత్రమందు, ఆనందమయుని అననుకృష్య = స్మరింపకయే, బ్రహ్మముయొక్క, భావాభావ వేదనయోః = ఉనికిని దెలిసికొనుటయొక్కయు, లేమిని దెలిసికొనుటయొక్కయుఁ గ్రమముగా గుణదోషములఁ జెప్పుటచే “బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా” యను స్థలమునందు బ్రహ్మమునకు స్వప్రధాన మని దెలియవచ్చుచున్నది స్వప్రధానత్వమనఁగా స్వార్థమునే ముఖ్యముగాఁ గల్గియుండుట ప్రకృతమున బ్రహ్మశబ్దమున కెయ్యది ముఖ్యార్థముగాఁ బ్రకరణమునందు గ్రహింపఁబడుచున్నదో యట్టి యర్థమునే యిచట గ్రహింపవలయునని భావము ఈమంత్రముచే నానందమయునియొక్క భావాభావ వేదనయందలి గుణదోషములే చెప్పఁబడఁగూడదా యన నట్లు గాదని “ న చానందమయస్య . యుక్తా” యని చెప్పఁబడుచున్నది అనఁగా నానందమయునియొక్క భావాభావముల గూర్చినశంక యెంతమాత్రము యుక్తముగాదు ఏలయన “ప్రియమోదాదివిశేషస్య ఆనందమయస్య సర్వలోకప్రసిద్ధత్వాత్” ప్రియము మోదము మొదలుగా గలిగిన విశేషములతోఁ గూడిన యానందమయుఁడు సకలప్రాణిజాతమునకుఁ బ్రత్యక్షముగాఁ దెలియవచ్చుటవలన నానందమయుని భావాభావవిషయమగు సందేహమున కెంతమాత్ర మవకాశము లేదని భావము. ఇట్లు “బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా” యనుచో బ్రహ్మమునకు స్వప్రధానత్వమును నిర్ణయింపఁ బూర్వపక్షి యానందమయునకుఁ బుచ్ఛముగా వర్ణింపఁబడిన బ్రహ్మమునకు స్వప్రధానత్వ మెట్లని “ కథం పునః . ప్రతిష్ఠా ”

ఆనందమయస్య పుచ్ఛత్వేన నిర్దిశ్యతే — "బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" ఇతి। నైష దోషః। పుచ్ఛవత్పుచ్ఛం, ప్రతిష్ఠా పరాయణమేకనీడం లౌకికస్యానందజాతస్య బ్రహ్మానంద ఇత్యేతదనేన వివక్ష్యతే, నావయవత్వం, "ఏతస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రాముపజీవంతి" (బృ 4-3-32) ఇతి శ్రుత్యన్తరాత్। అపి చానందమయస్య బ్రహ్మత్వే ప్రియాద్యవయవత్వేన సవిశేషం బ్రహ్మాభ్యుపగంతవ్యమ్। నిర్విశేషం తు బ్రహ్మ వాక్యశేషే శ్రూయతే వాఙ్మనసయోరగోచ

---

యని ప్రశ్నింప నియ్యది యొక దోషము గాదని "నైష దోష" యని పరిహరించి సమాధానము చెప్పఁబడుచున్నది దోషాభావమును వ్యక్తీకరింప "పుచ్ఛవత్పుచ్ఛమ్మ"ని పుచ్ఛశబ్దార్థము నిరూపింపఁబడుచున్నది పక్షికిఁ బుచ్ఛమెట్లాధారమో యట్లే యానందమయునికి బ్రహ్మ మాధార మగుటంజేసి పుచ్ఛమువలె నుండుటవలనఁ బుచ్ఛ మని చెప్పఁబడుచున్నది పుచ్ఛశబ్దమునకు ముఖ్యార్థము 'ప్రతిష్ఠా' యను పదముచే బాధింపఁబడుచున్నది ప్రతిష్ఠ యన పరాయణము, ఏకనీడ మను నర్థము చెప్పఁబడుచున్నది అనఁగా లోకసిద్ధమగు నానందజాతమునకు బ్రహ్మానంద మాధారభూతమని యర్థముగాని యానందమయునకు బ్రహ్మ మవయవమని యెంతమాత్ర మర్థముగాదు. లౌకికానందమునకు బ్రహ్మానంద మాధారభూతమని "ఏతస్య = ఈ, ఆనందస్య = బ్రహ్మానందమ్ము యొక్క, మాత్రాం = ఒక లేశమును, ఆశ్రయించి, అన్యాని = ఇతరములగు భూతాని = భూతములు, ఉపజీవంతి = జీవించుచున్నవను శ్రుత్యంతరముచేఁ గూడఁ బ్రతిపాదింపఁబడుటవలన నిందుఁగూడ నందుల కనుగుణమగు నర్థమునే గ్రహింపవలయును

ఇంతవఱకు నానందమయుని బ్రహ్మముగా గ్రహించుటయందును, "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" యను బ్రహ్మశబ్దముచే బ్రహ్మమును గ్రహించుటయందునుగూడ దోషములను బదర్శించి యందు 'బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా' యను దానిచేఁ దెలియవచ్చు బ్రహ్మమును గ్రహించుటయే సమంజసమని నిరూపింపఁబడియెను ప్రకృతమున నానందమయుని బ్రహ్మముగా గ్రహించినచోఁ గల్గు ననర్థవిశేషముగూడ "అపి చ.. కుతశ్చనేతి" యనుభాష్యముచేఁ బ్రదర్శింపఁబడుచున్నది. ఆనందమయునే బ్రహ్మముగా గ్రహించినచో నానందమయునికిఁ బ్రియము, మోదము, ప్రమోదము మున్నగు నవయవములు వినవచ్చుటంజేసి యీ యానందవల్లిచే సవిశేషమగు బ్రహ్మ ముపదేశింపఁబడుచున్నదని చెప్పవలసి వచ్చునని "అపి అభ్యుపగన్తవ్యమ్మ"ను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది వాక్యశేషమన నీవల్లియొక్క యుపసంహారమును గమనించినచో నిర్విశేషమగు బ్రహ్మము వినవచ్చుచున్నదని "నిర్విశేషం తు.. శ్రూయతే" యని చెప్పఁబడు

రత్వాభిధానాత్ — "యతో వాచో నివర్తన్తే। అప్రాప్య మనసా సహ। ఆనందం బ్రహ్మణో విద్వాన్। న బిభేతి కుతశ్చనేతి" (తై 2-9)। అపి చానంద ప్రచుర ఇత్యుక్తే దుఃఖాస్తిత్వమపి గమ్యతే, ప్రాచురస్య లోకే ప్రతియోగ్యల్పత్వాపేక్షత్వాత్। తథా చ సతి "యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా" (ఛాం 7-24-1) ఇతిభూమ్ని బ్రహ్మణి తద్వ్యతి

---

చున్నది వినఁబడుచుండెడి బ్రహ్మము నిర్విశేష మనుటకు హేతువు "వాఙ్మనసయోరగోచరత్వాభిధానాత్"ని చెప్పఁబడుచున్నది అనఁగా బ్రహ్మము వాక్కునకును, మనమునకును విషయముకాదని చెప్పఁబడుటవలన నని యర్థము బ్రహ్మము వాఙ్మనసగోచర మనుటకు శ్రుతి "యతో వాచః కుతశ్చన" యని ప్రదర్శింపఁబడుచున్నది యతః= ఏ నిర్వికల్పము నద్వయానందస్వరూపమగు నాత్మనుండి, మనసా సహ= విజ్ఞానముతోఁగూడ, వాచః= ద్రవ్యాదిసవికల్పవస్తువిషయకములగు వాక్కులు, అప్రాప్య= పొందకుండఁగనే యన నా వస్తువును బ్రకాశింపఁజేయకుండగనే, నివర్తంతే= మఱలుచున్నవో, యనఁగా సామర్థ్యవిహీనములగుచున్నవో, యట్టి, బ్రహ్మణః= బ్రహ్మముయొక్క, స్వరూపమగు, ఆనందం= పరమానందమును,విద్వాన్= తెలిసికొనిన బ్రహ్మవేత్త, కుతశ్చన= ఎద్దానివలనను, న బిభేతి= భయము నొందఁడు. అనఁగా తనకంటె వేఱగుపదార్థ మెద్దియు లేకపోవుటవలన భయము నొందుట కవకాశము లేదని భావము ఇట్టి యుపసంహారశ్రుతివలన బ్రహ్మరూపము నిర్విశేషమగు నానందమని వినవచ్చుచుండ సవిశేషమును సావయవమునునగు నానందమయుని బ్రహ్మముగాఁ గైకొనుట యసమంజసమని యాశయము ఇంతియ కాదు మయట్టునకుఁ బ్రాచుర్యార్థమును గ్రహించినను నర్థము సమసంజసము గాదని "అపి చ ప్రతియోగ్యల్పత్వాపేక్షత్వాత్త్"ని చెప్పఁబడుచున్నది అనఁగా నానందమయుఁ డన నానందప్రచురుఁ డను నర్థమును గ్రహించినను లోకములో బ్రాచుర్య మను నర్థమును గ్రహించిన స్థలమున విరోధియగు నర్థముయొక్క యల్పత్వముగూడ గల్గుచుండుఁ గావునఁ బ్రకృతమున దుఃఖలేశముగూడ నానందమయునికిఁ గలదని తెలియవచ్చును అట్లు బ్రహ్మమునకు దుఃఖలేశము నంగీకరించినచో శ్రుతివిరోధము గల్గునని "తథా చ సతి ఉపరుధ్యేత" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది యత్ర= దేనియందు, అన్యత్= రెండవదానిని న పశ్యతి= చూడఁడో, అన్యత్= రెండవదానిని న శృణోతి= వినఁడో, అన్యత్=రెండవదానిని, న విజానాతి= తెలిసికొనఁడో, సః=అట్టియాత్మయే, భూమా= భూమశబ్దవాచ్యమగు బ్రహ్మము. ఈ శ్రుతివలన భూమబ్రహ్మమం దానందముకంటె భిన్నమగు దుఃఖము లేదను శ్రుతి నిరర్థక మగును. కావున బ్రహ్మమందు దుఃఖలేశమును శంకింపఁగూడదు.

క్తాభావ ఇతి చేదుపరుద్ధ్యేత । ప్రతిశరీరం చ ప్రియాదిభేదాదానందమయస్యాపి భిన్నత్వమ్ । బ్రహ్మ తు న ప్రతిశరీరం భిద్యతే, "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" (తై 2-1) ఇత్యానంత్యశ్రుతేః । "ఏకో దేవస్సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా" (శ్వే 6-11) ఇతి చ శ్రుత్యంతరాత్ । న చానందమయస్యాభ్యాసః శ్రూయతే । ప్రాతిపదికార్థమాత్రమేవ హి సర్వత్రాభ్యస్యతే "రసో వై సః । రసగ్ంహ్యేవాయం లబ్ధ్వాఽఽనందీ భవతి । కో హ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్ । యదేష ఆకాశ ఆనందో న స్యాత్" "సైషాఽఽనందస్య మీమాగ్ంసా భవతి" । "ఆనందం బ్రహ్మణో విద్వాన్న బిభేతి కుతశ్చనేతి" (తై 2-7 8-9) "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" (తై 6-6) ఇతి చ । యది చానందమయశబ్దస్య

---

ఇంతియ కాదు ఆనందమయునకుఁ బ్రియాదిభేదముచే భేదము ఘటించుచుఁ బ్రతిశరీరమందు నొక్కొక్క యానందమయునిచొప్పున భేదభావమున నానాత్వము ఘటించుచున్నది. కావున నానందమయుఁడు బ్రహ్మము కాఁడని హేత్వంతరము "ప్రతిశరీరం భిన్నత్వమ్మ"ని చెప్పఁబడుచున్నది. శరీరభేదముచే నానందమయునకు భేదము ఘటించునట్లు బ్రహ్మమునకుఁ గూడ భేదము ఘటింపదా యనిన, నట్లు ఘటింపదని "బ్రహ్మ . భిద్యతే" యని ప్రతిజ్ఞ చేయఁబడుచున్నది. ఇట్టిప్రతిజ్ఞ స్వకపోలకల్పితముగాక శ్రుత్యనుప్రాణితమే యగు నని "సత్యం . శ్రుత్యంతరాత్త"ను భాష్యముచే రెండుశ్రుతులు ప్రదర్శింపఁబడుచున్నవి "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" యను శ్రుతిచే బ్రహ్మమున కానంత్యము వినఁబడుటవలన బ్రహ్మమునకు దేశముచేఁగాని, కాలముచేఁగాని, వస్తువుచేఁగాని, పరిచ్ఛేద మెంతమాత్రము లేదనియు, నట్టిబ్రహ్మము సర్వభూతములందు గూఢముగను, సర్వవ్యాపకముగను, నంతర్యామిగను నొక్కటియై యున్నదనియు నిర్వచింపఁబడుచుండుటచే బ్రహ్మమునకు నానాత్వము తెలియరాదు. కావున బ్రహ్మము, నానందమయుఁడును నొక్కటి యెంతమాత్ర మగుటకు వీలులేదని భావము.

ఇఁక నభ్యాసమువలన నానందమయుఁడు బ్రహ్మ మను వృత్తికారాశయము నిష్ప్రమాణక మని "న చానందమయస్యాభ్యాసః శ్రూయతే" యని ప్రతిజ్ఞ చేయఁబడుచున్నది. అందులకు హేతువు సంగ్రహముగ "ప్రాతిపదికార్థమాత్రమేవ హి సర్వత్రాభ్యస్యతే" యని నిర్వచింపఁబడుచున్నది. అనఁగా శ్రుతులయందుఁ బ్రాతిపదికమాత్రమౌనక ననానందశబ్దమునకుమాత్రమే యభ్యాసము వినఁబడుచున్నదిగాని మయడంతపదమున కభ్యాసము వినఁబడుట లేదని భావము. హేతువునకు దృష్టాంతముగాఁ బర్వఁగు శ్రుతులు "రసో వై ... ఇతి చ" యని ప్రదర్శింపఁబడుచున్నవి.

బ్రహ్మవిషయత్వం నిశ్చితం భవేత్, తత ఉత్తరేష్వానందమాత్రప్రయోగేష్వ ప్యానందమయాభ్యాసః కల్ప్యేత। న త్వానందమయస్య బ్రహ్మత్వమస్తి, ప్రియ శిరస్త్వాదిభిర్హేతుభిరిత్యవోచామ । తస్మాచ్ఛ్రుత్యంతరే "విజ్ఞానమానందం బ్రహ్మ" (బృ 3-9-28) ఇత్యానందప్రాతిపదికస్య బ్రహ్మణి ప్రయోగదర్శనాత్ । "యదేష ఆకాశ ఆనందో న స్యాత్" ఇత్యాదిర్బ్రహ్మవిషయః ప్రయోగో న త్వానంద మయాభ్యాస ఇత్యవగంతవ్యమ్ । యస్త్వయం మయడన్తస్యైవానంద శబ్దస్యాభ్యాసః — "ఏతమానందమయమాత్మానముపసంక్రామతి" (తై 2-8) ఇతి న తస్య బ్రహ్మవిషయత్వమస్తి, వికారాత్మనామేవాన్నమయాదీనామనాత్మనా ముపసంక్రమితవ్యానాం ప్రవాహే పఠితత్వాత్ । నన్వానందమయస్యోపసంక్ర

---

ఇంతియ కాదు ఆనందమయునే బ్రహ్మముగా వర్ణించినచో నీ శ్రుతులన్నిటియందును వినవచ్చెడి యానందశబ్దముల నన్నింటిని మయడంతములుగాఁ జేయవలయు నట్టిగౌరవము గలుగునని "యది చ కల్ప్యేత" యనుభాష్యముచే నిర్వచింపఁబడుచున్నది కల్పనాగౌరవ మున్నను ప్రయోజనమున్నచో గ్రాహ్య మేగదా యన నట్టిప్రయోజనముగూడ లేదుగావున నానందమయుని బ్రహ్మముగా బరిగణించుటకు వీలులేదని సింహావలోకనన్యాయమునఁ బూర్వనిర్దిష్టవిషయము నంతయును సంగ్రహముగ "న తు అవోచామ" యని నిర్వచించుచున్నారు ప్రకృతమున విషయమగు నానందవల్లియేగాదు, శ్రుత్యంతరముచేఁగూడ "విజ్ఞాన మానందం బ్రహ్మ" యని ప్రాతిపదికమగు నానందశబ్దమాత్రమే బ్రహ్మమందు బ్రయోగింపఁబడుచున్నదని "తస్మాత్ ప్రయోగదర్శనాత్"ను భాష్య ముచేఁ జెప్పఁబడుచున్నది ఇంతియ కాదు, ఉపసంహారమున "యదేష ఆకాశ ఆనందో న స్యాత్"ను బ్రహ్మవిషయకమగు ప్రయోగమునం దానందశబ్దమే వినవచ్చుటంజేసి యానందమయశబ్దమున కభ్యాసమెంతమాత్రము లేదని సువ్యక్త మగుచున్నది

ఇట్లు నిర్వచించి "పూర్వపక్షిచే నుపసంహారమునఁ బ్రదర్శింపఁబడిన మయడంతశబ్దమున కభ్యాసము సమీచీనముగాదని నిరసింపఁ బూర్వపక్షబీజము "యస్త్వయం ఉపసంక్రామతీతి" యని స్మరింపఁబడి యా యానందమయ శబ్దము బ్రహ్మపరము గాదని "న తస్య బ్రహ్మవిషయత్వమస్తి" యని ప్రతిషే ధింపఁబడుచున్నది ప్రతిషేధమునకుఁ దగు హేతువు "వికారాత్మనామేవ. పఠితత్వాత్"ను భాష్యముచేఁ బ్రదర్శింపఁబడుచున్నది. అనఁగా నుపసంక్రమిత వ్యము లనియు, వికారస్వరూపము లనియు, ననాత్మ లనియు నిర్వచింపఁబడిన యన్నమయాదులయొక్క ప్రవాహమం దీయానందమయము పఠింపఁబడుటంజేసి యానందమయుఁడుగూడ నన్నమయాదులవలె ననాత్మయేకాని బ్రహ్మ మెంతమా

మితస్యాన్నమయాదివద్బ్రహ్మత్వే సతి, నైవ విదుషో బ్రహ్మప్రాప్తిఫలం నిర్దిష్టం భవేత్ । నైష దోషః । ఆనందమయోపసంక్రమణనిర్దేశేనైవ పుచ్ఛప్రతిష్ఠాభూత బ్రహ్మప్రాప్తేః ఫలస్య నిర్దిష్టత్వాత్ । "తదప్యేష శ్లోకో భవతి । యతో వాచో నివర్తంతే" ఇత్యాదినా చ ప్రపంచ్యమానత్వాత్ । యా త్వానందమయసన్నిధానే "సో ఽకామయత బహు స్యాం ప్రజాయేయేతి" ఇయం శ్రుతిరుదాహృతా, సా "బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" ఇత్యనేన సన్నిహితతరేణ బ్రహ్మణా సంబధ్యమానా

---

త్రము కావని యభిప్రాయము. ఉపసంక్రమితవ్యుడగు నానందమయుడు బ్రహ్మము కానిచో విద్వాంసునికి బ్రహ్మప్రాప్తిఫలము చెప్పబడలేదని చెప్పవలయును అని మధ్యస్థుడు "నను నిర్దిష్టం భవేత్"ని ప్రశ్నించ నయ్యది యొకదోషము గాదని "నైష దోష" యని సమాధానము చెప్పబడుచున్నది. దోషాభావము నందలి హేతువు "ఆనందమయా నిర్దిష్టత్వాత్"ని చెప్పబడుచున్నది. అనగా నానందమయుని నుపసంక్రమణము చేయుటచే పుచ్ఛమువలె నాధారభూతుడగు బ్రహ్మప్రాప్తియే ఫలముగా నిర్వచింపబడుచున్నది. కావున బ్రహ్మప్రాప్తిఫలము లభింపదని యాక్షేపింప శక్యము గాదని భావము. బ్రహ్మప్రాప్తిఫలమును శ్రుతి బోధించుచున్నదని "తదపి ప్రపంచ్యమానత్వాత్"ని చెప్పబడుచున్నది. అనగా పుచ్ఛబ్రహ్మమును బోధించు మంత్రమగు "యతో వాచో నివర్తంతే" యను శ్రుతిచే బ్రహ్మప్రాప్తిఫలమగు నభయము పుష్కలముగ నిర్వచింపబడుచున్నదని తాత్పర్యము. ఆనందమయసన్నిధానమందు "సో ఽకామయత" యను శ్రుతి యుండుటచే నానందమయుడు బ్రహ్మ మను పూర్వపక్షవాదమును నిరసింప నా పూర్వపక్షబీజము "యా తు ఉదాహృతా" యని యనువదించి సమాధానము "సా ప్రతిబోధయతి" యని చెప్పబడుచున్నది. అనగా నానందమయవాక్యమునకును, "సో ఽకామయత" యను వాక్యమునకును మధ్యయందు, "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" యను వాక్య ముండుటం జేసి "సోఽకామయత" యను వాక్యము వ్యవహితమగు నానందమయవాక్యముతో సంబంధింపక సమీపమునందలి "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" యను వాక్యముతో సంబంధించుచున్నది. దానం జేసి "సో ఽకామయత" యను వాక్యముచే నానందమయునకు బ్రహ్మత్వ మెంతమాత్రము చెప్పుటకు వీలులేదు. అంతియ కాదు ఉత్తరగ్రంథమునందు విశదపరచబడిన "అసన్నేవ" యనునది మొదలుగా గల శ్రుతులన్నియు "సో ఽకామయత" యను వాక్యముతోడనే సంబంధించియుండుటం జేసి యయ్యవి గూడ నానందమయవాక్యముతో నెంతమాత్రము సంబంధింపవని "తదపేక్షత్వాచ్చ నానందమయవిషయతా" యను భాష్యముచే చెప్పబడుచున్నది. కావున సకల శ్రుతులు నానందమయవాక్యముతో సంబంధింపక "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" యను వాక్య

నానందమయస్య బ్రహ్మతాం ప్రతిబోధయతి । తదపేక్షత్వాచ్చోత్తరస్య గ్రంథస్య "రసో వై సః" ఇత్యాదేర్నానందమయవిషయతా । నను "సో ఽకామయత" ఇతి బ్రహ్మణి పుంలింగనిర్దేశో నోపపద్యతే । నాయం దోషః । "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః" ఇత్యత్ర పుంలింగేనాప్యాత్మశబ్దేన బ్రహ్మణః ప్రకృతత్వాత్ । యా తు భార్గవీ వారుణీ విద్యా "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" ఇతి తస్యాం మయడశ్రవణాత్ । ప్రియశిరస్త్వాద్యశ్రవణాచ్చ యుక్తమానందస్య బ్రహ్మత్వమ్ । తస్మాదణుమాత్రమపి విశేషమనాశ్రిత్య న స్వత ఏవ ప్రియశిరస్త్వాది బ్రహ్మణ ఉపపద్యతే । న చేహ సవిశేషం బ్రిహ్మ ప్రితిపిపాదయిషితం, వాఙ్మనసగోచరాతిక్రమశ్రుతేః । తస్మాదన్నమయాదిష్వివానందమయే ఽపి

---

ముతోడనే సంబంధించుచున్నవని ప్రదర్శింప మధ్యస్థుఁడు "సో ఽకామయత" యను పుంలింగనిర్దేశము బ్రహ్మమందు సమంజసము గాదుగదా యని "నను .. నోపపద్యతే" యని ప్రశ్నింప నిది యొక దోషము కాదని "నాయం దోష" యని సమాధానము చెప్పఁబడుచున్నది దోషాభావమునకు హేతువు "తస్మాద్వా. ప్రకృతత్వాత్త"ని చెప్పఁబడుచున్నది "తస్మాద్వా ఏతస్మాత్త"ను బ్రాహ్మణవాక్యప్రారంభమున మంత్రవర్ణమందలి బ్రహ్మము పుంలింగమగు నాత్మశబ్దముచేఁ బరామర్శింపఁబడుటవలన "సో ఽకామయత"యనుచోఁ బుంలింగనిర్దేశమెంతమాత్రము దోషావహము కాదని తాత్పర్యము ఇఁకఁ బూర్వపక్షి చే భృగువల్లియందలి "సైషా భార్గవీ వారుణీ విద్యా" యను వాక్య మానందమయపరమే యని చెప్పిన దానిని నిరసింప నా పూర్వపక్షబీజమగు "యా తు భార్గవీ వారుణీ విద్యా" యనుదాని ననువదించి యా భృగువల్లియందలి "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్త"నుచో మయట్ప్రత్యయము వినఁబడకపోవుటవలనను, ప్రియశిరస్త్వాదులు వినఁబడకపోవుటవలనను నానందమే బ్రహ్మమని చెప్పవలయునని "ఆనందః .. బ్రహ్మత్వమ్మ"ని చెప్పఁబడుచున్నది

ఇట్లు నిర్వచించి పరమతనిరాసము "తస్మాత్ ఉపపద్యతే" యని యుపసంహారముచేయఁబడుచున్నది అనఁగా నొక యణుమాత్రమైనను విశేషము లేకుండ బ్రహ్మమునకు స్వతస్సిద్ధముగఁ బ్రియశిరస్త్వాదు లెంతమాత్రము పొందికచేయఁబడనేరవని తాత్పర్యము ఇంతియ కాదు యానందవల్లియందు సవిశేషబ్రహ్మ మెంతమాత్రము బోధింపఁబడలేదని "న చేహ ప్రతిపిపాదయిషితమ్మ"ని ప్రతిజ్ఞచేయఁబడుచున్నది ప్రతిజ్ఞకు హేతువు "వాఙ్మనసగోచరాతిక్రమశ్రుతే" యని చెప్పఁబడుచున్నది అనఁగా "యతో వాచో నివర్తంతే" యను నుపసంహారమందలి శ్రుతిచే బ్రహ్మ మవాఙ్మనసగోచరమని ప్రతిపాదింపఁబడుటవలన సవిశేష మెంతమాత్రము గాదని యభిప్రాయము ఫలితము

వికారార్థఏవ మయడ్విజ్ఞేయో న ప్రాచుర్యార్థః। సూత్రాణి త్వేవం వ్యాఖ్యేయాని—"బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" ఇత్యత్ర కిమానందమయావయవత్వేన బ్రహ్మ వివక్ష్యత, ఉత స్వప్రధానత్వేనేతి। పుచ్ఛశబ్దావయవత్వేనేతి ప్రాప్తఉచ్యతే— "ఆనందమయో ఽభ్యాసాత్" ఆనందమయ ఆత్మేత్యత్ర "బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" ఇతి స్వప్రధానమేవ బ్రహ్మోపదిశ్యతే, అభ్యాసాత్। "అసన్నేవ స భవతి" ఇత్యస్మిన్నిగమనశ్లోకే బ్రహ్మణ ఏవ కేవలస్యాభ్యస్యమానత్వాత్।

---

"తస్మాత్ న ప్రాచుర్యార్థ" యని యుపసంహరింపఁబడుచున్నది ఆనందమయ, శబ్దమునందుఁగూడ నన్నను మూదిశబ్దములందువలెనే మయట్టు వికారార్థకముగ గ్రహింపవలయునేగాని ప్రాచుర్యార్థకముగ నెంతమాత్రము గ్రహింపఁబడఁ గూడదని సిద్ధాన్తము

ఇట్లు వృత్తికారులచే సూత్రములకుఁ జెప్పఁబడిన యర్థమును ద్రోసి పుచ్చి సూత్రములకు స్వాభిమతమగు నర్థమును బ్రతిపాదింప "సూత్రాణి త్వేవం వ్యాఖ్యేయాని" యని యుపక్రమించుచున్నారు

ఈ యధికరణమున విషయవాక్యము "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" యని నిర్వచింపఁబడుచున్నది. అందు విశయము "అత్ర స్వప్రధానత్వేనేతి" యని నిరూపింపఁబ్బడుచున్నది అనఁగా నిచట బ్రహ్మ మానందమయున కవయవముగాఁ జెప్పఁబడుచున్నదా లేక స్వప్రధానభావముగాఁ జెప్పఁబడుచున్నదా యని ఇందలి పూర్వపక్షము "పుచ్ఛశబ్దాదవయవత్వేన" యని నిరూపింపఁబడుచున్నదని "ప్రాప్తే" = పూర్వపక్షము కలుగ, ఉచ్యతే, = సమాధానము చెప్పఁబడుచున్నదని "ఆనందమయో ఽభ్యాసాత్త"ను సూత్రము సమాధానముగాఁ జెప్పఁబడుచున్నది సూత్రార్థము "ఆనందమయః అభ్యస్యమానత్వాత్త"ని చెప్పఁబడుచున్నది అనఁగా "ఆనందమయః ఆత్మా" యనుచో "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" యను వాక్యమున బ్రహ్మము స్వప్రధానముగనే యుపదేశింపఁబడుచున్నది. ఏలయన— 'అభ్యాసాత్' 'అసన్నేవ స భవతి' యను నిగమన శ్లోకమున ననఁగా నుపసంహారమంత్రమునఁ గేవలబ్రహ్మశబ్దమే రెండుపర్యాయము లుచ్చరింపఁబడి యుండుటవలన, ననఁగా నిగమనశ్లోకమున బ్రహ్మశబ్దము రెండు సారు లుచ్చరింపఁబడియుండుటచే "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" యనుచో బ్రహ్మ శబ్దము ముఖ్యముగా బ్రహ్మమునే బోధించుచున్నదని యభిప్రాయము

ఇచట సూత్రకారులచే 'ఆనందమయః' యని యానందమయుఁడే నిర్వచింపఁబడుచుండ నిర్వచింపఁబడిన యానందమయుని బ్రహ్మముగా గ్రహించుటకు మాఱుగ నానందమయశబ్దముచే 'బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా' యను వాక్యము నందలి బ్రహ్మమును గ్రహించుట యెట్లు? అట్లైనచో సూత్రవిరోధము గలు

గదా ? యనినచో నీయానందవల్లియొక్క తత్త్వము నొకింత విచారించినచో నియ్యదియే సువ్యక్త మయ్యెడిని. అదెద్ది యన—

ఆనందవల్లియందుఁ దొలుత సకలవేదార్థసంగ్రహభూతముగ 'బ్రహ్మవిదాప్నోతి పరమ్' మ్మను బ్రహ్మసూత్ర ముపదేశింపఁబడియున్నది. పిమ్మట నా సూత్రవ్యాఖ్యానరూపముగ "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ, యో వేద నిహితం గుహాయాం, పరమే వ్యోమన్, సోఽశ్నుతే సర్వాన్ కామాన్, సహ బ్రహ్మణా విపశ్చితేతి" యను మంత్రము ప్రదర్శింపఁబడియున్నది. సూత్రమందలి బ్రహ్మశబ్ద మీమంత్రమునందు "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" యని వ్యాఖ్యానము గావింపఁబడుటచే, "సత్యం, జ్ఞానం, అనంతం" అను పదములు బ్రహ్మము యొక్క స్వరూపలక్షణము లని సుస్పష్టము. మంత్రముచే నట్టి బ్రహ్మమునకు నుపలబ్ధిస్థానముగ గుహాయందలి యుత్కృష్టమగు నాకాశమనఁగా దహరాకాశము ప్రదర్శింపఁబడుచున్నది. అట్టి బ్రహ్మమును గుహాయం దున్నట్లు దెలిసికొనువాఁ డుత్కృష్టపురుషార్థమునొందు నని 'సోఽశ్నుతే' మంత్రముచేతను, సూత్రముచేతను గూడఁ జెప్పఁబడియున్నది. ఇట్లు శ్రుతిసూత్రములచేఁ దెలిసికొనఁబడవలయునని బోధింపఁబడిన బ్రహ్మమును బోధింప "తస్మాద్వా ఏతస్మాత్ ఆత్మనః" యను వాక్య మాదిగాఁ గల బ్రాహ్మణము పఱగుచున్నది. అట్టి బ్రాహ్మణమునందన్నమయప్రాణమయమనోమయవిజ్ఞానమయానందమయము లను పైదాత్మలు వివరింపఁబడియున్నవి. అందానందమయాత్మ "తస్య ప్రియమేవ శిరః, మోదో దక్షిణః పక్షః, ప్రమోద ఉత్తరః పక్షః, ఆనంద ఆత్మా, బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" యని వర్ణింపఁబడి యున్నది. ఇట్టి స్థితియందు "బ్రహ్మవిదాప్నోతి పరమ్" మ్మని యుపక్రమింపఁబడినట్టియు "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" యను మంత్రముచే వ్యాఖ్యానముగావింపఁబడినట్టియు బ్రహ్మమే యానందమయునిపుచ్ఛముగను బ్రతిష్ఠగను జెప్పఁబడుచున్నదా, లేక యీ బ్రహ్మశబ్దముచే వేఱొకవిషయ ముద్దేశింపఁబడుచున్నదా యను విశయమునకు సర్వథా నవకాశము గలుగును గాని యానందమయుఁడు బ్రహ్మమా లేక వేఱొకటియా యను సందియము గలుగుట కెంతమాత్ర మవకాశము లేదు. ఏలయన నానందమయుఁ డన్నమయాదిప్రవాహపతితుఁ డగుటం జేసి తత్తుల్యుఁడే యని సుకరముగ గ్రహింపనగును. ఆనందమయుఁడు బ్రహ్మమా కాఁడా యను విచికిత్స గలిగినచో నన్నమయాదులకుఁగూడ నట్టివిచికిత్స గలుగుటకు నవకాశము గలదు. కావున నట్లు దలంపఁగూడదు. ఆపాతదృష్టిచే నానందమయుని కవయవముగాఁ దెలియ వచ్చెడి బ్రహ్మమునుగూర్చి సందియము గలుగుట యుక్తమే యగును.

ఇది యిట్లుండ నిగమనశ్లోకమున నన "అసన్నేవ స భవతి" యను

"వికారశబ్దాన్నేతి చేన్న ప్రాచుర్యాత్" వికారశబ్దేనావయవశబ్దో ఽభిప్రేతః ।

మంత్రమున బ్రహ్మము సామాన్యముగ రెండుపర్యాయము లుచ్చరింపఁబడి యున్నది ఇఁక నానందమీమాంసయందు 'స ఏకో బ్రహ్మణ ఆనంద' యని మరియొక బ్రహ్మము వినవచ్చుచున్నది 'యతో వాచో నివర్తన్తే' యను నుపసంహారశ్లోకమున "ఆనందం బ్రహ్మణో విద్వాన్' అని వేఱొక బ్రహ్మశబ్దము వినవచ్చుచున్నది ఇంతియ కాదు విజ్ఞానమయావివక్షయందలి నిగమన శ్లోకమగు "యతో వాచో నివర్తన్తే" యను దానియందుఁగూడ నొక బ్రహ్మశబ్దము వినవచ్చుచున్నది

ఇట్టివల్లియందు వినవచ్చెడి యెనిమిది బ్రహ్మశబ్దములు నొకేయర్థము నందు వినియోగింపఁబడినవా లేక యీ "బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" యనునది మాత్రము వేఱొకయర్థమున నుపయోగింపఁబడినదా యను సంశయము గలుగుట కవకాశము గలదు అట్టిసందేహమునకు ద్బ్రహ్మశబ్దము స్వప్రధానముగ నుప దేశింపఁబడుచున్న దను నర్థమును బోధింపఁదలఁచిన సూత్రకారులు సూత్రము నెట్లు గచింపవలయును? సంశయాస్పదము బ్రహ్మశబ్దము గావున 'బ్రహ్మభ్యా సాత్త్'ని సూత్రమ్మును రచింపవలయునుగదా ! అట్లు సూత్రమును రచించినచో నీబ్రహ్మశబ్దా ముపనిషత్తులయందుఁ బలుతావుల నుండుటఁజేసియె బ్రహ్మశబ్దము నుద్దేశించి యీసూత్రము రచింపఁబడినను ననివారితముగ విప్రతిపత్తి గలుగును అట్టివిప్రతిపత్తిని వారించి విషయమును సుబోధము చేయ నభిమతమగు బ్రహ్మశబ్ద మనదు నతిశయముగు సన్నిధియం దుంచుటఁజేసి యానందమయశబ్దము నుపలక్షక ముగా గ్రహించి "ఆనందమయో ఽభ్యాసాత్త్"ను సూత్రరచనమును గావించి యున్నారు ఇంతియ కాదు, "అభ్యాసాత్త్"ను హేతువాచకశబ్దము చేఁగూడ నానందమయశబ్ద ముపలక్షకమే యని గ్రహింపవలయును ఏలయన నానంద మయశబ్దమున కుత్తరగ్రంథము నెచ్చటను నభ్యాసము వినఁబడక బ్రహ్మశబ్దమునకే యభ్యాసము వినఁబడుటవలనను, నిట్టివిశేషమును గమనింపఁజాలక యుత్తరాధి కరణములయందు స్మరింపఁబడిన అన్తరాకాశప్రాణశబ్దముల ట్లానందమయశబ్దము గూడ స్వార్థమునందే ప్రయోగింపఁబడిన దను భ్రమచే నీసూత్రమునందు బ్రహ్మ శబ్దమున కనువృత్తిచేసి వృత్తికారాదు లానందమయుఁడే బ్రహ్మ మను నపార్థము నకుఁ బాల్పడిరి కావున నీసూత్రమునకు "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" యను వాక్యమే విషయవాక్య మని గ్రహింపవలయును

ఇఁక రెండవసూత్రార్థమును వివరింప "వికారశబ్దాన్నేతి చేన్నప్రాచు ర్యాత్త్"ను రెండవసూత్రము స్మరింపఁబడుచున్నది వికారశబ్దమునకు నవయవ శబ్దార్థము అనఁగాఁ బ్రకృతము పుచ్ఛ మని "వికారశబ్దేన ... అభిప్రేత" యని

పుచ్ఛమిత్యవయవశబ్దాన్న స్వప్రధానత్వం బ్రహ్మణ ఇతి యదుక్తం తస్య పరిహారో వక్తవ్యః । అత్రోచ్యతే — నాయం దోషః, ప్రాచుర్యాదప్యవయవశబ్దోపపత్తేః । ప్రాచుర్యం ప్రాయాపత్తిః, అవయవప్రాయే వచనమిత్యర్థః । అన్నమయాదీనాం హి శిరఆదిషు పుచ్ఛాన్తేష్వవయవేషూక్తేష్వానందమయస్యాపి శిర ఆదీన్యవయవాంతరాణ్యుక్త్వా అవయవప్రాయాపత్త్యా 'బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా' ఇత్యాహ, నావయవవివక్షయా, యత్కారణమభ్యాసాదితి స్వప్రధానత్వం బ్రహ్మణః సమర్థితమ్॥ "తద్ధేతువ్యపదేశాచ్చ" సర్వస్య వికారజాతస్య సానందమయస్య కారణత్వేన బ్రహ్మ వ్యపదిశ్యతే "ఇదగ్ం సర్వమసృజత । యదిదంకించ"

---

చెప్పఁబడుచున్నది సూత్రమందలి "వికారశబ్దాన్న" యను పూర్వపక్షము "పుచ్ఛం బ్రహ్మణ" యని వివరింపఁబడుచున్నది అనఁగాఁ బుచ్ఛమను నవయవశబ్దముండుటవలన బ్రహ్మ స్వప్రధానముగాదని యర్థము 'ఇతి, చేత్‌'ను సూత్రమందలిపదములు 'యదుక్తమ్మ'ని వివరింపఁబడుచున్నవి అట్టి పూర్వపక్షమునకుఁ బరిహారము జెప్పవలయునను నాశయముతో సూత్రమందలి నఞ్ పదము స్మరింపఁబడుచున్నదని తదర్థము "తస్య పరిహారో వక్తవ్యః. నాయం దోష" యని చెప్పఁబడుచున్నది. అనఁగా నవయవవాచకమగు పుచ్ఛపద ముండుటంత దోషావహ మెంతమాత్రము గాదని తాత్పర్యము దోషాభావమున్నకు హేతువుగా స్మరింపఁబడిన "ప్రాచుర్యాత్త"ను పదము "ప్రాచుర్యాత్. నావయవవివక్షయా" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది ప్రాచుర్యమందుఁగూడ నవయవశబ్దము సమంజసమే యగును ప్రాచుర్యమన ప్రాయాపత్తి యనఁగా సాదృశ్యము. అవయవప్రాయమునందవయవవచనముగాని వాస్తవముగా నవయవము గాదని యభిప్రాయము, ఏలయన నన్నమయాదులకు శిరస్సు మొదలుగాఁ గల్గి పుచ్ఛమంతముగాఁ గల్గిన యైదేసియవయవములు చెప్పఁబడుటంజేసి యానందమయునికిఁ గూడ శిరస్సు మొదలుగాఁ గలిగిన యవయవాంతరములఁ జెప్పి యట్టి యవయవ సాదృశ్యముచే "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" యని శ్రుతి పలుకుచున్నది కాని వాస్తవమగు నవయవ వివక్షచే నెంతమాత్రము పలుకలేదు ఏలయన "యత్కారణా సమర్థితమ్మ"ని హేతువు చెప్పఁబడుచున్నది. ఏకారణమువలన బ్రహ్మశబ్దాభ్యాసముచే నిచట బ్రహ్మమునకు స్వప్రధానభావము సమర్థింపఁబడెనో యాకారణముచేతనే యిచటఁ బుచ్ఛశబ్దమునకుఁ బుచ్ఛప్రాయ మగు నర్థమును గ్రహింపవలయును

ఇఁక "తద్ధేతువ్యపదేశాచ్చ" యను సూత్రముయొక్క వ్యాఖ్యానము "సర్వస్య ... ఉపపద్యతే" యని నిరూపింపఁబడుచున్నది తస్య = ఆ యానందమయునితోఁ గూడిన సకలవికారజాతమునకు, హేతువ్యపదేశాత్ = కారణముగా

(తై 2-6) ఇతి। న చ కారణం సత్ బ్రహ్మ స్వవికారస్యానందమయస్య ముఖ్యయా వృత్త్యా ఽవయవ ఉపపద్యతే, అపరాణ్యపి సూత్రాణి యథాసంభవం పుచ్ఛవాక్యనిర్దిష్టస్యైవ బ్రహ్మణ ఉపపాదకాని ద్రష్టవ్యాని॥ ॥౧౯॥

---

వర్ణింపఁబడుటవలన, బ్రహ్మము స్వప్రధానమే యని సూత్రార్థము "ఇదం సర్వ మసృజత, యదిదం కించ" యను శ్రుతిచే సకల జగత్కారణముగ నీబ్రహ్మము వర్ణింపఁబడుచున్నదని తాత్పర్యము కారణభూతమగు బ్రహ్మము తనవికారమగు నానందమయునికి ముఖ్యవృత్తిచే నెంతమాత్ర మవయవభావము నొందదని "న చ కారణం ఉపపద్యతే" యని చెప్పఁబడుచున్నది

ఇట్లు మూఁడుసూత్రములకు సంక్షేపముగ వృత్తిని బ్రదర్శించి మిగిలిన యైదుసూత్రములకు నర్థమును జిజ్ఞాసువులే సులభముగ గ్రహింతురుగాక యని "అపరాణ్యపి ద్రష్టవ్యాని" యని చెప్పి యవ్వానివ్యాఖ్యానమునుండి యుపరమించిరి

అయిన నవ్వానియొక్క వృత్తి నీదిగువ సంక్షేపముగఁ బ్రదర్శించుచున్నారము

## "మాంత్రవర్ణిక మేవ చ గీయతే"

"బ్రహ్మవిదాప్నోతి పరమ్"ని యుపక్రమింపఁబడి 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' యని లక్షణముచేఁ బ్రదర్శింపఁబడినట్టి మాంత్రవర్ణికమగు బ్రహ్మమే 'బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా' యనుచో ననువదింపఁబడుటచే నిట బ్రహ్మ స్వప్రధానముగా నుపదేశింపఁబడుచున్నది

## "నేతరో ఽనుపపత్తేః"

ఇతరః=జీవుఁడగు నానందమయుఁడు, న=బ్రహ్మము కాఁడు, ఏలయన, అనుపపత్తేః—"సో ఽకామయత బహు స్యాం ప్రజాయేయేతి" యను మొదలగు శ్రుతులచే బ్రహ్మమునకుఁ జెప్పఁబడిన ధర్మములు జీవుఁడగు నానందమయునికి నినవచ్చుట లేదు గావున నని సూత్రార్థము.

## "భేదవ్యపదేశాచ్చ"

బ్రహ్మపుచ్ఛాధికారమునందు "రసో వై సః, రసగ్ం హ్యేవాయం లబ్ధ్వా ఽఽనందీ భవతి" యను శ్రుతియందు జీవబ్రహ్మములకు లబ్ధృత్వలబ్ధవ్యత్వభావము వినఁబడుటవలన భేదము తెలియవచ్చుచున్నది గావున జీవుఁడు బ్రహ్మము కాఁడు

## "కామాచ్చ నానుమానాపేక్షా"

•• బ్రహ్మపుచ్ఛాధికారమున "సో ఽకామయత బహు స్యాం ప్రజాయేయ" యను శ్రుతియందు కామాత్ = కామయితృత్వము వినఁబడుటవలన, అనుమానాపేక్షా = ఆనుమానిక మగు ప్రధానమునకు నవకాశ మెంతమాత్రమును లేదు

## అస్మిన్నస్య చ తద్యోగం శాస్తి"

అస్మిన్ = ఈబ్రహ్మమందు, అస్య = ప్రతిబుద్ధుఁడైన జీవునకు, తద్యోగం = బ్రహ్మభావాపత్తి రూపమగు ముక్తిని, శాస్తి = శాస్త్రము బోధించుచున్నది గావున నీ బ్రహ్మశబ్దము జీవునియందు గాని, ప్రధానమందుఁగాని యెంతమాత్రము వర్తింపదు

ఇది యానందమయాధికరణము

## ఆనందమయాధికరణసారాంశము

ఈ వల్లియందు బ్రహ్మస్వరూపము నిర్విశేషమగు నానందమని నిర్ధారణ చేయఁబడుచున్నది భృగువల్లియందుఁ గూడ బ్రహ్మస్వరూపమానందమే యని నిర్వచింపఁబడుచున్నది ఇట్లు తైత్తిరీయోపనిషత్తునందలి భృగువల్లి, యానందవల్లి యను రెండుప్రకరణములు గూడ బ్రహ్మమానందమే యనియు, నట్టి యానందస్వరూపమే సత్యజ్ఞానానంతశబ్దముల చేగూడ వ్యక్తీకరింపఁబడుచున్నదనియుఁ దెలియవచ్చెడిని.ఇంతియకాదు అట్టిబ్రహ్మము దానేయని తెలిసికొనుటయే బ్రహ్మభావాపత్తిరూపమగు మోక్షమని సువ్యక్తమయ్యెడిని ఇదియేసకలవేదార్థసారసంగ్రహమగు రహస్యమని "సూత్రకారులు అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యను సూత్రము మొదలు "అస్మిన్నస్యచ తద్యోగం శాస్తి" యను పందొమ్మిది సూత్రములచేఁ బూర్వపక్షనిరసనపూర్వకముగఁ బ్రబోధమును గావించియున్నారు ఇట్టిప్రబోధమునే సకలవేదాంతములును జేయుచున్నవను నిశ్చయమును జిజ్ఞాసువులకుఁ గలిపి వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థులుగఁ జేయ నీసూత్రములకు వ్యాఖ్యానరూపమునవలరారు నుత్తరగ్రంథమును "అంతస్తద్ధర్మోపదేశాత్"ను సూత్రముతోఁ బ్రారంభించుచున్నారు.

## అంతరధికరణమ్

## అన్తస్తద్ధర్మోపదేశాత్

ఇదమామ్నాయతే— "అథ య ఏషోఽన్తరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే హిరణ్యశ్మశ్రుర్హిరణ్యకేశ ఆప్రణఖాత్సర్వ ఏవ సువర్ణః" "తస్య యథా కప్యాసం పుండరీకమేవమక్షిణీ తస్యోదితి నామ స ఏష సర్వేభ్యః పాప్మభ్య ఉదిత ఉదేతి హ వై సర్వేభ్యః పాప్మభ్యో య ఏవం వేద" "ఇత్యాది

## "అన్తస్తద్ధర్మోపదేశాత్"

"అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యను సూత్రమునుండి బ్రహ్మశబ్దమున కనువృత్తి చేయఁగా నీ సూత్రమునకు అంతః, బ్రహ్మ, తద్ధర్మోపదేశాత్తను స్వరూపముసిద్ధించును. 'అంతః' అనఁగా బ్రహ్మమని యర్థము

ఏలయన, తత్ = ఆబ్రహ్మయొక్క, ధర్మోపదేశాత్ = ధర్మముల నుపదేశించుట వలన, అనఁగా నీయంతశ్శబ్దవాచ్యునకు బ్రహ్మధర్మము లుపదేశించుటవలన నంతశ్శబ్దవాచ్యుఁడు బ్రహ్మమే యని ప్రతిజ్ఞ చేయఁబడుచున్నది.

ఇఁక సంశయాస్పదుఁడై సూత్రకారునిచే బ్రహ్మముగా నిర్దేశింపఁబడిన యంతశ్శబ్దవాచ్యుఁ డే వేదాంతప్రకరణమున వినఁబడుచున్నాఁడో యా ప్రకరణమీ యధికరణమునకు విషయమగుచున్నది ఛాందోగ్యోపనిషత్తునందలి మొదటి ప్రపాఠకమున నుద్గీథోపాసనా ప్రకరణ మందారేడు ఖండములలో వినవచ్చెడి వాక్యములిచట విషయవాక్యములని "ఇదమామ్నాయతే ఇత్యాది" యను భాష్యము చెప్పఁబడుచున్నది ఆదిత్యే = ఆదిత్యమండలమందు, య ఏషః = ఏ యీ, అంతః = అంతశ్శబ్దవాచ్యుఁడును, హిరణ్మయః = జ్యోతిర్మయుఁడును, హిరణ్యశ్మశ్రుః = తేజోమయమగు మీసములు గలవాఁడును, హిరణ్యకేశః = జ్యోతిర్మయమగు తలవెండ్రుకలు గలవాఁడును, ఆప్రణఖాత్ = నఖాగ్రపర్యంతము, సర్వః = దేహమంతయు, సువర్ణ ఏవ = జ్యోతిర్మయమే యగు, పురుషః = పురుషుఁడు, దృశ్యతే = చూడఁబడుచున్నాఁడు తస్య = ఆ యంతశ్శబ్దవాచ్యునకు, కప్యాసం = మర్కటపృష్ఠముతోఁ దుల్యమగు రక్తిమతోఁ గూడిన, పుండరీకం = పద్మము, యథా = ఏతీరున ప్రకాశించునో, ఏవం = అట్టి పద్మముల వంటి, అక్షిణీ = నేత్రములు గలవు స ఏషః = ఆ యీ యంతశ్శబ్దవాచ్యుఁడు సర్వేభః పాప్మభ్యః = సకల కర్మలనుండి, ఉదితః = మీఁదుగాఁ బోయినవాఁడు గావున తస్య = వానికి, ఉత్, ఇతి = ఉత్తను, నామ = పేరు యః = ఎవ్వఁడు, ఏవం వేద = ఈ రీతిగాఁ దెలిసికొనుచున్నాఁడో, సః = వాఁడు గూడ, సర్వేభ్యః = సమస్తములగు, పాప్మభ్యః = కర్మలనుండి, ఉదేతి = దాఁటిపోవుచున్నాఁడు

దైవతమ్” (ఛాం 1-6-7, 8) ‘అథాధ్యాత్మమ్’ ‘అథ య ఏషోఽన్తరక్షిణి పురుషో దృశ్యతే” (ఛాం 1-7-1-5,) ఇత్యాది। తత్ర సంశయః – కిం విద్యాకర్మాతిశయవశాత్ప్రాప్తోత్కర్షః కశ్చిత్సంసారి సూర్యమండలే చక్షుషి చోపాస్యత్వేన శ్రూయతే కింవా నిత్యసిద్ధః పరమేశ్వర ఇతి। కిం తావత్ప్రాప్తం, సంసారీతి। కుతః,

---

తస్య = వానికి, ఋక్చ = ఋగ్వేదమును, సామ చ = సామవేదమును గేష్ణౌ = పర్వములు తస్మాత్ = ఆకారణముచేత, ఉద్గీథం = ఆపురుషుడు ఉద్గీథస్వరూపుఁడే, తస్మాత్ = ఆకారణముచే, ఉద్గాతా తు = ఉద్గాత యన్ననో ఏతస్య, = ఈ పూరుషుని, గాతా = గానముచేయువాఁడు, ఉద్గాతైవ హి=ఉద్గాతయో, అనఁగా ఉత్తును గానముచేయువాఁడుగాఁన నుద్గాతయని నిర్వచనము స ఏషః = ఆ యీ యుత్తు, అముష్మాత్ = ఈ యాదిత్యునికంటె, పరాంచః = ఊర్ధ్వములగు యే లోకాః = ఏ లోకములు గలవో, తేషాం చ = ఆలోకములకును, దేవకామ్యానాం చ = దేవతల కోరికలకును, ఈష్టే = ఈ పురుషుఁడు ఈశిత యన నియామకుఁడగుచున్నాడు ఇతి = ఈలాగున, అధిదైవతమ్ = అధిదైవతోపాసనము, అథ = అనంతరము, అధ్యాత్మమ్=అధ్యాత్మోపాసనము, వినఁబడుచున్నది. అక్షిణి= నేత్రమందు, యః ఏషః = ఏ యీ, అన్తః =అన్తశ్శబ్దవాచ్యుఁడగు, పురుషః=పురుషుఁడు, దృశ్యతే=చూడఁబడుచున్నాఁడో సాఏవ = ఆ పురుషుఁడే, ఋక్ = ఋగ్వేదము, సామ = సామవేదము, తత్ =ఆపురుషుఁడే ఉక్థమ్ = ఉక్థము, తత్ = ఆ పురుషుఁడే, యజుః = యజుర్వేదము, తత్ = ఆ పురుషుఁడే, బ్రహ్మ = బ్రహ్మము, అముష్య = ఆదిత్యమండలాంతర్వర్తియగు పురుషునకు, యత్ = ఏ హిరణ్మయాదికమగు, రూపం = రూపమో, తత్ =ఆ హిరణ్మయమగు రూపమే, తస్యైతస్య = ఆయీపురుషునియొక్క, రూపం = రూపము

స ఏషః = ఆ యీపురుషుఁడు, ఏతస్మాత్ = ఈయాధ్యాత్మికమగు నాత్మకంటె, అర్వాంచః = అడ్డుగానుండెడి, యే లోకాః= ఏలోకములు గలవో, తేషాం = ఆలోకములకు, మనుష్యకామానాంచ = మనుష్యులయొక్క కోరికలకును, ఈష్టే = నియామకుఁడగుచున్నాఁడు తత్ = ఆకారణము వలన, యే ఇమే = ఏయీగాయకులు, వీణాయాం = వీణయందు, గాయంతి = గానము చేయుచున్నారో, తే = అట్టిగాయకులు, ఏతం = ఈ యుత్తమపురుషునే, గాయంతి = గానముచేయుచున్నారు తస్మాత్ = ఆకారణముచే, తే = వారు, ధనసనయః = ధనవంతులు

ఈ వాక్యములందు సంశయము “తత్ర సంశయః . ఇతి” యను భాష్యముచే నిర్వచింపఁబడుచున్నది అనఁగా సూర్యమండలమందును నేత్రగోళకము

రూపవత్త్వశ్రవణాత్ । ఆదిత్యపురుషే తావత్ "హిరణ్యశ్మశ్రు రిత్యాది రూపముదాహృతమ్। అక్షిపురుషేపి తదేవాతిదేశేన ప్రాప్యతే—"తస్యైతస్య తదేవరూపం యదముష్య రూపం" ఇతి । న చ పరమేశ్వరస్య రూపవత్త్వం యుక్తమ్ "అశబ్దమస్పర్శమరూపమవ్యయమ్ (కా.1-3-15) ఇతి శ్రుతేః।ఆధారశ్రవణాచ్చ—"య ఏషోఽన్తరాదిత్యే" "య ఏషోఽన్తరక్షిణి" ఇతి। న హ్యనాధారస్య స్వమహిమప్రతిష్ఠస్య సర్వవ్యాపినః పరమేశ్వరస్యాధార ఉపదిశ్యేత । "స భగవః కస్మిన్ప్రతిష్ఠిత ఇతి

---

నందు నుపాస్యమని వినవచ్చెడి 'ఉత్త'ను పురుషుఁడు విద్యాకర్మాతిశయము వలన నుత్కర్షను జెందిన యొకానొక సంసారియగు ●వవిశేషమా లేక నిత్యసిద్ధుఁడగు పరమేశ్వరుఁడా యన బ్రహ్మమా యని భావము ఇట్టి విశయమున "కింతావత్ప్రాప్తమ్" ఏపక్షము లభించునని మధ్యస్థుఁడడుగఁ బూర్వపక్షి, సంసారి యని చెప్పుచున్నాఁడు. "కుతః = ఏలయని" మధ్యస్థుఁడడుగ "రూపవత్త్వశ్రవణాత్త"ని చెప్పఁబడుచున్నది అనఁగా నంతశ్శబ్దవాచ్యునకు రూపము తెలియవచ్చుట వలననని. సంగ్రహముగా హేతువు ప్రదర్శింపఁబడుచున్నది హేతుసంగ్రహవాక్యము "ఆదిత్యపురుషే. రూపమితి" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది ఆదిత్యపురుషునియందు "హిరణ్యశ్మశ్రుం, హిరణ్యకేశ" యను రూపము వినవచ్చుచున్నది । అక్షిపురుషునియందన్ననో "తస్యైతస్య తదేవ రూపం యదముష్య రూపమ్మ"ని యాదిత్యపురుషుని రూపమే యతిదేశముచేఁ జెప్పఁబడుచున్నది. కావున నిచటఁ గరచరణాద్యవయవవిశిష్టమగు రూప మొకటి వినవచ్చుచున్నది కరచరణాద్యవయవవిశిష్టరూపము పరమేశ్వరున కయుక్తమా యన నయుక్తమే యని శ్రుతిముఖమున "నచ . ఇతిశ్రుతే" యను భాష్యముచే నిర్వచింపఁబడుచున్నది. "అశబ్దమస్పర్శమరూపమవ్యయం, తథారసం నిత్యమగంధవచ్చ యత్, అనాద్యనంతం మహతః పరమ్మ"ను శ్రుతిచే బ్రహ్మము నిర్విశేషమని చెప్పఁబడుటవలనఁ బరమేశ్వరునకు రూపమును గ్రహించుట యొంతమాత్రము యుక్తము గాదని యభిప్రాయము

ఇంతియ కాదు "ఆధారశ్రవణాచ్చ" యను హేత్వంతర మొకటి వక్కాణింపఁబడుచున్నది. ఈ హేతుసంగ్రహవాక్యము "య ఏషోఽన్తరాదిత్యే యఏషోఽన్తరక్షిణి" యని యాదిత్యుఁడు నేత్రము నీపురుషుని కాధారముగా వర్ణింపఁబడుటచే నీ పురుషుఁడీశ్వరుఁడు గాఁడని యభిప్రాయము ఏలయన "న హి ఉపదిశ్యేత" యని హేతువు చెప్పఁబడుచున్నది నిరాధారుఁడును దన మహిమయందేయున్నవాఁడును సర్వవ్యాపి యగు పరమేశ్వరునకు నాధార మెంత మాత్రము చెప్పుటకు వీలు లేదు ఇట్టి పరమేశ్వరస్వభావమెందుఁ దెలియవచ్చు నన్న నాశ్రుతులు రెండు "స భగవః...శ్రుతీభవత"యను భాష్యముచే నిరూపింపఁ

స్వేమహిమ్ని" (ఛాం 7-24-1) ఇతి "ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః" ఇతి చ శ్రుతీ భవతః। ఐశ్వర్యమర్యాదాశ్రుతేశ్చ। "స ఏష యే చాముష్మాత్పరాఞ్చో లోకా స్తేషాం చేష్టే దేవకామానాంచ" (ఛాం 1-6-8) ఇత్యాదిత్యపురుషస్యైశ్వర్య మర్యాదా। "స ఏష యే చైతస్మాదర్వాఞ్చో లోకా స్తేషాం చేష్టే। మనుష్య కామానాం చ" (ఛా॥ 1-7-6) ఇత్యక్షిపురుషస్య నచ పరమేశ్వరస్య మర్యాదా వదైశ్వర్యం యుక్తమ్ "ఏష సర్వేశ్వర ఏష భూతాధిపతిరేష భూతపాల ఏష సేతుర్విధరణ ఏషాం లోకానామసంభేదాయ" (బృ 4-4-22) ఇత్యవిశేషశ్రుతేః। తస్మాన్నాక్ష్యాదిత్యయోరన్తః పరమేశ్వర ఇత్యేవం ప్రాప్తే బ్రూమః— 'అన్తస్త

---

బడుచున్నవి భగవః = మహానుభావా, సః = ఆయీశ్వరుఁడు, కస్మిన్ = దేని యందు, ప్రతిష్ఠితః ఇతి = ఉన్నాఁడని, ప్రశ్నింప స్వే = తన సంబంధమగు మహిమ్ని = మహిమయందే యని యర్థము ఇంతియకాదు "ఐశ్వర్యమర్యాదా శ్రుతేశ్చ" అను వేఱొకహేతువుగూడఁ జెప్పఁబడుచున్నది అనఁగా నైశ్వర్యము యొక్క యవధి వినఁబడుటవలన నని యర్థము హేతుసంగ్రహవాక్యము "స ఏషః... అక్షిపురుషస్య" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది "స ఏష . దేవకామానాం చ" యను శ్రుతిచే నాదిత్యపురుషునియైశ్వర్యము యొక్క హద్దు దెలియఁబడుచున్నది ఆతీరుననే "స ఏషః, మనుష్యకామానాం చ" యను శ్రుతిచే నక్షిపురుషునియొక్క హద్దు వినఁబడుచున్నది పరమేశ్వరుని యైశ్వర్య మునకు నవధియుండఁగూడదా యన నట్లింత్రమాత్ర ముండఁగూడదని "నచ . . యుక్తమ్మ"ని నిర్వచింపఁబడుచున్నది పరమేశ్వరుని యైశ్వర్యము నిరతిశయమని ప్రదర్శించు శ్రుతి "ఏష సర్వేశ్వరః . అవిశేషశ్రుతే" యని ప్రదర్శింపఁబడు చున్నది ఏషః = ఈ పరమేశ్వరుఁడు, సేతుః = ఆనకట్టవంటివాఁడు, ఏషః = ఈ పరమేశ్వరుఁడు, ఏషాం = ఈ, లోకానాం = లోకములయొక్క, అసంభే దాయ = సాంకర్యము లేకుండుటకు విధరణః = వేఱుగా ధరించువాఁడు.

ఈ శ్రుతివలన సర్వలోకములకును సకిల భూతములకును నియామకుఁ డీశ్వరుఁడని చెప్పఁబడుటచే నీశ్వరుని యైశ్వర్యమునకు మేఱ లేదు కావున మేఱతోఁ గూడిన యంతశ్శబ్దవాచ్యుఁ డీశ్వరుఁడెంత మాత్రముగాడని తెలియ వచ్చుచున్నది పూర్వపక్షము "తస్మాన్నాక్ష్యాదిత్యయోరంతః పరమేశ్వర" యని యుపసంహారము చేయఁబడు చున్నది అనఁగా నేత్రమందు నాదిత్య మండలమందునుఁ దెలియవచ్చెడి యంతశ్శబ్దవాచ్యునకు రూపవత్త్వము, ఆధారము, ఐశ్వర్యమర్యాదయు వినవచ్చుటంజేసి యంతశ్శబ్దవాచ్యుఁడు పరమేశ్వరుఁడెంత మాత్రము గాఁడని పూర్వపక్షము, "ఏవం ప్రాప్తే = గలుగఁగా బ్రూమః = సమాధానమును జెప్పుచున్నారమని సమాధాన పరముగా "అంత స్తద్ధర్మో

ద్ధర్మోపదేశాత్। ఇతి” “య ఏషోఽన్తరాదిత్యే” “య ఏషోఽన్తరక్షిణి” ఇతి చ శ్రూయమాణః పురుషః పరమేశ్వర ఏవ, న సంసారీ। కుతః తద్ధర్మోపదేశాత్। తస్య హి పరమేశ్వరస్య ధర్మా ఇహోపదిష్టాః। తద్యథా— “తస్యోదితి నామ” ఇతి శ్రావయిత్వా అస్యాదిత్యపురుషస్య నామ “స ఏష సర్వేభ్యః పాప్మభ్య ఉదితః” ఇతి సర్వపాప్మాపగమేన నిర్వక్తి। తదేవ చ కృతనిర్వచనం నామాక్షిపురుషస్యాప్యతిదిశతి— ‘యన్నామ తన్నామ’ ఇతి। సర్వపాప్మాపగమశ్చ పరమాత్మన ఏవ శ్రూయతే—“య ఆత్మాఽపహతపాప్మా”(ఛాం 8-7-1) ఇత్యాదౌ। తథా చాక్షుషే పురుషే. “సైవ ర్క్తత్సామ తదుక్థం తద్యజుస్తద్బ్రహ్మ”

---

పదేశాత్”ను సూత్రము చెప్పఁబడుచున్నది సూత్రమందలి యంతశ్శబ్దము ‘య ఏష. . న సంసారీ” యను భాష్యముచే వ్యాఖ్యానము చేయఁబడుచున్నది. అనఁగా “యఏషోఽన్తరాదిత్యే” “యఏషోఽన్తరక్షిణి” యను శ్రుతులయందు వినవచ్చెడి పురుషుఁడు పరమేశ్వరుఁడేగాని జీవుఁడెంతమాత్రము గాఁడని భావము. ఇచట వినవచ్చెడి పరమేశ్వరపదము బ్రహ్మపరము కుతః=ఏల యని మధ్యస్థుఁడు ప్రశ్నింప ‘తద్ధర్మోపదేశాత్”ను హేతువు ప్రదర్శింపఁబడుచున్నది హేతు వాక్యము “తస్య హి పరమేశ్వరం గమయతి” యను గ్రంథముచే వివరింపఁ బడుచున్నది. అందు “తస్య ఉపదిష్టా” యని హేతువాక్య వివరణ మనఁగా నా, పరమేశ్వరునియొక్క ధర్మములిచట నుపదేశింపఁబడుచున్నవని భావము పరమేశ్వరధర్మకథనము “తద్యథా” యని యుపక్రమింపఁబడుచున్నది అందొ కటి “తస్య ఉదితి నామ = అతనికి ‘ఉత్’ను పేరు అనిచెప్పి యా యాదిత్య పురుషునియొక్క నామమునకు “స ఏష సర్వేభ్యః పాప్మభ్య ఉదిత” యను నిర్వ చనముచే సర్వపాప్మాఽపగమ మొక ధర్మముగాఁ జెప్పఁబడుచున్నదని “అస్య . నిర్వక్తి” యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది

ఇట్లు నిర్వచింపఁబడిన ‘ఉత్’ను నామమే యతిదేశముచే నక్షిపురుషు నకు “యన్నామ తన్నామ” యని నిర్వచింపఁబడుటచే నక్షిపురుషుఁడు గూడ సర్వ పాప్మాపగమరూపధర్మముతో నొప్పియున్నాఁడని “తదేవ తన్నామ ఇతి” యని చెప్పఁబడుచున్నది

ఇట్లాదిత్యపురుషునకు నక్షిపురుషునకు సర్వపాప్మాపగమము ధర్మముగాఁ దెలియవచ్చుటచే నాతఁడు బ్రహ్మమే యని నిశ్చయించుటకు శ్రుత్యంతరమందు వినవచ్చెడి వాక్యమిచట “సర్వపాప్మాపగమః.. ఇత్యాదౌ” యను భాష్యముచేఁ బ్రదర్శింపఁబడుచున్నది అనఁగా “య ఆత్మాఽపహతపాప్మా” యను ప్రకర ణాంతరమందలి శ్రుతిచే సర్వపాప్మాపగమము పరమేశ్వరధర్మముగా నిరూపింప బడుచున్నదని యర్థము

ఇత్యృక్సామాద్యాత్మకతాం నిర్ధారయతి । సా చ పరమేశ్వరస్యోపపద్యతే సర్వకారణత్వాత్సర్వాత్మకత్వోపపత్తేః । పృథివ్యగ్న్యాద్యాత్మకే చాధిదైవతం ఋక్సామే వాక్ప్రాణాద్యాత్మకే చాధ్యాత్మమనుక్రమ్యాహ— "తస్యర్క్చ సామ చ గేష్ణౌ" ఇత్యధిదైవతమ్। తథాధ్యాత్మమపి— "యావముష్య గేష్ణౌ తౌ గేష్ణౌ" ఇతి । తచ్చ సర్వాత్మన ఏవోపపద్యతే। "తద్య ఇమే వీణాయాం గాయన్త్యేతం తే గాయన్తి తస్మాత్తే ధనసనయః" (ఛాం॥ 1-7-6) ఇతి చ లౌకికేష్వపి గానేష్వస్యైవ గీయమానత్వం దర్శయతి । తచ్చ పరమేశ్వరపరిగ్రహే ఘటతే । "యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జిత

---

ఇక రెండవధర్మమగు సార్వాత్మ్యము "తథా చాక్షుషే నిర్ధారయతి" యని ప్రదర్శింపబడుచున్నది ఎట్లన— "సైవ ఋక్ తద్బ్రహ్మ" యను శ్రుతివలనఁ జాక్షుషపురుషుఁడు ఋక్సామాదులను స్వరూపముగాఁ గలిగి యున్నట్లు తెలియవచ్చుచున్నది ఇట్టి ఋక్సామాదిస్వరూపము పరమేశ్వరునికే తగును, గాని జీవుని కెంతమాత్రము తగదని "సాచపరమేశ్వరస్యోపపద్యతే" యని చెప్పఁబడుచున్నది అందులకు హేతువు "సర్వకారణత్వాత్సర్వాత్మకత్వోపపత్తే" యన్ని ప్రదర్శింపఁబడుచున్నది పరమేశ్వరుఁడు సర్వకారణ మగుటంజేసి సార్వాత్మ్య మాతనికి యుక్తము ఏలయనఁ గారణము కార్యరూపము నొందుట వలనఁ గార్యాత్మత్వము కారణమునకుఁ గలుగుట సహజమని భావము. సార్వాత్మ్య భావమందు హేత్వంతరము "పృథివ్యగ్న్యాద్యాత్మకే .. ఉపపద్యతే "యని చెప్పఁబడుచున్నది ప్రకరణమునందధిదైవతము పృథివ్యగ్న్యాదులు స్వరూపముగా గలిగిన ఋక్సామములే యనియు, నధ్యాత్మము వాక్ప్రాణాదులు స్వరూపము గాఁగల ఋక్సామములే యనియు నుపక్రమించి "తస్యర్క్చ సామ చ గేష్ణౌ" యను శ్రుతిచే నాదిత్యపురుషునకు ఋక్సామములు పర్వములనియు, నాతీరుననే "యావముష్య గేష్ణౌతౌగేష్ణౌ"యను శ్రుతిచేఁ జాక్షుషపురుషునికిఁగూడనాఋక్సామములే పర్వములనియు నిర్వచింపఁబడియుండుటచే నీ పురుషునకు సార్వాత్మ్య భావము తెలియనచ్చుచున్నదని భావము ఈ వాక్యమున "ఋక్సామే" యను పదము కాకాక్షిన్యాయముచే నధిదైవతాధ్యాత్మల రెండిటితోడను సంబంధించుచున్నది సార్వాత్మ్యభావమునందే హేత్వంతరము "తద్య ఇమే భగవద్గీతా దర్శనాత్త"ను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది ఇందు "తద్యే ... ధనసనయ" యను శ్రుతిచే నీ లౌకికగానములయందుఁ గూడ నీ పురుషుఁడే గానము చేయఁ బడుచున్నట్లు తెలియవచ్చుటచే నీపురుషుఁడు పరమేశ్వరుఁడే గావలయును. ఏలయన సార్వాత్మ్యభావముతో నొప్పు పరమేశ్వరునియొక్క వి శేషములఁ గొన్ని టిని బరమేశ్వరభావముతో నుపాసనచేయవలయునని గీతాదర్శనముపదేశించు

సృష్ట్వా యన్మాం పశ్యసి నారద । సర్వభూతగుణైర్యుక్తం నైవం మాం జ్ఞాతుమర్హసి” ఇతి స్మరణాత్ । అపి చ యత్ర తు నిరస్తసర్వవిశేషం పారమేశ్వరరూపముపదిశ్యతే భవతి తత్ర శాస్త్రమ్— “అశబ్దమస్పర్శమరూపమవ్యయమ్” ఇత్యాది । సర్వకారణత్వాత్తు వికారధర్మైరపి కైశ్చిద్విశిష్టః పరమేశ్వర ఉపాస్యత్వేన నిర్దిశ్యతే— “సర్వకర్మా సర్వకామః సర్వగన్ధః సర్వరసః” (ఛాం॥ 3-14-2) ఇత్యాదినా । తథా హిరణ్యశ్మశ్రుత్వాదినిర్దేశోఽపి భవిష్యతి । యదప్యాధారశ్రవణాన్న పరమేశ్వర ఇతి అత్రోచ్యతే— స్వమహిమప్రతిష్ఠస్యాప్యాధా

---

ఒకానొక సమయమున నారదుఁడు పరమేశ్వరు నుద్దేశించి తీవ్రముగ తపంబు సలుప నాతని యందలి యనుగ్రహముచేఁ బరమేశ్వరుఁ డొకరూపవిశేషముతోఁ బ్రత్యక్షము గాఁగ నారదుఁ డట్టి రూపమును గొనియాడ నారదునకు హితమును గలుగుటకు భగవంతుఁ డీవాక్యమును వచించినట్లు పురాణప్రసిద్ధమై యున్నది దీని యర్థమేమన — ఓయీ నారదా! ఏరూపము గలవానిగా నన్నుఁ జూచుచున్నావో యారూపము నాచే సృజింపఁబడిన మాయయే నన్నిట్లు సకలభూతగుణములతో సన శబ్దస్పర్శాదులతో నొప్పు కరచరణాద్యవయవములతో గూడి యున్నట్లు దెలిసికొనఁగూడదు అనఁగా పారమేశ్వరరూప మవాఙ్మానసగోచరమని తాత్పర్యము

ఇట్లు పరమేశ్వరునియొక్క సోపాధికములగు రూపములు మాయామయములను విషయమును బ్రదర్శించి శ్రుతిసిద్ధమగు పారమార్థిక రూపమునకును సోపాధికరూపమునకును గల సంబంధ ప్రయోజనములు సువ్యక్తముగాఁగ “అపి చ —ఇత్యాది” యను భాష్యముచేఁ బారమార్థికమగు పరమేశ్వరరూపము ప్రదర్శింపఁబడుచున్నది అనఁగా “అశబ్దమస్పర్శమరూపమవ్యయమ్”ను శ్రుతి మొదలు గాఁగల శ్రుతులచే నుపదేశింపఁబడు సర్వోపాధిరహితమగు పరమేశ్వరుఁడే సర్వజగత్కారణమగుటం జేసి వికారధర్మములచేఁ గూడినవానిగా నుపాస్యభావము పరమేశ్వరునికిఁ బ్రదర్శింపఁబడుచున్నదని సోపాధికరూపముయొక్క ప్రయోజనము “సర్వకారణత్వాత్ ఇత్యాదినా” యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది వేదాంతములయందుఁ దెలియవచ్చెడి సోపాధికరూపములయొక్క ప్రయోజనమును సామాన్యముగఁ దెలియఁజెప్పి ప్రకృతమునఁ దెలియవచ్చెడి హిరణ్యశ్మశ్రుత్వాదులకుఁగూడ నుపాసనయందు వినియోగమని “తథా భవిష్యతి” యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది

ఇట్లు రూపవత్త్వశ్రవణము ప్రకృతమునకు నిర్బాధకమని నిర్వచించి యాధారశ్రవణము గూడ నిర్బాధకమని ప్రదర్శింపఁ బూర్వపక్షబీజమును “యదపి పరమేశ్వరే ఇతి” యని యనువదించి యందులకు సమాధానమును “అత్రో

శేషోపదేశ ఉపాసనార్థో భవిష్యతి । సర్వగతత్వాద్బ్రహ్మణో వ్యోమవత్సర్వాన్తరత్వోపపత్తేః । ఐశ్వర్యమర్యాదాశ్రవణమప్యధ్యాత్మాధిదైవతవిభాగాపేక్షముపాసనార్థమేవ । తస్మాత్పరమేశ్వర ఏవాక్ష్యాదిత్యయోరన్తరుపదిశ్యతే ॥ ౨౦ ॥

# భేదవ్యపదేశాచ్చాన్యః

అస్తి చాదిత్యాదిశరీరాభిమానిభ్యో జీవేభ్యోఽన్య ఈశ్వరోఽన్తర్యామీ । 'య ఆదిత్యే తిష్ఠన్నాదిత్యాదన్తరో యమాదిత్యో న వేద యస్యాదిత్యః శరీరం య ఆదిత్యమన్తరో యమయత్యేష త ఆత్మాన్తర్యామ్యమృతః' (బృ 3-7-9) ఇతి

---

శ్రూయతే" యని యుపక్రమించుచున్నారు దృష్టాన్తపురస్సరముగ సమాధానము స్వమహిమ ఉపపత్తే" యని చెప్పఁబడుచున్నది అనఁగా బ్రహ్మము సర్వగతమగుటచే నాకాశమువలె సర్వాంతరమగుచున్నది. సర్వాంతరమగుటచే నయొక్క మహిమయందే యున్నను నా పరమేశ్వరుని కాధారవిశేషోపదేశ ఉపాసనాసౌకర్యము కొఱకుపదేశింపఁబడుచున్నది కాని వాస్తవమగునాధార శేష మెంతమాత్రము లేదని తాత్పర్యము.

ఐశ్వర్యమర్యాద గూడ నుపాసనకొఱకుఁ జేయఁబడిన యధ్యాత్మాధిదైవవిభాగము ననుసరించి చేయఁబడినదే గాని వేఱొండు పరిచ్ఛిన్నభావముతో నంతమాత్రము గూడియుండలేదని "ఐశ్వర్యమర్యాదా ఉపాసనార్థమేవ" యను భాష్యముచే వినఁబడుచుండెడి యైశ్వర్యమర్యాదయొక్క విశేషము ప్రదర్శింపఁబడుచున్నది

ఇట్లు పూర్వపక్షిచేఁ బ్రదర్శింపఁబడిన రూపవత్త్వాదు లుపాసనకొఱకుఁ గల్పింపఁబడినవనియు సర్వపాప్మాపగమము, సార్వాత్మ్యభావము, లోకకామేశిత్వమనునవియే పరమేశ్వరధర్మములనియుఁ బ్రదర్శించి యంతశ్శబ్దవాచ్యుఁడు పరమేశ్వరుఁడే యని ఫలితము "తస్మాత్ ఉపదిశ్యతే" యని యుపసంహారము చేయఁబడుచున్నది ॥ ౨౦ ॥

ఇట్లు అన్తశ్శబ్దవాచ్యుఁడు పరమేశ్వరుఁడని నిరూపించి యాతని జీవునిఁగా శంకించుట కెంతమాత్రమవకాశము లేదనుటకు హేతువుగా సూత్రకారులు —

# భేదవ్యపదేశాచ్చాన్యః

యను సూత్రమును బ్రదర్శించుచున్నారు భేదవ్యపదేశాత్ = ఆదిత్యాదిశరీరాభిమానులగు జీవులకంటె నీ యంతశ్శబ్దవాచ్యుఁడు శ్రుత్యంతరమునందు భిన్నుఁడుగా వ్యపదేశింపఁబడుటవలన, అన్యః = ఈ యంతశ్శబ్దవాచ్యుఁడు బ్రహ్మమే గాని జీవుఁ

"శ్రుత్యన్తరే భేదవ్యపదేశాత్ । తత్ర హి ఆదిత్యాదన్తరో యమాదిత్యో న వేద' ఇతి వేదితురాదిత్యాద్విజ్ఞానాత్మనోఽన్యోఽన్తర్యామీ స్పష్టం నిర్దిశ్యతే। స ఏవేహాప్యన్తరాదిత్యే పురుషో భవితుమర్హతి శ్రుతిసామాన్యాత్ । తస్మాత్పరమేశ్వర ఏవేహోపదిశ్యత ఇతి సిద్ధమ్॥ ॥౨౦॥

---

దేంతమాత్రము గాఁడని యర్థము సూత్రమునందలి అన్యశబ్దార్థము "అస్తి ... అంతర్యామీ" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది జీవాంతర్యాములకు భేదము "య ఆదిత్యే భేదవ్యపదేశాత్తు"ను భాష్యముచే వివరింపఁబడుచున్నది

యః = ఎవఁడు, ఆదిత్యాత్ = ఆదిత్యునికంటె, అంతరః = అంతరుఁడును, ఆదిత్యే = ఆదిత్యునియందు, తిష్ఠన్ = ఉండువాఁడును, యం = ఎవనిని, ఆదిత్యః = ఆదిత్యుఁడు, న వేద = ఎఱుంగఁడో, యస్య = ఎవనికి, ఆదిత్యః = ఆదిత్యుఁడు, శరీరం = శరీరమో, యః = ఎవ్వఁడు, అంతరః = అంతరుఁడై, ఆదిత్యం = ఆదిత్యుని, యమయతి = చలింపఁజేయుచున్నాఁడో, ఏషః = ఈతఁడు, తే = నీయొక్క, ఆత్మా = స్వరూపము, అంతర్యామీ = అంతర్యామియును, అమృతః = మరణరహితుఁడు. సః। శ్రుత్యన్తరము ఈ శ్రుతియందు "ఆదిత్యాదంతరః యమాదిత్యో న వేద" యను వాక్యముచె వేదితయును జీవుఁడునగు నాదిత్యునికంటె వేఱగు నంతర్యామి స్పష్టముగ నిర్వచింపఁబడుచున్నాఁడని "తత్ర ... నిర్దిశ్యతే" యను భాష్యముచే పై శ్రుతితాత్పర్యము నిర్వచింపఁబడుచున్నది పై శ్రుతియందు వినవచ్చుచున్న యంతర్యామియే ప్రకృతమున నాదిత్యునియందు వినఁబడెడి యంతశ్శబ్దవాచ్యుఁడగు పురుషుఁడు గావలయునని "సఏవ అర్హతి" యని ప్రతిజ్ఞ చేయఁబడుచున్నది ప్రతిజ్ఞకు హేతువు "శ్రుతిసామాన్యాత్"ని చెప్పఁబడుచున్నది అనఁగా శ్రుతులన్నిటికి నర్థసామ్యముండుటవలన నదృష్టాన్తశ్రుతికిని దార్ష్టాన్తికశ్రుతికిని సమానముగ నర్థము దెలియఁబడుటవలన దృష్టాంతమందలి యంతర్యామియే ప్రస్తుతపు టంతశ్శబ్దవాచ్యుఁడగు పురుషుఁడని తెలియవచ్చుచున్నది. అధికరణతాత్పర్యము "తస్మాత్ సిద్ధమ్మ"ని సంగ్రహముగ నుపసంహరింపఁబడుచున్నది. ॥౨౧॥

ఇది యంతరధికరణము

### ఆకాశాధికరణమ్

## ఆకాశస్తల్లిఙ్గాత్

ఇదమామనన్తి— "అస్య లోకస్య కాగతిరిత్యాకాశ ఇతి హోవాచ

---

## ఆకాశస్తల్లిఙ్గాత్

పూర్వాధికరణమునందు వలెనే యీ సూత్రమునందుఁ గూడ బ్రహ్మశబ్దమున కనువృత్తిచేసి సూత్రార్థమును యోజింపవలయును దానం జేసి యాకాశము బ్రహ్మము ఏలయన బ్రహ్మలింగములు తెలియవచ్చుట వలన నని సూత్రార్థము సిద్ధించును ఇట్టి సూత్రార్థమును బట్టి యే ప్రకరణమున నాకాశ శబ్దము వినఁబడుచు నచట బ్రహ్మలింగములు గూడ వినఁబడునో యా ప్రకరణ మిచట విషయమని గ్రహింపవలయును అట్టి ప్రకరణము చాందోగ్యప్రథమప్రపాఠకమున నెనిమిది తొమ్మిది ఖండములలోఁ గథాసందర్భమునందు వినవచ్చెడి యాకాశ ముఖ్యవాక్యమని "ఇదమామనంతి .. ఇతి" యని చెప్పఁబడుచున్నది ఈ శ్రుత్యర్థమును వివరించుటకై బూర్వమీ ప్రకరణసందర్భము నొకింత తెలియవలయును అదెట్లన్న—

ఒకానొక దేశమున నొక కాలమునందు శిలకుఁడు, దాల్భ్యుఁడు, జైవలి యను ముగ్గురుద్గీథవిద్యాకుశలులు సమావేశమై మనముద్గీథవిద్యయందుఁ గుశలులము గావున నుద్గీథమునందుఁ గొంత విచారణ చేయుదమని నిశ్చయించిరి. అట్టి తరుణమునఁ బూజ్యులగు బ్రాహ్మణులైన మీయొక్క విచారణను నేను వినియెదనని జైవలి పలికెను

పైయిద్దఱును బూజ్యులగు బ్రాహ్మణులని జైవలి పలుకుటచే జైవలి రాజని నిశ్చయింపఁబడుచున్నాఁడు. పిమ్మట శిలకుఁడు దాల్భ్యునుద్దేశించి నేను బ్రశ్నింపనా యన నట్లే యని దాల్భ్యుఁడంగీకరించెను అప్పుడిదిగువ వ్రాయఁబడిన ప్రశ్నోత్తరములు గల్గినవి.

| | |
|---|---|
| 1. ఉద్గీథమునకు గతి యన నాశ్రయమెద్ది ? | స్వరము |
| 2 స్వరమునకు గతి యెద్ది ? | ప్రాణము |
| 3. ప్రాణమునకు గతి యెద్ది ? | అన్నము |
| 4. అన్నమునకు గతి యెద్ది ? | ఉదకములు |
| 5. ఉదకములకు గతి యెద్ది ? | స్వర్గలోకము |

స్వర్గలోకమునకు గతి యెద్ది యని శిలకుఁడడుగ దాల్భ్యుఁడు స్వర్గలోకమునతిక్రమించి యుద్గీథము నాశ్రియాంతరమును గూర్చి పొందింపఁగూడదు.

సర్వాణి హ వా ఇమాని భూతాన్యాకాశాదేవ సముత్పద్యన్త ఆకాశం ప్రత్యస్తం యన్త్యాకాశో హ్యేవైభ్యో జ్యాయానాకాశః పరాయణమ్" (ఛాం॥ 1-9-1) ఇతి ॥ తత్ర సంశయః — కిమాకాశశబ్దేన పరం బ్రహ్మాభిధీయత ఉత భూతాకాశమితి। కుతః సంశయః। ఉభయత్ర ప్రయోగదర్శనాత్ । భూతవిశేషే

---

మేము స్వర్గలోకమునే యుద్గీథమున కాశ్రయముగా గ్రహించుచున్నారమనెను. అంతట శిలకుఁడు-ఓయీ దాల్భ్య ! నీ యుద్గీథమప్రతిష్ఠితము ఇదియే నిశ్చయమగుచో నీ శిరము వ్రక్కలు కాఁగలదనెను అంత దాల్భ్యుఁడు వినయముతో మహానుభావుఁడవగు నీ వలన నీవిషయముఁ దెలిసికొన నిచ్ఛయించుచున్నాననెను. సరియే తెలిసికొనుమని దాల్భ్యుఁడుపలుక తిరుగ శిలకునకును దాల్భ్యునకునీదిగువ ప్రశ్నోత్తరములు జరిగినవి

స్వర్గలోకమునకు గతియేమి ? ఈ భూలోకము

ఈ భూలోకమునకు గతి యేమన నీభూలోకము నతిక్రమించి యుద్గీథమునాశ్రయాంతరమును గూర్చి పొందింపఁ గూడదు ఉద్గీథమీభూలోకము నాశ్రయించియున్నదని శిలకుఁడు చెప్పెను. అంత జైవలి యోయి, శిలకుఁడా ! నీయొక్క యుద్గీథ మంతవత్తగుచున్నది ఇదియే నిశ్చయమగుచో నీతల వ్రక్కలు కాఁగలదనెను అంతట శిలకుఁడు వినయమునీఱు మహానుభావులగు మీవలనఁ దెలిసికొన నిచ్ఛయించుచున్నానని జైవలితోఁ బలుకఁ దెలిసికొనుమని జైవలి పలికెను అంత శిలకుఁడు 'ఈలోకమునకు గతి యేమ'ని ప్రశ్నింప జైవలి యాకాశమని పలికినపిమ్మటఁ బరఁగిన "సర్వాణి హ వా" యను వాక్యముల యర్థమిట్లు పరఁగుచున్నది ఈ పరిదృశ్యమానములగు స్థావరజంగమరూపములగు భూతములన్నియు నాకాశమువలననే పుట్టుచున్నవి ఆకాశమునుగూర్చియే లయము నొందుచున్నవి ఆకాశమే యీ సకల భూతములకంటె మహత్తరమైనది ఆకాశము మహత్తరమగు నాధారము ఆ యీ యాకాశమే పరోవరీయమగు నుద్గీథము ఈ యాకాశ మనంతమని

ఈ వాక్యమునందు వినవచ్చెడి యాకాశశబ్దము పరబ్రహ్మబోధకమా లేక భూతాకాశపరమా యని విశయమని "తత్ర సంశయః భూతాకాశమితి" యని నిర్వచింపఁబడుచున్నది ఈ యాకాశశబ్దమును గూర్చి సంశయమేల గలుగవలయునని "కుతః సంశయ" యని మధ్యస్థుఁడడుగ "ఉభయత్ర ప్రయోగదర్శనా త్త"ని సమాధానము సంగ్రహముగాఁ జెప్పఁబడుచున్నది అనఁగానాకాశశబ్దమునకు భూతవిశేషమందును బ్రహ్మమందును గూడఁ బ్రయోగముండుటవలన సంశయము గలుగుచున్నదని యాశయము హేతుసంగ్రహవాక్యము "భూతవిశేషే ... అతః సంశయ" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది. అనఁగానాకాశ

తావత్స్ప్రసిద్ధో లోకవేదయో రాకాశశబ్దః । బ్రహ్మణ్యపి క్వచి త్ప్రయుజ్యమానో దృశ్యతే । యత్ర వాక్యశేషవశా దసాధారణగుణశ్రవణాద్వా నిర్ధారితం బ్రహ్మ భవతి, యథా— "యదేష ఆకాశ ఆనన్దో న స్యాత్" (తై 2-7) ఇతి । "ఆకాశో వై నామ నామరూపయోర్నిర్వహితా తే యదన్తరా తద్బ్రహ్మ" (ఛాం॥ 8-14-1) ఇతి చైవమాదౌ । అతః సంశయః కిం పున రత్ర యుక్తం భూతాకాశమితి । కుతః । తద్ధి ప్రసిద్ధతరేణ ప్రయోగేణ శ్రోతుః బుద్ధి మారోహతి । న చాయమాకాశశబ్ద ఉభయోః సాధారణః శక్యో విజ్ఞాతుం అనేకార్థత్వ

శబ్దమునకు భూతవిశేషమందు సుప్రసిద్ధవ్యవహారము తెలియ వచ్చుచున్నదని "భూతవిశేషే, ఆకాశశబ్ద" యని చెప్పఁబడుచున్నది ఇఁక నాకాశమునకు బ్రహ్మమునందుఁ గూడ వ్యవహార మచ్చటచటఁ దెలియవచ్చుచున్న దనియు నే స్థలమునందు వాక్యశేషము వలననో లేక యసాధారణగుణములు దెలియవచ్చుట వలననో యాకాశశబ్దము బ్రహ్మవాచకముగా నిర్ధారణ చేయఁబడు నని, రెండు శ్రుతులు "బ్రహ్మణ్యపి ఇతిచైవమాదౌ"యను వాక్యముచే ప్రదర్శింపఁబడు చున్నవి ఏషః = ఈ, ఆకాశః = బ్రహ్మము, ఆనందః = ఆనందము, న స్యాత్ యత్ = కాకపోయినచో,

ఆకాశః వై నామ = ఆకాశమనునది, నామరూపయో = నామరూపములకు, నిర్వహితా = కర్త తే=ఆనామరూపములు యదంతరా=దేనియందుఁ గలవో, తత్ = ఆయాకాశము, బ్రహ్మ = బ్రహ్మమే

ఇట్లాకాశశబ్దమున కుభయవిధములగు ప్రయోగములుండుటవలన సంశయము గలుగుచున్నదని "అతః సంశయ" యని చెప్పబడినది ఇట్లు పలుక మధ్యస్థుఁడు "అందెయ్యది యుక్తమగు నని "కిం పునర త్ర యుక్తమ్మ"ని ప్రశ్నింపఁ బూర్వపక్షి భూతాకాశమునే గ్రహింపవలయునని "భూతాకాశమితి" యని పలుక మధ్యస్థుఁడు, 'కుతః = ఏలయని ప్రశ్నింపఁ బూర్వపక్షి "తద్ధి ఆరోహతి" యని సమాధానము చెప్పుచున్నాఁడు అనఁగా నాకాశమునకు భూతాకాశమందు విపులమగు ప్రయోగముండుటవలన నయ్యదియే ముందుగా బుద్ధియందు గోచరించునని యభిప్రాయము ఇంతియ కాదు ఈయాకాశశబ్దము భూతాకాశమును బ్రహ్మమును గూడ సాధారణముగా బోధించుననుట యుక్తము, గాదని "నచ . విజ్ఞాతుమ్మ"ని నిరసింపఁబడుచున్నది అందుఁకు హేతువు "అనేకార్థత్వప్రసంగాత్" — ఒక శబ్దమునకే యనేకార్థములను గ్రహించుట యన్యాయమగునని యభిప్రాయము కావునఁ గొన్నికావేళ బ్రహ్మమందాకాశ శబ్దము ప్రయోగింపఁబడినచో నయ్యది గౌణము కావలయును గాని ముఖ్యమెంత మ్మాత్రము గాదు ఏలయన — బ్రహ్మము విభుత్వము మొదలుగాఁగల యనేక

[illegible] । బ్రహ్మణి తు గౌణ ఏవాకాశశబ్దో భవితుమర్హతి । విభుత్వాదిభిర్హి బహుభిర్ధర్మైః సదృశమాకాశేన బ్రహ్మ భవతి । న చ ముఖ్యసంభవే గౌణోఽర్థో గ్రహీతవ్యః । సంభవతి చేహ ముఖ్యస్యైవాకాశస్య గ్రహణమ్ । నను భూతాకాశపరిగ్రహే వాక్యశేషో నోపపద్యతే । "సర్వాణి హ వా ఇమాని భూతాన్యాకాశాదేవ సముత్పద్యన్తే" ఇత్యాది । నైష దోషః । భూతాకాశస్యాపి వాయ్వాదిక్రమేణ కారణత్వోపపత్తేః । విజ్ఞాయతే హి "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః ఆకాశాద్వాయుః । వాయోరగ్నిః" । (తై॥ 2-1) ఇత్యాది । జ్యాయస్త్వపరాయణత్వే అపి భూతాన్తరాపేక్షయోపపద్యేతే భూతాకాశస్యాపి । తస్మాదాకాశశబ్దేన భూతాకాశస్య గ్రహణమిత్యేవం ప్రాప్తే బ్రూమః — "ఆకాశస్తల్లిఙ్గాత్" ఆకాశశబ్దేన బ్రహ్మణో గ్రహణం యుక్తమ్ । కుతః తల్లిఙ్గాత్

---

ధర్మములతో నాకాశసదృశముగఁ దెలియవచ్చుచున్నదని "తస్మాద్బ్రహ్మణో .. భవతి" యను భాష్యముచే నిర్వచింపఁబడుచున్నది పోనిండు అట్లు గానినో నిచట నాకాశశబ్దము గౌణముగా బ్రహ్మమును బోధించుచున్నదా యన ముఖ్యార్థము సంభవింపనపుడు గదా గౌణార్థము ను గల్పింపవలయును? అట్లు ముఖ్యార్థమునకిచట నెంతమాత్రము బాధ దెలియరాదని "నచ .. గ్రహణమ్మ"ని చెప్పఁబడుచున్నది అనఁగా నిచట నాకాశశబ్దమునకు భూతాకాశరూపముఖ్యార్థమునే గ్రహింపవలయునన మధ్యస్థుఁడు భూతాకాశమును గ్రహించినచో "సర్వాణి .. సముత్పద్యన్తే" యను శ్రుతి మొదలుగాఁగల వాక్యశేషమందలి శ్రుతులాకాశ ముఖ్యార్థమున సమన్వయింపనేరవే యని "నను .. ఇత్యాది" యను భాష్యముచేఁ బ్రశ్నింప "నైష దోష = అది యొక దోషము గాదని" సమాధానము చెప్పఁ బడుచున్నది దోషాభావమునకుఁ గారణము "భూతాకాశస్యాపి .. భూతాకాశస్యాపి" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది 'తస్మాద్వా .. వాయోరగ్నిః' యను శ్రుతిచే భూతాకాశమునకుఁగూడ వాయువు మొదలుగాఁగలిగిన సకలభూతములయొక్క కారణభావము వినవచ్చుటవలనను, వాయువు మొదలుగాఁగలిగిన భూతములదృష్టిచే భూతాకాశమునకు జ్యాయస్త్వము, పరాయణత్వము ఘటించుట వలనను నిచట నాకాశశబ్దమునకు గౌణార్థమును గ్రహింపఁగూడదని యభిప్రాయము ఇట్లాకాశశబ్దమునకు బ్రహ్మమునందు గౌణప్రయోగము గూడ సంభవింపనేరదని చెప్పి యచట భూతాకాశమునే గ్రహింపవలయునని పూర్వపక్షి తన వాదమును "తస్మాత్ .. గ్రహణమితి"యని యుపసంహారము చేయుచున్నాఁడు

ఇట్లు పూర్వపక్షము ఘటింప సమాధానమ్ముగా "ఏవం ప్రాప్తే బ్రూమః ఆకాశస్తల్లిఙ్గాత్త"ని సూత్రము ప్రదర్శింపఁబడుచున్నది సూత్రకారులయొక్క ప్రతిజ్ఞ "ఆకాశశబ్దేన యుక్తమ్మ"ని చెప్పఁబడుచున్నది అనఁగా నాకాశ

పరస్య హి బ్రహ్మణ ఇదం లిఙ్గమ్— "సర్వాణి హ వా ఇమాని భూతాన్యాకాశాదేవ సముత్పద్యన్తే" ఇతి । పరస్మాద్ధి బ్రహ్మణో భూతానాముత్పత్తిరితి వేదాన్తేషు మర్యాదా । నను భూతాకాశస్యాపి వాయ్వాదిక్రమేణ కారణత్వం దర్శితమ్। సత్యం దర్శితమ్। తథాపి మూలకారణస్య బ్రహ్మణ ఉపస్థాపకా దాకాశాదేవేత్యవధారణం సర్వాణీతి చ భూతవిశేషణం నానుకూలం స్యాత్ । తథా "ఆకాశం ప్రత్యస్తం యన్తి" ఇతి బ్రహ్మలిఙ్గం "ఆకాశో హ్యేవైభ్యో జ్యాయా నాకాశః పరాయణమ్"ఇతి చ జ్యాయస్త్వపరాయణత్వే జ్యాయస్త్వం హ్యనాపే-

---

శబ్దముచే బ్రహ్మమునే గ్రహింపవలయునని భావము ఇట్లు ప్రతిజ్ఞ నుపపాదింప మధ్యస్థుఁడు "కుతం ఏలయని" ప్రశ్నింప, తల్లింగాతని సూత్రమందలి హేతు వాక్యము సమాధానముగాఁ జెప్పఁబడుచున్నది హేతువాక్యముచే నుద్దేశింపఁ బడిన స్పష్టబ్రహ్మలింగమగు జగత్కారణత్వ మిచట శ్రుతియందు "పరస్య . ఇతి" యని ప్రదర్శింపఁబడుచున్నది. జగత్కారణత్వము సుప్రసిద్ధమగు స్పష్ట బ్రహ్మలింగమని యద్దాని యతిశయము "పరస్మాత్ మర్యాదా" యను భాష్యముచే నిరూపింపఁబడుచున్నది అనఁగా "పరబ్రహ్మమువలననే సకల భూతములును బుట్టుచున్నవనునది వేదాంతములయందలి నిర్ణయమ్ము"ని యభి ప్రాయము. ఇట్లు చెప్ప మధ్యస్థుఁడు భూతాకాశము గూడ వాయ్వాదిభూతము లకుఁ గారణమని చెప్పఁబడెనుగదా యని "నను . దర్శితమ్మ"ని ప్రశ్నింప నందులకు సమాధానము "సత్యందర్శితం తథాపి నస్వం బ్రహ్మలింగమ్మ"ను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది. ఆకాశమునకుఁ గారణత్వము చెప్పఁబడినను మూలకారణమగు బ్రహ్మము గ్రహింపఁబడకపోవుటచే "ఆకాశాదేవ" యనుచో నేవకారమును 'సర్వాణి హ వా' యను వాక్యమున సర్వాణి యను భూతవిశేష ణమును సమంజసము లెంతమాత్రమును గావు సకలభూతములకు నాకాశ ముతోఁగూడిన భూతములన్నిటిని గ్రహింపవలయును గదా! ఏవకారముచే నొకే కారణమును జెప్పవలయును గదా! ఆకాశాదిభూతములకు నొకేకారణము బ్రహ్మమే యగుటంజేసి యిచట సకలభూతములకు నొకేకారణముగా వినవచ్చెడి యాకాశ శబ్దము బ్రహ్మపరమే యయి తీరవలయునని భావము ఇంతియ కాదు ఆకాశమునందు భూతములన్నియు లయముఁ జెందుచున్నవని "తథా బ్రహ్మ లింగమ్మ"ని భూతలయకారణమను వేఱొకలింగము కూడఁ బ్రదర్శింపఁబడు చున్నది ఆతీరుననే వినవచ్చెడి జ్యాయస్త్వపరాయణత్వములుకూడ బ్రహ్మ లింగములే యని "ఆకాశో వై జ్యాయస్త్వపరాయణత్వే" యని నిర్వచింపఁ బడుచున్నది జ్యాయస్త్వము బ్రహ్మలింగమని శ్రుత్యంతరముచేఁ గూడ దెలియ వచ్చుచున్నదని "జ్యాయస్త్వం . ఇతి" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది.

క్షికం పరమాత్మన్యేవైకస్మిన్నామ్నాతమ్— 'జ్యాయాన్పృథివ్యా జ్యాయానన్తరిక్షా జ్జ్యాయాన్దివో జ్యాయానేభ్యో లోకేభ్యః' (ఛాం॥ ౩-14-3)ఇతి। తథాపరాయణత మపి, పరమకారణత్వాత్పరమాత్మన్యేవోపపన్నతరమ్ । శ్రుతిశ్చ భవతి—"విజ్ఞానమానన్దం బ్రహ్మ రాతేర్దాతుః పరాయణమ్" (బృ॥ 3-9-28)ఇతి।అపి చాన్తవత్త్వదోషేణ శాలావత్యస్య పక్షం నిన్దిత్వా అనన్తం కించిద్వక్తుకామేన జైవలినా ఆకాశః పరిగృహీతః । తం చాకాశముద్గీథే సంపాద్యోపసంహరతి—"స ఏష పరోవరీయానుద్గీథః స ఏషోఽనన్తః" (ఛాం 1-9 2) ఇతి । తచ్చానన్త్యం బ్రహ్మలిఙ్గమ్ । యత్పునరుక్తం భూతాకాశం ప్రసిద్ధిబలేన ప్రథమతరం ప్రతీయ

---

అనాపేక్షికం = నిరతిశయమగు, పృథివ్యాః = పృథివికంటె, జ్యాయాన్ పెద్దది, అంతరిక్షాత్ = అంతరిక్షముకంటె గూడ, జ్యాయాన్ = పెద్దది, దివః ద్యులోకముకంటె గూడ, జ్యాయాన్ = పెద్దది, ఏభ్యః = ఈ, లోకేభ్యః=లోకములకంటెఁగూడ, జ్యాయాన్ = పెద్దది, యనుశ్రుతిచే జ్యాయస్త్వము ప బ్రహ్మమందు వినవచ్చుటచే జ్యాయస్త్వము బ్రహ్మలింగమని తెలియవచ్చుచున్నది ఆతీరుననే పరాయణత్వము గూడ బ్రహ్మలింగమని "తథా ఉపపన్నతరమ్మ"ని చెప్పఁబడుచున్నది బ్రహ్మము పరమకారణమగుటంజేసి సకలజగత్తునకు ఆధారము గావునఁ బరాయణమని చెప్పఁబడుచున్నది పరాయణత్వము యుక్తిసాధ్యమే గాక శ్రుతిసిద్ధమని గూడ "శ్రుతిశ్చ ఇతి" యని ప్రదర్శింపఁబడుచున్నది. రాతేః = ధనముయొక్క, దాతుః = దాతకు, పరాయణం = ఉత్కృష్టమగునాధారము. ఇవి యటుండ నాఖ్యాయికాసందర్భమునఁ దెలియవచ్చెడి యానంత్యమను బ్రహ్మలింగ మొకటి గూడ "అపిచ బ్రహ్మలింగమ్మ"నిప్రదర్శింపఁబడుచున్నది శాలావత్యజైవలి సంవాదమున శాలావత్యునియొక్క పక్షమంతవత్త్వదోషముతోఁ గూడినదని జైవలిచే నిందింపఁబడి యానంత్యమునుపదేశించు తలంపుచే జైవలిచే నాకాశముపదేశింపఁబడెను అట్టి యాకాశముద్గీథమందుఁ బొందికచేయఁబడి "సఏషః అనంత" యని యుపసంహరింపబడి యున్నది ఇచట "స ఏషోఽనంతః=ఆ యీ యాకాశమనంతమ"ని యాకాశమనంతగుణవిశిష్టముగా నుపదేశింపఁబడియున్నది ఇట్టి యానంత్యము గూడ బ్రహ్మలింగమే యని యభిప్రాయము

ఇట్లీప్రకరణమున వినవచ్చెడి యాకాశశబ్దము బ్రహ్మపరమే యని నిరూపింప సకలభూతోత్పత్తికారణత్వము సకలభూతలయకారణత్వము జ్యాయస్త్వము పరాయణత్వము ఆనంత్యమునునను నైదులింగములను బ్రదర్శించి పూర్వపక్షమును నిరసింప భూతాకాశము ప్రసిద్ధిబలముచే మున్ముందు బుద్ధిగోచరమగునను పూర్వపక్షబీజమును "యత్పునరుక్తం, భూతాకాశం. .ఇతి" యని యనువదించి

ఇతి। అత్ర బ్రూమః—ప్రథమతరం ప్రతీతమపి సత్, వాక్యశేషగతాన్ బ్రహ్మగుణాన్ దృష్ట్వా న పరిగృహ్యతే। దర్శితశ్చ బ్రహ్మణ్యప్యాకాశశబ్దః— "ఆకాశో వై నామ నామరూపయోర్నిర్వహితా" ఇత్యాదౌ। తథాకాశపర్యాయవాచినామపి బ్రహ్మణి ప్రయోగో దృశ్యతే— "ఋచో అక్షరే పరమే వ్యోమన్యస్మిన్ దేవా అధివిశ్వే నిషేదుః" (ఋ సం 1-164-39) "సైషా భార్గవీ వారుణీ విద్యా పరమే వ్యోమన్ప్రతిష్ఠితా" (తై 3-6) 'ఓం కం బ్రహ్మ ఖం బ్రహ్మ" (ఛాం 4-10-5) "ఖం పురాణం" (బృ 5-1) ఇతి చైవమాదౌ। వాక్యోపక్రమేపి వర్తమానస్యాకాశశబ్దస్య వాక్యశేషవశాద్యుక్తా బ్రహ్మవిషయత్వావధారణా "అగ్నిరధీతేఽను వాకమ్" ఇతి హి వాక్యోపక్రమగతోఽప్యగ్నిశబ్దో మాణవకవిషయో దృశ్యతే। తస్మాదాకాశశబ్దం బ్రహ్మేతి సిద్ధమ్। ॥౨౨॥

---

యద్దానికి సమాధానము "అత్ర బ్రూమః" యని యుపక్రమింపఁబడుచున్నది. సమాధానము "ప్రథమతరం ... పరిగృహ్యతే" యని చెప్పఁబడుచున్నది. ఆకాశశబ్దము భూతాకాశపరమని తొలుత భాసించినను వాక్యశేషమందలి బ్రహ్మగుణములఁ దెలిసికొనినంతనే యట్టిబుద్ధి యుపరమించునని యభిప్రాయము. ఇంతియ కాదు, బ్రహ్మమునందాకాశశబ్దమునకుఁ బ్రయోగము గలదని నిరూపింపఁబడిన శ్రుతియే తిరుగనిచట "దర్శితశ్చ ... ఇత్యాదౌ" యని ప్రదర్శింపఁబడుచున్నది ఇంతియ కాదు ఆకాశశబ్దమే గాక యాకాశశబ్దముతో పాటు ఆకాశశబ్దపర్యాయములు గూడ శ్రుతులయందు బ్రహ్మపరములుగా వినవచ్చుచున్నవని "తథా ... ఇతిచైవమాదౌ" యను భాష్యముచేఁ బ్రదర్శింపఁబడుచున్నది పరమే = ఉత్కృష్టమగు, వ్యోమన్ (వ్యోమ్ని) = బ్రహ్మమందు, ఇచట 'అధి' యను నుపసర్గము 'నిషేదుః' యను క్రియాపదముతో సంబంధించుచున్నది ఈ శ్రుతులయందు నాకాశపర్యాయపదములగు 'వ్యోమ, ఖమ్మ'ను పదములు బ్రహ్మబోధకములుగా నలరారుచున్నవి

ఇట్లు పూర్వపక్షమును నిరసించి యుపక్రమమునందలి సందియ మువసంహారవాక్యముచే నిర్ణయమును గను నను న్యాయము ననుసరించి గూడ నీయాకాశశబ్దము బ్రహ్మపరమే యని "వాక్యోపక్రమేఽపి బ్రహ్మవిషయత్వావధారణా" యని నిర్వచింపఁబడు చున్నది అందులకు లౌకికదృష్టాంతము గూడ 'అగ్నిరధీతే దృశ్యతే' యని ప్రదర్శింపఁబడుచున్నది అగ్ని యనువాకమును జదువుచున్నాఁడను వాక్యోపక్రమమునందలి యగ్నిశబ్దము 'అధీతే' యను వాక్యోపసంహారమునందలి పదముయొక్క సంబంధముచే నగ్నిశబ్దము మాణవకపరముగాఁ దెలియఁబడుచున్నదని తాత్పర్యము. ఫలితము 'తస్మాత్ సిద్ధమ్మ'ని యుపసంహారము చేయఁబడుచున్నది ॥౨౨॥ (ఇది ఆకాశాధికరణము)

ఇతి। అత్ర బ్రూమః—ప్రథమతరం ప్రతీతమపి సత్ వాక్యశేషగతాద్బ్రహ్మగుణాన్దృష్ట్వా న పరిగృహ్యతే। దర్శితశ్చ బ్రహ్మణ్యప్యాకాశశబ్దః— "ఆకాశో వై నామ నామరూపయోర్నిర్వహితా" ఇత్యాదౌ। తథాకాశపర్యాయవాచినామపి బ్రహ్మణి ప్రయోగో దృశ్యతే— "ఋచో అక్షరే పరమే వ్యోమన్యస్మిన్దేవా అధివిశ్వే నిషేదుః"(ఋ సం 1-164-39) "సైషా భార్గవీ వారుణీ విద్యా పరమే వ్యోమన్ప్రతిష్ఠితా" (తై 3-6) 'ఓం కం బ్రహ్మ ఖం బ్రహ్మ' (ఛాం 4-10-5) "ఖం పురాణం' (బృ 5-1) ఇతి చైవమాదౌ। వాక్యోపక్రమేపి వర్తమానస్యాకాశశబ్దస్య వాక్యశేషవశాద్యుక్తా బ్రహ్మవిషయత్వావధారణా। "అగ్నిరధీతేఽను వాకమ్' ఇతి హి వాక్యోపక్రమగతోఽప్యగ్నిశబ్దో మాణవకవిషయో దృశ్యతే। తస్మాదాకాశశబ్దం బ్రహ్మేతి సిద్ధమ్। ॥౨౨॥

---

యద్దానికి సమాధానము "అత్ర బ్రూమ" యని యుపక్రమింపఁబడుచున్నది. సమాధానము "ప్రథమతరం పరిగృహ్యతే" యని చెప్పఁబడుచున్నది. ఆకాశశబ్దము భూతాకాశపరమని తొలుత భాసించినను వాక్యశేషమందలి బ్రహ్మగుణములఁ దెలిసికొనినంతనే యట్టిబుద్ధి యుపరమించునని యభిప్రాయము. ఇంతియ కాదు, బ్రహ్మమునందాకాశశబ్దమునకుఁ బ్రయోగము గలదని నిరూపింపఁబడిన శ్రుతియే తిరుగ నిచట "దర్శితశ్చ ఇత్యాదౌ" యని ప్రదర్శింపఁబడుచున్నది ఇంతియ కాదు ఆకాశశబ్దమే గాక యాకాశశబ్దముతోపాటు ఆకాశశబ్దపర్యాయములు గూడ శ్రుతులయందు బ్రహ్మపరములుగా వినవచ్చుచున్నవని "తథా ... ఇతిచైవమాదౌ" యను భాష్యముచేఁ బ్రదర్శింపఁబడుచున్నది పరమే = ఉత్కృష్టమగు, వ్యోమన్ (వ్యోమ్ని) = బ్రహ్మమందు, ఇచట 'అధి' యను నుపసర్గము 'నిషేదు' యను క్రియాపదముతో సంబంధించుచున్నది ఈ శ్రుతులయందు నాకాశపర్యాయపదములగు 'వ్యోమ, ఖమ్మ'ను పదములు బ్రహ్మబోధకములుగా నలరారుచున్నవి

ఇట్లు పూర్వపక్షమును నిరసించి యుపక్రమమునందలి సందియ ముప సంహారవాక్యముచే నిర్ణయమును గను నను న్యాయము ననుసరించి గూడ నీ యాకాశశబ్దము బ్రహ్మపరమే యని "వాక్యోపక్రమేఽపి బ్రహ్మవిషయత్వావధారణా" యని నిర్వచింపఁబడుచున్నది అందులకు లౌకికదృష్టాన్తము గూడ 'అగ్నిరధీతే దృశ్యతే' యని ప్రదర్శింపఁబడుచున్నది అగ్ని యనువాకమును జదువుచున్నాఁడను వాక్యోపక్రమమునందలి యగ్నిశబ్దము 'అధీతే' యను వాక్యోపసంహారమునందలి పదముయొక్క సంబంధముచే నగ్నిశబ్దము మాణవకపరముగాఁ దెలియఁబడుచున్నదని తాత్పర్యము. ఫలితము 'తస్మాత్ సిద్ధమ్మ'ని యుపసంహారము చేయఁబడుచున్నది ॥౨౨॥ (ఇది ఆకాశాధికరణము)

## ప్రాణాధికరణమ్

# అత ఏవ ప్రాణః

ఉద్గీథే— 'ప్రస్తోతర్యా దేవతా ప్రస్తావమన్వాయత్తా' ఇత్యుపక్రమ

---

# అత ఏవ ప్రాణః

పూర్వమందువలెనే యీ సూత్రమునందుఁ గూడ బ్రహ్మశబ్దమును అనువృత్తి చేయవలయును అట్లు చేసి సూత్రార్థమును యోజించిన "అతః=కారణమువలన, ప్రాణః = ప్రాణము, బ్రహ్మైవ = బ్రహ్మమే" యని సిద్ధమగును

ఇచట 'అతః' శబ్దముచే 'తల్లింగాత్'ను పూర్వసూత్రమందలి హేతువాచకపదము గ్రహింపఁబడుచున్నది దానంజేసి బ్రహ్మలింగము దెలియ వచ్చుటవలన ప్రాణము బ్రహ్మమే యను నర్థము సిద్ధించును పూర్వసూత్రమున దెలియవచ్చెడి బ్రహ్మలింగములలో సకలభూతోత్పత్తిలయకారణత్వము ప్రధ లింగముగాఁ దెలియవచ్చుచున్నది కావుననట్టి బ్రహ్మలింగముతోఁ గూడ ప్రాణశబ్దమ్మేప్రకరణమున వినవచ్చునో యాప్రకరణమిచట విషయవాక్యము బరఁగును అయ్యది ఛాందోగ్యోపనిషత్తునందలి యుద్గీథోపాసనప్రకరణం నలిదలి ఉషస్తిచాక్రాయణోపాఖ్యానమునందలి వాక్యవిశేషమని "ఉద్గీథే ఇతి" యను భాష్యముచేఁ బ్రదర్శింపఁబడుచున్నది ఈవాక్యార్థమును విచారిం టకుఁ బూర్వము కథా సందర్భము నొకింత ముందుగాఁ దెలియవలయును ఆ కథాసందర్భమేమన—

ఒకానొక కాలమునఁ గురుదేశములయందు ఉషస్తిచాక్రాయణుఁడ ప్రసిద్ధిఁగాంచిన సామవేది యొకఁడుండెను ఆ దేశములయందొకప్పుడు పిడుగులతోఁగూడిన వర్షములు గురియుటచే నాదేశమందలి సస్యములన్నియు నాశమొ దుర్భిక్షము గలిగెను అప్పుడీయుషస్తి దనజీవికకొఱకు ధనమును సంపాదిం నొకయాగస్థలమునుగూర్చి యటకు యగు తనభార్యతోఁ గూడ వెడలె అటకియన పయోధరములు మున్నగు స్త్రీవ్యంజనములు జనింపని బాలిక య యర్థము అనఁగాఁ బది పదునొకండు వర్షములు ప్రాయము గల బాలి దీనింబట్టి యాకాలమున రజస్వలకాని పిల్లలను వివాహముచేసికొని నిత్య నైమి కాదికర్మలను జేసికొనుచుండుట ప్రబలమగు సదాచారముగ నుండునని నిస్స దేహముగా నూహింపనొప్పును.

అట్లు బయలువెడలి కొన్నిదినములకు 'ఇభ్య' యను గ్రామము నాఁ పతులు చేరిరి అటఁజేరునప్పటికీయుషస్తి యాకలిదప్పికలచేఁ బీడింపఁబడి జీవింపఁ

యవస్థ నొందెను ఇభ్యయన నేనుఁగులయజమాని యని యర్థము. అట్టితరుణమున నాయుషస్తి కుత్సితములగు మినుములను దినుచుండిన యేనుఁగులకాపరి నొకనిం జూచి యాఁకలిబాధచే నామినుగులను దనకిమ్మని కోరెను. అప్పుడా యేనుఁగులకాపరి దాఁ దినుచుండిన యెంగిలిమినుములుదక్క వేఱొండు లేవని చెప్పెను. ఆ యుచ్ఛిష్టపుమినుములనే యుషస్తి దనకిమ్మని యడుగ వాఁడామినుముల నుషస్తికిచ్చి పిమ్మట దనకడనున్న నీటిని గూడ నీయఁబోయెను. అప్పుడా యుషస్తి యీ యుదకమును నేఁ ద్రావినచో నుచ్ఛిష్టమును బానముచేసిన దోషమునొందుదునని చెప్పెను. అట్లైన నీమినుములు నుచ్ఛిష్టములు గావా యని నీమినుములఁ దిననిచో నే జీవింపఁజాలను. ఉదకమన్ననో నాకిచ్చవచ్చినంత నిచట దోషరహితమైనది లభించుచున్నది. కావున నీయుదకము లవంటరాదని పలికెను.

దీనింబట్టి మహాపురుషులకు సంకటకాలమగు ప్రాణాత్యయకాలమున నభక్ష్యభక్షణము దోషావహ మెంతమాత్రము గాదని యభిప్రాయము. ఇట్టి యాపద్ధర్మము నవకాశము చేసికొని జ్ఞానావలేపముచే ననియతప్రవృత్తికిఁ గడంగువాఁడత్యంత నరకపాతమునను భవించునని తాత్పర్యము. ఇయ్యది ప్రసంగానుప్రసక్తి. ప్రకృతమేమన నుషస్తి యుదకమునట్లు నిరాకరించి మినుములను జేకొని వలసినన్నిటిని దిని మిగిలినవానిని దనభార్యకిచ్చెను. ఆమె యంతవరకు శోభనముగ నన్నమును దినుటచే భర్తను దిరస్కరింపకుండ నామినుములఁ జేకొని తనయొద్దనే యుంచెను. ఉషస్తియు మఱునాటి యుదయమువరకు నడిచి డస్సినవాఁడై యిట్లు విలపించెను "అయ్యో, యన్నము లభించెనేని జీవించెదను. ఇప్పుడు జీవించెదనేని విశేషమగు ధనము లభింపగలదు. అనతిదూరముననే యా రాజు యాగము చేయనున్నాఁడు. అతడు నన్ను సకలయార్త్విజ్యములతోడను వరించును." అప్పుడాతనిభార్య "చేకొనుఁడు ఇవిగో మినుముల"ని దాఁ దాచిపెట్టిన మినుములను భర్తకు నిచ్చెను. అప్పుడామినుములఁ జేకొని తిని యుషస్తి యాగస్థలమును జేరుసరికి యాగమారంభింపఁబడెను. ఆర్త్విజ్యము లన్నియు నీయఁబడెను. దానంజేసి యాతని సరకుగొనువారెవ్వరును లేరైరి. అట్టితరుణమున నాస్తావమునందు స్తవముఁ జేయసంసిద్ధులైయున్న యుద్గాతృపురుషులచెంతఁ జేరి యచ్చటఁ గూర్చుండెను. అంతనుద్గాతృగణము స్తవమును బ్రారంభించుతరుణము రాఁగా నీయుషస్తి యిట్లుద్గాతృపురుషుల నుద్దేశించి పలికెను.

ఓయి ప్రస్తోత! ఏదేవత ప్రస్తావముచే స్తవముచేయఁబడుచున్నదో యా దేవతను గుర్తెఱుఁగకుండ ప్రస్తావము చేసినచో నీతల వ్రక్కలు కాఁగలదని ప్రస్తోతతోఁ బలికెను. ఈరీతిగానే ఓయియుద్గాత! ఉద్గీథముచే నేదేవత స్తవముచేయఁబడుచున్నదో యాదేవతను గుర్తెఱుఁగకుండ యుద్గానమును జేసితివేని నీతల వ్రక్కలు

శ్రూయతే— "కతమా సా దేవతేతి, ప్రాణ ఇతి హోవాచ, సర్వాణి హ వా ఇమాని భూతాని ప్రాణమేవాభిసంవిశన్తి, ప్రాణమభ్యుజ్జిహతే, సైషా దేవతా ప్రస్తావమన్వాయత్తా" (ఛాం॥ 1-11- 4-5) ఇతి । తత్ర సంశయనిర్ణయౌ పూర్వవదేవ ద్రష్టవ్యౌ । "ప్రాణబన్ధనం హి సోమ్య మనః" (ఛా। 6-8-2) "ప్రాణస్య ప్రాణమ్"

---

కాఁగలదని యుద్గాతతోఁ బలికెను ఈరీతిగానే ప్రతిహర్తతో, ఓయి ప్రతిహర్తా ! ప్రతిహారముచే నేదేవత స్తవముచేయఁబడునో యాదేవతను గుర్తెఱుఁగకుండ ప్రతిహారమును బల్కితివేని నీ తల వ్రక్కలు కాఁగలదు, అని పలికెను అట్టి పలుకులు వినినయుద్గాతృగణము దమయజ్ఞతకు వెరచి గానమునుపక్రమింపకుండ యూరకుండిరి

అట్టి తరుణమున యజమానుఁడగు రాజు ఉషస్తినుద్దేశించి మహానుభావులగు మిమ్ములఁ దెలిసికొననిచ్ఛయించుచున్నానని పలికెను అంతఁజాక్రాయణుఁడుషస్తియనుపేరఁ బరఁగుచున్నానని సమాధానమీయ రాజు మహనీయులగు మిమ్ములను నేనెన్నఁడును వినియుండలేదు వినియున్నచో సకలార్త్విజ్యములచే మిమ్ములనే వరించియుందును, తెలియకపోవుటచేనితరుల వరించితిని ప్రకృతమున మహనీయులగు మీరు సకలార్త్విజ్యములను జేకొనుఁడని పల్కనుషస్తి యట్లు గాదని వీరలు నాచేననుజ్ఞాతులై స్తవము చేయుదురు గాక వీరలకెంతధనము నిచ్చెదవో యంతధనమును నాకీయవలయు నని పల్కెను రాజట్లేయని సమ్మతించెను

పిమ్మట నీయుషస్తిని బ్రస్తోత సమీపించి "ఏదేవతాజ్ఞానము లేకుండ ప్రస్తావముచేసిన తలవ్రక్కలగునని మహానుభావులు సెలవిచ్చిరో యాదేవత యెద్దియో యుపదేశింపవలయు" నని ప్రార్థింప యుషస్తి యిట్లు పలికెను

"ప్రాణ ఇతి హోవాచ" యని ప్రాణ ఇతి = ప్రాణమే యని, హ = నిశ్చయముగా, ఉవాచ = పలికెను ఎలయన ఇమాని= ఈపరిదృశ్యమానములగు సర్వాణి= సమస్తములగు, భూతాని = భూతములు, హ వై = నిశ్చయముగ, ప్రాణమేవ = ప్రాణమును గూర్చియే, అభిసంవిశన్తి = లయమును జెందుచున్నవి ప్రాణమభి = ప్రాణమునననుసరించియే, ఉజ్జిహతే = పుట్టుచున్నవి సా ఏషా దేవతా = ఆ యీ ప్రాణమను దేవతయే, ప్రస్తావం = ప్రస్తావమును గూర్చి అన్వాయత్తా = అనుసరించుచున్నది అను వాక్యము విషయము ఇందలి సంశయనిర్ణయములు పూర్వాధికరణమునందువలెనే గ్రహింపఁబడవలయునని సామాన్యముగా "తత్ర ద్రష్టవ్యౌ" యని సంగ్రహముగఁ బలికి సంశయము "ప్రాణబంధనం .. భవతి సంశయః" యను భాష్యముచే నిర్వచింపఁబడుచున్నది. సోమ్య = ప్రియదర్శనుఁడా ! మనః = మనస్సు అన మనశ్శబ్దోపలక్షితుఁడగు

(బృ॥ 4-4-18) ఇతి చైవమాదౌ బ్రహ్మవిషయ- ప్రాణశబ్దో దృశ్యతే। వాయువికారే తు ప్రసిద్ధతరో లోకవేదయోః। అత ఇహ ప్రాణశబ్దేన కతరస్యోపాదానం యుక్తమితి భవతి సంశయః । కింపునరత్రయుక్తమ్। వాయువికారస్య పఞ్చవృత్తేః ప్రాణస్యోపాదానం యుక్తమ్ । తత్ర హి ప్రసిద్ధతరః ప్రాణశబ్ద ఇత్యవోచామ । నను పూర్వవదిహాపి తల్లిఙ్గాద్బ్రహ్మణ ఏవ గ్రహణం యుక్తమ్। ఇహాపి వాక్యశేషే భూతానాం సంవేశనోద్గమనం పారమేశ్వరం కర్మ ప్రతీయతే। న । ముఖ్యేపి ప్రాణే భూతసంవేశనోద్గమనస్య దర్శనాత్ । ఏవం హ్యామ్నాయతే— "యదా వై పురుషః స్వపితి ప్రాణం తర్హి వాగప్యేతి, ప్రాణం చక్షుః, ప్రాణం

---

జీవుఁడు, ప్రాణబంధనం హి = ప్రాణశబ్దోపలక్షితమగు బ్రహ్మమునందున్నవాఁడు ప్రాణస్య=వాయువికారమగు ప్రాణమునకు, ప్రాణం=ప్రాణమనంటిది బ్రహ్మము ఇవి మొదలుగాఁగల శ్రుతులయందుఁ బ్రాణశబ్దము బ్రహ్మపరముగాఁ జూడఁబడుచున్నది లోకమునందు వేదమునందునన్నను ప్రాణశబ్దము వాయువికారమునందుఁ బ్రసిద్ధతరమగు ప్రయోగమును గలుచున్నది కావున నిచటఁ బ్రాణశబ్దముచే వాయువికారమా లేక బ్రహ్మమా గ్రహింపఁబడుట యుక్తమను సంశయము గలుగుచున్నది ఇట్టి విశయమున మధ్యస్థుఁడు "కిం పునరత్రయుక్తం= ఇందేది యుచితమని ప్రశ్నింపఁ బూర్వపక్షి పంచవృత్తిరూపమగువాయువికారమునే యిచట గ్రహించుట యుక్తమని "వాయువికారస్య యుక్తమ్మ"ని పలికి యిందులకు హేతువు ప్రసిద్ధతరప్రయోగమే యని "తత్ర అవోచామ" యని చెప్పుచున్నాఁడు అంత మధ్యస్థుఁడు పూర్వాధికరణమునందువలెనే యిచటఁగూడ బ్రహ్మలింగము దెలియవచ్చుటవలన బ్రహ్మమునే గ్రహింపఁగూడదా యని "నను . యుక్తమ్మ" ని ప్రశ్నించి యిచట వాక్యశేషమునందు భూతముల యొక్క లయము నుత్పత్తియునను పరమేశ్వరసంబంధమగు కర్మము తెలియవచ్చుచున్నదే యని "ఇహాపి ప్రతీయతే" యని యీ వాక్యమునందలి బ్రహ్మలింగమును స్ఫురింపఁజేయఁ బూర్వపక్షి —

'న' అట్లు గాదని నిషేధించుచున్నాఁడు నిషేధమునకు హేతువు "ముఖ్యే . దర్శనాత్త్"ని సంగ్రహముగాఁ జెప్పఁబడుచున్నది అనఁగా ముఖ్యప్రాణమందుఁ గూడ భూతములయొక్క సంవేశనోద్గమము శ్రుతులయందుఁ జూడఁబడుచున్నదని భావము హేతుసంగ్రహవాక్యము "ఏవంహ్యామ్నాయతే వాక్యశేష" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది యదా = యెప్పుడు, పురుషః = జీవుఁడు, స్వపితి = నిద్రించునో, తర్హి = అప్పుడు, వై = నిశ్చయముగ, ప్రాణం = ప్రాణమును గూర్చి, వాక్ = వాగింద్రియము, అప్యేతి = లయముఁ బొందును చక్షుః = చక్షురింద్రియము, ప్రాణం = ప్రాణమును గూర్చి, శ్రోత్రం

శ్రోత్రం, ప్రాణం మనః, స యదా ప్రబుధ్యతే ప్రాణాదేవాధి పునర్జాయన్తే (శ॥ బ్రా॥ 10-3-3-6) ఇతి। ప్రత్యక్షం చైతత్ స్వాపకాలే ప్రాణవృత్తావపరిలుప్యమానాయామిన్ద్రియవృత్తయః పరిలుప్యన్తే, ప్రబోధకాలే చ ప్రాదురవస్తీతి। ఇన్ద్రియసారత్వాచ్చ భూతానామవిరుద్ధో ముఖ్యే ప్రాణేఽపి భూతసంవేశనోద్గమనవాదీ వాక్యశేషః। అపిచాదిత్యోఽన్నం చోద్గీథప్రతిహారయోర్దేవతే ప్రస్తావదేవతాయాః ప్రాణస్యానన్తరం నిర్దిశ్యేతే। న చ తయోర్బ్రహ్మత్వమస్తి। తత్సామాన్యాచ్చ ప్రాణస్యాపి న బ్రహ్మత్వమిత్యేవం ప్రాప్తే సూత్రకార ఆహ— "అత ఏవ ప్రాణః" ఇతి। "తల్లిఙ్గాత్" ఇతి పూర్వసూత్రే

---

= శ్రోత్రేంద్రియము, మనః = మనస్సును, ప్రాణం = ప్రాణమునుగూర్చి అప్యేతి = లయమునొందుచున్నది స = ఆ జీవుఁడు యదా = యెప్పుడు ప్రబుధ్యతే = మేలుకొనునో, పునః = తిరిగి, ప్రాణాదేవ = ప్రాణమువలననే అధిజాయంతే = బయలు వెడలుచున్నాఁడు

ఇట్లు శ్రుతివలనఁ దెలియవచ్చుటయే గాక ప్రత్యక్షముగ గూడ నీవిషయము దెలియవచ్చుచున్నదని "ప్రత్యక్షం చైతత్ ప్రాదుర్భవంతి" యని భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది అనఁగా నిదురయందుఁ బ్రాణవృత్తి లోపింపకుండ యుండునపుడింద్రియవృత్తులు పుష్కలముగ లోపించుటయుఁ బ్రబోధకాలమున ననఁగా మేలుకొనునప్పు డింద్రియవృత్తులు మఱల బయల్వెడలుచున్నట్లును బ్రత్యక్షమే గదా యని భావము ఇంద్రియములు లోపించుటయు నింద్రియములు బయలువెడలుటయును దెలియవచ్చుచున్నది గావున నింద్రియసారములగు భూతములుగూడఁ బ్రాణమందు లయముఁజెందుచున్నవనియు బ్రాణము నుండియే బయలువెడలుచున్నవనియు వినవచ్చెడి వాక్యశేషమెంతమాత్రము విరోధము కాదని "ఇంద్రియసారత్వాచ్చ వాక్యశేషః" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది ఈ ప్రాణమనునది బ్రహ్మముకంటె భిన్నమగు నన్నము నాదిత్యుఁడునను దేవతలయొక్క సన్నిధియందు బఠింపఁబడుటచే నియ్యది బ్రహ్మము కాదని హేత్వంతరము "అపిచ... న బ్రహ్మత్వమితి" యని ప్రదర్శింపఁబడుచున్నది అనఁగా నీప్రకరణమునందుద్గీథమున కాదిత్యుఁడు దేవతయనియు, నన్నము ప్రతీహారమునకు దేవతయనియుఁ బ్రస్తావదేవత ప్రాణమని చెప్పిన వెనుకఁ జెప్పఁబడుచున్నది అన్నమునకు నాదిత్యునకు బ్రహ్మత్వము లేదుగదా! అన్నాదిత్యులతోఁ దుల్యముగాఁ జెప్పఁబడు ప్రాణమునకుఁగూడ బ్రహ్మత్వము లేదని ఏవం ప్రాప్తే = ఇట్లు పూర్వపక్షముగలుగ సమాధానమును సూత్రకార ఆహ = సూత్రకారులు చెప్పుచున్నార"ని సూత్రము "అత ఏవ ప్రాణ" యని స్మరింపఁబడుచున్నది

సూత్రమునందలి అతశ్శబ్దమున కర్థము "తల్లింగాత్ నిర్దిష్టమ్మ"ని

నిర్దిష్టమ్। అత ఏవ తల్లిఙ్గాత్ప్రాణశబ్దమపి పరం బ్రహ్మ భవితుమర్హతి। ప్రాణస్యాపి హి బ్రహ్మలిఙ్గసంబన్ధః శ్రూయతే— "సర్వాణి హ వా ఇమాని భూతాని ప్రాణమేవాభిసంవిశన్తి ప్రాణమభ్యుజ్జిహతే" (ఛా॥ 1-11-5) ఇతి। ప్రాణనిమిత్తౌ సర్వేషాం భూతానాముత్పత్తిప్రలయావుచ్యమానౌ ప్రాణస్య బ్రహ్మతాం గమయతః। నన్వుక్తం ముఖ్యప్రాణపరిగ్రహేఽపి సంవేశనోద్గమనదర్శనమవిరుద్ధమ్। స్వాపప్రబోధయోర్దర్శనాదితి। అత్రోచ్యతే—స్వాపప్రబోధయోరిన్ద్రియాణామేవ కేవలానాం ప్రాణాశ్రయం సంవేశనోద్గమనం దృశ్యతే, న సర్వేషాం భూతానామ్। ఇహ తు సేన్ద్రియాణాం సశరీరాణాం చ జీవావిష్టానాం భూతానాం "సర్వాణి హ వా ఇమాని భూతాని" ఇతి శ్రుతేః। యదాఽపి భూతశ్రుతిర్మహాభూతవిషయా పరిగృహ్యతే తదాపి బ్రహ్మలిఙ్గత్వమవిరుద్ధమ్। నను సహాపి

---

ప్రదర్శించి సూత్రార్థమును "అత ఏవ అర్హతి" యని చెప్పుచున్నారు అత ఏవ = బ్రహ్మలింగముండుటవలననే, ప్రాణశబ్దమపి = ప్రాణశబ్దముగూడను, పరం బ్రహ్మ = పరబ్రహ్మమే భవితుం = అగుటకు, అర్హతి = తగును "తల్లింగాత్"ను హేతుశబ్దము "ప్రాణస్యాపి గమయత" యను భాష్యముచే వివరింపఁబడు చున్నది 'సర్వాణి హ వా' యను శ్రుతిచేఁ బ్రాణశబ్దమునకు బ్రహ్మలింగసంబంధము వినవచ్చుచున్నది కావున భూతములయొక్క యుత్పత్తిప్రలయములకుఁ బ్రాణము కారణమని చెప్పఁబడుటచేఁ బ్రాణము బ్రహ్మమే యని తాత్పర్యము

ఇట్లు సిద్ధాన్తి పలుక మధ్యస్థుఁడు "నన్వుక్తం దర్శనాదితి" యను పూర్వపక్షవాక్యమును దిరుగఁ బ్రశ్నించుచున్నాఁడు— అనఁగా సుషుప్తియందును ప్రబోధమునందును ముఖ్యప్రాణమునందుఁ గూడ సంవేశనోద్గమనములు తెలియ వచ్చుచుండుటచే ముఖ్యప్రాణమును గ్రహించుట గూడ నవిరుద్ధమేగదా యని యర్థము అందులకు సమాధానము "అత్రోచ్యతే" యని యుపక్రమింపఁబడు చున్నది సమాధానమన్ననో "స్వాపప్రబోధయోః అవిరుద్ధమ్" ని చెప్పఁబడుచున్నది అనఁగా స్వాపప్రబోధములయందుఁ గేవల మింద్రియములకే ప్రాణముతో సంబంధించిన సంవేశనోద్గమనము చూడఁబడుచున్నది కాని సమస్త భూతములకుఁ జూడఁబడుట లేదు ప్రకృతపు శ్రుతియందన్ననో యింద్రియముల తోడను శరీరములతోడను గూడిన జీవభావముఁ బొందిన భూతములన్నియు "సర్వాణి హ వా" యను శ్రుతిచే గ్రహింపఁబడుచున్నవి ఇయ్యదియటుండ "భూతాని" యను భూతశ్రుతికి మహాభూతము లను నర్థమును గ్రహించినచో నపుడుగూడ బ్రహ్మలింగము విరోధింపనేరదని సమాధానము చెప్ప మధ్యస్థుఁడు శ్రుత్యంతరమున్న విషయములగు భూతాదులతోఁ గూడ నింద్రియములకు స్వాపప్రబోధములయందుఁ బ్రాణమునందు లయము ప్రాణము

విషయైరిన్ద్రియాణాం స్వాపప్రబోధయోః ప్రాణోఽప్యయం ప్రాణాచ్చ ప్రభవం శ్రూయతే — "యదా సుప్తః స్వప్నం న కంచన పశ్యత్యథాస్మిన్ప్రాణ ఏవైకధా భవతి తదైనం వాక్సర్వైర్నామభిః సహాప్యేతి" (కౌ॥ 3-3) ఇతి తత్రాపి తల్లిఙ్గాత్ప్రాణశబ్దం బ్రహ్మైవ । యత్పునరన్నాదిత్య సంనిధానాత్ప్రాణస్యాబ్రహ్మత్వమితి తదయుక్తమ్ । వాక్యశేషబలేన ప్రాణశబ్దస్య బ్రహ్మవిషయతాయాం ప్రతీయమానాయాం సంనిధానస్యాకించిత్కరత్వాత్ । యత్పునః ప్రాణశబ్దస్య పఞ్చవృత్తౌ ప్రసిద్ధతరత్వం తదాకాశశబ్దస్యేవ ప్రతివిధేయమ్ । తస్మాత్సిద్ధం

---

వలన నుత్పత్తియును వినుచున్నారమే యని "నను సహాపి . అప్యేతీతి" యని ప్రశ్నించుచున్నాఁడు యదా = ఎప్పుడు, సుప్తః = నిద్రించువాఁడు, కంచన = ఒకానొక, స్వప్నం = కలను, న పశ్యతి = చూడఁడో, అధ = అప్పుడు, అస్మిన్ ప్రాణే ఏవ = ఈ ప్రాణమునందే, ఏకధా = ఒకేభావముగా, భవతి = అగుచున్నాడు తదా = అప్పుడు, ఏనం = ఈప్రాణమునుగూర్చి, వాక్ = వాగింద్రియము, సర్వైః నామభిః సహ=సమస్తనామములతోఁగూడ, అప్యేతి=లయము జెందును ఇట్లు ప్రశ్నింప సిద్ధాన్తిచే నాశ్రుతియందుఁ గూడ బ్రహ్మలింగముచేఁ బ్రాణశబ్దము బ్రహ్మపరమేయని "తత్రాపి బ్రహ్మైవ" యన్ని సమాధానము చెప్పఁబడుచున్నది ఇట్లు సమాధానమును చెప్పి పూర్వపక్షవాదముకు నిరసింప నన్నాదిత్యులసన్నిధానమందుండుటచే బ్రాణము బ్రహ్మముగాదను పూర్వపక్షబీజమును "యత్పునః . . అబ్రహ్మత్వమితి" యని యనువదించి యయ్యది యసమంజసమని "తదయుక్తమ్మ"ని నిరసించుచున్నారు. నిరసనమునకు హేతువు "వాక్యశేషబలేన అకించిత్కరత్వాత్త"ని చెప్పఁబడుచున్నది అనఁగా వాక్యశేషబలముచేఁ బ్రాణశబ్దము బ్రహ్మమని తెలియవచ్చుచుండ సన్నిధానమునకుఁ బ్రయోజనమెద్దియును లేదు అనఁగా సన్నిధానమాత్రముచే నర్థనిర్ణయమును జేయుట యుచితము గాదని యాశయము ప్రాణశబ్దము వాయువికారమందుఁ బ్రసిద్ధతరప్రయోగమును గల్గియున్నదను వేఱొక పూర్వపక్షబీజమును "యత్పునః . ప్రసిద్ధతరత్వమ్మ"ని యనువదించి యద్దానికిఁ గూడ నాకాశశబ్దమునకువలెనే సమాధానము చెప్పఁబడవలయునని సమాధానమును "తదాకాశశబ్దస్యేవ ప్రతివిధేయమ్మ"ని చెప్పుచున్నారు అనఁగాఁ బ్రాణశబ్దమునకుఁ బ్రసిద్ధతరప్రయోగముచేఁ దొలుత వాయువికారమని భాసించినను వాక్యశేషమందుఁదెలియవచ్చెడి బ్రహ్మలింగములచే బ్రహ్మమనియే గ్రహింపవలయును గాని వాయువికారమని యెంతమాత్రము గ్రహింపఁగూడదు ఇట్లు పూర్వపక్షివాదమును నిరసించి ప్రస్తావదేవతయగు ప్రాణము బ్రహ్మమేయని స్వాభిమతము "తస్మాత్ . . బ్రహ్మత్వమ్మ" ని యుపసంహారము చేయఁబడుచున్నది

ప్రస్తావదేవతాయాః ప్రాణస్య బ్రహ్మత్వమ్। అత్ర కేచిదుదాహరన్తి— "ప్రాణస్య ప్రాణమ్" "ప్రాణబన్ధనం హి సోమ్య మనః" ఇతి చ। తదయుక్తమ్ । శబ్దభేదాత్ప్రకరణాచ్చ సంశయానుపపత్తేః । యథా పితుః పితేతి ప్రయోగేఽన్యః పితా షష్ఠీనిర్దిష్టోఽన్యః ప్రథమానిర్దిష్టః పితుః పితేతి గమ్యతే, తద్వత్ "ప్రాణస్య ప్రాణమ్" ఇతి శబ్దభేదాత్ప్రసిద్ధాత్ప్రాణాదన్యః ప్రాణస్య ప్రాణ ఇతి నిశ్చీయతే। నహి స ఏవ తస్యేతి భేదనిర్దేశార్హో భవతి। యస్య చ ప్రకరణే యో నిర్దిశ్యతే నామాన్తరేణాపి స ఏవ తత్ర ప్రకరణీ నిర్దిష్ట ఇతి గమ్యతే। యథా జ్యోతిష్టోమాధికారే— "వసన్తే వసన్తే జ్యోతిషా యజేత" ఇత్యత్ర జ్యోతిః శబ్దో జ్యోతిష్టో

---

ఇట్లు స్వసిద్ధాన్తము నుపపాదించి యీ యధికరణమునఁ బ్రస్తావదేవతా సంబంధమగు శ్రుతివాక్యమును విడిచి వేఱొక విషయవాక్యమును బ్రదర్శించిన వృత్తికారాశయమును నిరసింప "అత్ర కేచిదుదాహరంతి" యని యుపక్రమము చేయుచున్నారు అత్ర = ఈ యధికరణమునందు, కేచిత్ = వృత్తికారాదులు వాక్యాంతరములను "ప్రాణస్య ఇతిచ" యని ప్రదర్శించి యట్లుదహరించిన వాక్యములు విషయవాక్యము లెంతమాత్రముగావని "తదయుక్తమ్మ"ని నిరసించుచున్నారు నిరాసహేతువు "శబ్దభేదాత్ . అనుపపత్తే" యని సంగ్రహముగఁ జెప్పఁబడుచున్నది శబ్దభేదముచేతను ప్రకరణసందర్భముచేతను సంశయము గలుగుటకు వీలులేదు కావున విషయవాక్యము లెంతమాత్రము గానేరవని యభిప్రాయము అందు శబ్దభేదమను హేతువు "యథా భవతి" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది. "పితుః పితా" యను ప్రయోగమున షష్ఠీవిభక్త్యంతముచే నిర్దేశింపఁబడిన తండ్రి వేఱనియు ప్రథమావిభక్త్యంతముచే నిర్దేశింపఁబడిన తండ్రి మొదటివానికి దండ్రియగుటచే వేఱనియుఁ దెలియవచ్చునటుల "ప్రాణస్య ప్రాణమ్మ"నుచో షష్ఠ్యంతప్రథమాంతరూపములగు శబ్దములకు భేదముండుటవలన షష్ఠీనిర్దిష్టమగు ప్రాణముకంటెఁ బ్రథమానిర్దిష్టమగు ప్రాణము వేఱని నిశ్చయింపఁబడుచున్నది స ఏవ = అదియే, తస్యేతి = దానితో సంబంధించినదను, భేదనిర్దేశార్హః = భేదనిర్దేశమునకుఁ దగియుండుట, నహి భవతి = కలుగదుగదా!

ఇఁకఁ బ్రకరణసందర్భమను హేతువు "యస్యచ ప్రకరణే . కథమవగమయేత్త" ను భాష్యముచే వివరింపఁబడుచున్నది ఏప్రకరణమునందెయ్యది నామాంతరముచేఁ గూడ నిర్దేశింపఁబడుచున్నదో యాప్రకరణమందుఁ దెలియవచ్చెడి యయ్యది యేనామాంతరముచేనైన గ్రహింపఁబడవలయును గాని నామాంప్రసిద్ధమగుదాని నెంతమాత్రము గ్రహింపఁగూడదని "యస్య గమ్యతే" యను న్యాయము ప్రదర్శింపఁబడుచున్నది అందులకు దృష్టాన్తము "యథా . . భవతి" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది అనఁగా "వసంతే వసంతే

మవిషయో భవతి, తథా పరస్య బ్రహ్మణః ప్రకరణే "ప్రాణబన్ధనం హి సోమ్య మనః" ఇతి శ్రుతః ప్రాణశబ్దో వాయువికారమాత్రం కథమవగమయేత్ । అతః సంశయాఽవిషయత్వాన్నైతదుదాహరణం యుక్తమ్ । ప్రస్తావదేవతాయాం తు ప్రాణే సంశయపూర్వపక్షనిర్ణయా ఉపపాదితాః । ॥ ౨౩ ॥

## జ్యోతిరధికరణమ్

# జ్యోతిశ్చరణాభిధానాత్

ఇదమామనన్తి—"అథ యదతః పరో దివో జ్యోతిర్దీప్యతే విశ్వతః

---

జ్యోతిషా యజేత"యను శ్రుతి జ్యోతిష్టోమప్రకరణమునుండుటజేసి యందలిజ్యోతిశ్శబ్దము జ్వలనపరమయ్యుఁ గ్రతువిశేషమగు జ్యోతిష్టోమమునందే ప్రకరణ సందర్భముచే గ్రహింపఁబడుచున్నదని భావము ఇట్లు దృష్టాన్తమును బ్రదర్శించి దార్ష్టాన్తికము "తథా అవగమయేత్త"ని నిర్వచింపఁబడుచున్నది ఎట్లన— "ప్రాణబంధనం హి సోమ్య మన" యను శ్రుతి శ్వేతకేతూద్దాలకసంవాదమనెడి పరబ్రహ్మప్రకరణమున వినవచ్చుటచే నచటి ప్రాణశబ్దము వాయువికారము నెంత మాత్రము బోధింపదని యభిప్రాయము.

ఇట్లుదాహృతశ్రుతులయందు సంశయమునకవకాశము లేదు. గావున నీ శ్రుతులనిచట విషయవాక్యములుగా నుదాహరించుటకవకాశము లేదని "అతః యుక్తమ్మ"ని నిరసింపఁబడుచున్నది ప్రస్తావదేవతయందన్ననో సంశయమునకు నవకాశము గలదు గావున నయ్యదియే విషయవాక్యమనియు, నాకారణముచేతనే యయ్యది నిరూపింపఁబడెననియు "ప్రస్తావదేవతాయాంతు . ఉపపాదితా" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది విషయము, సంశయము, పూర్వపక్షము నిర్ణయమను నాలుగవయవములతోఁ గూడినది యధికరణమని యధికరణలక్షణ మీభాష్యముచే నిర్వచింపఁబడుచున్నది

ఇదిప్రాణాధికరణము

# జ్యోతిశ్చరణాభిధానాత్

పూర్వసూత్రమునుండి బ్రహ్మశబ్దమీసూత్రమునందనువృత్తి చేయఁ బడుచున్నది దానంజేసి "జ్యోతిః, బ్రహ్మ, చరణాభిధానాత్త"ని సూత్రస్వరూపము సిద్ధమగుచున్నది సూత్రార్థమన్ననో, జ్యోతిః = జ్యోతిశ్శబ్దము, బ్రహ్మ = బ్రహ్మబోధకము ఏలయన, చరణాభిధానాత్ = పాదములు చెప్పఁబడుట వలననని సిద్ధించుచున్నది. ఇట్టి జ్యోతిశ్శబ్దము వినవచ్చెడిశ్రుతివాక్యము ఛాందో గ్యోపనిషత్తునందలి మూఁడవ ప్రపాఠకమునఁ బదుమూఁడవ ఖండమునందలి

పృష్ఠేషు సర్వతః పృష్ఠేష్వనుత్తమేషూత్తమేషు లోకేష్విదం వావ తద్యదిదమస్మి
న్నన్తః పురుషే జ్యోతిః" (ఛా॥ 3-13-7) ఇతి। తత్ర సంశయః— కిమిహ జ్యోతి
శ్శబ్దేనాదిత్యాది జ్యోతిరభిధీయతే కిం వా పరమాత్మేతి। అర్థాన్తరవిషయస్యాపి
శబ్దస్య తల్లిఙ్గాద్బ్రహ్మవిషయత్వముక్తమ్। ఇహ తు తల్లిఙ్గమేవాస్తి నాస్తీతి విచా
ర్యతే। కిం తావత్ప్రాప్తం, ఆదిత్యాదికమేవ జ్యోతిఃశబ్దేన పరిగృహ్యత ఇతి। కుతః।
ప్రసిద్ధేః। తమో జ్యోతిరితి హీమౌ శబ్దౌ పరస్పరప్రతిద్వన్ద్విభిషయౌ ప్రసిద్ధౌ।
చక్షుర్వృత్తేర్నిరోధకం శార్వరాదికం తమ ఉచ్యతే, తస్యా ఏవానుగ్రాహక

---

యేడవ వాక్యమని వినవచ్చెడినని "ఇదమామనంతి ఇతి" యని విషయ్యవాక్యము
ప్రదర్శింపఁబడుచున్నది. 'అథ' ఇచట నథశబ్దము ప్రకరణాంతరసూచకము
అతః = ఈ, దివః = ద్యులోకముకంటె, పరః = పరముండలి, విశ్వతః = సమస్త
ములైన, పృష్ఠేషు = స్థానములయందును, అనుత్తమేషు 'సర్వతః పృష్ఠేషు'
యనునది విశ్వతః పృష్ఠేషు యను దానికి వివరణరూపము అనుత్తమేషూత్తమేషు
= సర్వోత్కృష్టములగు, లోకేషు = లోకములయందు, పరః = ఉత్కృష్టమగు,
జ్యోతిః = తేజస్సు, దీప్యతే = ప్రకాశించుచున్నదో, తత్ = ఆతేజస్సు,
అస్మిన్ = ఈ, పురుషే = శరీరమునందు, యత్ ఇదం = ఏ యీ జారరాగ్ని
రూపముగు జ్యోతిః = జ్యోతి గలదో, ఇదం వావ = ఇదియే

ఈ వాక్యమునందు సంశయము "తత్ర సంశయః నాస్తీతి విచా
ర్యతే" యను భాష్యముచే నిర్వచింపఁబడుచున్నది ఎట్లన— నిందలి జ్యోతిశ్శబ్ద
ముచే నాదిత్యుఁడునున్నగు జ్యోతి చెప్పఁబడుచున్నదా లేక పరమాత్మయనియా?
ఒకానొకవేళ నర్థాంతరమును బోధించు శబ్దమైనను బ్రహ్మలింగముండినచో బ్రహ్మ
పదమని నిర్వచింపనొప్పును ప్రకృతపు ప్రకరణమునందన్ననో యట్టి బ్రహ్మలింగ
మెద్దియేని కలదా లేదా యని విచారింపవలయునని సంశయము ఇట్టి సంశ
యమునందు మధ్యస్థుఁడు "కిం తావత్ ప్రాప్తం = ఈ యుభయపక్షములలో నెద్ది
లభించుచున్నదని ప్రశ్నింపఁ బూర్వపక్షి, జ్యోతిశ్శబ్దముచే నాదిత్యాదికమగు తేజ
మునే గ్రహింపవలయునని "ఆదిత్యాదికమేవ ఇతి" యని నిర్వచింప మధ్యస్థుఁడు,
కుతః=ఏలయని ప్రశ్నింప బూర్వపక్షి, ప్రసిద్ధేః = ప్రసిద్ధియుండుటవలననని యొక
హేతువును నిర్వచించుచున్నాఁడు హేతుసంగ్రహవాక్యము "తమోజ్యోతిరితి ..
ప్రసిద్ధౌ ఇతి" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది అనఁగా "తమస్సు,
జ్యోతిస్సు"ను రెండు శబ్దములును, పరస్పరప్రతిద్వన్ద్విభిషయౌ=అన్యోన్యము విరుద్ధ
స్వభావములను గల్గిన విషయములందు సుప్రసిద్ధములు వ్యవహారమును గను
చున్నవి ఎట్లనఁ జక్షురింద్రియవృత్తికిఁ బ్రతిబంధరూపమగు రాత్రి మున్నగు
వానితో సంబంధించిన విషయము తమస్సని చెప్పఁబడుచున్నది ఆ చక్షురింద్రియ

మాదిత్యాదికం జ్యోతిః । తథా, “దీప్యతే” ఇతీయమపి శ్రుతిరాదిత్యాదివిషయా ప్రసిద్ధా । నహి రూపాదిహీనం బ్రహ్మ “దీప్యతే” ఇతి ముఖ్యాం శ్రుతిమర్హతి। ద్యుమర్యాదత్వశ్రుతేశ్చ। నహి చరాచరబీజస్య బ్రహ్మణః సర్వాత్మకస్య ద్యౌర్మర్యాదా యుక్తా। కార్యస్య తు జ్యోతిషః పరిచ్ఛిన్నస్య ద్యౌర్మర్యాదాస్యాత్ । “పరో దివో జ్యోతిః” ఇతి చ బ్రాహ్మణమ్। నను కార్యస్యాపి జ్యోతిషః సర్వత్ర గమ్యమానత్వాద్ద్యుమర్యాదావత్త్వమసమఞ్జసమ్ । అస్తు తర్హ్యత్రివృత్కృతం తేజః ప్రథమజమ్। న। అత్రివృత్కృతస్య తేజసః ప్రయోజనాభావాదితి। ఇదమేవ ప్రయోజనం యదుపాస్యత్వమితి చేత్। న। ప్రయోజనాన్తరప్రయుక్తస్యైవాదిత్యాదేరుపాస్యత్వదర్శనాత్। “తాసాం త్రివృతం త్రివృతమేకైకాం కరవాణి” (ఛా॥ 6-

---

వృత్తికే యనుకూలమును జేయునట్టి యాదిత్యుఁడు మున్నగువిషయములు జ్యోతులని చెప్పఁబడుచున్నవి ఇంతియకాదు శ్రుతియందలి ‘దీప్యతే’ యను పదమాదిత్యాదితేజోవిషయమని సుప్రసిద్ధమే స్వరూపవిహీనమగు బ్రహ్మము “దీప్యతే= ప్రకాశించుచున్నద”ని ముఖ్యముగాఁ జెప్పవీలులేదు కదా ! యని ప్రసిద్ధవ్యవహారము ఇట్లు ప్రసిద్ధిని వివరించి “ద్యుమర్యాదత్వశ్రుతేశ్చ = ద్యులోకమవధిగాఁ గలది” యని వినవచ్చుటవలన నని రెండవహేతువు నిరూపింపఁబడుచున్నది. హేతుసంగ్రహవాక్యము “నహి ..ఇతి చ బ్రాహ్మణమ్మ”ను భాష్యముచే వివరింపఁబడుచున్నది అనఁగాఁ జరాచరభూతములకుఁ గారణమగునట్టియు నద్దానిచేసర్వాత్మయగునట్టియు బ్రహ్మమునకు ద్యులోకమర్యాద యుక్తము గాదు. కాని పరిచ్ఛిన్నమగు కార్యతేజమునకన్ననో ద్యులోకమర్యాద యుక్తమే దివః పరం జ్యోతిః = ద్యులోకమునకుఁ బరమగుజ్యోతియని ద్యులోకమర్యాద వినవచ్చుచున్నదిగదా యని భావము ఇట్లు పలుక మధ్యస్థుఁడు కార్యతేజముకూడ నన్నిస్థలములయందును దెలియవచ్చుటఁజేసి యద్దానికిఁగూడ ద్యులోకావధి చెప్పుట యుక్తము గాదు కావునఁ దొలుతఁ బుట్టినట్టియుఁ ద్రివృత్కృతముగానట్టియుఁ దేజమును గ్రహించినచో యుక్తమా యని “నను ప్రథమజమ్మ”ని ప్రశ్నింపఁ బూర్వపక్షి ‘న = అట్లుగాద’ని యనుచున్నాఁడు అందులకు హేతువు ప్రయోజనము లేకపోవుటచేతనే యని “అత్రివృత్కృతస్య . ప్రయోజనాభావాత్త”ని చెప్ప మధ్యస్థుఁ డుపాస్యముగ విధింపఁబడుటయే ప్రయోజనమని “ఇదమేవ ... ఇతి ఉపాస్యత్వమ్మ”నఁ బూర్వపక్షి “న” యట్లుగాదనివారించి యందులకు హేతువును “ప్రయోజనాంతర . దర్శనాత్త”ని చెప్పుచున్నాఁడు అనఁగా శాస్త్రముచేఁ బ్రయోజనాంతరముతోఁగూడుకొనియుండునాదిత్యాదులకే యుపాస్యత్వము విధింపఁబడుచున్నది గాని ప్రయోజనరహితములగువానికెన్నఁడు నుపాస్యత్వము విధింపఁబడ

1-3) ఇతి చావిశేషశ్రుతేః । న చాత్రివృత్కృతస్యాపి తేజసో ద్యుమర్యాదత్వం ప్రసిద్ధమ్। అస్తు తర్హి త్రివృత్కృతమేవ తేజసో జ్యోతిఃశబ్దమ్ । నన్వేకమర్వాగపి దివోఽవగమ్యతేఽగ్న్యాదికం జ్యోతిరితి। నైష దోషః । సర్వత్రాపి గమ్యమానస్య జ్యోతిషః "పరో దివః" ఇత్యుపాసనార్థః ప్రదేశవిశేషపరిగ్రహో నవిరుధ్యతే। నతు నిష్ప్రదేశస్యాపి బ్రహ్మణః ప్రదేశవిశేషకల్పనా భాగినీ, "సర్వతః పృష్ఠేష్వనుత్తమేషూత్తమేషు లోకేషు" ఇతి చాధారబహుత్వశ్రుతిః కార్యే జ్యోతిష్యుపపద్యతేతరామ్ । "ఇదం వావ తద్యదిదమస్మిన్నన్తః పురుషే జ్యోతిః (ఛా॥ 3-13-7) ఇతి చ కౌక్షేయే జ్యోతిషి పరం జ్యోతిరధ్యస్యమానం దృశ్యతే । సారూప్య

---

లేదని యభిప్రాయము అంతియ కాదు. ఆ తేజోఽబన్నములలో నొక్కొక్క దానిని మూఁడుమూఁడింటితోఁగూడినదానిగాఁ జేసెదనని విశేషరహితముగ్గా వినఁబడుటచే నత్రివృత్కృతమగు తేజస్సుప్రసిద్ధమే యగుచున్నదని "తాసాం . అవిశేషశ్రుతే"యని చెప్పి యత్రివృత్కృతమగుదానికిఁగూడ ద్యుమర్యాదయెచ్చటను వినఁబడుట లేదని "నహి ... ప్రసిద్ధమ్మ"ని వారించి స్వాభిమతమును "అస్తు జ్యోతిశ్శబ్దమ్మ"న జ్యోతిశ్శబ్దము త్రివృత్కృతమగుజ్యోతినే చెప్పుచున్నదని చెప్ప మధ్యస్థుఁడు త్రివృత్కృతమయినట్టియు నగ్న్యాదిరూపమునొందినట్టియు, జ్యోతిస్సు ద్యులోకమునకు దిగువఁగూడఁ దెలియవచ్చుచున్నదే యని "నన్వేకం.. జ్యోతిరితి" యని ప్రశ్నింపఁ బూర్వపక్షి యయ్యది యొకదోషముగాదని "నైష దోష" యని చెప్పి యందులకు హేతువును "సర్వత్రాపి నవిరుధ్యతే" యని నిర్వచించుచున్నాఁడు అనఁగా నన్నిదిశలయందును దెలియవచ్చెడి తేజమునకే 'దివః పరః" యని ప్రదేశవిశేషకల్పనముపాసనార్థము విధింపఁబడుటచే విరోధమెంతమాత్రము లేదని యభిప్రాయము ఇంతియ గాదు ప్రదేశరహితమగు బ్రహ్మమునకుఁ బ్రదేశమును గల్పించుట యుక్తము కాదుగదాయని "నతు భాగినీ''నభాగినీ = యుక్తముకాదని వ్యతిరేకముఖమున జ్యోతిశ్శబ్దము బ్రహ్మపరము గాదని నిర్వచించి "సర్వతఃపృష్ఠేషు" యను శ్రుతిచేఁ దెలియవచ్చెడి యాధారబహుత్వము గూడఁ గార్యరూపమగు తేజమునందే సమన్వయమగుచున్నదని " సర్వతః .. ఉపపద్యతేతరామ్మ"ని చెప్పి హేత్వంతరమును "ఇదం వావ తద్యత్ ఇతి చ శ్రుతే" యను భాష్యముచేఁ జెప్పుచున్నారు అనఁగా నీపురుషునియందలి జ్యోతిగూడ నీజాఠరాగ్నియే యని కుక్షిసంబంధమగు తేజమునందుఁ బరమగుతేజమధ్యస్తము గావింపఁబడినట్లు తెలియుచున్నదని " ఇదంవావ . .దృశ్యతే" యను శ్రుతితాత్పర్యము చెప్పి యధ్యాసరూపములగు నుపాసనములు సమానస్వభావముగలవానికే యుపదేశింపఁబడుట న్యాయము గావునఁ గార్యతేజమగు జాఠరాగ్నియందునధ్యాసము చేయఁబడవలెనని యుపదేశింపఁబడిన పరమగు

నిమిత్తాశ్చాధ్యాసా భవన్తి యథా—"తస్య భూరితి శిర ఏకం శిర ఏకమేతదక్షరం" (బృ॥ 5-5-3) ఇతి । కౌక్షేయస్య తు జ్యోతిషః ప్రసిద్ధమబ్రహ్మత్వమ్ । "తస్యైషా దృష్టిః" (ఛాం॥ 3-13-7) "తస్యైషా శ్రుతిః" ఇతి చౌష్ణ్యఘోషవిశిష్టత్వస్య శ్రవణాత్ । 'తదేతద్దృష్టం చ శ్రుతం చేత్యుపాసీత' ఇతి చ శ్రుతేః । "చక్షుష్యః శ్రుతో భవతి య ఏవం వేద (ఛాం॥ 3-13-8) ఇతి చాల్పఫలశ్రవణాదబ్రహ్మత్వమ్ । మహతే హి ఫలాయ బ్రహ్మోపాసనమిష్యతే న చాన్యదపి కించిత్స్వవాక్యే ప్రాణాకాశవజ్జ్యోతిషోఽస్తి బ్రహ్మలిఙ్గమ్ । న చ

---

తేజముగూడఁ గార్య తేజమేయైయుండవలయునని "నారూప్యనిమిత్తాశ్చాధ్యాసా భవంతి" యను హేతువును జెప్పి యధ్యాసరూపములగునువాసనలు సాదృశ్య నిమిత్తములే యనుటకు దృష్టాన్తముగ "యథా ఇతి" యని శ్రుతిని ప్రదర్శించుచున్నారు తస్య = ఆ బ్రహ్మమునకు, భూః ఇతి = 'భూ' యనునది, శిరః = శిరస్సు శిర. = శిరస్సు, ఏకం = ఒకటియే ఏతత్ = ఈ, అక్షరం = 'భూ యను నక్షరము, ఏకం = ఒకటియే, అనఁగా 'భూ' యను నక్షరమొక్కటియే శిరస్సుగూడనొక్కటియే, కావున 'భూ' యనుదానిని శిరముగా భావింపవలయుననుచో 'భూః, శిర' యనురెండును గార్యములే యగుచున్నవి. ప్రకృతమున కుక్షిసంబంధమగు జాఠరాగ్ని బ్రహ్మముగాదను విషయము సుప్రసిద్ధమే కావున నందధ్యాసను చేయఁబడవలయుననిబోధింపఁబడినపరమగుజ్యోతిస్సుగూడబ్రహ్మము కాదనునాశయముచే "కౌక్షేయస్య . అబ్రహ్మత్వమ్మ"ని చెప్పఁబడుచున్నది ఇంతియ కాదు ఇందుపదేశింపఁబడినయుపాసనమునకు స్వల్పమగు ఫలమే వినఁబడుట వలన నీతేజస్సు బ్రహ్మము కాదని తెలియఁబడుచున్నదని "తదేతద్దృష్టం . అబ్రహ్మత్వమ్మ"ను భాష్యముచే జెప్పఁబడుచున్నది తదేతత్ = ఆ యీ తేజస్సు దృష్టం చ = దృష్టమనియు, శ్రుతంచ ఇతి = శ్రుతమనియును, ఉపాసీత = ఉపాసింపఁబడవలయును యః = ఎవ్వఁడు, ఏవం = ఈరీతిగా వేద = ఉపాసించునో అట్టివాఁడు, చక్షుష్యః = అందఱిచేఁ జూడ నిచ్ఛయింపఁబడిన సౌందర్యముగల వాఁడును, శ్రుతః = విద్వాంసుఁడును, భవతి = అగుచున్నాఁడు అల్పఫలము విన బడుటచే బ్రహ్మము కాదనుటకు హేతువు, "మహతే హి ఫలాయ ఇష్యతే యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది అనఁగా బ్రహ్మోపాసనము గొప్పఫలమునకభిలషింపఁబడుచున్నది, గాని స్వల్పఫలమున కభిలషింపబడదనుటవలన నిచట స్వల్పఫలము వినవచ్చుటంజేసి యియ్యది బ్రహ్మము కాదని తాత్పర్యము. ఏది యెట్టులైన నీజ్యోతిర్వాక్యమందుఁ బ్రాణాకాశశబ్దములందువలె బ్రహ్మలింగమెద్దియేని గలద్దా యన నయ్యదియును గాఁ రాదని "న చ .. బ్రహ్మలింగమ్మ"ను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది

పూర్వస్మిన్నపి వాక్యే బ్రహ్మ నిర్దిష్టమస్తి "గాయత్రీ వా ఇదం సర్వం భూతమ్ ।" ఇతి ఛందో నిర్దేశాత్ । అథాపి కథంచిత్పూర్వస్మిన్వాక్యే బ్రహ్మ నిర్దిష్టమ్ స్యాదేవమపి న తస్యేహ ప్రత్యభిజ్ఞానమస్తి । తత్ర హి 'త్రిపాదస్యామృతం దివి' (3-12-1, 6) ఇతి ద్యౌరధికరణత్వేన శ్రూయతే । అత్ర పునః "పరో దివో జ్యోతి" ఇతి ద్యౌర్మర్యాదాత్వేన । తస్మాత్ప్రాకృతం జ్యోతిరిహ గ్రాహ్యమిత్యేవం ప్రాప్తే బ్రూమః — జ్యోతిరిహ బ్రహ్మ గ్రాహ్యమ్ । కుతః । చరణాభిధానాత్ । పాదాభిధానాదిత్యర్థః । పూర్వస్మిన్హి వాక్యే చతుష్పాద్బ్రహ్మ నిర్దిష్టం "తావా

---

పోనిండు, స్వవాక్యమందు బ్రహ్మలింగము గానఁబడకపోయినను బూర్వవాక్యమందైనను బ్రహ్మము చెప్పఁబడియున్నదా యనిన నచట ఛందోరూపమగు గాయత్రి చెప్పఁబడుచున్నదిగాని బ్రహ్మము చెప్పఁబడియుండలేదని "నచ ఛందో నిర్దేశాత్త"ని భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది ఒకానొకవేళఁ బూర్వవాక్యమునందు బ్రహ్మము చెప్పఁబడినదని యనుకొన్నను నా బ్రహ్మమీ జ్యోతిశ్శబ్దముచే వివక్షచేయఁబడుట కవకాశ మెంతమాత్రము లేదని "అథాపి .. అస్తి" యని చెప్పఁబడుచున్నది ప్రత్యభిజ్ఞానమన 'నదియే యిదియును' నేకార్థబోధకజ్ఞానము. అట్లు ప్రత్యభిజ్ఞానము గలుగుటకుఁ దగు హేతువు లేదని పూర్వోత్తరగ్రంథసందర్భమ్ము "తత్రేహి ద్యౌర్మర్యాదాత్వేన" యను భాష్యముచే నిర్వచింపఁబడుచున్నది అనఁగా బూర్వవాక్యమున అస్య = ఈ బ్రహ్మముయొక్క, త్రిపాత్ = మూఁడుపాదములు, దివి = ద్యులోకమునందు, అమృతం = నిర్వికారముగనున్నదని "దివి" యను సప్తమ్యంతపదముచే ద్యులోకమధికరణముగాఁ దెలియవచ్చుచున్నది ప్రకృతమునందన్ననో "పరో దివో జ్యోతి" యను పంచమీవిభక్తివలన ద్యులోకము మర్యాదయనన వధిగా వినవచ్చుచున్నది పంచమీ సప్తమీ విభక్తులవలన నదియే యిదియను ప్రత్యభిజ్ఞానము గలుగనేరదు గదా! ఇట్లెన్నివిధములఁ జూచినను నీజ్యోతిశ్శబ్దము బ్రహ్మబోధకముగాక ప్రాకృత తేజమునే బోధించుచున్నదని "తస్మాత్ప్రాకృతం జ్యోతిరిహ గ్రాహ్యమ్మ"ను భాష్యముచేఁ బూర్వపక్షము సంహరింపఁబడుచున్నది ఏవం ప్రాప్తే = ఇట్లు పూర్వపక్షము గలుగ, సమాధానమును, బ్రూమః = చెప్పుచున్నారమని సూత్రార్థము వర్ణింపఁబడుచున్నది జ్యోతిః = జ్యోతిశ్శబ్దము, ఇహ = ఈ ప్రకరణమున, బ్రహ్మ = బ్రహ్మమని, గ్రాహ్యం = గ్రహింపబడవలయును కుతః = ఏలయన, చరణాభిధానాత్ = పాదములు వర్ణింపఁబడుటవలననని యర్థము. పాదాభిధానమన "పూర్వస్మిన్ నిర్దిష్టమ్మ"ని వివరింపఁబడుచున్నది అనఁగాఁ బూర్వవాక్యమున నాలుగుపాదములతోఁగూడిన బ్రహ్మము నిర్దేశింపఁబడి యుండుట వలన నయ్యది యీజ్యోతిశ్శబ్దముచేఁ బరామృష్టమగుచున్నదని యర్థము నాల్గు

నస్యమహిమా । తతో జ్యాయాగ్ంశ్చ పూరుషః । పాదోస్య సర్వా భూతాని త్రిపాదస్యామృతం దివి” (ఛా 3-12-6) ఇత్యనేన మన్త్రేణ । తత్ర యచ్చతుష్పదో బ్రహ్మణస్త్రిపాదమృతం ద్యుసంబన్ధిరూపం నిర్దిష్టం తదేవేహద్యుసంబన్ధాన్నిర్దిష్టమితి ప్రత్యభిజ్ఞాయతే । తత్పరిత్యజ్య ప్రాకృతం జ్యోతిః కల్పయతః ప్రకృతహానాప్రకృతప్రక్రియే ప్రసజ్యేయాతామ్ । న కేవలం జ్యోతిర్వాక్య ఏవ బ్రహ్మానువృత్తిః । పరస్యామపి శాండిల్యవిద్యాయామనువర్తిష్యతే బ్రహ్మ । తస్మాదిహ జ్యోతిరితి బ్రహ్మ ప్రతిపత్తవ్యమ్ । యత్తూక్తమ్ — “జ్యోతి, ర్దీప్యతే”

పాదములతోఁగూడిన బ్రహ్మమును బోధించు వాక్యము ‘తావానస్య మన్త్రేణ’ యను భాష్యముచేఁ నిరూపింపఁబడుచున్నది అస్య = ఈ గాయత్రితోననుగతమగు బ్రహ్మముయొక్క మహిమా = విభూతి, తావాన్ = అంత పరిమాణము గలది పూరుషశ్చ = పురుషుఁడన్ననో, తతః = ఆజగత్తుకంటె, జ్యాయాన్ = గొప్పవాఁడు, అస్య = ఈ పురుషుఁడగు బ్రహ్మముయొక్క పాదః = నాల్గవ భాగము సర్వా సర్వాణి = సమస్తములగు, భూతాని = భూతములు, అస్య = ఈ బ్రహ్మముయొక్క, త్రిపాత్ = మూఁడుపాదములు, దివి = ద్యులోకమున అమృతం = అమృతమని చెప్పఁబడుచున్నదని శ్రుత్యర్థము

ఈ ‘త్రిపాదస్యామృతం దివి’ యను వాక్యముచే నాలుగుపాదములతోఁగూడిన బ్రహ్మముయొక్క ద్యులోకముతో సంబంధించిన రూపమగు నమృతమనెడి మూఁడుపాదములనియెడిదియే ప్రకృతపు జ్యోతిర్వాక్యమునందు “దివః జ్యోతి” యను ద్యులోకసంబంధమువలన వినఁబడు నీజ్యోతిశ్శబ్దవాచ్యముగాఁ దెలియవచ్చుచున్నదని “తత్ర ప్రత్యభిజ్ఞాయతే” యని నిర్వచింపఁబడుచున్నది ఇట్లు ప్రత్యభిజ్ఞాయమానమగు బ్రహ్మము నీజ్యోతిశ్శబ్దముచే గ్రహింపక ప్రాకృతమగుజ్యోతిస్సును గ్రహించినచోఁ బ్రకృతహానాప్రకృతప్రక్రియారూపదోషములు వాటిల్లునని “తత్పరిత్యజ్య . ప్రసజ్యేయాతామ్” ని దోషముద్ఘాటనము చేయఁబడుచున్నది ఇంతియ కాదు పూర్వవాక్యమునవినవచ్చెడి చతుష్పాద్బ్రహ్మ మీజ్యోతిర్వాక్యమునం దనువృత్తి చేయఁబడుటయేగాక యీజ్యోతిర్వాక్యమునకుఁ బరమందున్న శాండిల్యవిద్యయందుఁగూడ ననువృత్తమగుటచే నీమూఁడుప్రకరణములుగూడ బ్రహ్మప్రకరణములేయని హేత్వంతరము “న కేవలం . బ్రహ్మ” యను వాక్యముచే నిర్వచింపఁబడుచున్నది ఇట్లు పూర్వాపరసందర్భమును బ్రదర్శించి జ్యోతిశ్శబ్దము బ్రహ్మపరమేయను ఫలితము “తస్మాత్ . ప్రతిపత్తవ్యమ్” ను భాష్యముచే నిర్వచింపఁబడుచున్నది.

ఇట్లు స్వాభిమతమును బ్రదర్శించి పూర్వపక్షమును నిరసింప జ్యోతిర్దీప్యతే యను శ్రుతిచే నియ్యది కార్యరూపమగు జ్యోతియే కావలయునను పూర్వ

ఇతి చేత్తో శబ్దా కార్యే జ్యోతిషి ప్రసిద్ధావితి ।, నాయం దోషః ప్రకరణాత్ బ్రహ్మావగమే సత్యనయోః శబ్దయోరవిశేషకత్వాత్ । దీప్యమానకార్యజ్యోతిరుపలక్షితే బ్రహ్మణ్యపి ప్రయోగసంభవాత్ । "యేన సూర్యస్తపతి తేజసేద్ధః" (తై బ్రా 3-12-9-7) ఇతి చ మన్త్రవర్ణాత్ ।యద్వా నాయం జ్యోతిశ్శబ్దః చక్షుర్వృత్తేరేవానుగ్రాహకే తేజసి వర్తతే।అన్యత్రాపి ప్రయోగదర్శనాత్ । వాచైవాయం జ్యోతిషాస్తే" (బృ 4-3 5) "మనో జ్యోతిర్జుషతామ్" (తై బ్రా 1-6-3-3) ఇతి చ । తస్మాద్యద్యత్కస్యచిదవభాసకం తత్తజ్జ్యోతిఃశబ్దేనాభిధీయతే । తథా సతి

పక్షబీజమును "యత్తూక్తం ప్రసిద్ధావితి" యని యనువదించి యయ్యది యొక దోషముగాదని చెప్పి దోషాభావమునకుఁగారణము "ప్రకరణాత్ అవిశేషకత్వాత్"ని చెప్పుచున్నారు అనఁగాఁ బ్రకరణమువలన బ్రహ్మము దెలియఁబడుచుండ నీశబ్దములకు బ్రహ్మముకంటె భిన్నమగునర్థమును జెప్పుటకునవకాశము లేదని తాత్పర్యము ఇంతియకాదు ప్రకాశించుచుండెడి కార్యరూపమును బోధించెడి జ్యోతిశ్శబ్దమును బ్రహ్మమున కుపలక్షకముగాఁబ్రయోగించుట ప్రసిద్ధమే యని "దీప్యమాన . ప్రయోగసంభవాత్"ని హేత్వంతరము చెప్పఁబడుచున్నది. ఇందులకు దృష్టాన్తము"యేనమంత్రవర్ణాత్త"ను మంత్రవర్ణము ప్రదర్శింపఁబడుచున్నది "యేన తేజసా = యే జ్యోతీరూపమగు బ్రహ్మముచే, ఇద్ధః = ప్రకాశింపఁజేయఁబడినవాఁడై, సూర్యః = సూర్యుఁడు, తపతి = తపింపఁజేయుచున్నాఁడో" యను శ్రుతియందుఁ దేజశ్శబ్దము బ్రహ్మమున కుపలక్షకముగాఁబ్రయోగింపఁబడియున్నది

ఇంతియకాదు ప్రకారాంతరముచేఁగూడ జ్యోతిశ్శబ్దము బ్రహ్మపరమే యని చెప్పుటకుఁగల కారణముగలదనియుఁ గార్యతేజమునందే యీజ్యోతిశ్శబ్దమునకు రూఢమగుప్రయోగములేదనియు "యద్వావర్తతే" యని నిర్వచింపఁబడుచున్నది అందులకు హేతువు "అన్యత్రాపిప్రయోగదర్శనా త్"ని సంగ్రహముగఁజెప్పఁబడుచున్నది అన్యత్రాపి = చక్షుర్వృత్త్యనుగ్రాహక తేజోభిన్నములగు బ్రహ్మాదులయందుఁగూడ, అందులకు దృష్టాన్తముగ రెండుశ్రుతులు "వాచైవ జుషతామ్మ"ని ప్రదర్శింపఁబడినవి ఈ శ్రుతులయందు వాఙ్మనసములు జ్యోతిశ్శబ్దముచే నిర్వచింపఁబడుచున్నవి ఇట్టి ప్రయోగములననుసరించి జ్యోతిశ్శబ్దముచే గ్రహింపఁదగువలయు విశేషాభిప్రాయము "తస్మాత్ . అభిధీయతే" యని నిర్వచింపఁబడుచున్నది అనఁగా నేవస్తువు నెయ్యది ప్రకాశింపఁజేయునో యయ్యది యాయావస్తువునకుఁ బ్రకాశకమన జ్యోతిస్సని చెప్పఁబడును అనఁగా జ్యోతిశ్శబ్దమున కవభాసకమన ప్రకాశకమ్మని యర్థమని భావము ఇట్టి యర్థమును గ్రహించుటచే సకలజగదవభాసహేతువగు చైతన్యరూపమగు బ్రహ్మమును బోధించుటకుఁగూడ జ్యోతిశ్శబ్దప్రయోగము సమంజసమేయగునని "తథాసతి జ్యోతిశ్శబ్ద"

బ్రహ్మణోఽపి చైతన్యరూపస్య సమస్త జగదవభాస హేతుత్వాదుపపన్నో జ్యోతిః శబ్దః 'తమేవ భాన్తమనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి" (కఠ॥ 2-5-15) 'తద్దేవా జ్యోతిషాం జ్యోతిరాయుర్హోపాసతేఽమృతమ్" (బృ॥ 4-4-16) ఇత్యాది శ్రుతిభ్యశ్చ । యదప్యుక్తం ద్యుమర్యాదత్వం సర్వగతస్య బ్రహ్మణో నోపపద్యత ఇతి। అత్రోచ్యతే— సర్వగతస్యాపి బ్రహ్మణ ఉపాసనార్థః ప్రదేశవిశేష పరిగ్రహో న విరుధ్యతే।నన్వుక్తం నిష్ప్రదేశస్య బ్రహ్మణః ప్రదేశ విశేష కల్పనా నోపపద్యత ఇతి।నాయం దోషః। నిష్ప్రదేశస్యాపి బ్రహ్మణ ఉపాధి విశేషసంబన్ధాత్ప్రదేశవిశేషకల్పనోపపత్తేః। తథాహి— ఆదిత్యే చక్షుషి హృదయ ఇతి ప్రదేశవిశేషసంబన్ధాని బ్రహ్మణ ఉపాసనాని శ్రూయన్తే । ఏతేన "విశ్వతః

---

యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది ఇట్టి యర్థము కాల్పనిక మేగాక శ్రుతిసిద్ధమని "తమేవ.. ఇత్యాదిశ్రుతిభ్యశ్చ" యను భాష్యముచే రెండు శ్రుతులుదాహరింపఁ బడుచున్నవి

తం = ఆ, భాన్తం = ప్రకాశించుచుండెడి బ్రహ్మమునను సరించియే సర్వం = సమస్తమగుజగత్తును, అనుభాత్యేవ = ప్రకాశించుచున్నదే, తస్య = ఆబ్రహ్మముయొక్క, భాసా = ప్రకాశముచే, ఇదం సర్వం = ఈ సమస్తమగు జగత్తును, విభాతి = ప్రకాశించుచున్నది తత్ = ఆబ్రహ్మమును, దేవాః= దేవతలు, జ్యోతిషాం = ప్రకాశకములకు, జ్యోతిః = ప్రకాశకమనియు, ఆయుః = ఆయువనియు, అమృతం=అమృతమనియు, ఉపాసతేహ=ఉపాసించుచున్నారు

ఇఁక సర్వగతమగు బ్రహ్మమునకు ద్యులోకావధి సమంజసముగాదను పూర్వపక్షబీజమును "యదప్యుక్తం . నోపపద్యత ఇతి" యని యనువదించి యందులకు సమాధానమును "అత్రోచ్యతే" యని యుపక్రమించి "సర్వగతస్యాపి . న విరుధ్యతే" యని చెప్పుచున్నారు సర్వగతమగు బ్రహ్మమునకుఁ బ్రదేశ విశేషకల్పన ముపాసనాసౌకర్యముకొఱకు గావున నయ్యది యెంతమాత్రము విరోధావహముగాదని యభిప్రాయము ఇట్లు దోషపరిహారముచేయ మధ్యస్థుఁడు ప్రదేశరహితమగు బ్రహ్మమునకుఁ బ్రదేశమును గల్పించుట యుక్తము కాదు గదా!యని "నన్వుక్తం ఇతి" యని ప్రశ్నింప సిద్ధాన్తి యిదియొక దోషముగాదని సమాధానము చెప్పి దోషాభావమునకు హేతువును "నిష్ప్రదేశస్యాపి . ఉపపత్తే" యని చెప్పుచున్నారు బ్రహ్మము ప్రదేశరహితమైనను నుపాధివిశేషసంబంధముచే బ్రదేశవిశేషకల్పనము సమంజసమే యగునని భావము అందులకు దృష్టాన్తము "తథాహి ... శ్రూయంతే" యని ప్రదర్శింపఁబడుచున్నది అనఁగానాదిత్యుని యందు నేత్రమందు హృదయమందునని ప్రదేశవిశేషసంబంధముగలిగిన బ్రహ్మముతో సంబంధించినయుపాసనములు పెక్కులు శ్రుతులయందు వినవచ్చుచున్నవి

వృష్ఠేషు" ఇత్యాధారబహుత్వముపపాదితమ్ । యదప్యేతదుక్తం, కౌక్షేయఘోషానుమితే కౌక్షేయే కార్యే జ్యోతిష్యధ్యాసస్యోపదేశాత్ప్రకరణమపి చేత్ కార్యజ్యోతిరేవేతి । తదప్యయుక్తమ్ । పరస్యాపి బ్రహ్మణో నామాదిప్రతీకత్వవత్ కౌక్షేయజ్యోతిఃప్రతీకత్వోపపత్తేః । "దృష్టం చ శ్రుతం చేత్యుపాసీత" ఇతి తు ప్రతీకద్వారకం దృష్టత్వం శ్రుతత్వం చ భవిష్యతి । యదప్యల్పఫలశ్రవణాన్న బ్రహ్మేతి తదప్యనుపపన్నమ్। న హీయతే ఫలాయ బ్రహ్మాశ్రయణీయమ్ । ఇయతే నేతి నియమహేతురస్తి । యత్ర హి నిరస్తసర్వవిశేషసంబంధం పరంబ్రహ్మాత్మత్వేనోపదిశ్యతే,

గావునఁ బ్రదేశవిశేషకల్పన మెంతమాత్రము దోషావహము గాదని తాత్పర్యము ప్రదేశవిశేషకల్పనము దోషముగాదని చెప్పుటచే నర్థవశమున నాధారబహుత్వకదనము గూడ దోష మెంతమాత్రముగాదని "ఏతేన ఉపపాదితమ్మ"ని పొందిక చేయఁబడుచున్నది ఇఁక నౌష్ణ్యఘోషముచే ననుమానింపఁబడు జాఠరాగ్నియందు నధ్యాసము చేయఁబడవలయునని యుపదేశింపఁబడుటవలనఁ గార్యరూపమే కావలయునను పూర్వపక్షబీజమును "యదప్యేతదుక్తం కార్యజ్యోతిరేవేతి" యని యనువదించి యయ్యది యుక్తముగాదని "తదప్యయుక్తమ్మ"ని నిరసించుచున్నారు అందులకు హేతువు "పరస్యాపి ఉపపత్తేః" యని చెప్పఁబడుచున్నది పరబ్రహ్మమునకు నామాదులు ప్రతీకములుగాఁ జెప్పఁబడినట్లే కుక్షిసంబంధమగు తేజస్సుగూడ నొకప్రతీకముగాఁ జెప్పఁబడుట యుక్తమే యని భావము ఇట్లు హేతువును జెప్పి యందులకనుగుణముగఁ బ్రకృతమునఁ గౌక్షేయ తేజస్సుగూడనొకప్రతీకముగఁ బరఁగునని ప్రకృతప్రకరణమున విధింపఁబడిన యుపాసనావిశేషమును "దృష్టంచ . భవిష్యతి" యని ప్రదర్శించుచున్నారు "దృష్టం చ శ్రుతం చేత్యుపాసీత" యనునది యుపాసనావిధి అందులకుఁబ్రతీకము కౌక్షేయ తేజమన జాఠరాగ్నియని భావము.

ఇఁక నల్పఫలశ్రవణమువలన బ్రహ్మముకాదను పూర్వపక్షబీజమును "యదపి బ్రహ్మేతి" యని యనువదించి "తదప్యనుపపన్నమ్మ"ని నిరసించుచున్నారు అందులకు హేతువు "నహి . అస్తి" యను భాష్యముచే నిర్వచింపఁబడుచున్నది ఇయతే = ఇంత, ఫలాయ = ఫలముకొఱకు, బ్రహ్మమువాశ్రయింపవలయుననియు, ఇయతే = ఇంతఫలముకొఱకు, న = ఆశ్రయింపగూడదనియు, నియమమునకుఁ గారణమెచ్చటను గానరాదు గావున ఫలశ్రుతివలన నిర్ణయమునకుఁ గడంగుట యుక్తముగాదని తాత్పర్యము బ్రహ్మవిషయమే యగుటంజేసి ఫలమేకరూపమునఁ దెలియఁబడక విలక్షణముగఁ దెలియఁబడుట యనుచితమే యన ఫలనిర్ణాయకన్యాయము "యత్రహి . శ్రుతిషు" యను భాష్యముచే వ్యవస్థ చేయఁబడుచున్నది. అనఁగా నేప్రకరణములందు సర్వవిశేషసంబంధములును నిర

తత్తైకరూపమేవ ఫలం మోక్ష ఇత్యవగమ్యతే । యత్ర తు గుణవిశేషసంబన్ధం ప్రతీక విశేషసంబన్ధం వా బ్రహ్మోపదిశ్యతే, తత్ర సంసారగోచరాణ్యేవోచ్చావచాని ఫలాని దృశ్యన్తే । "అన్నాదో వసుదానో విన్దతే వసు య ఏవం వేద" (బృ 4-4-24) ఇత్యాద్యాసు శ్రుతిషు । యద్యపి న స్వవాక్యే కించిజ్జ్యోతిషో బ్రహ్మలిఙ్గమస్తి । తథాపి పూర్వస్మిన్వాక్యే దృశ్యమానం గ్రహీతవ్యం భవతి । తదుక్తం సూత్రకారేణ — "జ్యోతిశ్చరణాభిధానాత్" ఇతి । కథం పునర్వాక్యాన్తరగతేన బ్రహ్మసంనిధానేన జ్యోతిఃశ్రుతిః స్వవిషయాచ్ఛక్యా ప్రచ్యావయితుమ్। నైష దోషః । "యదతః పరో దివో జ్యోతిః" ఇతి ప్రథమతరపఠితేన యచ్ఛబ్దేన

---

సింపఁబడినట్టి పరబ్రహ్మము స్వస్వరూపముగనాత్మగా నుపదేశింపఁబడునో యచట మోక్షమును ఫలము నొకే రూపముననుపదేశింపఁబడుచున్నది కావుననందు వైషమ్యము దెలియరాదు కాని యే ప్రకరణములందు గుణవిశేసంబంధముతోఁగాని ప్రతీకవిశేషసంబంధముతోఁగాని బ్రహ్మ ముపాస్యముగ నుపదేశింపఁబడుచున్నదో యాయాయి ప్రకరణములందు సంసారసంబంధమగు న్యూనాధిక భేదములతోఁ నలరారు ఫలములు వినవచ్చుచున్నవి న్యూనాధికఫలములను బోధించు శ్రుతి దృష్టాన్తముగా "అన్నాదో ఏవం వేద" యని ప్రదర్శింపఁబడుచున్నది యః=ఎవ్వఁడు, ఏవం = ఈరీతిగా, వేద = ఉపాసించుచున్నాఁడో, సః = వాఁడు, అన్నాదః = అన్నమునుదినువాఁడును, వసుదానః = ధనమునిచ్చుచున్నవాఁడునై, వసు = ధనమును, విందతే = పొందును

ఇఁక జ్యోతిర్వాక్యమునందు బ్రహ్మలింగము లేదను పూర్వపక్షబీజమును "యద్యపి అస్తి" యని యనువదించి స్వవాక్యమునందు లేకపోయినను బూర్వవాక్యమునందు జూడఁబడెడి బ్రహ్మలింగము గ్రహింపఁబడవలయునని "తథాహి . భవతి" యని సమాధానము చెప్పుచున్నారు అట్లు గ్రహించుటకుఁ బ్రమాణము సూత్రకారానుశాసనమే యని "తదుక్తం జ్యోతిశ్చరణాభిధానాదితి" యని చెప్పఁబడుచున్నది సూత్రకారునిచే సూత్రమునందు 'చరణాభిధానాత్'ను హేతువు స్మరింపఁబడుట చేతనే పూర్వాపరవాక్యములరెండిటికి సంబంధము గ్రహింపఁబడవలయునని నిర్ణయము ని సూత్రకారానుశాసనముచేఁ బూర్వాపరసందర్భమును గ్రహింపవలయునని నిర్వచింప మధ్యస్థుఁడొకింత యభినివేశముతో వాక్యాంతర గతమగు బ్రహ్మముయొక్క సన్నిధానముచే జ్యోతిశ్శ్రుతికి స్వార్థమును విడచి యన్యార్థమును గ్రహించుట యెట్లుసమంజసమన "కథం...ప్రచ్యావయితుమ్మ"ని ప్రశ్నింపవలదియొక దోషము గాదని సమాధానము చెప్పఁబడుచున్నది. దోషాభావమునకు హేతువు "యదతః...ఉపపత్తే" యని నిర్వచింపఁబడుచున్నది. "యదత" యనుచో ముందుగాఁ బఠింపఁబడిన

సర్వనామ్నా ద్యుసంబన్ధాత్ప్రత్యభిజ్ఞాయమానే పూర్వవాక్యనిర్దిష్టే బ్రహ్మణి స్వసామర్థ్యేన పరామృష్టే సత్యర్థాజ్జ్యోతిశ్శబ్దస్యాపి బ్రహ్మవిషయత్వోపపత్తేః। తస్మా దిహ జ్యోతిరితి బ్రహ్మ ప్రతిపత్తవ్యమ్॥ ॥౨౪॥

# ఛందోభిధానాన్నేతి చేత్ న తథా చేతోర్పణ నిగదాత్తథాహి దర్శనమ్

అథ యదుక్తం పూర్వస్మిన్నపివాక్యే న బ్రహ్మాభిహితమస్తి, "గాయత్రీ వా ఇదం సర్వం భూతం యదిదం కించ" (ఛా॥ 3-12-1) ఇతి గాయత్ర్యాఖ్యస్య ఛన్దసోఽభిహితత్వాదితి, తత్పరిహర్తవ్యమ్ । కథం పునశ్ఛన్దోభిధానాన్న బ్రహ్మాభిహితమితి శక్యతే వక్తుం, యావతా "తావానస్య మహిమా" ఇత్యే

---

సర్వనామమగు యచ్ఛబ్దముచేఁ బూర్వవాక్యమున నిర్దిష్టమగు బ్రహ్మము ద్యుసంబంధమువలననఁగా "దివః దివి" యను శబ్దములయొక్క సంబంధమువలనఁ దెలియఁబడుచు నర్థాపత్తిచే నీజ్యోతిశ్శబ్దముచేఁగూడ బ్రహ్మము దెలియవచ్చుచున్నది యచ్ఛబ్దేన='యత్'ను పదముచే ద్యుసంబంధమన 'దివః దివి" యను పదములయొక్కసంబన్ధము పూర్వవాక్యమన"తావానస్యమహిమా"యను వాక్యము స్వసామర్థ్యమున సర్వనామముయొక్కసామర్థ్యము అర్థాత్ = అర్థాపత్తివలన. ఇట్లు ప్రమాణములను బ్రదర్శించి పలితము "తస్మాత్ ప్రతిపత్తవ్యమ్మ"ని యుప సంహరింపఁబడుచున్నది ॥౨౪॥

పూర్వవాక్యమునందు 'గాయత్రీవా ఇదం సర్వమ్మ' ని గాయత్రి యనుపేరుగల ఛందస్సు చెప్పఁబడుటవలన బ్రహ్మము చెప్పఁబడలేదను పూర్వపక్ష వాదమును నిరసింప సూత్రకారులీసూత్రమును స్మరించుచున్నారని సూత్రమునకుఁ బ్రతీకము "అథ యదుక్తం తత్పరిహర్తవ్యమ్మ" ని నిర్వచింపఁబడుచున్నది. సూత్రమేమన—

# "ఛందోభిధానాన్నేతి చేన్న తథా చేతోఽర్పణ నిగదాత్తథాహి దర్శనమ్"

యని సూత్రమందలి "ఛందోభిధానాత్, న" యనునది పూర్వపక్ష బీజము అనఁగా ఛందస్సు చెప్పఁబడుటవలనఁ బూర్వవాక్యమున బ్రహ్మము చెప్పఁబడుట లేదని యభిప్రాయము ఇట్లు పూర్వపక్షి పలికినంతనే మధ్యస్థుఁడు "తావానస్య మహిమా" యను ఋక్కునందుఁ జతుష్పాద్బ్రహ్మము చెప్పఁబడుచుండ ఛందస్సు చెప్పఁబడినంతమాత్రమున బ్రహ్మము చెప్పఁబడలేదని చెప్పుట

తస్యామృచి చతుష్పాద్బ్రహ్మ దర్శితమ్ । నైతదస్తి । “గాయత్రీ వా ఇదం సర్వమ్” ఇతి గాయత్రీముపక్రమ్య తామేవ భూతపృథివీశరీరహృదయవాక్ప్రాణప్రభేదైర్వ్యాఖ్యాయ “సైషా చతుష్పదా షడ్విధా గాయత్రీ” తదేతదృచాఽభ్యనూక్తం “తావానస్య మహిమా” ఇతి తస్యామేవ వ్యాఖ్యాతరూపాయాం గాయత్ర్యాముదాహృతో మన్త్రః కథమకస్మాద్బ్రహ్మ చతుష్పాదభిదధ్యాత్ । యోఽపి తత్ర “యద్వై తద్బ్రహ్మ” (ఛా॥ 3-12-5, 6) ఇతి బ్రహ్మశబ్దః సోఽపి ఛన్దసః ప్రకృతత్వాచ్ఛన్దోవిషయఏవ । “య ఏతామేవం బ్రహ్మోపనిషదం వేద” (ఛా॥ 3-11-3) ఇత్యత్ర హి వేదోపనిషదమితి వ్యాచక్షతే, తస్మాచ్ఛన్దోభిధానాన్న బ్రహ్మణః ప్రకృతత్వమితి చేత్, నైష దోషః, “తథా చేతోర్పణనిగదాత్”

---

యెట్లని ప్రశ్నింపఁ బూర్వపక్షి, “నైతదస్తి = ఈ బ్రహ్మము చెప్పఁబడ లేదని” సంగ్రహముగ నిషేధించుచున్నాఁడు హేతుసంగ్రహవాక్యము “గాయత్రీ వా ప్రకృతత్వమ్మ”ను భాష్యముచే వివరింపఁబడుచున్నది ఎట్లన—పూర్వ వాక్యమున “గాయత్రీ వా ఇదంసర్వమ్మ”ని గాయత్రినుపక్రమించి యాగాయత్రినే భూతములు పృథివి శరీరము హృదయము వాక్కు ప్రాణమునను నాలుభేదములతోఁ గూడినదానిగా వర్ణించి పిమ్మట నాగాయత్రి నాల్గుపాదములతోడను నాలుభేదములతోడను గూడియున్నదని “సైషా గాయత్రీ”యని నిర్వచించి పిమ్మట “తదేతదృచాభ్యనూక్తం, తత్ = ఆ యీ గాయత్రియందు, ఋచా = ఋక్కుచే, అభ్యనూక్తం = చెప్పఁబడినది” యని “తావానస్య మహిమా” యను ఋక్కు చెప్పఁబడినది కావున వ్యాఖ్యానముచేయఁబడిన యాగాయత్రియందుదాహరింపఁబడిన మంత్ర మాకస్మికముగ నాల్గుపాదములతోఁగూడిన బ్రహ్మము నెట్లు బోధించును ? అనఁగా బ్రహ్మము నెంతమాత్రమును బోధింపనేరదని యాశయము ఇంతియ కాదు, అందుఁ దెలియవచ్చెడి “యద్వై తద్బ్రహ్మ” యను వాక్యమునందలి బ్రహ్మశబ్దముగూడఁ బ్రకృతఛందోవిషయమే యగుటచే గాయత్రీవిషయమే యగుచున్నది. ఇంతియు కాదు “య ఏతామేవం బ్రహ్మోపనిషదం వేద” యను వాక్యమున బ్రహ్మ శబ్దమునకు వేదమనునర్థమును గ్రహించి “వేదోపనిషదమ్మ”న వేదరహస్యమని వ్యాఖ్యానము గావింపనొప్పును కావున ఛందోఽభిధానాత్ = ఛందస్సు చెప్పఁబడుటవలన. బ్రహ్మణః = బ్రహ్మమునకు, ప్రకృతత్వం = ప్రకరణసందర్భము, న = లేదని సూత్రమునందలి పూర్వపక్షివాక్యమునకుఁ దాత్పర్యము అంత, ఇతిచేత్ = ఇట్లనిచో, ‘న’ యను సూత్రకారులయొక్క ప్రతిషేధమునకు ‘నైష దోష’ యని యర్థము చెప్పఁబడుచున్నది అందులకు హేతువు “తథాచేతోఽర్పణనిగదాత్త”ని నిర్వచింపఁబడుచున్నది హేతువాక్యము “తథా . ఇతి”

తథా గాయత్ర్యాఖ్యఛన్దోద్వారేణ తదనుగతే బ్రహ్మణి చేతసోఽర్పణం చిత్తసమాధానమనేన బ్రాహ్మణవాక్యేన నిగద్యతే — "గాయత్రీ వా ఇదం సర్వం" ఇతి। న హ్యక్షరసంనివేశమాత్రాయా గాయత్ర్యాః సర్వాత్మకత్వం సంభవతి। తస్మాద్యద్గాయత్ర్యాఖ్యవికారేనుగతం జగత్కారణం బ్రహ్మ తదిహ సర్వమిత్యుచ్యతే। యథా "సర్వం ఖల్విదం బ్రహ్మ" (ఛాం 3-14-1) ఇతి। కార్యం చ కారణాదవ్యతిరిక్తమితి వక్ష్యామః — "తదనన్యత్వమారమ్భణశబ్దాదిభ్యః" (బ్ర 2-1-14) ఇత్యత్ర। తదాన్యత్రాపి వికారద్వారేణ బ్రహ్మణ ఉపాసనం

---

యని వ్యాఖ్యానము చేయఁబడుచున్నది తథా = అట్లుగాయత్రియనుపేరు గల ఛందోమూలమున, తదనుగతే=ఆ గాయత్రియందనుగతమగునన ననుసరించియున్న బ్రహ్మణి/బ్రహ్మమునందు, చేతసః అర్పణం = చిత్తముయొక్క సమాధానము? అనేన బ్రాహ్మణవాక్యేన = 'గాయత్రీ వా ఇదం సర్వమ్మ' ను బ్రహ్మణ వాక్యముచే, నిగద్యతే=చెప్పబడుచున్నది అనఁగా గాయత్రియందనుస్యూతమగు బ్రహ్మమును గాయత్రిచే నుపాసింపవలయునని యొకబ్రహ్మోపాసనము విధింపఁబడుటచే నీప్రకరణమున గాయత్రివినఁబడుచున్నది దానంజేసి యీప్రకరణమున బ్రహ్మము నిర్దేశింపఁబడలేదనుట సాహసమాత్రము ఇంతియ కాదు ఈ శ్రుతియందు ఇదం సర్వం= ఈ పరిదృశ్యమానమగు జగమంతయు, గాయత్రీ వై = గాయత్రి యే, అని-గాయత్రికి సర్వాత్మకత్వము వినవచ్చుచున్నది అక్షరసన్నివేశరూపమగు గాయత్రికి సర్వాత్మకత్వము సంభవింపనేరదు గదా! కావునఁ కేవలము ఛందస్సు పదేశింపఁబడినదని చెప్పుట యుక్తముగాదని "నహ్యక్షర . సంభవతి" యని చెప్పఁబడుచున్నది కావున నీశ్రుతికి గాయత్రియను పేరుగల వికారమునందు జగత్కారణమగు బ్రహ్మమనుస్యూతమైయున్నదనియు నట్టి బ్రహ్మమే యిచట సర్వమని చెప్పఁబడుచున్నదనియు గ్రహింపవలయునని "తస్మాత్ ఇత్యుచ్యతే" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది వికారమునందు బ్రహ్మమనుస్యూతమగుటచే వికారమును బ్రహ్మమనుటకు శ్రుత్యంతరము గూడ "యథా సర్వం ఖల్విదం బ్రహ్మ ఇతి" యని దృష్టాన్తముగఁ బ్రదర్శింపఁబడుచున్నది. కార్యమును గారణముయొక్క పేరు వ్యవహరించుటకుఁగల కారణము కార్యము కారణముకంటె భిన్నము కాకపోవుటచేతనే యనిగూడ హేత్వంతరము "కార్యం చ కారణాదవ్యతిరిక్తమ్మ"ని చెప్పఁబడుచున్నది కార్యకారణముల కభేదము కాల్పనికముగాక సప్రమాణమును సయుక్తికమునని నిర్వచింపనున్నారమని "వక్ష్యామః ఇత్యత్ర" యని చెప్పఁబడుచున్నది

వికారద్వారముగ బ్రహ్మోపాసనమును విధించుట యీప్రకరణమునందే గాక శ్రుతియందు సర్వసామాన్యముగఁ దెలియవచ్చుచున్నదని "తథాఽన్యత్రాపి

దృశ్యతే — "ఏతం హ్యేవ బహ్వృచా మహత్యుక్థే మీమాంసన్త ఏతమగ్నావధ్వర్యవ ఏతం మహావ్రతే ఛన్దోగాః" (ఐ అ 3-2 3-12) ఇతి । తస్మాదస్తి ఛన్దోఽభిధానేఽపి పూర్వస్మిన్వాక్యే చతుష్పాద్బ్రహ్మ నిర్దిష్టమ్ । తదేవ జ్యోతిర్వాక్యేఽపి పరామృశ్యత ఉపాసనాన్తరవిధానాయ । అపర ఆహ — సాక్షాదేవ గాయత్రీశబ్దేన బ్రహ్మ ప్రతిపాద్యతే । సంఖ్యాసామాన్యాత్ । యథా గాయత్రీ చతుష్పదా షడక్షరైః పాదైస్తథా బ్రహ్మ చతుష్పాత్ । తథాన్యత్రాపి

---

... దృశ్యతే" యని చెప్పఁబడుచున్నది అందులకు దృష్టాన్తము "ఏతం ఇతి" యని శ్రుతిప్రదర్శింపఁబడుచున్నది బహ్వృచాః = ఋగ్వేదులు, ఏతం హ్యేవ= ఈ బ్రహ్మమునే, మహతి = గొప్పదగు, ఉక్థే = ఉక్థమందు, మీమాంసన్తే = ఉపాసించుచున్నారు అధ్వర్యవః = యజుర్వేదులు, ఏతం = ఈ బ్రహ్మమునే, అగ్నౌ = అగ్నియందును, ఛందోగాః = సామవేదులు, ఏతం = ఈ బ్రహ్మమునే మహావ్రతే = మహావ్రతమునందును, మీమాంసన్తే = ఉపాసించుచున్నారు

ఇట్లు వికారద్వారముగ బ్రహ్మమునుపాసించుట సమంజసమే కావునఁ బూర్వవాక్యమున గాయత్రీరూపమగు ఛందస్సు చెప్పఁబడినను నాలుగుపాదములతోఁగూడిన బ్రహ్మము చెప్పఁబడియే యున్నదనియు, నాబ్రహ్మమే యుపాసనాంతరవిధానముకొఱకు జ్యోతిర్వాక్యమునందుఁగూడఁ బరామర్శింపఁబడుచున్నదనియు ఫలితము "తస్మాదస్తి ఉపాసనాంతర విధానాయ" యని చెప్పఁబడుచున్నది

జ్యోతిర్వాక్యమునకుఁ బూర్వమునసుండెడి వాక్యమునందు గాయత్రీద్వారమున బ్రహ్మముపదేశింపఁబడుటంజేసి బ్రహ్మము దెలియవచ్చుచున్నదని స్వాభిమతమును బ్రదర్శించి యీవాక్యమునఁ బ్రత్యక్షముగనే బ్రహ్మము బోధింపఁబడుచున్నదని కొందరు దలంచిన విషయమునుగూడ స్వమత ద్రఢిమకొఱకు "అపర ఆహ" యని యుపక్రమించుచున్నారు అదెద్దియన "సాక్షాదేవ . . ప్రతిపాద్యతే" యని చెప్పఁబడుచున్నది అనఁగా గాయత్రిశబ్దముచేఁ బ్రత్యక్షముగనే బ్రహ్మము బోధింపఁబడుచున్నదని ప్రతిజ్ఞ అందులకు హేతువు "సంఖ్యాసామాన్యాత్త"ని సంగ్రహముగఁ బ్రదర్శింపఁబడుచున్నది సంఖ్యయొక్క సమానభావముండుటవలననని యర్థము హేతుసంగ్రహవాక్యము "యథా .. చతుష్పాత్త"ని వివరింపఁబడుచున్నది అనఁగా గాయత్రి యాఱేసి యక్షరములతోఁగూడిన నాల్గుపాదములతో నెట్లలరారుచున్నదో యాతీరుననే బ్రహ్మముగూడ నాల్గుపాదములతో నలరారుటంజేసి పాదసంఖ్య గాయత్రీ బ్రహ్మములరెండిటికిని సమానమే యగుటవలన , గాయత్రీశబ్దము బ్రహ్మపరమే యని యభిప్రాయము ఇట్లు సంఖ్యాసామ్యముచే నర్థసామ్యమును గ్రహిం

ఛన్దోభిధాయీ శబ్దోఽర్థాన్తరే సంఖ్యాసామాన్యాత్ప్రయుజ్యమానో దృశ్యతే। తద్యథా — తే వా ఏతే పఞ్చాన్యే పఞ్చాన్యే దశ సన్తస్తత్కృతమ్" ఇత్యుపక్రమ్యాహ "సైషా విరాడన్నాదీ" (ఛా 4-3-8) ఇతి। అస్మిన్పక్షే బ్రహ్మైవాభిహితమితి న ఛన్దోభిధానమ్। సర్వథాప్యస్తి పూర్వస్మిన్వాక్యే ప్రకృతం బ్రహ్మ ॥ ౨౬॥

## భూతాదిపాదవ్యపదేశోపపత్తేశ్చైవమ్

ఇతశ్చైవమభ్యుపగన్తవ్యమస్తి పూర్వస్మిన్వాక్యే ప్రకృతం బ్రహ్మేతి।

---

చుట వేదమునందుఁ దెలియవచ్చుట యొకవింతగాదని "తథాఽన్యత్రాపి... దృశ్యతే" యని చెప్పఁబడుచున్నది అనఁగా ఛంధస్సును బోధించు శబ్దములు సంఖ్యాసామ్యముచేనర్థాంతరములందు వాడఁబడుట శ్రుతియందు సర్వవిధములఁ జూడఁబడుచునేయున్నదని భావము అందులకు దృష్టాన్తము "తద్యథా.. ఽన్నాదీ ఇతి" యని ప్రదర్శింపఁబడుచున్నది తే = ఆ, ఏతే = ఈ, అన్యే = ఒకభాగమగు, పంచ = ఐదును, అన్యే = వేఱొకభాగమగు, పంచ = ఐదును గలిసి, దశ = పది, సంతః = అగుటంజేసి, తత్ = ఆపదియను సమూహము, కృతం వై = కృతమను సంజ్ఞచేఁ బరగుచున్నదని ఛాందోగ్యమునందలి సంవర్గవిద్యయందుపక్రమించుటఁజేసి, సా = ఆ కృతమనునది ఏషా = ఈ, విరాట్ = విరాట్ఛందస్సని యనిపించుకొనుచున్నది అనఁగా జూదమునందుఁ గృతమను పందెమునకుఁ బదియనియర్థము పదియక్షరములతోఁ గూడినఛందమునకు విరాట్టని పేరు కృతమునకును విరాట్టునకును బదియనుసంఖ్య సమానమగుటంజేసి కృతమే విరాట్టని భావము. ఇట్లర్థముఁజెప్పినచో గాయత్రివాక్యమున బ్రహ్మమే చెప్పఁబడుచున్నది గాని ఛందస్సు చెప్పఁబడలేదనునర్థముగల్గుచున్నది ఇట్లర్థసమన్వయమును జేయుటయుక్తమాయన నెట్లయ్యును బూర్వవాక్యమునందు సర్వవిధముల బ్రహ్మమున్నదనియే గ్రహింపఁబడుచున్నదని సమాధానము "సర్వథాపి ... బ్రహ్మ" యని యుపసంహారము చేయఁబడుచున్నది. సర్వథాపి = స్వాభిప్రాయముచేతను బరాభిప్రాయముచేతనుగూడ నెట్లాలోచించినను బూర్వవాక్యమున బ్రహ్మము బోధింపఁబడియే యున్నదని తాత్పర్యము ॥ ౨౬ ॥

పూర్వవాక్యమగు గాయత్రీవాక్యమునందు బ్రహ్మమే నిర్దేశింపఁబడుచున్నదనుటకు హేత్వంతరముగా నీసూత్రమును సూత్రకారులు రచియించి యున్నారు సూత్రమేమన—

## భూతాదిపాదవ్యపదేశోపపత్తేశ్చైవమ్

యని సూత్రమునందలి "ఏవమ్మ"ను పదమునకు వ్యాఖ్యానము "ఇతశ్చ బ్రహ్మేతి" యని చేయఁబడుచున్నది ఏవం = ఈప్రకారము, అనఁగాఁ బూర్వ

యతో భూతాదీన్పాదాన్వ్యపదిశతి । భూతపృథివీశరీరహృదయాని హి నిర్ది శ్యైహ — "సైషా చతుష్పదా షడ్విధా గాయత్రీ" ఇతి । నహి బ్రహ్మానాశ్ర యణే కేవలస్య ఛందసో భూతాదయః పాదా ఉపపద్యన్తే । అపిచ బ్రహ్మానాశ్ర యణే నేయమృక్సంబధ్యేత — "తావానస్య" ఇతి । అనయా హి ఋచా స్వ రసేన బ్రహ్మైవాభిధీయతే । "పాదోఽస్య సర్వా భూతాని త్రిపాదస్యామృతం దివి" (ఛా 3-12-5) ఇతి, సర్వాత్మత్వోపపత్తేః । పురుషసూక్తేఽపీయమృగ్బ్రహ్మ

వాక్యమునఁ బ్రకృతము బ్రహ్మమని, ఇతశ్చ = ఈ చెప్పఁబడిన హేతువుచే, అభ్యుపగన్తవ్యమ్ = అంగీకరింపఁదగినది "ఏవమ్మ"ను పదము "పూర్వస్మిన్ .. బ్రహ్మేతి" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది 'ఇతశ్చ' యను పదముచే జెప్పఁబడిన సూత్రమునందలి హేతుపదము "యతః.. వ్యపదిశతి" యను భాష్య ముచే వివరింపఁబడుచున్నది. అనఁగా నేకారణముచే భూతాదులు గాయత్రికిఁ బాద ముగనుపదేశింపఁబడుచున్నవో యా హేతువుచే బ్రహ్మ నిర్దేశింపఁబడుచున్నదని యభిప్రాయము. హేతువుచే సూచింపఁబడిన యర్థము ప్రకరణసందర్భముతో "భూత . గాయత్రీ ఇతి" యని నిరూపింపఁబడుచున్నది అనఁగా భూతముల పృథివి శరీరము హృదయము నను నాలుగింటిని నిర్వచించి "సా ఏషా= ఆ యీ గాయత్రీ = గాయత్రి, చతుష్పదా = నాలుగు పాదములు గలిగినదనియు షడ్విధా = ఆఱు విధములనియుఁ జెప్పఁబడుటచే గాయత్రికి భూతములు పృథివి శరీరము, హృదయమునను నాల్గు పాదములున్నట్లు దెలియవచ్చుచున్నదని తాత్ప ర్యము ఇచట భూతాదిపాదములఁ జేర్చుకొనుటచే బ్రహ్మమే యభిప్రేతమగునట్ల గ్రహింపవలయుగాని కేవలఛందస్సునే గ్రహించుట సమంజసముగాదని వ్యతిరేక ముఖమున "నహి ఉపపద్యన్తే" యని నిర్వచింపఁబడుచున్నది ఇంతియ కాదు బ్రహ్మమును గ్రహింపకపోయినచో "తావానస్య మహిమా" యను ఋక్కుగూడ ప్రకరణసందర్భము లేనిదేయగునని "అపిచ ... ఇతి" యని హేత్వంతరము నిర్వ చింపఁబడుచున్నది ఇట్లు వ్యతిరేకముఖమున నీఋక్కుయొక్క యతిశయమును బ్రదర్శించి యీఋక్కు స్వార్థముచే బ్రహ్మమునే బోధించుచున్నదని "అనయా ఇతి" యని చెప్పి బ్రహ్మమునే బోధించుచున్నదనుటకు హేతువు "సర్వాత్మ త్వోపపత్తే" యని నిర్వచించుచున్నారు. ఈ ఋక్కుచేఁ బురుషునకు సర్వాత్మ త్వము వినవచ్చుచున్నది సర్వాత్మత్వము సర్వకారణమగు బ్రహ్మమునకేగాని వేఱొకదానికి సిద్ధింపదు కావుననిందలి పురుషశబ్దము సర్వకారణమగు బ్రహ్మ పరమేయని నిరూపించి శ్రుత్యంతరమందుఁ గూడ నీఋక్కు బ్రహ్మపరముగానే వర్ణింపఁబడియున్నట్లు "పురుషసూక్తేఽపి . సమామ్నాయతే" యని నిర్వచింప బడుచున్నది శ్రుత్యంతరమనఁ బురుషసూక్తము. బ్రహ్మమునకు సర్వాత్మత్వమున

రణ్యైవ సమామ్నాయతే। స్మృతిశ్చ బ్రహ్మణ ఏవంరూపతాం దర్శయతి విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్" (భగ. 10-42) ఇతి। యద్వై తద్బ్రహ్మ" (ఛా 3-12-7) ఇతి చ నిర్దేశ ఏవం సతి ముఖ్యార్థ ఉపపద్యతే। "పఞ్చ బ్రహ్మపురుషాః" (ఛా. 3-13-6) ఇతి చ హృదయసుషిషు బహ్మపురుషశ్రుతిర్బ్రహ్మసంబన్ధితాయాం వివక్షితాయాం సంభవతి। తస్మాదస్తి పూర్వస్మిన్వాక్యే బ్రహ్మ ప్రకృతమ్। తదేవ బ్రహ్మ జ్యోతిర్వాక్యే ద్యుసంబన్ధాత్ప్రత్యభిజ్ఞాయమానం పరామృశ్యత ఇతి స్థితమ్॥ ॥౨౬॥

## ఉపదేశభేదాన్నేతిచేత్ నోభయస్మిన్నప్యవిరోధాత్

యదప్యేతదుక్తం పూర్వత్ర—"త్రిపాదస్యామృతం దివి" ఇతి సప్తమ్యా

---

ధించుటయందు శ్రుతియేగాక, స్మృతిగూడఁ దెలియఁబడుచున్నదని "స్మృతిశ్చ ఇతి" యని చెప్పఁబడుచున్నది

అహం = నేను, ఇదం = ఈ పరిదృశ్యమానమగు, కృత్స్నం=పుష్కలముగు, జగత్ = ప్రపంచమును, ఏకాంశేన = ఒకకళచే, విష్టభ్య = విశేషముగా నరిగట్టి, స్థితః = ఉన్నవాఁడను

ఇట్లు గాయత్రికి సర్వాత్మత్వము వినఁబడుటచే గాయత్రియే బ్రహ్మమని యీప్రకరణమునఁ దెలియవచ్చు 'యద్వై తద్బ్రహ్మ' యను శ్రుతి గూడ ముఖ్యముగా బ్రహ్మపరమేయని "యద్వై ఉపపద్యతే" యని ప్రదర్శించి హృదయముతో సంబంధించిన రంధ్రములయందుపాసనార్థమై వివక్షింపఁబడిన బ్రహ్మపురుషశ్రుతిగూడ నీప్రకరణము బ్రహ్మప్రకరణమేయని చెప్పుటయందుఁ బ్రయోజనమును గనుచున్నదని "పంచబ్రహ్మపురుషాః సంభవతి" యను హేత్వంతరము నిర్వచింపఁబడుచున్నది

ఇట్లు సయుక్తికముగఁ బూర్వప్రకరణము బ్రహ్మప్రకరణమేయని నిరూపించి ఫలితమును "తస్మాదస్తి ... బ్రహ్మప్రకృతమ్మ"ని యుపసంహారము చేయుచున్నారు

ఇట్లు పూర్వవాక్యమునందు బ్రహ్మము నిర్దేశింపఁబడినదని చెప్పి యీ బ్రహ్మమే ప్రకృతమున జ్యోతిర్వాక్యమునందు ద్యుసంబంధముచేఁ దెలియవచ్చుచున్నదని "తదేవ బ్రహ్మ ఇతి స్థితమ్మ"ని స్వాభిమతము నిరూపించుచున్నారు ॥ ౨౬ ॥

## ఉపదేశభేదాన్నేతిచేన్నోభయస్మిన్నప్యవిరోధాత్

పూర్వపక్షమునందుఁ గాయత్రీప్రకరణమున "త్రిపాదస్యామృతం దివి"

ద్యౌరాధారత్వేనోపదిష్టా, ఇతి, పునః "అథ యదతః పరో దివః" ఇతి పఞ్చమ్యా మర్యాదాత్వేన, తస్మాదుపదేశభేదాన్న తస్యేహ ప్రత్యభిజ్ఞానమస్తీతి। తత్ పరిహర్తవ్యమ్। అత్రోచ్యతే — నాయం దోషః, ఉభయస్మిన్నప్యవిరోధాత్। ఉభయస్మిన్నపి సప్తమ్యన్తే పఞ్చమ్యన్తే చోపదేశే న ప్రత్యభిజ్ఞానం విరుధ్యతే। యథాలోకే వృక్షాగ్రసంబద్ధోఽపి శ్యేన ఉభయథోపదిశ్యమానో దృశ్యతే, వృక్షాగ్రే శ్యేనో వృక్షాగ్రాత్పరతః శ్యేన ఇతి చ। ఏవం దివ్యేవ సద్బ్రహ్మ దివః పరమిత్యుపదిశ్యతే। అపర ఆహ — యథా లోకే వృక్షాగ్రేణాసంబద్ధోఽపి ఉభయథోపదిశ్యమానో దృశ్యతే వృక్షాగ్రే శ్యేనో, వృక్షాగ్రాత్పరత శ్యేన

---

యనుచోట 'దివి' యను సప్తమిచే ద్యులోకమాధారముగా నుపదేశింపఁబడియున్నదనియు, జ్యోతిర్వాక్యమునందు "పరో దివ" యని ద్యులోకము మర్యాదగా నుపదేశింపఁబడియున్నదనియు నట్టియుపదేశభేదముచేఁ బూర్వోత్తరము లొక్కటి యను ప్రత్యభిజ్ఞానమెంతమాత్రము గలుగదనియుఁ బ్రతిపాదింపఁబడిన యాక్షేపమును బరిహరించుటకుఁగా నీసూత్రము వర్తించుచున్నట్లు "యదపి ... పరిహర్తవ్యమ్"ను భాష్యము సూత్రమునకుఁ బ్రతీకముగానవతారించుచున్నది పూర్వపక్షబీజము "ఉపదేశభేదాత్ న, ఇతిచేత్త్"ని సూత్రముచేననువదింపఁబడి యందు సమాధానము చెప్పఁబడుచున్నదని "నాయం దోష" యని సూత్రస్థనకారపదమునకర్థము చెప్పఁబడుచున్నది దోషాభావమునకు హేతువు "ఉభయస్మిన్నప్యవిరోధాత్త్"ను సూత్రవాక్యముచేఁ జెప్పఁబడుచున్నది హేతువాక్యము "ఉభయస్మిన్నపి ... విరుధ్యతే" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది అనఁగానుపదేశము సప్తమ్యన్తము పంచమ్యంతమని రెండువిధములఁబరఁగుచున్న ప్రత్యభిజ్ఞానమునకు విరోధమెంతమాత్రము లేదు ప్రత్యభిజ్ఞానమునందు విరోధము లేదనుటకు దృష్టాన్తము "యథాలోకే ... ఇతిచ" యను భాష్యముచేఁ బ్రదర్శింపఁబడుచున్నది అనఁగా లోకమునందు వృక్షాగ్రసంబద్ధమగు డేగను "వృక్షాగ్రే శ్యేన" యనియు "వృక్షాగ్రాత్పరతః శ్యేన" యనియు నుపదేశించువాడుకగలదని యర్థము దార్ష్టాన్తికము "ఏవం ... ఉపదిశ్యతే" యని ప్రదర్శింపఁబడుచున్నది అనగా ద్యులోకమందుండు బ్రహ్మమే ద్యులోకముకంటెఁ బరముగానున్నదని చెప్పఁబడుచున్నదని యభిప్రాయము లౌకికప్రయోగమునఁ దెలివచ్చెడి ప్రయోగాంతరముచేఁగూడఁ బ్రకృతము సిద్ధించుచున్నదని యట్టిప్రయోగమును "అపర ఆహ . ఇతిచ" యను భాష్యముచేఁ బ్రదర్శించుచున్నారు అనఁగా వృక్షాగ్రముతో సంబద్ధముగానట్టి డేగనుగూడఁ బై రెండువిధముల జెప్పుట కలదని చెప్పి దార్ష్టాన్తికము "ఏవంచ .. ఉపదిశ్యతే" యని నిర్వచించుచున్నారు. ఫలితము "తస్మాత్ .. ప్రత్యభిజ్ఞానమ్మ"ని యుపసంహార

చ, ఏవం చ దివః పరమపి సద్బ్రహ్మ దివిత్యుపదిశ్యతే। తస్మాత్ ... ప్రాగ్నిర్దిష్టస్య బ్రహ్మణ ఇహ ప్రత్యభిజ్ఞానమ్ ।అతః పరమేవ బ్రహ్మ జ్యోతిశ్శబ్దమితి సిద్ధమ్ ॥२८॥

**ప్రాతర్దనాధికరణమ్**

## ప్రాణస్తథానుగమాత్

అస్తి కౌషీతకిబ్రాహ్మణోపనిషది ప్రాతర్దనాఖ్యాయికాయాం "ప్రాతర్దనో

---

చేయఁబడుచున్నది సిద్ధాన్తము "అతః పరమేవ బ్రహ్మ" యని నిరూపింపఁబడుచున్నది. ॥ ౨౮ ॥

ఇది జ్యోతిరధికరణము

## ప్రాణస్తథానుగమాత్

ఈ సూత్రమునందు బ్రహ్మశబ్దమునకనువృత్తి చేయవలయును దానంజేసి 'ప్రాణో బ్రహ్మ, తథానుగమాత్త'ని సూత్రరూపము గల్గుచున్నది అనఁగాఁ బూర్వాపరసందర్భమును విచారించుటవలనఁ బ్రాణశబ్దము బ్రహ్మపరమేయను నర్థము లభించుచున్నది ఇదివఱకు "అత ఏవ ప్రాణ" యను సూత్రముచేఁ జాన్ద్రాయణవాక్యముదాహరింపఁబడి ప్రాణశబ్దము బ్రహ్మపరమని నిర్వచింపఁబడుటచేఁ దిరుగఁ బ్రాణశబ్దమునుగూర్చి సంశయము గలుగుటయు నద్దానింగూర్చి విచారణయుఁ గలుగఁగూడదు అట్టివిషయమున మఱల "ప్రాణస్తథానుగమాత్త"ని వేఱొకయధికరణమును జేకొనుటకుఁగల కారణమేమన "అత ఏవ ప్రాణ" యనుచో "అత ఏవ" యను పదములచే నద్దానికిఁ బూర్వసూత్రమగు "ఆకాశస్తల్లింగాత్త"ను సూత్రమునందలి 'తల్లింగాత్త'ను హేతువు గ్రహింపఁబడుచున్నది. ఇచటనో "తథానుగమాత్త"ని హేత్వంతరము గ్రహింపఁబడుచున్నది ఇంతియ కాదు. ఉత్తరసూత్రములచే "నవక్తురాత్మోపదేశాత్" "జీవముఖ్యప్రాణలింగాన్న" యని రెండుపూర్వపక్షములచే వక్తయొక్క యాత్మోపదేశము, జీవలింగము, ముఖ్యప్రాణలింగమను మూఁడుపూర్వపక్షహేతువులు తెలియవచ్చుటచే నీప్రకరణమునఁ బ్రాణశబ్దము వినవచ్చుచున్నట వక్తయొక్కయాత్మయే ప్రాణముగ నుపదేశింపఁబడుటయేగాక జీవబోధకవాక్యములు ముఖ్యప్రాణబోధకవాక్యములు నీప్రకరణమునఁ దెలియవచ్చునో యట్టి ప్రకరణమునందలి ప్రాణశబ్దమిచట జిజ్ఞాస్యముకాని వేఱొక ప్రాణశబ్దమెంతమాత్రమును జిజ్ఞాస్యముగాదని సువిదితము గాఁగ భాష్యకారులచే "అస్తి.. అమృత" ఇత్యాది యని విషయవాక్యము ప్రదర్శింపఁబడుచున్నది అనఁగాఁ గౌషీతకిబ్రాహ్మణోపనిషత్తునందు నిందప్రతర్దనాఖ్యాయికయందలి వాక్యములివియని తెలియవచ్చుచున్నది ఈ వాక్యములన్నిటో

వ్యవహితసంబంధమును గల్గియుండుటచేనవ్వాని యర్థము సువ్యక్తముగాఁగ నా ప్రకరణ మిచట నుదాహరింపఁబడుచున్నది

"ప్రతర్దనో హ వై దైవోదాసిరింద్రస్య ప్రియం ధామోపజగామ యుద్ధేన చ పౌరుషేణ చ, తం హేంద్ర ఉవాచ- ప్రతర్దన వరం తే దదానీతి- స హోవాచ ప్రతర్దనస్త్వమేవ వృణీష్వ యం త్వం మనుష్యాయ హితతమం మన్యస ఇతి స హోవాచ మామేవ విజానీహ్యేతదేవాహం మనుష్యాయ హితతమం మన్యే యన్మాం విజానీయాం త్రిశీర్షాణం త్వాష్ట్రమహనమరున్ముఖా న్యతీన్సాలావృకేభ్యః ప్రాయచ్ఛమ్। బహ్వీః సంధా అతిక్రమ్య దివి ప్రహ్లాదీ నతృణమహమంతరిక్షే పౌలోమాన్పృథివ్యాం కాలకాశ్యాం స్తస్య మే తత్ర న లోమంచ = న మీయతే స యో మాం విజానీయాన్నాస్య కేన చ కర్మణా లోకో మీయతే న మాతృవధేన న పితృవధేన న స్తేయేన న భ్రూణహత్యయా నాస్యపాపం చకృషో ముఖాన్నీలం వేత్తీతి॥ 1॥ ౧.॥

స హోవాచ ప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మా తం మామాయురమృతమిత్యు పాస్వాయుః ప్రాణః ప్రాణో వా ఆయుః ప్రాణ ఉవాచామృతం యావద్ధ్యస్మిన్ శరీరే ప్రాణో వసతి తావదాయుః ప్రాణేన హ్యేవాముష్మింల్లోకేఽమృతత్వమా ప్నోతి అథ ఖలు ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మేదం శరీరం పరిగృహ్యోత్థాపయతి, తస్మాదేతమేవోక్థముపాసీత యో వై ప్రాణః సా ప్రజ్ఞా యా వై ప్రజ్ఞా స ప్రాణః సహ హ్యేతావస్మిన్ శరీరే వసతః సహోత్క్రామతః, తస్యైషైవ దృష్టిరేతద్వి జ్ఞానం యత్రైతత్పురుషః సుప్తః స్వప్నం న కంచన పశ్యత్యథాస్మిన్ప్రాణ ఏవై కధా భవతి తదైనం వాక్సర్వైర్నామభిః సహాప్యేతి చక్షుః సర్వై రూపైః సహా ప్యేతి శ్రోత్రం సర్వైశ్శబ్దైః సహాప్యేతి మనస్సర్వైర్ధ్యానైస్సహాప్యేతి స యదా ప్రతిబుధ్యతే యథాగ్నేర్జ్వలతో విస్ఫులింగా విప్రతిష్ఠేరన్నేవమేవైతస్మాదాత్మనః ప్రాణాః యథాయతనం విప్రతిష్ఠన్తే ప్రాణేభ్యో దేవా దేవేభ్యో లోకాః .. యథా ప్రజ్ఞాయాం సర్వాణి భూతాన్యేకీభవంతి తద్వ్యాఖ్యాస్యామః॥ వాగేవాస్యా ఏకమంగముదూఢం తస్యై నామ పరస్తాత్ప్రతివిహితా . భూతమాత్రా ప్రజ్ఞయా వాచం సమారుహ్య వాచా సర్వాణి నామాన్యాప్నోతి న వాచం విజిజ్ఞాసీత వక్తారం విద్యాత్ న గంధం విజిజ్ఞాసీత ఘ్రాతారం విద్యాత్ .. .. తా వా ఏతా దశైవ భూతమాత్రా. అధిప్రజ్ఞం దశ ప్రజ్ఞామాత్రా అధిభూతం యద్ధి భూతమాత్రా నస్యుర్న ప్రజ్ఞామాత్రాః స్యుః యద్వా ప్రజ్ఞామాత్రా నస్యుః నభూతమాత్రాస్స్యుః ॥౮॥ నహ్యన్యతరతో రూపం కించన సిద్ధ్యేన్నో ఏతన్నానా తద్యథా రథస్యారేషు నేమిరర్పితా నాభావరా అర్పితా ఏవమేవైతా భూతమాత్రాః ప్రజ్ఞామాత్రాస్వర్పితాః ప్రజ్ఞామాత్రాః ప్రాణే అర్పితా ఏష ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మా

హ వై దైవోదాసిః ప్రతర్దన ఇన్ద్రస్య ప్రియం ధామోపజగామ యుద్ధేన చ పౌరుషేణచ" ఇత్యారభ్యామ్నాతా । తస్యాం శ్రూయతే— 'స హోవాచ ప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మా తం మామాయురమృతమిత్యుపాస్స్వ" ఇతి । తథోత్తరత్రాపి "అథ, ఖలు ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మేదం శరీరం పరిగృహ్యోత్థాపయతి' (కౌ బ్రా॥ 3-1,2,3) ఇతి । తథా "న వాచం విజిజ్ఞాసీత వక్తారం విద్యాత్", ఇత్యాది । అన్తే చ "స ఏష ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మానన్దోఽజరోఽమృతః" (కౌ॥ 3-8) ఇత్యాది తత్ర

---

నందోఽజరోఽమృతో న సాధునా కర్మణా భూయాన్నో ఏవాసాధునా కర్మణా కనీయానేష హ్యేవైనం సాధుకర్మ కారయతి తం యమేభ్యో లోకేభ్య ఉన్నినీషత, ఏష ఉ ఏవాసాధు కర్మ కారయతి తం యమేభ్యో లోకేభ్యోఽధోనినీషతే, ఎష లోకపాల ఏష లోకాధిపతి రేష సర్వేశ్వరః సమ ఆత్మేతి విద్యాత్సమ ఆత్మేతి విద్యాత్ "

ప్రకృతమునఁ బ్రకరణసందర్భమేమన దివోదాసుని కుమారుఁడగు ప్రతర్దనుఁడనురాజు యుద్ధమునందు రక్కసుల జయించుటచేత, నశ్వమేధాది మహాక్రతువులనొనరించుటచేత నింద్రుని సన్నిధికిఁ జేరెను. అంత నింద్రుఁడాతని యోగ్యతను మెచ్చి "ప్రతర్దనా! నీవొక వరమును వేఁడుకొనుము"ని యాన తిచ్చెను. అంత ప్రతర్దనుఁడు 'మనుష్యునికి నెయ్యది హితతమమో యట్టివరమును, మీరే యనుగ్రహింపుఁడ' ని ప్రార్థింప నాయింద్రుఁడు ప్రతర్దనునికొఱకు జ్ఞానము నుపదేశించినప్రకరణము కౌషీతకిబ్రాహ్మణమునందు మూఁడవ యధ్యాయముగ నొప్పుచున్నది. అందు సంశయాస్పదములగు ప్రధానవాక్యములు "తస్యాం శ్రూయతే" యని భాష్యకారులచేఁ బ్రదర్శింపఁబడుచున్నవి. దైవోదాసిః = దివోదాసుని కుమారుఁడు, ధామ = నివాసస్థానము, పౌరుషేణ = క్రత్వనుష్ఠానరూపమగు పురుషకారముచే, సః = ఆ యింద్రుఁడు, ఉవాచ హ = పలికెను ప్రాణః = ప్రాణమగు ప్రజ్ఞాత్మా = పుష్కలజ్ఞాన స్వరూపము, అస్మి = అగుచున్నాను. తం = ఆ ప్రాణరూపుఁడగు, మాం = నన్ను, ఆయుః = ఆయువు, అమృతం= అమృతమునని 'ఉపాస్స్వ=ఉపాసింపుము అథ = ఇఁక, = ఖలు నిశ్చయముగా, ప్రజ్ఞాత్మా = పుష్కలజ్ఞానస్వరూపమగు, ప్రాణః ఏవ = ప్రాణమే, ఇదం = ఈ పరిదృశ్యమానమగు, శరీరం = దేహమును, పరిగృహ్య = పుష్కలముగ గ్రహించి, ఉత్థాపయతి = లేవనెత్తుచున్నది.

వాచం = వాక్కును, న విజిజ్ఞాసేత = తెలిసికొనిననిచ్ఛయింపకుము వక్తారం = వక్తను, విద్యాత్ ,= తెలిసికొనుము సః = ఆ, ఏషః = ఈ, ప్రాణ ఏవ = ప్రాణమే, ప్రజ్ఞాత్మా = పుష్కలమగు జ్ఞానస్వరూపము, ఆనందః = ఆనందము, అజరః = ముసలితనములేనిది అమృతః = చావులేనిది

సంశయః— కిమిహ ప్రాణశబ్దేన వాయుమాత్రమభిధీయత ఉత దేవతాత్మేతి జీవోఽథవా పరం బ్రహ్మేతి । నను "అత ఏవ ప్రాణః ఇత్యత్ర వర్ణితం ప్రాణశబ్దస్య బ్రహ్మపరత్వమ్ । ఇహాపి చ బ్రహ్మలిఙ్గముక్తం— "ఆనన్దోఽజరోఽమృతః" ఇత్యాది । కథమిహ పునః సంశయః సంభవతి । అనేకలిఙ్గదర్శనాదితి బ్రూమః । న కేవలమిహ బ్రహ్మలిఙ్గమేవోపలభ్యతే । సన్తి హీతరలిఙ్గాన్యపి । "మామేవ విజానీహి" (కౌ॥ 3-1) ఇతీన్ద్రస్య వచనం దేవతాత్మలిఙ్గమ్ । "ఇదం శరీరం పరిగృహ్యోత్థాపయతీ" తి ప్రాణలిఙ్గమ్। "న వాచం విజిజ్ఞాసీత, వక్తారం విద్యాత్" ఇత్యాది జీవలిఙ్గమ్ । అత ఉపపన్నః సంశయః । తత్ర ప్రసిద్ధేర్వాయుః ప్రాణ ఇతి ప్రాప్త ఉచ్యతే— ప్రాణశబ్దం బ్రహ్మ విజ్ఞేయమ్ । కుతః । తథానుగమాత్ ।

---

ఇట్లు విషయవాక్యములఁ బ్రదర్శించి యందలి సంశయము "తత్రసంశయ. బ్రహ్మేతి" యని ప్రదర్శింపఁబడుచున్నది అనఁగా నిచట బ్రాణశబ్దముచే వాయుమాత్రమే చెప్పఁబడుచున్నదా లేక దేవతాస్వరూపమా లేక జీవుఁడా లేక పరబ్రహ్మమా యని సంశయమును బ్రదర్శింపఁగా మధ్యస్థుఁడు "అత ఏవ ప్రాణ యను సూత్రముచేఁ బ్రాణశబ్దము బ్రహ్మపరమని నిరూపింపఁబడెనుగదా ? ఇచటనుగూడ "ఆనందః అజరః అమర" యని బ్రహ్మలింగము వినఁబడుచున్నదే, దానంజేసి యిచటనుగూడఁ బ్రాణశబ్దము బ్రహ్మపరమే యని గ్రహింపనగును అట్టి విషయమున సంశయమునకవకాశమెట్లుకలదని "నను. సంభవతి" యని ప్రశ్నింపనందులకు సమాధానము సంగ్రహముగ "అనేకలింగదర్శనాదితిబ్రూమ" యని చెప్పఁబడుచున్నది అనఁగా నానార్థబోధకములగు లింగములు దెలియఁబడుటంజేసి సంశయమునకుఁ గారణముగలదని తాత్పర్యము హేతుసంగ్రహవాక్యము "న కేవలం.. అత ఉపపన్నః సంశయ" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది. అనఁగా నిచటఁ గేవలము బ్రహ్మలింగముమాత్రమే తెలియఁబడదు ఇతర లింగములుగూడఁగలవు అందు 'మామేవ విజానీహి = నన్నే తెలిసికొనుము"ను నింద్రవచనము దేవతాస్వరూపబోధకమగులింగము ఆ తీరుననే "ఇదం శరీరం పరిగృహ్యోత్థాపయతి" యనునది ప్రాణలింగము "న వాచం . విద్యాత్" మున్నగునది జీవలింగము ఇట్లు పలువిధములగు లింగములు తెలియవచ్చుచున్నవి కావున సంశయమునకుఁ గారణము గలదని చెప్పి పూర్వపక్షి యిట్టిసంశయములందుఁ బ్రసిద్ధిబలముచేఁ బ్రాణమునువాయువుగా గ్రహించుట నిర్వచింపనందులకు సమాధానముగా "ఇతి ప్రాప్త ఉచ్యతే" యని సూత్రార్థము వివరింపఁబడుచున్నది సూత్రమునందు బ్రహ్మశబ్దమున కనువృత్తిజేసి సూత్రకారుల ప్రతిజ్ఞ "ప్రాణశబ్దం బ్రహ్మవిజ్ఞేయమ్మ"ని నిరూపింపఁబడుచున్నది. అనఁగాఁ బ్రాణశబ్దము బ్రహ్మపరమేయని యర్థము అంతమధ్యస్థుఁడు అదియెట్లని

తథాహి— పౌర్వాపర్యేణ పర్యాలోచ్యమానే వాక్యే పదానాం సమన్వయో బ్రహ్మ ప్రతిపాదనపర ఉపలభ్యతే। ఉపక్రమే తావత్ "వరం వృణీష్వ" ఇతీన్ద్రేణోక్తః ప్రతర్దనః పరమం పురుషార్థం వరముపచిక్షేప — "త్వమేవ మే వృణీష్వ యం త్వం మనుష్యాయ హితతమం మన్యసే" ఇతి। తస్మై హితతమత్వేనోపదిశ్యమానః ప్రాణః కథం పరమాత్మా న స్యాత్। న హ్యన్యత్ర పరమాత్మజ్ఞానాద్ధితతమప్రాప్తిరస్తి। "తమేవ విదిత్వాతిమృత్యుమేతి, నాన్యః పన్థా విద్యతేఽయనాయ" (శ్వేతా॥ 3-8) ఇత్యాదిశ్రుతిభ్యః। తథా "స యో మాం వేద న హ వై తస్య కేనచన కర్మణా లోకో మీయతే న స్తేయేన న భ్రూణహత్యయా"

---

'కుత' యని ప్రశ్నింప "తథానుగమాత్త్"ని సూత్రస్థమగు హేతువు పఠింపఁబడు-చున్నది హేతువాక్యార్థము "తథాహి ఉపలభ్యతే" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది అనఁగాఁ బూర్వాపరసందర్భముచే వాక్యమును యోజింప నందలి పదములయొక్క యర్థసమన్వయము బ్రహ్మమునందే పర్యవసానము నొందుచున్న దని తాత్పర్యము అట్టి పూర్వాపరసందర్భము తద్గ్రంథముచే వివరింపఁ బడుచున్నది అందుపక్రమవాక్యములయొక్క యర్థనిరూపణము "ఉపక్రమే తావత్ . సంభవతి" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది. అనఁగా నుపక్రమమునందు "వరం వృణీష్వ = వరమును గోరుకొను"మని పలుకఁబడిన ప్రతర్దనుఁడు "త్వమేవ = నీవే, మనుష్యాయ = మనుష్యునికొఱకు, యం = దేనిని, హితతమం = అత్యంతము హితముగా, మన్యసే = తలఁచుచున్నావో, తం = దానిని, మే = నాకొఱకు, వృణీష్వ=అనుగ్రహింపు"మని పరమపురుషార్థరూపమగు వరమును, ఉపచిక్షేప = కోరెను అట్లు హితతమమున పేక్షించిన ప్రతర్దనునికొఱకు హితతమమని యుపదేశింపఁబడిన ప్రాణము పరమాత్మయెందు లకుఁగాదు ? ఏలయన—"తమేవ = ఆపరమాత్మనే, విదిత్వా = తెలిసికొని, మృత్యుం = మరణమును, అత్యేతి = అతిక్రమించుచున్నాఁడు అయనాయ = మోక్షముకొఱకు, అన్యః = వీనికంటె వేఱగు, పన్థాః = మార్గము, న విద్యతే లేద" ను శ్రుతి మొదలుగాఁగల శ్రుతులచేఁ బరమాత్మజ్ఞానముకంటె అన్యత్ర= ఇతరమగుదానివలన హితతమము లభించుట లేదని తెలియవచ్చుచున్నది అనఁగాఁ బరమాత్మజ్ఞానమువలననే హితతమప్రాప్తియని శ్రుతులవలనఁ దెలియ వచ్చుటంజేసి హితతమముగా నుపదేశింపఁబడిన ప్రాణము పరమాత్మయని యభిప్రాయము ఇంతియ కాదు ఈ ప్రకరణమునందు 'మాం = నన్ను, సః యః = ఎవఁడు వేద = తెలిసికొనుచున్నాఁడో, తస్య = వానికి, కేనచన = ఎట్టివిధమగు, కర్మణా = కర్మముచే, లోకః = పరమార్థము, నమీయతే = చెడదు, స్తేయేన= దొంగతనముచే, న = చెడదు, భ్రూణహత్యయా = బ్రహ్మహత్యాది మహాపాప

(కౌ॥ 3-1) ఇత్యాది చ బ్రహ్మ పరిగ్రహే ఘటతే। బ్రహ్మవిజ్ఞానేన హి సర్వ కర్మక్షయః ప్రసిద్ధః "క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్దృష్టే పరావరే" (ము॥ 2-2-8) ఇత్యాద్యాసు శ్రుతిషు। ప్రజ్ఞాత్మత్వం చ బ్రహ్మపక్ష ఏవోపపద్యతే । నహ్య చేతనస్య వాయోః ప్రజ్ఞాత్మత్వం సంభవతి। తథోపసంహారేఽపి ఆనన్దోఽజరోఽమృతః" ఇత్యానందత్వాదీని న బ్రహ్మణోఽన్యత్ర సమ్యక్సంభవన్తి। "స నసాధునా కర్మణా భూయాన్భవతి నో ఏవాసాధునా కర్మణా కనీయానేష హ్యేవ సాధుకర్మ కారయతి తం యమేభ్యో లోకేభ్య ఉన్నినీషతే । ఏష ఉ ఏవాసాధుకర్మ కారయతి తంయమేభ్యోలోకేభ్యోఽధోనినీషతే" ఇతి।"ఏష లోకాధిపతి రేషలోకేశః" (కౌ॥ 3-8) ఇతిచ । సర్వ మేతత్పరస్మి న్బ్రహ్మణ్యాశ్రీయమాణేఽనుగంతుం శక్యతే న ముఖ్యే ప్రాణే । తస్మాత్ప్రాణో బ్రహ్మ॥ ॥౨౮॥

ముచేఁగూడ, న = చెడదను ఫలశ్రుతి యుచటఁ ప్రాణమును బ్రహ్మముగా గ్రహించుటయందే సమంజసమగును ఏలయన—తస్మిన్ = ఆ, బ్రహ్మణి = బ్రహ్మమందు, పరావరే = కార్యకారణములు, దృష్టే=చూడఁబడుచో, అస్య = ఈవిద్వాంసునియొక్క, కర్మాణి = కర్మములు, క్షీయంతే = నశించుచున్నవను సర్వకర్మక్షయము బ్రహ్మజ్ఞానఫలముగా వినఁబడుచున్నది కావునఁ ప్రాణము బ్రహ్మమేయని యభిప్రాయము ఇంతియకాదు "ప్రజ్ఞాత్మ" యను పుష్కల జ్ఞానస్వరూపము బ్రహ్మపక్షముననే యుపోద్బలకమగుచున్నది ఏలయన నచేతన మగు వాయువునకుఁ ప్రజ్ఞాత్మత్వము యుక్తమెంతమాత్రము గాదు

ఇట్లుపక్రమవాక్యములఁ బ్రదర్శించి యుపసంహారవాక్యములయందు విన వచ్చెడి యానందము, అజరము, అమృతము నను స్వరూపబోధకపదములు నట్టి యాశయమునే వ్యక్తీకరించు 'సః = ఆయాత్మ, సాధునా = మంచి, కర్మణా = కర్మచేత, భూయాన్ = పెద్దవాఁడను, న భవతి = కాఁడు, అసాధునా = అవి హితమగు, కర్మణా = కర్మచే కనీయాన్ = తక్కువవాఁడును, నైవ భవతి= కానేరఁడు ఏషః హి ఏవ = ఈ యాత్మయే, యం = ఎవనిని ఏభ్యః = ఈ, లోకేభ్యః = లోకములనుండి, ఉన్నినీషతే = ఉద్ధరింపఁదలఁచునో, తం=వానిని, సాధు = లెస్సయైన, యన మంచి, కర్మ = కర్మమును, కారయతే=చేయించును ఏషః ఉ ఏవ = ఈ యాత్మయే, యం = ఎవనిని, ఏభ్యః = ఈ లోకేభ్యః = లోకములనుండి, అధః = క్రిందికి, నినీషతే = త్రోయదలఁచుచున్నదో, తం = వానిని, అసాధు = దుష్టమగు, కర్మ=కర్మను, కారయతి = చేయించుచున్నది యను వాక్యమును బ్రదర్శించుచున్నారు ఇట్లు ప్రదర్శింపఁబడిన యుపక్రమోప సంహారవాక్యములచే నీప్రకరణమంతయు బ్రహ్మబోధకమే గాని ముఖ్యప్రాణ బోధకమెంతమాత్రము "గాదని " సర్వమేతత్ . ప్రాణే " యని చెప్పి "తస్మాత్ప్రాణోబ్రహ్మ" యని సిద్ధాంతము నుపసంహారము చేయుచున్నారు ॥౨౮॥

## న వక్తురాత్మోపదేశాదితిచే దధ్యాత్మసంబన్ధభూమా హ్యస్మిన్

యదుక్తం ప్రాణో బ్రహ్మేతి తదాక్షిప్యతే। న పరం బ్రహ్మ ప్రాణశబ్దమ్। కస్మాత్। వక్తురాత్మోపదేశాత్। వక్తా హీన్ద్రో నామ కశ్చిద్విగ్రహవాన్ దేవతావిశేషః స్వమాత్మానం ప్రతర్దనాయాచచక్షే — "మామేవ విజానీహి" ఇత్యుపక్రమ్య "ప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మా" ఇత్యహంకారవాదేన। స ఏష వక్తురాత్మత్వేనోపదిశ్యమానః ప్రాణః కథం బ్రహ్మ స్యాత్। నహి బ్రహ్మణో వక్తృత్వం సంభవతి, "అవాగమనాః" (బృ 3-8-8) ఇత్యాదిశ్రుతిభ్యః। తథా విగ్రహసంబన్ధిభిరేవ బ్రహ్మణ్యసంభవద్భిర్ధర్మైరాత్మానం తుష్టావ — "త్రిశీర్షాణం త్వాష్ట్రమహనమరున్ముఖాన్యతీన్సాలావృకేభ్యః ప్రాయచ్ఛమ్" ఇత్యేవమాదిభిః।

---

## న వక్తురాత్మోపదేశాదితి చేదధ్యాత్మసంబన్ధభూమా హ్యస్మిన్

ప్రాణము బ్రహ్మమని నిర్వచింపఁబడిన విషయము సూత్రమందలి 'న వక్తురాత్మోపదేశాత్"ను పదములచే నాక్షేపింపఁబడుచున్నదని ప్రతీకము "యదుక్తం ఆక్షిప్యతే" యని నిరూపింపఁబడుచున్నది సూత్రమందలి యాక్షేపవాచకమగు నఞ్ పదమున కర్థము "న పరం బ్రహ్మ ప్రాణశబ్దమ్ = ప్రాణశబ్దవాచ్యము పరబ్రహ్మము కాద"ని నిరూపింపఁబడుచున్నది. కస్మాత్ = ఎట్లని మధ్యస్థుఁడడుగ "వక్తురాత్మోపదేశాత్"ని సూత్రస్థపదము చెప్పఁబడుచున్నది హేతుపదము "వక్తాహి. యోజయితవ్యాని" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది ప్రకృతప్రకరణమున వక్తయన నుపదేశకుఁడింద్రుఁడనునతఁడు కరచరణాద్యవయవవిశిష్టమగు దేవతావిశేషము అట్టియింద్రుఁడు "మామేవ విజానీహి = నన్నే తెలిసికొనుమ"ని ప్రారంభించి "ప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మా = పుష్కలజ్ఞానస్వరూపమగు ప్రాణము నేనే యైయున్నాఁడ"నని యహంకారవాదమన నహంభావముతోఁ దనయొక్క స్వరూపమును ప్రతర్దనునికొఱకుఁ జెప్పియున్నాఁడు అట్లు వక్తయొక్క యాత్మగా నుపదేశింపఁబడిన యీప్రాణము బ్రహ్మమెట్లు కాఁగలదు ? ఏలయన—"అవాక్, అమనాః" = వాగాదీంద్రియరహితము మనోరహితమునని చెప్పఁబడు బ్రహ్మమునకు వక్తృత్వము సంభవింపదుగదా ! ఇంతియకాదు త్రిశీర్షాణం = మూఁడుశిరములుగలిగినట్టి, త్వాష్ట్రం = త్వష్టృప్రజాపతిపుత్రుఁడగు వృత్రాసురుని, అహనం = చంపితిని. అరున్ముఖాన్ = (రౌతి యథార్థమును బల్కుచున్నవి గావున, రుత్ అనఁగా వేదాంతవాక్యము, అట్టి

ప్రాణత్వం చేన్ద్రస్య బలవత్త్వాదుపపద్యతే । "ప్రాణో వై బలం" ఇతి హి విజ్ఞాయతే । బలస్య చేన్ద్రో దేవతా ప్రసిద్ధా । యా చ కాచిద్బలకృతిరిన్ద్రకర్మైవ తదితి హి వదన్తి । ప్రజ్ఞాత్మత్వమప్యప్రతిహతజ్ఞానత్వాద్దేవతాత్మనః సంభవతి । అప్రతిహతజ్ఞానా దేవతా ఇతి హి వదన్తి । నిశ్చితే చైవం దేవతాత్మోపదేశే హితతమత్వాదివచనాని యథాసంభవం తద్విషయాణ్యేవ యోజయితవ్యాని । తస్మాద్వక్తురాత్మోపదేశాన్న ప్రాణో బ్రహ్మేత్యాక్షిప్య ప్రతిసమాధీయతే "అధ్యాత్మసంబన్ధభూమా హ్యస్మిన్" ఇతి। అధ్యాత్మసంబన్ధః ప్రత్యగాత్మసంబన్ధస్తస్య భూమా బాహుల్యమస్మిన్నధ్యాయ ఉపలభ్యతే । "యావద్ధ్యస్మిఞ్ఛరీరే ప్రాణో వసతి

---

వేదాంతవాక్యములెవ్వరి ముఖములయందుండునో వారు రున్ముఖులు, అట్టివారి కంటె భిన్నులు, అరున్ముఖులు) వేదాంతవాక్యములను గుర్తెఱుంగనివారలగు యతీన్ = యతులను అన సంన్యాసులను, శాలావృకేభ్యః = తోడేళ్ళకు, ప్రాయచ్ఛం = ఇచ్చితిని. ఈ మొదలుగాఁగలిగినట్టియు బ్రహ్మమునందు సంబంధింపనట్టియు దేహముతో సంబంధించినట్టియు ధర్మములచే నింద్రుఁడు తనను స్తవముచేసికొని యున్నాఁడు ఇంద్రునకన్ననో బలముగలవాఁడగుటంజేసి ప్రాణభావము యుక్తమే ఏలయన— "ప్రాణో వై బలమ్మ"ను శ్రుతిచేఁ బ్రాణమే బలమని చెప్పఁబడుచున్నది. బలమునకు నింద్రుఁడధిదేవతయని సుప్రసిద్ధము ఏదియేనియు బలముతోఁగూడిన కార్యమున్నచో నయ్యది యింద్రకర్మయని చెప్పఁబడుచున్నది. ఇది యిట్లుండఁ బుష్కలమగు జ్ఞానస్వరూపముగూడ నప్రతిహతజ్ఞానము గలిగిన యింద్రునకు యుక్తమే ఏలయన దేవతలప్రతిహతజ్ఞానముగలవారనుట లోకమున సుప్రసిద్ధముగు విషయమే ఇట్టిధర్మములచే నింద్రునియొక్క యాత్మోపదేశమే యిచట సిద్ధించుచున్నదని నిశ్చయముగాఁగ హితతమత్వాది వచనములు యథోచితముగ నాయింద్రపరమే సమన్వయము చేయవలయునని నిర్వచించి పూర్వము "తస్మాత్ బ్రహ్మేతి" యని యుపసంహారము చేయుచున్నారు

అనఁగా వక్తయగునింద్రునియొక్క స్వరూపముపదేశింపఁబడుటంజేసి ప్రాణమెంతమాత్రము బ్రహ్మముగాదని ఆక్షిప్య = ఆక్షేపించి యందులకు "ప్రతిసమాధీయతే = సమాధానము చెప్పఁబడుచున్న"దని సూత్రమునందలి సమాధానవాక్యము "అధ్యాత్మసంబంధభూమా హ్యస్మిన్న"ని నిరూపింపఁబడుచున్నది వాక్యార్థము, అధ్యాత్మసంబంధస్య = ప్రత్యగాత్మసంబంధముయొక్క, భూమా= బాహుళ్యము, అస్మిన్ = ఈ యధ్యాయమునందు, ఉపలభ్యతే = పొందఁబడుచున్నది అట్టి బాహుళ్యము "యావద్ధ్యస్మిన్ పరాచీనపరిగ్రహే "యను భాష్యముచే వివరింపఁబడుచున్నది ఎట్లన— యావత్ హి = ఎంతవఱకు

తావదాయుః" ఇతి ప్రాణస్యైవ ప్రజ్ఞాత్మనః ప్రత్యగ్భూతస్యాయుష్ప్రదానోపసంహారయోః స్వాతంత్ర్యం దర్శయతి న దేవతావిశేషస్య పరాచీనస్య । తథా స్తిత్వే చ ప్రాణానాం నిఃశ్రేయసమిత్యధ్యాత్మమేవేన్ద్రియాశ్రయం ప్రాణం దర్శయతి । తథా "ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మేదం శరీరం పరిగృహ్యోత్థాపయతి" (కౌ ౩-౩) ఇతి । "న వాచం విజిజ్ఞాసీత వక్తారం విద్యాత్" ఇతి చోపక్రమ్య "తద్యథా రథస్యారేషు నేమిరర్పితా నాభావరా అర్పితా ఏవమేవైతా భూతమాత్రాః ప్రజ్ఞామాత్రాస్వర్పితాః ప్రజ్ఞామాత్రాః ప్రాణేఽర్పితాః స ఏష ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మానన్దోఽజరోఽమృతః" ఇతి విషయేన్ద్రియవ్యవహారారనాభిభూతం ప్రత్యగాత్మాన

---

అస్మిన్ = ఈ, శరీరే = శరీరమందు, ప్రాణః = ప్రాణము, వసతి = ఉండునో, తావత్ = అంతవఱకు, ఆయుః = ఆయువు, అని ప్రత్యగ్భావముతో నొప్పునట్టియుఁ బ్రజ్ఞాస్వరూపమగునట్టియుఁ బ్రాణమునకే యాయువునిచ్చుటయందును నుపసంహరించుటయందును స్వాతంత్ర్యము తెలియవచ్చుచున్నది గావున నీ ప్రాణము పరాచీనమగునవఁగా బాహ్యవిషయమగు దేవతావిశేషమెంతమాత్రము గాదని "యావద్ధ్యస్మిన్ . పరాచీనస్య"యను భాష్యముచే నొకవిశేషము ప్రదర్శింపఁబడుచున్నది

ఆతీరుఫనే "తథాఽస్తిత్వే దర్శయంతి" యనుభాష్యముచేఁ హేత్వంతరముపదేశింపఁబడుచున్నది అస్తిత్వే = ప్రాణమున్నపుడే, ప్రాణానాం = ప్రాణములకు నిఃశ్రేయసము గలుగుచున్నదని దేహసంబంధమగు నిన్ద్రియాదులకాధారముగా నీప్రాణము నిరూపింపఁబడుచున్నది ఆతీరుననే "ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మా" "నవాచం విజిజ్ఞాసీత" యను శ్రుతుల నుపక్రమించి పిమ్మట తత్ = ఆవిషయము, యథా = ఎట్లన, రథస్య = రథముయొక్క, అరేషు = ఆకులయందు, నేమిః = వలయము, అర్పితా = అమర్పఁబడియున్నదో నాభౌ = నాభి (కుంచము) యందు, అరాః = ఆకులు, అర్పితాః = అమర్పఁబడియున్నవో, ఏవమేవ = ఈ ప్రకారముగనే, ఏతాః = ఈ భూతమాత్రాః = శబ్దస్పర్శాదులు, ప్రజ్ఞామాత్రాసు = ఇందిద్రియములందు, అర్పితాః = అర్పింపఁబడి యున్నవి ప్రజ్ఞామాత్రాః = ఇంద్రియములు ప్రాణే = ప్రాణమునందు, అర్పితాః = అమర్పఁబడియున్నవి సః=అట్టి, ఏషః = ఈ, ప్రాణః ఏవ = ప్రాణమే, ప్రజ్ఞాత్మా = జ్ఞానస్వరూపము, ఆనందః = ఆనందము, అజరః = ముదుసలితనములేనిది, అమరః = చావులేనిదియు అని విషయేంద్రియవ్యవహారమనెడి యరలకు నాభిస్వరూపముగఁ బ్రత్యగాత్మనే శ్రుతి యుపసంహారముచేయుచున్నదని "తథా ఉపసంహరతి" యను భాష్యముచే హేత్వంతరముపదేశింపఁబడుచున్నది ఇంతియకాదు సః = ఆప్రాణము, మే =

మేవోపసంహరతి । "స మ ఆత్మేతి విద్యాత్" ఇతి చోపసంహారః ప్రత్యగాత్మపరిగ్రహే సాధుర్న పరాచీనపరిగ్రహే । "అయమాత్మా బ్రహ్మ సర్వానుభూః" (బృ-2-5-19) ఇతి చ శ్రుత్యన్తరమ్ । తస్మాదధ్యాత్మసంబన్ధబాహుల్యాద్బ్రహ్మోపదేశ ఏవాయం న దేవతాత్మోపదేశః॥ ॥౨౯॥

కథం తర్హి వక్తురాత్మోపదేశః-

## శాస్త్రదృష్ట్యాతూపదేశో వామదేవవత్

ఇన్ద్రో నామ దేవతాత్మా స్వమాత్మానం పరమాత్మత్వేనాహమేవ పరం బ్రహ్మేత్యార్షేణ దర్శనేన యథాశాస్త్రం పశ్యన్నుపదిశతి స్మ— మామేవ

నాయొక్క ఆత్మా ఇతి = స్వరూపమని, విద్యాత్ = తెలియవలయునను నుపసంహారముగూడఁ బ్రత్యగాత్మను గ్రహించినపుడే యుక్తమగునుగాని పరాచీనమగు దేవతాస్వరూపమును గ్రహించినచో యుక్తముకాదని "స మ ఆత్మేతి పరిగ్రహే" యని నిర్వచింపఁబడుచున్నది "స మ ఆత్మేతి విద్యాత్"ను బ్రహ్మాత్మాభేదబోధక వాక్యము శ్రుత్యంతరముచేఁగూడఁ బోషింపఁబడుచున్నదని "అయమాత్మా . . ఇతి శ్రుత్యంతరమ్మ"ను భాష్యముచే నిర్వచింపఁబడుచున్నది ఇట్లు ప్రకరణమందుఁ దెలియవచ్చెడి యధ్యాత్మసంబంధబాహుళ్యమును బ్రదర్శించి సిద్ధాన్తవాక్యార్థము "తస్మాత్ దేవతాత్మోపదేశ" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది తస్మాత్ = ఆకారణముచే, అధ్యాత్మసంబంధబాహుళ్యాత్ = అధ్యాత్మసంబంధముయొక్క బాహుళ్యముండుటచే, అయం = ఈ వక్తయొక్క యాత్మోపదేశము, బ్రహ్మోపదేశ ఏవ = బ్రహ్మోపదేశమే గాని, దేవతాత్మోపదేశః= దేవతాస్వరూపమగునింద్రునియొక్క యుపదేశము, న=ఎంతమాత్రముగాదు.

ఇట్లు నిర్వచింప బ్రహ్మోపదేశమునందు వక్తయొక్క యాత్మోపదేశమెట్లు సమంజసమగునని "కథం తర్హి వక్తురాత్మోపదేశ" యని మధ్యస్థుఁడు ప్రశ్నింప నందులకు సమాధానముగా—

## "శాస్త్రదృష్ట్యాతూపదేశో వామదేవవత్"

యను సూత్రముదాహరింపఁబడుచున్నది

వక్తయొక్క యాత్మోపదేశము శాస్త్రదృష్ట్యా = శాస్త్రముచే నుపదేశింపఁబడిన జ్ఞానముయొక్క సాక్షాత్కారదృష్టిచేఁగాని, తు = లౌకికదృష్టిచేఁగాదు. వామదేవవత్ = వామదేవునివలెనని దృష్టాన్తము హేతువాక్యము "ఇంద్రోనామ . విజానీహీతి" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది ఇంద్రుఁడను దేవతావిశేషము తనయొక్క స్వరూపమును బరమాత్మగాఁ దెలిసికొని అహమేవ పరంబ్రహ్మ = నేనే పరబ్రహ్మమునను

విజానీహి" ఇతి । యథా "తద్ధైతత్పశ్యన్నృషిర్వామదేవః ప్రతిపేదే—హం మను రభవం సూర్యశ్చ" ఇతి తద్వత్ । "తద్యో యో దేవానాం ప్రత్యబుధ్యత స ఏవ తదభవత్" (బృ॥ 1-4-10) "ఇతి శ్రుతేః । యత్పునరుక్తం 'మామేవ విజానీహి' ఇత్యుక్త్వా విగ్రహధర్మైరిన్ద్ర ఆత్మానం తుష్టావ త్వాష్ట్రవధాదిభిః తత్పరిహర్తవ్యమ్ । అత్రోచ్యతే— న త్వాష్ట్రవధాదీనాం విజ్ఞేయేన్ద్రస్తుత్యర్థత్వేనోపన్యాసో యస్మాదేవం కర్మాహం తస్మాన్మాం విజానీహీతి । కథం తర్హి విజ్ఞానస్తుత్యర్థత్వేన । యత్కారణం త్వాష్ట్రవధాదీని సాహసాన్యుపన్యస్య

ఆర్షేణ = ఋషిసంబంధమగు, దర్శనేన = జ్ఞానముచే, శాస్త్రోక్తోపదేశించు చున్నదో యాతీరున, పశ్యన్ = సాక్షాత్కారమునొందుచు "మామేవ విజానీహి" యని పలికెను దృష్టాన్తపదము "యథా తద్వత్"ను భాష్యముచే వివరింపఁబడుచున్నది తత్ = ఆ ఏతత్ యీ = బ్రహ్మమును, పశ్యన్ హ = సాక్షాత్కారము నొందుచునే, వామదేవః = వామదేవుఁడను, ఋషిః = జ్ఞాని అహం = నేను, మనుః = మనువును, అభవం = అయితిని, సూర్యశ్చ = సూర్యుఁడనుగూడ నయితినని యెట్లు పలికెనో యాతీరున నింద్రుఁడు పలికెనని యభిప్రాయము. ఇట్లెవ్వరైనను బ్రహ్మసాక్షాత్కారమునొందినచో బ్రహ్మత్వము నొందుదురని "తద్యో యో ఇతిశ్రుతే" యను భాష్యముచే శ్రుతి యుదాహరింపఁబడుచున్నది దేవానాం = దేవతలలో, యః యః = ఎవ్వఁడెవ్వఁడు, తత్ = బ్రహ్మమును, ప్రత్యబుధ్యత = తెలిసికొనెనో సః = వాఁడు, తదేవ= ఆ బ్రహ్మమే, అభవత్ =ఆయెను ఇట్లు వక్తయొక్క యాత్మోపదేశ మపరోక్ష జ్ఞానమూలకమని నిరూపించి, యింద్రుఁడు తననే తెలిసికొనవలయునని చెప్పి త్వాష్ట్రవధమున్నగు విగ్రహధర్మములచేతనే తనను స్తవముచేసికొనినాఁడను పూర్వపక్షబీజమును "యత్పునరుక్తం త్వాష్ట్రవధాదిభిరితి" యని యనువదించి, యయ్యది పరిహరింపబడవలయునని యద్దాని నిరాకరణము "అత్రోచ్యతే విజానీహి" యని సమాధానము చెప్పఁబడుచున్నది అనగా త్వాష్ట్రవధాదులయొక్క యుపన్యాసము "ఇట్టి కర్మగలవాఁడను నేనగావున నన్ను దెలిసికొనవలయు"నను నభినివేశముచే నింద్రస్తుతిపరముగాఁ జెప్పఁబడినదైతే మాత్రముగాదు అట్లయినచో మఱియెందులకని ప్రశ్న కథం తర్హి యని ప్రశ్నింప "విజ్ఞానస్తుత్యర్థత్వేన"యనిసమాధానము చెప్పబడుచున్నది అనఁగా బ్రహ్మవిజ్ఞానముయొక్కయతిశయమును స్తుతించుటకు త్వాష్ట్రవధాదులు చెప్పఁబడినవని యభిప్రాయము హేతుసంగ్రహవాక్యము "యత్కారణం సాహసాని" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది॥ అనఁగా హేతువుచే త్వాష్ట్రవధాదిసాహసములగు సాహసముల నుపదేశించి, పరేణ= ఉత్తరగ్రంథముచే, తత్ర= ఆ సాహసములందు,

పదేన విజ్ఞానస్తుతిమనుసందధాతి—"తస్య మే తత్ర లోమచ న మీయతే సయో మాం వేద న హ వై తస్య కేన చ కర్మణా లోకో మీయతే"ఇత్యాదినా।ఏతదుక్తం భవతి— యస్మాదీదృశాన్యపి క్రూరాణి కర్మాణి కృతవతో మమ బ్రహ్మభూతస్య లోమాపి న హింస్యతే, స యోఽన్యోఽపి మాం వేద న తస్య కేనచిదపి కర్మణా లోకో హింస్యత ,ఇతి । విజ్ఞేయం తు "బ్రహ్మైవ ప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మా" ఇతి వక్ష్యమాణమ్ । తస్మాద్బ్రహ్మవాక్యమేతత్ ॥30॥

## జీవముఖ్యప్రాణలిఙ్గాన్నేతి చేన్నోపాసా త్రైవిధ్యాదాశ్రితత్వాదిహ తద్యోగాత్

యద్యప్యధ్యాత్మసంబన్ధభూమదర్శనాన్న పరాచీనస్య దేవతాత్మన ఉపదేశః । తథాపి న బ్రహ్మవాక్యం భవితుమర్హతి । కుతః । జీవలిఙ్గాన్ముఖ్య

---

తస్య = అట్టి సాహసములను జేసిన, మే = నాకు, లోమ చ = వెండ్రుకయైనను న మీయతే = చెడదు, సః యః = ఎవ్వఁడు, మాం = అద్వితీయపరమాత్మ యగు నన్ను, వేద, తెలిసికొనుచున్నాఁడో, తస్య చ = వానికిఁగూడ, కేన = ఎట్టి, కర్మణా = కర్మచే, లోకః = పరమార్థము, న హ వై మీయతే = యెంత మాత్రము చెడదు బ్రహ్మజ్ఞానముయొక్క స్తుతి నిందుఁ డనుసంధానము చేయుచున్నాఁడని నిర్వచించి శ్రుత్యర్థము "ఏతదుక్తం భవతి హింస్యతే" యని గ్రంథముచే వివరింపఁబడుచున్నది ఇట్టిధర్మములు జ్ఞానస్తావకములని నిరూపించి "ప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మా" యను శ్రుతిచే విజ్ఞేయమగు బ్రహ్మమే బోధింపఁబడు చున్నదని "విజ్ఞేయం వక్ష్యమాణమ్మ"ని చెప్పఁబోవు గ్రంథతాత్పర్యమును సూచించుచు ఫలితముగ "తస్మాద్బ్రహ్మవాక్యమేతత్ = ఇయ్యది బ్రహ్మవాక్య మేయని" యుపసంహరించుచున్నారు

## "జీవముఖ్యప్రాణలింగాన్నేతి చేన్నో పాసాత్రైవిధ్యాదాశ్రితత్వాదిహ తద్యోగాత్"

పూర్వసూత్రమున నిర్వచింపఁబడినట్లు ప్రకరణమున నధ్యాత్మసంబన్ధబాహుళ్యము దెలియవచ్చుటచే బాహ్యమగు నింద్రస్వరూపోపదేశము గాకపోయినను నీవాక్య మును బ్రహ్మవాక్యమనుటకు నావకాశములేదని సూత్రమందలి నఞ్ పదముచేఁ బూర్వపక్షి యధిక్షేపింప మధ్యస్థుఁడు "కుతః = ఎందువలననని" ప్రశ్నింపఁ బూర్వపక్షి సూత్రమందలి హేతుపదమగు "జీవముఖ్యప్రాణలింగాత్" ను దానిని విభజించి "జీవలింగాత్, ముఖ్యప్రాణలింగాచ్చ" యని హేతుద్వ

ప్రాణలిఙ్గాచ్చ । జీవస్య తావదస్మిన్వాక్యే విస్పష్టం లిఙ్గముపలభ్యతే "న వాచం విజిజ్ఞాసీత వక్తారం విద్యాత్" ఇత్యాది । అత్ర హి వాగాదిభిః కరణైర్వ్యాపృతస్య కార్యకరణాధ్యక్షస్య జీవస్య విజ్ఞేయత్వమభిధీయతే । తథా ముఖ్యప్రాణలిఙ్గమపి— "అథ ఖలు ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మేదం శరీరం పరిగృహ్యోత్థాపయతి" ఇతి । శరీరధారణం చ ముఖ్యప్రాణస్య ధర్మః । ప్రాణసంవాదే వాగాదీన్ప్రాణాన్ప్రకృత్య— "తాన్వరిష్ఠః ప్రాణ ఉవాచ మా మోహమాపద్యథాహమేవైతత్పఞ్చధాత్మానం ప్రవిభజ్యైతద్బాణమవష్టభ్య విధారయామి" (ప్ర॥ 2-3) ఇతి శ్రవణాత్ । యే తు "ఇమం శరీరం పరిగృహ్య" ఇతి పఠన్తి

---

యమును నిరూపించుచున్నాఁడు అందు "జీవలింగాత్త" ను హేతుపదము జీవస్య . ఉపలభ్యతే' యను భాష్యముచే వివరింపఁబడుచున్నది అనఁగా నీవాక్యమునందు జీవునియొక్క లింగము స్పష్టముగాఁ దెలియవచ్చుచున్నదని భావము ఆ జీవలింగమిద్దియన "న వాచం . విద్యాత్త"ను శ్రుతియని నిర్వచింపఁబడుచున్నది ఆ శ్రుతియొక్క యర్థము "అత్ర అభిధీయతే" యని చెప్పఁబడుచున్నది అనఁగా నీశ్రుతియందు వాగాదీంద్రియములతోఁ గూడుకొని నట్టియు, దేహేంద్రియసంఘాతమునకుఁ బ్రభువగునట్టియు జీవునిఁ దెలిసికొనవలయునని యుపదేశింపఁబడుచున్నదని భావము ఇఁక "ముఖ్యప్రాణలింగాత్త"ను హేతుపదము యొక్క యర్థము "తథా . ధర్మ" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది. అనఁగా "అథ ఖలు" యను శ్రుతిచే ముఖ్యప్రాణధర్మమగు శరీరధారణమే తెలియవచ్చుచున్నది శరీరధారణము ప్రాణధర్మమే యనుటకుఁ బ్రాణసంవాదరూపమగు కలహశ్రుతియందు వాగాదీంద్రియములనుద్దేశించి ప్రాణము పలికినపలుకు "ప్రాణసంవాదే . . ఇతి శ్రవణాత్త"ను భాష్యముచే నిరూపింపఁబడుచున్నది— మోహం = అవివేకమును, మా ఆపద్యథ = పొందకుఁడు అహమేవ = నేనే, ఏతత్ = ఈకార్యమును, కరోమి = చేయుచున్నాను ఏమన – ఆత్మానం = నన్ను, పంచధా = ప్రాణాపానసమానవ్యానోదానభేదములచే, విభజ్య = వేఱు చేసికొని, ఏతత్ = ఈబాణం = శరీరమును, అవష్టభ్య = ఆశ్రయించి, విధారయామి = ధరించుచున్నాను

ఇదివఱకు "ఇదం శరీరం పరిగృహ్య" యను శ్రుతిపాఠమునను సరించి ముఖ్యప్రాణలింగము చూపఁబడినది ఆశ్రుతియందు "ఇమం శరీరం పరిగృహ్య" యను పాఠాన్తరముగూడఁ గలదు. అట్టిపాఠాన్తరమున 'ఇమమ్మ'ను పదమునకు జీవుఁడనికాని, ఇంద్రియగ్రామఁ (సమూహ) మనికాని యర్థమును గ్రహింపవలయునని పాఠాన్తరము యొక్క యర్థము "యేతు . . వ్యాఖ్యేయమ్మ"ను భాష్యముచేఁ జెప్పఁబడు

తేషామిహాం జీవమిన్ద్రియగ్రామం వా పరిగృహ్య శరీరముత్థాపయతీతి వ్యాఖ్యేయం । ప్రజ్ఞాత్మత్వమపి జీవే తావచ్చేతనత్వాదుపపన్నమ్ । ముఖ్యేఽపి ప్రాణే ప్రజ్ఞాసాధనప్రాణాన్తరాశ్రయత్వాదుపపన్నమేవ । జీవముఖ్యప్రాణపరిగ్రహే చ ప్రాణప్రజ్ఞాత్మనోః సహవృత్తిత్వేనాభేదనిర్దేశః స్వరూపేణ చ భేదనిర్దేశ ఇత్యుభయథా నిర్దేశ ఉపపద్యతే "యో వై ప్రాణః సా ప్రజ్ఞా యా వై ప్రజ్ఞా స ప్రాణః సహ హ్యేతావస్మిఞ్ఛరీరే వసతః సహోత్క్రామతః" ఇతి । బ్రహ్మపరిగ్రహే తు కిం కస్మాద్భిద్యేత । తస్మాదిహ జీవముఖ్యప్రాణయోరన్యతర ఉభౌ వా ప్రతీయేయాతాం న బ్రహ్మేతి చేత్, నైతదేవం ఉపాసాత్రైవిధ్యాత్ ।

---

చున్నది ఇట్లు జీవముఖ్యప్రాణలింగములు దెలివచ్చుటంజేసి జీవుండనికాని ముఖ్యప్రాణమనికాని గ్రహింపవలయునని చెప్పి "ప్రజ్ఞాత్మా" యను లింగము జీవునియందుఁగూడఁ జేతనభావముండుటవలన సమంజసమే యని "ప్రజ్ఞాత్మత్వమపి ఉపపన్నమ్"ని నిర్వచింపఁబడుచున్నది ఇంతియ కాదు "ప్రజ్ఞాత్మ" యను పదము ముఖ్యప్రాణమందుఁగూడ సమన్వయము కాఁగలదని "ముఖ్యేఽపి . ఉపపన్నమేవ" యని చెప్పఁబడుచున్నది ఎట్లనఁ బ్రజ్ఞకు సాధనభూతములగు ప్రాణాంతరమునొకదానిని గ్రహించి యట్టిప్రాణమును "ప్రజ్ఞాత్మా" యని వ్యవహరించుట సమంజసమనియాశయము ఇట్లు జీవముఖ్యప్రాణలింగములను బరిగ్రహించినచో జీవప్రాణముల రెండిటికిని సహావృత్తిత్వముచే నభేదమును, స్వరూపముచే భేదనిర్దేశమును యుక్తమనుచు "యో వై ప్రాణః స హోత్క్రామత" యను శ్రుతి సమంజసమగును శ్రుత్యర్థమేమన – "యో వై ప్రాణః = ప్రాణమెద్దియో, సా = అదియే, ప్రజ్ఞా = ప్రజ్ఞారూపము యా వై ప్రజ్ఞా = ప్రజ్ఞ యెద్దియో, సః = అదియే, ప్రాణః = ప్రాణరూపము ఏతౌ = ఈ రెండును, అస్మిన్ శరీరే = ఈ శరీరమునందు, సహ = కూడి, వసతః = నివసించుచుండును సహ = కలసి, ఉత్క్రామతః = బయలువెడలుచుండును ఈ శ్రుతియందు బ్రహ్మమును గ్రహించినచో భిన్నములగు రెండుపదార్థములు లేకపోవలయునని దోషము "బ్రహ్మపరిగ్రహే . . భిద్యేత" యని నిరూపింపఁబడుచున్నది

ఇట్లు పూర్వపక్షము నుపపాదించి యీ ప్రకరణమున జీవముఖ్యప్రాణములలోనొకదానినైన లేదా రెండిటినైన గ్రహింపవచ్చునుగాని బ్రహ్మమును గ్రహించుటకవకాశము లేదని పూర్వపక్షాభిప్రాయము "తస్మాదిహ న బ్రహ్మేతి చేత్త"ని యనువదించి యయ్యది యట్లు గాదని నిరసింపఁబడుచున్నది. అందులకు హేతువుగా "ఉపాసాత్రైవిధ్యాత్త"ను సూత్రము నందలి హేతుపదమాకర్షింపఁబడుచున్నది హేతుపదము "ఏవం సతి... చేతి"యని వివరింపఁబడుచున్నది.

ఏవం సతి త్రివిధముపాసనం ప్రసజ్యేత, జీవోపాసనం ముఖ్యప్రాణోపాసనం బ్రహ్మోపాసనం చేతి। నచైతదేకస్మిన్వాక్యేఽభ్యుపగన్తుం యుక్తమ్॥

ఉపక్రమోపసంహారాభ్యాం హి వాక్యైకత్వమవగమ్యతే "మామేవ విజానీహి" ఇత్యుపక్రమ్య "ప్రాణోస్మి ప్రజ్ఞాత్మా తం మామాయురమృతమిత్యుపాస్స్వ" ఇత్యుక్త్వాన్తే "స ఏష ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మానన్దోఽజరోఽమృతః" ఇత్యేకరూపావుపక్రమోపసంహారౌ దృశ్యేతే। తత్రార్థైకత్వం యుక్తమాశ్రయితుమ్। నచ బ్రహ్మలిఙ్గమన్యపరత్వేన పరిణేతుం శక్యమ్। దశానాం భూత

---

అనఁగా జీవప్రాణముల రెండిటినిగూడ నంగీకరించినచో జీవోపాసనము ముఖ్యప్రాణోపాసనము, బ్రహ్మోపాసనమునను మూఁడువిధములగునుపాసనము బోధింపఁబడుచున్నట్లంగీకరింపవలయునని దోషపరముగా హేతుపదము వ్యాఖ్యానము చేయఁబడుచున్నది. దోషమన్ననో యొకేవాక్యమునందు మూఁడువిధములగు నర్థమును గ్రహించుటయే యని "నచ. యుక్తమ్మ"ని చెప్పఁబడుచున్నది అనఁగా నొకవాక్యమునందు మూఁడువిధములగునుపాసనమును గ్రహించుట యయుక్తమని యభిప్రాయము అయుక్తమనుటకు హేతువు "ఉపక్రమోపసంహారాభ్యాంవాక్యైకత్వమభ్యుపగమ్యతే" యని చెప్పఁబడుచున్నది అనఁగా నుపక్రమమ్మునందు నుపసంహారమ్మునందునుండు వాక్యముల కేకార్థత్వము తెలియవచ్చుచున్నదని యభిప్రాయము అట్టిదేకవాక్యత "మామేవ దృశ్యేతే" యని ప్రదర్శింపఁబడుచున్నది అనఁగా "మామేవ విజానీహి" యని ప్రారంభించి "ప్రాణోఽస్మి" యను శ్రుతిని మధ్యయందుఁబలికి, యంతమున "సఏషప్రాణ" యను శ్రుతి తెలియవచ్చుటచే నుపక్రమోపసంహారములుః రెండునేకార్థమునే బోధించుచున్నట్లు దెలియవచ్చుచున్నదని యభిప్రాయము కావున నీవాక్యమునందు నేకార్థబోధకత్వమును గ్రహించుట యుక్తమని "తత్ర .. ఆశ్రయితుమ్మ"ని చెప్పి యీవాక్యమునందుఁ దెలియవచ్చెడి బ్రహ్మలింగమును వేఱొకదానితో సమన్వయముచేయఁ జూచుట శక్యము కాదని "నచ శక్యమ్మ"ని హేత్వంతరము నిర్వచింపఁబడుచున్నది అట్టి బ్రహ్మలింగమెద్దియన "తద్యథా రథస్యారేషు నేమిరర్పితా" యను శ్రుతిచే నుపదేశింపఁబడిన భూతమాత్రలయొక్కయుఁ బ్రజ్ఞామాత్రలయొక్కయు నాభియగు ప్రాణమునందు సమర్పణమగునదియని "దశానాం అనుపపత్తే" యని నిర్వచింపఁబడుచున్నది అనఁగాఁ బదియగుభూతమాత్రలయొక్కయు ప్రజ్ఞామాత్రలయొక్కయు సమర్పణము బ్రహ్మముకంటె వేఱగుదానియందయుక్తమని యభిప్రాయము కావున నిచట బ్రహ్మమునే గ్రహింపవలయునని తాత్పర్యము. ఇంతియ కాదు ప్రాణశబ్దము బ్రహ్మపరముగానిదివఱకు నాశ్రయింపఁబడియుండుటవలన నటఁగూడ నయ్యది సమంజసమేయని "ఆశ్రితత్వా త్త"ను సూత్రమునందలి హేతుం

మాత్రాణాం ప్రజ్ఞామాత్రాణాం చ బ్రహ్మణోఽన్యత్రార్పణానుపపత్తేః । ఆశ్రితత్వాచ్చాన్యత్రాపి బ్రహ్మలిఙ్గవశాత్ప్రాణశబ్దస్య బ్రహ్మణి వృత్తేః ।

ఇహాపి చ హితతమోపన్యాసాదిబ్రహ్మలిఙ్గయోగాద్బ్రహ్మోపదేశ ఏవాయమితి గమ్యతే, యత్తు ముఖ్యప్రాణలిఙ్గం దర్శితం — "ఇదం శరీరం పరిగృహ్యోత్థాపయతి" ఇతి తదసత్, ప్రాణవ్యాపారస్యాపి పరమాత్మాయత్తత్వాత్పరమాత్మన్యుపచరితుం శక్యత్వాత్, "న ప్రాణేన నాపానేన మర్త్యో జీవతి కశ్చన, ఇతరేణ తు జీవన్తి యస్మిన్నేతావుపాశ్రితౌ" (కాఠ 2-5-5) ఇతి శ్రుతేః । యదపి "న వాచం విజిజ్ఞాసీత వక్తారం విద్యాత్" ఇత్యాది జీవలిఙ్గం దర్శితం తదపి న బ్రహ్మపక్షం నివారయతి । నహి జీవో నామాత్యన్తభిన్నో బ్రహ్మణః,

---

పదము "ఆశ్రితత్వాత్ వృత్తేః" యని వివరింపఁబడుచున్నది అన్యత్ర అపి = ఇతరస్థలములందుఁగూడ, బ్రహ్మలింగవశాత్ = బ్రహ్మలింగముండుటవలన ప్రాణశబ్దస్య = ప్రాణశబ్దమునకు, బ్రహ్మణి = బ్రహ్మమునందు, వృత్తేః = వినియోగముండుటవలన

ఇట్లు ప్రకరణాంతరమందుఁ బ్రాణశబ్దము బ్రహ్మమునందుండుటంజేసి యీప్రకరణమునందుఁ గూడనట్లే యని స్మరింపఁబడిన "ఇహతద్యోగాత్"ను సూత్రమందలి పదము, "ఇహాపిచ గమ్యతే" యను భాష్యముచే వివరింపఁబడుచున్నది అనఁగా నిచటఁ గూడ హితతమోపన్యాసము మొదలుగాఁగలిగిన బ్రహ్మలింగము లుండుటవలన నీప్రకరణముకూడ బ్రహ్మోపదేశమే యని యభిప్రాయము, ఇట్లు స్వాభిమతమును బ్రదర్శించి పూర్వపక్షవాదమును నిరసింపఁ బూర్వపక్షబీజము "యత్తు ఇతి"యని 'ఇదం శరీర'మ్మను శ్రుతి ముఖ్యప్రాణలింగమని యనువదించి యయ్యది పొరపాటని యందులకు హేతువు "ప్రాణవ్యాపారస్యాపి ఇతిశ్రుతేః" యని నిరూపించుచున్నారు మర్త్యః = మనుజుఁడు, కశ్చన = ఒకానొకఁడును, ప్రాణేన = ప్రాణముచేత, న జీవతి = జీవింపలేడు, అపానేన = అపానముచేత, న = జీవింపలేడు, తు = కాని, యస్మిన్ = దేనియందు, ఏతౌ = ఈప్రాణాపానములు, ఉపాశ్రితౌ = ఆశ్రయించియున్నవో, అట్టి, ఇతరేణ = వేఱొకదానిచే, జీవంతి = జీవించుచున్నారను, శ్రుతిచేఁ బ్రాణవ్యాపారముగూడఁ బరమాత్మాధీనమగుటవలనఁ బరమాత్మయందే యీ శరీరధారణమౌపచారికముగ సమన్వయముచేయుట యుచితమని యాశయము ఇఁక "యదపి దర్శితమ్మను" వాక్యముచే "నవాచమ్మ"ను శ్రుతి జీవలింగమును పూర్వపక్షబీజమునను వదించి యయ్యదిగూడ బ్రహ్మపరమే యగుటలో నభ్యంతరములేదని "తదపి . నివారయతి" యని చెప్పఁబడుచున్నది జీవలింగము బ్రహ్మలింగమెట్లగునన జీవుఁడనువాఁడు బ్రహ్మముకంటె నెంతమాత్రము

"తత్త్వమసి" "అహం బ్రహ్మాస్మి" ఇత్యాది శ్రుతిభ్యః బుద్ధ్యాద్యుపాధికృతం తు విశేషమాశ్రిత్య బ్రహ్మైవ సఞ్జీవః కర్తా భోక్తా చేత్యుచ్యతే । తస్యోపాధికృతవిశేషపరిత్యాగేన స్వరూపం బ్రహ్మ దర్శయితుం, "న వాచం విజిజ్ఞాసీత వక్తారం విద్యాత్" ఇత్యాదినా ప్రత్యగాత్మాభిముఖీకరణార్థ ఉపదేశో న విరుధ్యతే । "యద్వాచాఽనభ్యుదితం యేన వాగభ్యుద్యతే తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే" (కే॥ 1-4) ఇత్యాది చ శ్రుత్యన్తరం వచనాదిక్రియావ్యాపృతస్యైవాత్మనో బ్రహ్మత్వం దర్శయతి । యత్పునరేతదుక్తమ్—"సహ హ్యేతావస్మిఞ్ఛరీరే వసతః సహోత్క్రామతః" ఇతి ప్రాణప్రజ్ఞాత్మనోర్భేదదర్శనం బ్రహ్మవాదే నోపపద్యత ఇతి । నైష దోషః । జ్ఞానక్రియాశక్తి

---

త్రము వేఱుగాదని శ్రుతితాత్పర్యమైయున్నట్లు "నహి . ఇత్యాదిశ్రుతిభ్యః"యని చెప్పఁబడుచున్నది అనఁగా "తత్త్వమసి" "అహంబ్రహ్మాస్మి"యనుశ్రుతులచేజీవుఁడె బ్రహ్మమని యుపదేశింపఁబడుచున్నదని తాత్పర్యము జీవేశ్వరులొక్కటే యగుచో జీవేశ్వరులకు వ్యవహారసిద్ధమగు భేదమెట్లు త్రోసివేయఁబడుచున్నగరన వ్యవహారసిద్ధమగు జీవేశ్వరభేదమునకుఁ దగునుపపత్తి "బుద్ధ్యాద్యుపాధికృతం . . చేత్యుచ్యతే" యని చెప్పఁబడుచున్నది అనఁగా బ్రహ్మమునకు బుద్ధ్యాద్యుపాధిసంబంధము గలుగ జీవుఁడనువ్యవహారము గలుగుచున్నదని యభిప్రాయము అట్టి జీవుని కుపాధివిశేషమును ద్రోసి స్వస్వరూపమగు బ్రహ్మభావమును బోధింప "న వాచం విజిజ్ఞాసీత" యను శ్రుతి జిజ్ఞాసువును బ్రత్యగాత్మవైపునకు మఱలించుటకుఁ గాను జేయు నుపదేశమని గ్రహించినచో విరోధమెంతమాత్రము లేదని "తస్య . నవిరుధ్యతే" యని జీవలింగమునకు సమాధానము చెప్పి శ్రుత్యంతరముచేఁ గూడ వచనాదిక్రియలతోఁగూడిన యాత్మకే బ్రహ్మభావము బోధింపఁబడుచున్నదని దృష్టాన్తముగూడ "యద్వాచా . దర్శయతి" యని చెప్పఁబడుచున్నది యత్= ఏది, వాచా = వాక్కుచే, అనభ్యుదితం = చెప్పఁబడదో, యేన = దేనిచే, వాక్ = వాగింద్రియము, అభ్యుద్యతే = బయలువెడలుచున్నదో, తదేవ = అయ్యదియే, బ్రహ్మ = బ్రహ్మమును, త్వం = నీవును అని, విద్ధి = తెలిసికొనుము. యత్ = ఏ, ఇదం = ఈ పరిదృశ్యమానమగు వస్తువును, ఉపాసతే= ఉపాసించుచున్నారో (తత్) ఇదం = అయీ పరిదృశ్యమానమగువస్తువు, న = బ్రహ్మము కాదు

ఇఁక 'సహహ్యేతౌ' యను శ్రుతిచే వినవచ్చెడి జీవప్రాణభేదము బ్రహ్మవాదమునందు యుక్తముగాదను పూర్వపక్షబీజమును "యత్పునః నోపపద్యతే" యని యనువదించి యయ్యది యొకదోషముగాదని సమాధానము చెప్పుచున్నారు. దోషాభావమునకు హేతువు "జ్ఞానక్రియాశక్తి అవిరుద్ధమ్మ"ను భాష్యముచేఁ

ద్వయాశ్రయయోర్బుద్ధిప్రాణయోః ప్రత్యగాత్మోపాధిభూతయోర్భేదనిర్దేశోపపత్తేః । ఉపాధిద్వయోపహితస్య తు ప్రత్యగాత్మనః స్వరూపేణాభేద ఇత్యతః । ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మేత్యేకీకరణమవిరుద్ధమ్ । అథవా "నోపాసాత్రైవిధ్యాదాశ్రితత్వాదిహ తద్యోగాత్" ఇత్యస్యాయమన్యోఽర్థః — న బ్రహ్మవాక్యేఽపి జీవముఖ్యప్రాణలిఙ్గం విరుధ్యతే । కథమ్ । ఉపాసాత్రైవిధ్యాత్ । త్రివిధమిహ బ్రహ్మోపాసనం వివక్షితం, ప్రాణధర్మేణ ప్రజ్ఞాధర్మేణ స్వధర్మేణ చ । తత్ర "ఆయురమృతముపాస్స్వాయుః ప్రాణః" ఇతి, "ఇదం శరీరం పరిగృహ్యోత్థాపయతి" ఇతి, "తస్మాదేతదేవోక్థముపాసీత" ఇతి చ ప్రాణధర్మః । అథ "యథాస్యై ప్రజ్ఞాయై సర్వాణి భూతాన్యేకీభవన్తి

---

జెప్పఁబడుచున్నది. ఏమన—జ్ఞానశక్తికాశ్రయమగు బుద్ధియుఁ క్రియాశక్తికాశ్రయమగు ప్రాణమును బ్రత్యగాత్మకుపాధులగుటం జేసి భేదనిర్దేశము యుక్తమే అంతియకాదు ఉపాధిద్వయోపహితమగు ప్రత్యగాత్మకు స్వరూపముచే నభేదమే గావున "ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మా = ప్రాణమే ప్రజ్ఞాత్మ" యను నభేదోపదేశము విరుద్ధముగాదని యభిప్రాయము

ఇట్లు "నోపాసాత్రైవిధ్యాదాశ్రితత్వాదిహ తద్యోగాత్త"ను సూత్రవాక్యమునకు నభ్యర్హితమగు నర్థవిశేషము జెప్పి పక్షాంతరముచేఁ గూడ నర్థమును బ్రతిపాదించుట బాధకముగాదని యట్టియర్థమును "అథవా. అన్యోఽర్థ" యను వాక్యముచే నుపక్రమింపఁబడుచున్నది అనఁగా బ్రహ్మవాక్యమున జీవలింగమును ముఖ్యప్రాణలింగమును విరుద్ధముగాదని యభిప్రాయము ఇట్లు చెప్ప మధ్యస్థుడు 'కథమ్మ'ని ప్రశ్నింప "ఉపాసాత్రైవిధ్యాత్త"ని సూత్రమందలి హేతుపదమాకర్షింపఁబడుచున్నది హేతుపదముయొక్క యర్థము "త్రివిధమిహ స్వధర్మేణ చ" యని వివరింపఁబడుచున్నది ఈవాక్యమునందుఁ బ్రాణధర్మముచేతను బ్రజ్ఞాధర్మముచేతను స్వధర్మముచేతను మూఁడువిధములుగ బ్రహ్మోపాసనము విధింపఁబడుచున్నది అందుఁ బ్రాణధర్మముచే నుపాసనము "తత్ర ప్రాణధర్మమ్మ"ను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది ఆయుః = ఆయువే, అమృతం = బ్రహ్మము, ఆయుః = ఆయువే, ప్రాణః = ప్రాణమని, ఉపాస్స్వ = ఉపాసింపుము

తస్మాత్ = ఆకారణముచే, ఏతదేవ = ఈప్రాణమునే, ఉక్థం = ఉక్థమని, = ఉపాసీత = ఉపాసింపవలయునని చెప్పఁబడుచున్నది

ఇఁక "అథ యథా ప్రజ్ఞాధర్మ" యను భాష్యముచేఁ బ్రజ్ఞాధర్మముచే నుపాసనము విధింపఁబడుచున్నది అథ = అనంతరము, యథా = ఏప్రకారము, అస్యై = ఈ, ప్రజ్ఞాయై = ప్రజ్ఞకొఱకు, సర్వాణి = సమస్తములగు, భూతాని =

తద్వ్యాఖ్యాస్యామః" ఇత్యుపక్రమ్య "వాగేవాస్యా ఏకమఙ్గమదూదుహత్ తస్యై నామ పరస్తాత్ప్రతివిహితా । భూతమాత్రా ప్రజ్ఞయా వాచం సమారుహ్య వాచా సర్వాణి నామాన్యాప్నోతి" ఇత్యాదిః ప్రజ్ఞాధర్మః । "తా వా ఏతా దశైవ భూతమాత్రా అధిప్రజ్ఞం దశ ప్రజ్ఞామాత్రా అధిభూతమ్ । యద్ధి భూతమాత్రా న స్యుర్న ప్రజ్ఞామాత్రాః స్యుః । యద్ధి ప్రజ్ఞామాత్రా న స్యుర్న భూతమాత్రాః స్యుః । నహ్యన్యతరతో రూపం కించన సిద్ధ్యేత్ । నో ఏతన్నానా । తద్యథా రథస్యారేషు నేమిరర్పితా నాభావరా అర్పితా ఏవమేవైతా భూతమాత్రాః ప్రజ్ఞామాత్రాస్వర్పితాః ప్రజ్ఞామాత్రాః ప్రాణేఽర్పితాః స ఏష ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మా" ఇత్యాదిర్బ్రహ్మధర్మః । తస్మాద్బ్రహ్మణ ఏవైతదుపాధిద్వయధర్మేణ

---

భూతములు, ఏకీభవంతి = ఐక్యమును బొందుచున్నవో, తత్ = ఆబ్రహ్మమును, వ్యాఖ్యాస్యామః = వివరించుచున్నామని యుపక్రమించి, వాగేవ = వాగింద్రియమే, అస్యాః = ఈ ప్రజ్ఞయొక్క, ఏకం = ఒకటగు, అంగం = అంగమును, అదూదుహత్ = కలుగఁజేసెను తస్యై = ఆప్రజ్ఞకొఱకు (ఆప్రజ్ఞకు) పరస్తాత్ = పిమ్మట, నామ = పేరు, ప్రతివిహితా = తెలియఁజేయఁబడినది భూతమాత్రాః = భూతమాత్రలగుశబ్దస్పర్శాదులు, వాచం = వాగింద్రియమును, ప్రజ్ఞయా = జ్ఞానముచే, సమారుహ్య = అధిష్ఠించి, వాచా = వాగింద్రియముచే సర్వాణి = సమస్తములగు, నామాని = నామములను, ఆప్నోతి = పొందుచున్నదని ప్రజ్ఞాధర్మము చెప్పఁబడుచున్నది

ఇఁక బ్రహ్మధర్మముచే నుపాసనము "తావా ఏతాః ఇత్యాది బ్రహ్మధర్మ" యను భాష్యముచేఁ జెప్పఁబడుచున్నది తావా ఏతాః = ఆయీ, దశైవ = పదియగు, భూతమాత్రాః = భూతమాత్రలు, అధిప్రజ్ఞం = ప్రజ్ఞతో సంబంధించినవి దశ = పదియగు, ప్రజ్ఞామాత్రాః = ప్రజ్ఞామాత్రలు, అధిభూతం = భూతములతో సంబంధించున్నవి భూతమాత్రాః = భూతమాత్రలు, నస్యుః యత్ = లేకపోయినచో, ప్రజ్ఞామాత్రాః = ప్రజ్ఞామాత్రలు, నస్యుః = కలుగనేరవు ప్రజ్ఞామాత్రాః = ప్రజ్ఞామాత్రలు, నస్యుఃయత్ = లేకపోయినచో, భూతమాత్రాః = భూతమాత్రలు, నస్యుః = కలుగనేరవు అన్యతరతః = ఎద్దియోయొకదానివలన, కించన = ఒకానొక, రూపం = రూపము, నసిద్ధ్యేత్ = సిద్ధింపదు. ఏతత్ = ఇది, నానా = అనేకవిధములగు భేదములుగలది, నో = కాదు, అని విధింపఁబడుచున్నది

ఇట్లు ప్రకరణసందర్భమును ప్రదర్శించి ఫలితము "తస్మాత్ వివక్షితమ్మ"ని యుపసంహారము చేయఁబడుచున్నది అనఁగా బ్రహ్మమునకుపాధి

స్వధర్మేణ చైకము పాసనం త్రివిధం వివక్షితమ్ । అన్యత్రాపి "మనోమయః ప్రాణశరీరః" (ఛా 3-14-2) ఇత్యాదావుపాధిధర్మేణ బ్రహ్మణ ఉపాసన మాశ్రితమ్ । ఇహాపి తద్యుజ్యతే వాక్యస్యోపక్రమోపసంహారాభ్యా మేకార్థత్వావగమాత్ ప్రాణప్రజ్ఞాబ్రహ్మలిఙ్గావగమాచ్చ। తస్మాద్బ్రహ్మవాక్యమేతదితి సిద్ధమ్॥౩౧॥

---

ద్వయమగు జీవప్రాణములయొక్క ధర్మము చేతను, స్వధర్మము చేతను, మూఁడు విధములగు నుపాసనము వివక్షచేయఁబడుచున్నదని యభిప్రాయము

ఇఁక "ఆశ్రితత్వాత్" ను పదమునకు "అన్యత్రాపి . ఉపాసన మాశ్రితమ్" ను భాష్యముచే వివరణము చేయఁబడుచున్నది అనఁగా "మనోమయః ప్రాణశరీరః" మున్నగు ప్రకరణములందు నుపాధిధర్మముచే బ్రహ్మమున కుపాసనము వివక్షచేయఁబడుచున్నదని యభిప్రాయము

ఇఁక "ఇహ తద్యోగాత్"ను సూత్రపదమునకు "ఇహాపి .. అవగమాచ్చ"యను భాష్యముచే వివరింపఁబడుచున్నది. అనఁగా వాక్యముయొక్క యుపక్రమోపసంహారములకు నొకేయర్థము తెలియవచ్చుటవలనను, ప్రాణలింగము ప్రజ్ఞాలింగము బ్రహ్మలింగము గూడఁ తెలియవచ్చుటచేతను నీ ప్రకరణమునందుఁగూడ మూఁడువిధములగు నుపాసనమును యుక్తమేయని యభిప్రాయము

ఇట్లు సూత్రమునందలి సిద్ధాన్తవాక్యమునకు రెండువిధములగు నర్థమును బ్రతిపాదించి యధికరణతాత్పర్యము "తస్మాద్బ్రహ్మవాక్యమేతదితి సిద్ధమ్"ని యుపసంహారము చేయఁబడుచున్నది ॥౩౧॥

# స్పష్టబ్రహ్మలింగశ్రుతి సమన్వయవిశేషము.

నిత్యానిత్యవస్తువివేకము ఇహాముత్రార్థఫలభోగవిరాగము శమాది సంపత్తి ముముక్షుత్వము నను సద్గుణసంపదలుగఁ బురుషునకు బ్రహ్మజ్ఞానేచ్ఛ జనించుననియు నప్పుడట్టిజిజ్ఞాసు వుపసదనవిధిననుసరించి శ్రోత్రియుఁడగు బ్రహ్మనిష్ఠునిఁజేరి యాతనిముఖమున వేదాంతవాక్యశ్రవణము గావింపవలయుననియు శ్రీకృష్ణద్వైపాయన వేదవ్యాసభగవానులచే "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యని ప్రతిజ్ఞ చేయఁబడెను జిజ్ఞాస్యమగు బ్రహ్మము జగదుత్పత్తిస్థితిలయకారణమనియునానంద

స్వరూపమనియు, వేదాంతైకవేద్యమనియు 'జన్మాద్యస్య యతః' యనుసూత్రముచే లక్షణప్రమాణములు నిర్వచింపఁబడినవి ఈ రెండుసూత్రములను "భృగుర్వై వారుణిః వరుణం పితరముపససార" యనువాక్యమాదిగాఁగల్గి "సైషా భార్గవీ వారుణీవిద్యా పరమే వ్యోమన్ ప్రతిష్ఠితా" యను వాక్యమంతముగాఁగల్గిన తైత్తిరీయోపనిషదన్తర్గతమగు భృగువరుణసంవాదమునే ప్రధానముగాఁగల్గి స్మరింపఁబడుటంజేసి యాప్రకరణమే యీరెండుసూత్రములకు విషయవాక్యముగా నొప్పుచున్నది "శాస్త్రయోనిత్వాత్"ను సూత్రము తంత్రముచే నుచ్చరింపఁబడి ప్రకారాన్తరముచే బ్రహ్మము ఋగ్వేదాదిశాస్త్రమునకుఁ గారణమనియు, విజ్ఞానఘనమనియు, శాస్త్రైకసమధిగమ్యమనియు శాస్త్రార్థపరిశుద్ధికొఱకుఁ బ్రదర్శింపఁబడియెను ఈ సూత్రము బృహదారణ్యకమునందలి మైత్రేయీయాజ్ఞవల్క్యసంవాదము ప్రధానముగాఁగల్గి స్మరింపఁబడినది మైత్రేయీబ్రాహ్మణమున నాత్మకుఁ జెప్పఁబడిన శాస్త్రయోనిత్వము, విజ్ఞానఘనత్వమును ప్రకృతమున బ్రహ్మమునకు సూత్రకారులచే సమన్వయము చేయఁబడుటంజేసి బ్రహ్మాత్మలకునభేదము శ్రీకృష్ణద్వైపాయనవేదవ్యాసభగవానులకుఁ బరమతాత్పర్యమని శాస్త్రారంభమున స్మరింపఁబడిన యీ మూఁడుసూత్రములచేతను సువ్యక్తమగుచున్నది

ఇట్టీమూఁడుసూత్రములచేఁ బ్రతిజ్ఞచేయఁబడిన తత్త్వమే సకలవేదాంతములయొక్క తత్త్వమని సకలేతరపక్షనిరసనపూర్వకముగ "తత్తు సమన్వయాత్"ను సూత్రముచేఁ బ్రతిజ్ఞచేయఁబడుచున్నది ఇందలి 'తు' శబ్దముచే సకలేతరపక్షనిరసనము సూచింపబడుచున్నది తచ్ఛబ్దముచే జగత్కారణమును శాస్త్రయోనియునగు బ్రహ్మము నిర్దేశింపఁబడుచున్నది. "సమన్వయాత్"ను పదముచే సకలవేదాంతసమన్వయము ప్రతిజ్ఞచేయఁబడుచున్నది ఇట్టీచతుస్సూత్రిచే వేదాంతసిద్ధాన్తమును సిద్ధముగఁబ్రతిజ్ఞచేసి యట్టియాశయమే సకలవేదాంతములచే బోధింపఁబడుచున్నదని జిజ్ఞాసువులకుబోధింప నుత్తరగ్రంథము రచింపఁబడినది అందు "ఈక్షతేర్నాశబ్దమ్"ను సూత్రముచే ఛాన్దోగ్యోపనిషత్తునందలి షష్ఠప్రపాఠకమగు శ్వేతకేతూద్దాలకసంవాదమున "సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయమ్"ను శ్రుతిచేఁ బూర్వోక్తమగు బ్రహ్మమే యుపదేశింపఁబడుచున్నదనియు నితరపక్షవాదులు దలఁచునట్లు వేఱొకవస్తువెంతమాత్రము బోధింపఁబడలేదనియుఁ బ్రధానమల్లనిబర్హణన్యాయము ననుసరించి సాంఖ్యమతనిరాసపూర్వకముగఁ బ్రదర్శింపఁబడియెను ఇంతియ కాదు సకలవేదాంతములు గూడఁ బూర్వోక్తమగు బ్రహ్మమును బోధించుటయందే తాత్పర్యమును గల్గియున్నవని "గతిసామాన్యాత్"ను సూత్రముచే వేదాంతవాక్యములకు గతిసామాన్యము ప్రదర్శింపఁబడియెను.

ఇక “ఆనందమయోఽభ్యాసాత్”ను సూత్రముచేఁ దైత్తిరీయోపనిషత్తునందలి” బ్రహ్మవిదాప్నోతి పరమ్”ను వాక్యము మొదలుగాఁగల్గి “ఇత్యుపనిషత్”ను వాక్యమంతముగాఁ గల్గిన యుపనిషత్తునందు వినవచ్చెడి “బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా” యను వాక్యమునఁ నిదివఱకు జగత్కారణముగనుపదేశింపఁబడిన బ్రహ్మము సకలజగదాధారభూతమనియు నిర్విశేషమనియు సత్యము జ్ఞానము ననంతము నానందము నను లక్షణములతో నొప్పుచున్నదనియు నిరూపింపఁబడుచున్నది

ఇంతియకాదు వేదాంతములచే బ్రహ్మము నామరూపవికారభేదోపాధివిశిష్టమును దద్రహితమునని ద్వివిధమనియు, నందు మొదటిది సవిశేషమనియు సగుణమనియు వ్యవహరింపఁబడుచు నుపాస్యమై భావనావిశేషము కొలఁది బ్రహ్మలోకమవధిగా గలిగినట్టి యభ్యుదయఫలములకుఁ గారణమనియు రెండవదియగు నిర్విశేషస్వరూపము జ్ఞేయమే యగుచు సద్యోముక్తికారణమగుచున్నదనియు వ్యవస్థ చేయఁబడుచున్నది

“అంతస్తద్ధర్మోపదేశాత్”ను సూత్రముచే ఛాందోగ్యోపనిషత్తునందలి యుద్గీథప్రకరణమునందలి “య ఏషోఽన్తరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే హిరణ్యశ్మశ్రుర్హిరణ్యకేశ ఆప్రణఖాత్సర్వ ఏవ సువర్ణస్తస్య యథా కప్యాసం పుండరీకమేవమక్షిణీ, తస్యోదితి నామ స ఏష సర్వేభ్యః పాప్మభ్య ఉదిత ఉదేతి హ వై సర్వేభ్యః పాప్మభ్యో, య ఏవం వేద ఇత్యధిదైవతమ్”ను వాక్యమందు వినవచ్చెడి యన్తశ్శబ్దవాచ్యుఁడు పూర్వోక్తమగు బ్రహ్మమేయని నిర్వచింపఁబడుచున్నది ఇందుఁ బ్రదర్శింపబడిన ధర్మములెవ్వియన 1 సర్వపాప్మాపగమము, 2 సర్వాత్మకత్వము, 3 గానములయందు గీయమానత్వము ననునవి.

ఇదియిట్లుండఁ బరమేశ్వరునిచే సాధకుల ననుగ్రహించుటకొఱకు నిజేచ్ఛావశమున మాయామయరూపములు ధరింపఁబడుచుండుననియు, నట్టిరూపములలో హిరణ్యశ్మశ్రుత్వాదిరూప మొకటనియు నిర్వచింపఁబడుచున్నది దానంజేసి రూపములు మాయామయములగుటవలన వాస్తవమెంతమాత్రమునుగావు కావున బ్రహ్మముయొక్క నిర్విశేషరూపమునకు నామరూపవికారభేదోపాధులను వర్ణించు వాక్యములెంతమాత్రమును బాధకములుగావని పరమతాత్పర్యము

“ఆకాశస్తల్లింగాత్”ను సూత్రముచె ఛాందోగ్యోపనిషత్తునందలి శాలావత్యజైవలిసంవాదమున వినవచ్చెడి “అస్య లోకస్య కా గతి రిత్యాకాశ ఇతి

హోవాచ" యను వాక్యమునందలి యాకాశశబ్దము వాక్యశేషమున బ్రహ్మలింగ ములు వినఁబడుటవలన బ్రహ్మబోధకమేయని ప్రతిజ్ఞచేయఁబడుచున్నది ఇందుఁ దెలియవచ్చెడి లింగములు భూతములయొక్క యుత్పత్తిలయములు జ్యాయ స్త్వము పరాయణత్వము నానంత్యము నను నవి

ఇఁక "అత ఏవ ప్రాణః" యను సూత్రముచేఁ జాక్రాయణప్రస్తోత్ర సంవాదమున "కతమా సా దేవతేతి ప్రాణ ఇతి హోవాచ" యను శ్రుతియందలి ప్రాణశబ్దమునకుఁ దచ్ఛేషమున బ్రహ్మలింగములు దెలియఁబడుటవలన ప్రాణ శబ్దము బ్రహ్మపరమేయని నిర్వచింపఁబడుచున్నది. ఇచటఁ దెలియవచ్చెడి లింగ ములు భూతములయొక్క యుత్పత్తిలయములు

ఇఁక "జ్యోతిశ్చరణాభిధానాత్త"ను సూత్రముచే ఛాందోగ్యమున మూఁడవయధ్యాయమునఁ బదుమూఁడవఖండమందుఁ దెలియవచ్చెడి, "అథ యదతః పరో దివో జ్యోతిర్దీప్యతే" యను శ్రుతియందలి జ్యోతిశ్శబ్దము తత్పూర్వ వాక్యమున వినవచ్చెడి "పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి" యని చరణసంకీర్తనము చేయఁబడుటవలన బ్రహ్మపరమేయని నిర్ణయము చేయఁబడు చున్నది

ఇఁక "ప్రాణస్తథానుగమాత్త"ను సూత్రముచేఁ గౌషీతకి బ్రాహ్మణము నందలి యింద్రప్రతర్దనాఖ్యాయికయందు నింద్రునియాత్మగ నుపదేశింపఁబడిన ప్రాణ శబ్దము పూర్వాపరసందర్భవిశేషముచే బ్రహ్మబోధకమే యని నిర్వచింపఁబడు చున్నది

ఇందొకవిశేషము గలదు. ఇంద్రునియొక్క యాత్మగఁబలుకఁబడిన ప్రాణము బ్రహ్మమని నిర్వచింపఁబడుటఁజేసి యింద్రునియొక్క యాత్మయే బ్రహ్మ మని తేలుచున్నది ఇంద్రుఁడన్ననో జీవకోటిలో లెక్కింపఁబడు నొక దేవతా విశేషము జీవవిశేషమగు నింద్రుఁడు దనయాత్మను బ్రహ్మముగా నెట్లుబోధించెనని యాక్షేపము గలుగ "శాస్త్రదృష్ట్యాతూపదేశో వామదేవవత్త"ని సమాధానము సూత్రకారులచే స్మరింపఁబడియున్నది. దానంజేసి జీవేశ్వరైక్యమనఁగా బ్రహ్మా త్మైక్యము శాస్త్రహృదయమని శ్రీకృష్ణద్వైపాయనవేదవ్యాసభగవానులు కం ఠోక్తిగ స్మరించినట్లు సుస్పష్టము!

ఇట్టిపాదముచే స్పష్టబ్రహ్మలింగశ్రుతులుగా శ్రీకృష్ణద్వైపాయనభగవానులచేఁ బ్రదర్శింపఁబడిన వేదాంతము లెవ్వియనఁ దైత్తిరీయోపనిషత్తునందలి భృగువల్లి, బ్రహ్మవల్లి, ఛాందోగ్యమష్టప్రపాఠకము, ఉద్గీథప్రకరణమున శాలావత్యజైవలిసంవాదము, చాక్రాయణప్రస్తోతృసంవాదము, మూఁడవయధ్యాయమందలి జ్యోతిర్వాక్యము, బృహదారణ్యకమునందలి మైత్రేయీయాజ్ఞవల్క్యసంవాదము, కౌషీతకిబ్రాహ్మణమునందలి యిందప్రతర్దనసంవాదమునని తెలియవచ్చుచున్నది

దీనినిఁ బట్టి బ్రహ్మజిజ్ఞాసువు ప్రథమమున నీప్రకరణముల నవశ్యము విమర్శించి యనంతరమున నితరప్రకరణములను విమర్శనమునకుఁ జేకొనవలయును గాని వేఱొకవిధమునఁ బ్రవర్తింపఁగూడదని శ్రీకృష్ణద్వైపాయనవేదవ్యాస భగవానులయొక్క మంగళాశాసనమని సువ్యక్తమగుచున్నది ఇందుదాహరింపఁబడిన ప్రకరణములందు సూత్రకారులచే విషయములుగాఁ బ్రదర్శింపబడిన పదములును, నట్టిపదములను బ్రహ్మబోధకములని నిర్వచించుటకుఁ దగు వాక్యవిశేషములను దక్క యోగమమూనులచే నభినివేశముతోఁ దలంపఁబడు విష్ణ్వాదిశబ్దములుమాత్ర మీప్రకరణములందు నించుకేనియు వినరాకుండుటం జేసి తత్పరములుగ నీ వేదాంతములనుగాని సూత్రములనుగాని సమన్వయము చేయుట ప్రతిసూత్రవ్యాకోపమునకుఁ గారణమని నిశ్చయింప నొప్పును.

ఇఁక నీస్పష్టబ్రహ్మలింగసమన్వయాధికారమునందు స్మరింపఁబడిన పండ్రెండధికరణములయందు జిజ్ఞాసాధికరణము జన్మాద్యధికరణము నానన్దమయాధికరణమనుమూఁడును దైత్తిరీయోపనిషత్తునందలి రెండుప్రకరణములననుసరించుచున్నవి శాస్త్రయోనిత్వాధికరణము బృహదారణ్యకమునందలి మైత్రేయీబ్రాహ్మణము ననువదించుచున్నది ఈక్షత్యంతరాకాశప్రాణజ్యోతిరధికరణములైదును ఛాందోగ్యోపనిషత్తు ననుసరించుచున్నవి పదునొకండవ యధికరణమగు నిందప్రాణాధికరణము కౌషీతకిమునందలి యిందప్రతర్దనాఖ్యాయిక ననుసరించుచున్నది

ఇందు మొదటిమూఁడధికరణములుననఁగా జిజ్ఞాసాధికరణము జన్మాద్యధికరణము శాస్త్రయోనిత్వాధికరణమును నిర్ణాయకగ్రంథమనఁబడుచున్నది ఈక్షత్యధికరణమాదిగాఁగలగ్రంథమంతయు నిర్ణేతవ్యగ్రంథముగా నలరారుచున్నది ఈరెండుగ్రంథములకునును సంబంధమును బ్రదర్శించుచు సర్వవేదాంత

ఇతి శ్రీమచ్ఛారీరకమీమాంసాభాష్యే శ్రీవిద్యాశంకరభగవత్పాదకృతౌ
ప్రథమాధ్యాయస్య ప్రథమః పాదః॥ ॥౧॥
స్పష్టబ్రహ్మలిఙ్గశ్రుతిసమన్వయః

---

సమన్వయమును నిర్ణాయక గ్రంథతాత్పర్యమేయని నాల్గవదియగు సమన్వయాధికరణము బోధించుచున్నది దీనింబట్టి ఛాందోగ్యోపనిషత్తునందలి వాక్యములెక్కుడుగ సంశయగ్రస్తములగుటవలన నవ్వానినిర్ణయము తైత్తిరీయశ్రుతిచే వ్యవస్థచేయఁబడవలయునను న్యాయమును శ్రీకృష్ణద్వైపాయనభగవాను లనుసరించి యున్నట్లు తెలియవచ్చుచున్నది ఇంతియకాదు. ఉత్తరగ్రంథస్వరూపముగూడ నీన్యాయమునే యనుసరించుచున్నట్లు తెలియవచ్చుచున్నది. కావున సర్వవేదాంతములకు నర్థనిర్ణయమునందుఁ దైత్తిరీయశ్రుతి నిర్ణాయకమగుచు సకలశ్రుతిశిరోవతంసముగ నలరారుచున్నది కావున వేదాంతవిజ్ఞాన సునిశ్చితార్థలకుఁ దైత్తిరీయశ్రుతి యగ్రగణ్యము

ఇత్యాది శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యవర్యేత్యాది సకలబిరుదావళీ
విరాజమాన శృంగేరీ శ్రీ విరూపాక్ష శ్రీవిద్యాశంకర
పదమాఽఽవేశప్రకాశిత ద్వైతధ్వాంతచండభాస్కర
**జగద్గురు శ్రీ కల్యాణానందభారతీ మహంతాచార్య**
స్వాములవారిచే రచింపఁబడిన కల్యాణసుధ
యను శాంకర బ్రహ్మసూత్రభాష్య
వ్యాఖ్యయందుఁబ్రథమాధ్యా
యమునఁబ్రథమపాదము





